# కొమరగిరి కారాగారలేఖలు



కొమరగిరి కృష్ణమోహనరావు

సంపాదకులు 'శ్రీవాణి'





శ్రీవాణి పబ్లికేషన్స్

24 - 52, రామానాయుడుపేట

మచిలీపట్నం - 521 001. 22818

# కొమరగిరి కారాగార లేఖలు

ప్రథమముద్రణ : ది. 5 - 8 - 2001

వెల : అమూల్యము

ముద్రణ

**శ్రీవాణి ఆఫ్ సెట్ ప్రింటర్స్**

రామానాయుడు పేట

మచిలీపట్నం - 521 001

© 21137, 26667

# మనసులోని మాట

**"అంతయూ మన మేలునకే"** అన్నట్లుగా 1975 జూన్ 26వ తేదీన 'మీసా' క్రింద నందిగామలో నిర్బంధించబడి రాజమహేంద్రవరం సెంట్రల్ జైలుకు వెళ్ళటం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో మాదే ప్రధమ డిటెన్యూ బ్యాచి. అందులో నాతోపాటు శ్రీ గొట్టిపాటి మురళీమోహన్, అడ్వొకేట్, విజయవాడ; శ్రీ యం. వి.రామమూర్తి, అడ్వొకేట్, విజయవాడ; శ్రీ అయితా రాములు, మాజీ మేయర్, విజయవాడ; శ్రీ అట్లూరి శ్రీమన్నారాయణ, సమితి అధ్యక్షులు, గన్నవరం ప్రభృతులు కూడా వున్నారు.

షుమారు 19 నెలలు తరువాత అనగా ది. 21-1-1977న విడుదల అయినాను. మొదటి నెలరోజులు కుటుంబ సభ్యులకు ఇంటర్వ్యూలు కూడా యివ్వలేదు. సుదీర్ఘకాలం రాజకీయాలలో పయనించిన నాకు రాజకీయపరమైన పుస్తకాలతో పరిచయం తప్ప మన ఇతిహాస, పురాణాలతో ఎట్టి పరిచయం లేదు. జైలులో రాజకీయపుస్తకాలు దొరకవు. బయటనుంచి తెప్పించుకోవటానికి కూడా అవకాశం వుండదు. ఇటువంటి స్థితిలో కాలక్షేపం ఎట్లా? అనే సమస్య వుత్పన్నమైంది. **"తల్లి శరీరాన్ని పోషించి పెంచుతుంది. ఉత్తమ గ్రంధం హృదయాన్ని పోషించి పెంచుతుంది."** అని చెప్పిన శ్రీ రావూరు సత్యనారాయణగారి మాటలు గుర్తుకు వచ్చాయి. అటువంటి ఉత్తమ గ్రంధాలనే పఠించి తీరాలనే అభిలాష నాలో కలిగింది. జైలులో లభించిన ఉత్తమ గ్రంధాలను చదివాను. చెత్త సాహిత్యాన్ని వాసన కూడా చూడలేదు. నేను రామాయణం చదువుతుంటే కొంతమంది మిత్రులు శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారి **'రామాయణ విషవృక్షం'** చదువుతూ నన్ను ఎగతాళి చేసేవారు. అయినప్పటికీ నేను వారి విమర్శనలను పట్టించుకోకుండా భగవద్గీత, భారతం, భాగవతం, రామాయణం, భర్తృహరి సుభాషితములు, పంచతంత్రం, సుమతీ శతకం, వేమన శతకం వగయిరాలు చదివేవాడను. భగవాన్ బాబావారి **"సత్యం, శివం, సుందరం"** కూడా అప్పుడే చదవటం జరిగింది. ఇవి నా ప్రయత్నానికి ఎంతో ఉపకరించాయి. సంస్కృతోపాధ్యాయులైన శ్రీ సూరి సుబ్రమణ్యం (రామచంద్రపురం తూ॥ గో॥ జిల్లా) గారు కూడా నాతోపాటు **'డిటెన్యూగా'** వుండటం వలన అదృష్టవశాత్తు సంస్కృతపరిచయం కూడా లభించింది. ఉదయం రెండు గంటలు సంస్కృతం నేర్చుకునేవారము. మధ్యాహ్నం రెండు గంటలు వివిధ సమస్యలమీద చర్చించుకునే వాళ్ళం. ఉదయం ఆసనాలు వేయటం, సాయంత్రం ఆటలాడు కొనేవాళ్ళం. రాత్రిపూట పురాణ కాలక్షేపం, మిగతా సమయంలో పుస్తకాలు చదవటం. ఈ విధంగా 19 నెలలు ఒక క్రమపద్ధతి జీవితాన్ని గడిపాను. మా మామగారు శ్రీ తుర్లపాటి వెంకట బసవేశ్వరరావు గారు పరమపదించిన 5వ రోజున నేను అరెష్టు అయినాను. మా బావమరుదులు చిన్నవారు కావటం వలన నా మరదలు చి॥ హేమలత వివాహం మా ఇంట్లోనే చేయవలసి

వచ్చింది. ఎంతో మంది డిటెన్యూలకు పెరోలును ప్రసాదించిన ప్రభుత్వం నాకు పెరోలును నిరాకరించింది. మా సోదరులే ఆ వివాహాన్ని జరిపించారు. ఆనాడు నా కుటుంబ సభ్యులు పడిన వేదన వర్ణించటానికి నా మాటలు చాలవు. ఆ పందొమ్మిది నెలలలో ఎంతో మంది డిటెన్యూలు మార్పును కోరి కొందరు, ఆరోగ్యం చెడి మరి కొందరు, రాజమండ్రి, కాకినాడ ప్రభుత్వ ఆసుపత్రులకు తరచుగా వెళ్ళుతుండేవారు. నేను మాత్రం జైలు గేటును దాటి బయటకు వెళ్ళలేదు.

కాలాన్ని వృధాపరచటం విజ్ఞత లక్షణం కాదు గదా! నేను దూరమైనానని బాధపడుతున్న నా అర్ధాంగి శ్రీమతి జయప్రదను, నా పిల్లలైన చి॥ లక్ష్మి, చందు, ఉదయ్, శ్యాం, విజయగౌరి (అంతా 10 సంవత్సరములలోపు వారే) లకు కొంత ఊరడింపును కలుగజేయాలని, మనశ్శాంతిని యివ్వాలని సంకల్పించుకున్నాను. అంతే కాదు ఆ నిర్మలపసిహృదయాలలో మంచి ఆలోచనలు కలుగజేయాలని అభిప్రాయపడ్డాను. మా తల్లిదండ్రులకు, సోదరులకు మనశ్శాంతిని యివ్వాలని సంకల్పించుకున్నాను. మా **'గురుకుల్'** కు ఎంతో దూరం నుండి వచ్చివున్న బాలబాలికలకు (అంతా 14 సంవత్సరముల లోపు వారే) కొంత విజ్ఞానాన్ని అందించాలని భావించాను. నా ఆశయాలకు ఒక రూపకల్పన యివ్వాలని సంకల్పించుకున్నాను. నేను నిర్బంధితుడ్ని కావడం వలన నా భావాలను సూటిగా సరాసరి నా పిల్లలకుచెప్పే అవకాశం లేదు గదా! సూటిగా ఆనాటి పరిస్థితి వివరిస్తే నేను వ్రాసిన ఉత్తరాలు ఇంటికి చేరవు. రాజకీయాలు వ్రాస్తే జైలు అధికారులే పంపించరు. ఎక్కువ ఉత్తరాలు వ్రాయటానికి వీలులేదు. సుదీర్ఘమైన ఉత్తరాలు వ్రాయటానికి కాగితాలు అధికారులు సప్లయి చేయరు. వారానికి రెండు ఉత్తరాలు మాత్రమే వ్రాయటానికి అవకాశం వుంటుంది. అది కూడా ఒక షీటు (అర ఠావు) మాత్రమే యిస్తారు. దానిలో 1/3 వంతు చిరునామా వివరాలకు పోతుంది. మిగిలిన 2/3 వంతు కాగితంలోనే వ్రాయాలి. యోగక్షేమాలు, వ్యక్తిగత విషయాలకైతే సరిపోతుంది గాని, నేను సంకల్పించుకొనిన మంచి విషయాలను, ఉత్తమ భావాలను వ్రాయడానికి సరిపోయేది కాదు. అయినప్పటికీ చిన్న చిన్న అక్షరాలలో కుదించి వ్రాసేవాడను. ఆ విధంగా జైలు జీవితంలో వంద లేఖలు పైన వ్రాసాను. నా ఆశ ఫలించింది. నా కుటుంబ సభ్యులలో ఉత్సాహం కలిగినట్లుగా, వాళ్ళ ప్రత్యుత్తరాలు చూచి ఆనందించాను. నా ప్రయత్నం సఫలీకృత మైందని ఆనందించాను. ఉత్సాహంతో నా కలం పరవళ్ళు త్రొక్కింది. నిర్బంధింతుడనైనాననే బాధను కూడా మరచిపోయాను. విద్య, జ్ఞానం, విజ్ఞానం, ఆత్మజ్ఞానం, సచ్ఛీలం, త్యాగం, దేశభక్తి మొదలైన విషయాలను గురించి మరియు మరెన్నో ఆధ్యాత్మిక విషయాలమీద ఉత్తరాలు వ్రాసాను. నా కుటుంబ సభ్యులకు కొంత మనశ్శాంతిని యివ్వ గలిగాను.

1977 జనవరి 21వ తేదీన విడుదలై నందిగామ చేరాను. రాజకీయ కార్యకలాపాలలో నిమగ్నం కావటం వలన ఆ ఉత్తరాలను బయటకు తీసే తీరుబడి లభించలేదు. 1978 శాసనసభ ఎన్నికలలో జగ్గయ్యపేట నియోజకవర్గం నుండి పోటీచేసి

కొద్దిలో ఓడిపోయాను. మానవజీవితంలో ఊహించనటువంటి సంఘటనలు అప్పుడప్పుడూ జరుగుతుంటాయి. అనుకోకుండా నందిగామ నుండి మచిలీపట్నం 1978 జూన్ 11వ తేదీన మకాం మార్చాను. ఒక చంప ఆర్థిక యిబ్బందులు, మరొక చంప రాజకీయాలు వదులుకుందామనుకున్నా నన్ను వదలలేదు. అటువంటి పరిస్థితులలో నా జైలు లేఖలను బయటకు తీసాను. ఆ లేఖలలోని కొన్ని విషయాలను పుస్తకాల రూపంలో తీసుకొని .రావాలని అనుకున్నాను. చక్కటి నీతిని బాల బాలికలకు బోధించాలని సంకల్పించుకున్నాను. ఆ సంకల్ప ఫలితమే 1. వివేకవాణి 2. రామాయణ పాత్రలు. 3. బాల విజ్ఞానకోశములు. కొంతమంది సహృదయులైన మిత్రుల సహకారంతో వాటిని ముద్రించగలిగాను. అనతికాలంలోనే అశేష ప్రజానీకంతో ప్రశంశల నందుకొని మొదటి రెండు పుస్తకాలు ద్వితీయ ముద్రణ చేసే అవకాశం లభించింది.

1985 జనవరిలో శ్రీవాణి సాంస్కృతిక మాసపత్రిక ప్రారంభించాను. మొదటి పది నెలలూ,ఎంతో కష్టంమీద ప్రతినెలా శ్రీవాణిని ముద్రించేవాడను. అయితే పాఠకుల ప్రశంసలను మాత్రం శ్రీవాణి పొందింది గాని, **'శ్రీవాణి'** లో **'శ్రీ'** కోసం మాత్రం ఎంతో శ్రమించవలసి వచ్చేది. అసలే ఆర్థిక యిబ్బందులతో సతమతమవుతున్న నేను ఈ పత్రికను ఎందుకు పెట్టుకున్నానా? అని బాధపడేవాడిని. వేదనలలో కరిగినప్పుడే, ఆవేదనలను పొందినప్పుడే ఆత్మ విమర్శన మానవుడు చేసుకోగలుగుతాడు. అనుకోకుండా **భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి** సన్నిధికి 1985 అక్టోబర్‌లో చేరాను. వారి పవిత్రమైన ఆశీస్సులు లభించాయి. నా శ్రీవాణికి కూడా లభించాయి. క్రమం తప్పకుండా 36 సంచికలు తీసుకొని రాగలిగాను. భగవాన్ బాబావారి సంకల్ప బలంతో రాజకీయాలకు పూర్తిగా 1987 మార్చి నుండి స్వస్థి చెప్పగలిగాను. ఇది నాజీవితంలో ఊహించనటువంటి మలుపు. ఆదిలో కేవలం సాహిత్య, సాంస్కృతిక పత్రికగా పెట్టిన శ్రీవాణి రానురాను ఆధ్యాత్మిక పత్రికగా రూపకల్పన చేసుకుంటున్నది. భగవాన్ బాబా జన్మదినోత్సవ ప్రత్యేక సంచిక ఎంతోమంది ప్రముఖుల ప్రశంసల నందుకున్నది. భవిష్యత్తులో యింకా ఒక మంచి పత్రికగా రూపొందించ డానికి అవసరమైన ప్రయత్నాలు చేస్తున్నాను. భగవాన్ బాబావారి సంకల్ప బలంతో ఆ ప్రయత్నంలో సఫలీకృతుడనవుతానని భావిస్తున్నాను.

కొంతమంది మిత్రుల సలహాలననుసరించి నేను వ్రాసిన **'కారాగారలేఖల'**ను యథాతథంగా **'శ్రీవాణి'** లో ముద్రించదలచుకొని, 8 సంవత్సరాలపాటు ప్రతినెలా పాఠకులకు అందించాను. ఆ లేఖలు ఊహించని రీతిలో పాఠకుల ప్రశంసలనందు కొనినాయి. అప్పటినుంచి ఆ లేఖలను పుస్తకరూపంలో తీసుకొని వస్తే బాగుంటుందని చాలా మంది శ్రేయోభిలాషులు సలహా యిచ్చారు. అయినప్పటికి నా ఆర్థికయిబ్బందుల వలన ఆ పని చేయలేకపోయాను. 25 సంవత్సరాలైనా, అవి పుస్తకరూపం దాల్చనందులకు విచారిస్తున్న సమయంలో భగవదానుగ్రహం వలన, నేను అడుగకుండానే ఒక సహృదయుడు, ఒక ఉదారవదాన్యుడు, పరోపకారమే తన జీవితలక్ష్యంగా భావిస్తున్న ఒక

త్యాగశీలి, అనేక విద్యాసంస్థలను అత్యంత క్రమశిక్షణతో నడుపుతూ, వేలాదిమంది బాలబాలికలను తీర్చిదిద్దుతూ, ప్రశంసలనందుకుంటూ, విద్యారంగంలో విశేషమైన కృషినలుపుతున్న ఒక ప్రముఖ విద్యావేత్త నా కారాగారలేఖలను ముద్రించడానికి, అవసరమైన ఆర్థిక సహకారం అందించడానికి సహృదయంతో ముందుకు వచ్చారు. ఆ వితరణశీలే నెల్లూరుకు చెందిన **'రత్నం కోచింగ్ సెంటర్'** అధినేత **గౌ॥ శ్రీ. కె. వి. రత్నం గారు.** మరియు వారి సతీమణి **శ్రీమతి కె. పద్మావతి గారు** కూడా ఈ బృహత్తర కార్యమును సహృదయంతో ప్రోత్సహించటం జరిగింది. ఆ దంపతులకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు, అభినందనలు, ఆశీస్సులు. వారి ఆర్థిక సహకారంతో, 25 సంవత్సరాల తరువాత నా కారాగారలేఖలు గ్రంథరూపంలో ఈనాడు వెలుగును చూస్తున్నందులకు నేనెంతో ఆనందిస్తున్నాను, సంతోషిస్తున్నాను.

ఈ గ్రంథంలో అనేక ఆధ్యాత్మిక విషయాలున్నాయి. పురాణ, ఇతిహాస, చారిత్రక అంశాలు సందర్భోచితంగా ప్రస్తావించబడ్డాయి. బాలబాలికలలో నైతిక, శీలసంపత్తిని పెంపొందించడానికి అవసరమైన, అమూల్యమైన విషయాలెన్నో వున్నాయి. విద్య, విజ్ఞానం, క్రమశిక్షణ, సచ్ఛీలం, దేశభక్తి మొదలగు విషయాలతో పాటు, చిన్న చిన్న కథలు కూడా ఉన్నాయి. నేను దూరమైనానని బాధపడుతున్న నా కుటుంబసభ్యులను ఓదార్చడానికి ఆధ్యాత్మిక దృష్టితో వ్రాసిన లేఖలు కూడా ఎన్నో ఉన్నాయి. 44వ రాజ్యాంగసవరణ గురించి, ప్రముఖన్యాయశాస్త్రకోవిదుల అభిప్రాయాలను సందర్భోచితంగా పేర్కొంటూ వ్రాసిన లేఖలు నా ఇంటికి చేరకుండా **D.I.G.** ఇంటెలిజన్స్‌వారి వద్దకు వెళ్ళి తిరిగి నాకే పంపబడిన లేఖలు కూడా అందులో ఉన్నాయి. ఇంకా ఎన్నో..... ఎన్నో ...... అమూల్యమైన విషయాలు ఈ గ్రంథంలో చోటుచేసుకున్నాయి. కనుక ఈ గ్రంథమును శ్రద్ధగా, సమగ్రంగా చదివి, అత్యయికపరిస్థితి (Emergency) నాటి స్థితిగతులను సంపూర్ణంగా అవగాహన చేసుకొని, తిరిగి ఈ దేశంలో అటువంటి నియంతృత్వపోకడలు పునరావృత్తం కాకుండా జాగ్రత్త పడతారని, ప్రజాస్వామ్యాన్ని పటిష్టపరిచేందుకు తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తారని, ఈ దేశ సమైక్యతకు, సమగ్రతకు ఆర్థిక పురోభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషిచేస్తారని ఆశిస్తూ..... **ఈ గ్రంథమును స్వాతంత్ర్యసమరంలో సర్వస్వాన్ని సమర్పించిన త్యాగధనులకు; అశ్రువులుబాసిన అమరవీరులకు అంకితం గావిస్తున్నాను.**

మచిలీపట్నం,
ది. 5-8-2001

(కొమరగిరి కృష్ణమోహనరావు)
సంపాదకులు 'శ్రీవాణి'

# కృతజ్ఞతలు

ఒకసారి హైద్రాబాద్ 'అశోక్ హోటల్' లో కొంతమంది ఆత్మీయులైన మిత్రులం కలిశాం. అనేక విషయాలు చర్చించుకున్నాం. ఆ సందర్భంలో అనుకోకుండా ఎమర్జన్సీ నాటి పరిస్థితులు కూడా చర్చలలో వచ్చాయి. ఆనాడు నేను రాజమండ్రి సెంట్రల్ జైలు నుండి వ్రాసిన లేఖలను గురించి వివరిస్తూ, 25సంవత్సరాలు అయినా అవి పుస్తకరూపం దాల్చనందులకు బాధపడ్డాను. అంతే....... ఆరోజు రాత్రే ఎవరి ఇండ్లకు వారు వెళ్ళారు. కొన్ని రోజుల తరువాత నా 'శ్రీవాణి' పనిలో నిమగ్నుడనై ఉండగా ఫోన్ వచ్చింది. ఆ ఫోన్‌లో ఒక సహృదయుడైన ఆత్మీయుడు మాట్లాడుతూ నా 'కారాగారలేఖలు' విషయం ప్రస్తావిస్తూ, "వాటిని పుస్తకంగా తీసుకొని రావడానికి ఎంత అవుతుంది?" అని అడిగారు. 'తమర్ని అడుగలేదు గదా!' అన్నాను. 'ఒక మంచి పనికి సహకారం అందించకూడదా?' అని ప్రశ్నించారు. 'తరువాత చెబుతానులే !' అని ఫోన్ పెట్టేశాను. మరల కొన్ని రోజుల తరువాత వారే ఫోన్ చేసి అడిగారు. Estimation చెప్పాను. వారం తిరుగకమునుపే 'చెక్' పంపారు. నాకు చాలా ఆశ్చర్యమేసింది. వారి సహృదయమునకు లోలోపలనే కృతజ్ఞతలు చెప్పుకున్నాను. 25 సంవత్సరాల తరువాత నా **'కారాగారలేఖలు'** పుస్తకరూపం దాలుస్తు న్నందులకు ఎంతో సంతోషించాను. ప్రింటింగ్ ప్రారంభించాను. ఆ సహృదయుని సహకార ఫలితమే ఈ గ్రంథస్వరూపం.

వారే నెల్లూరు ప్రముఖ విద్యావేత్త, 'రత్నం కోచింగ్ సెంటర్' అధినేత **శ్రీ కె. వి. రత్నంగారు.** వారికి కృతజ్ఞతాపూర్వకమైన అభినందనలు.

భవదీయ

**కొమరగిరి కృష్ణమోహనరావు**

సంపాదకులు 'శ్రీవాణి'

# కొమరగిరి కృష్ణమోహనరావు, జయప్రద



# లేఖకుడు - గ్రహీత





**శ్రీ కె.వి. రత్నం, శ్రీమతి పద్మావతి**



ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక

సహకారము అందించిన వదాన్యులు

**శ్రీ కె.వి. రత్నం**



ఎమర్జన్సీ (1975 సం॥) సమయంలో 'డిటిన్యూ'గా రాజమండ్రి సెంట్రల్ జైలుకు వెళ్ళడానికి కొద్ది నెలల ముందు 'కొమరగిరి' తన కుటుంబ సభ్యులతో



1968 సం॥లో కేరళలోని పాలఘాట్ కలక్టరేట్ ముందు 'కొమరగిరి' సత్యాగ్రహం చేస్తున్నప్పుడు పోలీసుల వలయాన్ని ఛేదించుకొని ముందుకు వెళ్ళుతున్న దృశ్యము



సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది.16-7-1975

ప్రియమైన జయ,

నేను యిక్కడ ఆరోగ్యంగానే వున్నాను. ప్రతి దినము 'ఆసనములు' వేయుచున్నాను. మన ఇంట్లో వున్న అందర్నీ అడిగినట్లు చెప్పగలవు. రెండు మూడు రోజులనుండి మీ నాన్నగారు కలలోవస్తున్నారు. ఆయన మరణించారా? లేదా? అనే అనుమానం వేస్తున్నది. మనం నిమిత్తమాత్రులం. పరమేశ్వరుని చిద్విలాసానికి మానవుడు తలవంచవలసిందే గదా? **'గతజల సేతు బంధనం'** గతించిన దానికి వగచి లాభంలేదు. మనస్సును స్థిరపరచుకొని, గుండె బిగపట్టుకొని, సమయస్ఫూర్తితో, జీవితమనే పడవకు ఒడుదుడుకులు వచ్చినా ముందుకు సాగిపోవటం కార్యోన్ముఖుల కర్తవ్యం, ధర్మం, విజ్ఞుల లక్షణం కూడాను. మీ అమ్మకు, బామ్మకు, తమ్ముళ్లకు ధైర్యాన్ని యివ్వడం నీ ప్రథమ కర్తవ్యం.

ఇకపోతే మన విద్యానికేతన్‌లో వున్న పిల్లలకు ఎవ్విధమైన లోటు రాకుండా చూడటం నీపని. ఎవరు ఏమనుకున్నా పట్టించుకోవద్దు. నేను లేని లోటు ఏమీ కనపడరాదు. శ్రమ వుండేమాట వాస్తవమే. కష్టాలు కలకాలం కాపురం చేయవు. భగవంతుడ్ని నమ్మిన వారికి ప్రారంభంలో కష్టాలు తప్పవు. ధర్మం జయించి తీరుతుంది. అయితే కొంచెం ఓపిక మాత్రం వుండాలి. నీవు అనేక పురాణాలు చదివావు. ఆకళింపు చేసుకున్నావు. కనుక యదార్థాలను గమనించి, వాస్తవాలను గుర్తించి, కష్టాలను చిరునవ్వుతో స్వీకరించి, ధైర్యంతో ముందుకు సాగిపోవటం దూరదృష్టిగల విజ్ఞుల పవిత్ర లక్ష్యం.

'వైకుంఠపాళి' ఆటలో వైకుంఠం చేరే లోపులో అనేక విషసర్పాలకు అనేక పర్యాయాలు ఆహుతి కావలసి వస్తుంది. నిరుత్సాహపడక, నిస్పృహ జెందక పట్టుదలతో ఆడేవారు మాత్రమే ధ్యేయాన్ని చేరుకోగలుగుతారు. ధైర్యాన్ని కోల్పోయి, భీరువులై పిరికితనంతో పోరాటాన్ని విడనాడే అసమర్ధులు కాలగర్భంలో కలసిపోతారు.

ఈ సృష్టి ప్రారంభమైననాటినుండి నేటివరకు కొన్ని కోట్లమంది పుట్టారు, గిట్టారు. అయినప్పటికి ప్రజానీకానికి చాలా కొద్దిమంది మాత్రమే గుర్తున్నారు. కొంతమంది మహానుభావులను మాత్రమే ఈ ప్రజలు స్తోత్రిస్తున్నారు, పూజిస్తున్నారు. కారణం? వారి జీవిత పరమావధి అత్యంత ఆదర్శనీయమైనది. వారి లక్ష్యం పరమోత్కృష్టమైనది. సమాజ శ్రేయస్సుకు వారి జీవితాల నర్పించారు. పట్టుదలతో అవిరామంగా దేశ కళ్యాణం కోసం కృషి సలిపారు. అందుకోసమనే వారిని ఈ ప్రజలారాధిస్తున్నది.

ఒక దేశభక్తుని సతీమణిగా, భరతమాత పుత్రికగా, ఆంధ్ర వీరనారీ మణురాలిగా, సోదరిగా నీకర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ మన పిల్లల్ని, విద్యానికేతన్ పిల్లల్ని చక్కటి సంస్కారంగల విద్యావంతులుగా, దేశభక్తి పరాయణులుగా చేయడం నీకర్తవ్యం, ధర్మం, నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకో.

నీవు వ్రాసినట్లుగా భగవత్కార్యాన్ని నిర్వర్తించడం అంత తేలిక కాదు. సత్కార్యాలను సాధించడంలో అనేక అడ్డంకులను ఎదుర్కోవాల్సివస్తుంది, మధ్య మధ్య అవరోధాలు ఏర్పడటం కూడా సహజమే. వాటన్నింటిని వైదొలగించుకొని, కార్యోన్ముఖులై కర్తవ్యపరాయణత్వంతో, ధ్యేయాన్ని చేరుకోగల్గినవారు మాత్రమే ఆదరణీయులు, ధీరులు, ధీశాలురు. అట్టి వారినే సమాజం మెచ్చుకుంటుంది, పొగడుతుంది, గౌరవిస్తుంది. కాని ఆదిలో విమర్శిస్తుంది. తేలికగా చూస్తుంది. పొగుడ్తున్నప్పుడు వళ్లు మైమరచిపోవడం, హీనంగా చూస్తున్నప్పుడు దిగజారి పోవడం సజ్జనుల లక్షణం కాదు. ఓర్పు, ఓర్మి, ధైర్యం, సాహసం, చాకచక్యం, సమయస్ఫూర్తి ప్రతి కార్యసాధకునికి అత్యంతావశ్యకములు. వాటిని నిత్య జీవితంలో సాధించిన వానికి అపజయమే ఉండదు. దయ, దాక్షిణ్యం, ప్రేమ, ఆదరము, సహనం ప్రతి వ్యక్తి అలవరచుకోవలసిన, ఆచరించవలసిన సద్గుణములు. అట్టివారిని ఏ శక్తీ ఎదుర్కొనజాలదు. తోటిమానవుని కష్టాలను చూచి కరుణించే హృదయం, ప్రక్కవాడు పడుతున్న బాధలనుచూచి ద్రవించే మనస్సు ఎదుటివాడు పడుతున్న యిక్కట్లను చూచి సహాయపడాలనే తాపత్రయపడే మానవత్వం - ప్రతి వ్యక్తికి వుండవలసిన సద్గుణాలు, అన్నింటికన్నా మించి వుండవలసినది **'విశాల భావం'** మరియు ప్రతి వ్యక్తికి అత్యున్నతమైన ఆదర్శం కూడా వుండాలి.

ఈ ' ఆదర్శం' విషయంలో స్వామి వివేకానంద వెలిబుచ్చిన అభిప్రాయం ఒకటి వ్రాస్తాను. **"మనకు మహోత్తమాదర్శం వుండాలి. కాని దురదృష్టవశాత్తు ప్రజలలో నేడు అసంఖ్యాంకులు ఆదర్శహీనులై అంధకార నిమగ్నులై వున్నారు. ఆదర్శం గలవాడు వేయి తప్పులు చేస్తే ఆదర్శం లేనివాడు యాభైవేల తప్పులు చేస్తాడు. కనుక ఆదర్శం వుండటం చాలా అవసరం. ఆ ఆదర్శానికై జీవనమర్పిద్దాం. ఇదే మన దృఢనిశ్చయం. భారత వర్షమే నశిస్తే ప్రపంచంలో ఆధ్యాత్మికతయే నశిస్తుంది. నైతికసమగ్రత సాంతం నశిస్తుంది. ఆదర్శవాదమే నశిస్తుంది."** అని పలికిన వివేకానంద మాటలు మననం చేసుకుంటే మన విద్యుక్త ధర్మమేమిటో బోధపడుతుంది. కనుక ప్రతివానికి అత్యున్నతమైన ఆదర్శం, దానిని సాధించి తీరాలనే పట్టుదల, ఎంతటి కష్టాలనైనా ఎదుర్కొనడానికి వుండవలసిన సంసిద్ధత, సమర్థత ప్రతి సాధకునికి వుండవలసిన అత్యున్నతమైన లక్షణము. పై వాటన్నింటిని ఆచరణలో పెట్టి, కార్యరూపంలో సాధించుకోగలిగిన వ్యక్తిని ఏ అసుర శక్తి ఏమీ చేయలేదు. సమస్త శక్తులు అతనికి పాదాక్రాంతం కావల్సినదే. కాని పూర్వజన్మ సుకృతం కూడా కావాలి. అన్నింటికన్నా మించిన మనోస్థైర్యము కూడా అవసరం. అట్టి దానిని సాధించటం సద్గుణుల లక్ష్యం. ఇంకా ఏవేవో వ్రాసి మీ మనస్సును విసిగించడం భావ్యంకాదు. పిల్లలకు నా ముద్దులు. ఇక వుంటా.

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 28-7-1975

**ప్రియమైన జయ,**

నీవు వ్రాసిన ఉత్తరాలు అందుతునే వున్నాయి. నా దినచర్య ఒక క్రమపద్ధతిలో నడుస్తున్నది. అందువలన నా ఆరోగ్యం చాలా బాగున్నది. ఇకపోతే నీ ఆరోగ్య విషయమే నాకు ఆందోళనగా వున్నది. మందులు సక్రమంగా, సకాలంలో తీసుకుంటున్నావని ఈ తడవ ఉత్తరంలో నాకు వ్రాయాలి. అప్పుడే నాకు మనశ్శాంతి.

ఇకపోతే జైలువారు ఒక రేడియో స్పీకరును మా 'కాంపౌండు' లోనే పెట్టారు. ప్రతిరోజు తెలుగు, ఇంగ్లీషు దినపత్రికలు వస్తున్నాయి. ఏది విన్నా, ఏది చూచినా అంతా ఒకటే పాట గదా! వినక, చూడక తప్పడంలేదు. నీవు ఏ విషయాలను గురించీ అంత ఎక్కువగా పట్టించుకోవద్దు. మన పిల్లలు, మన విద్యానికేతన్ పిల్లల యోగక్షేమాల విషయంలో మాత్రం శ్రద్ధ తీసుకోగలవు. ఇకపోతే ఇంగ్లీషు

కూడా తీరుబడి సమయంలో నేర్చుకోవచ్చు. కాని నీకు మిక్కిలి అభీష్టమైన వేదాంతం పుస్తకాలు చదవడంలోనే ఆనందాన్ని పొందగలుగుతావని నా నమ్మకం. వాటివల్లనే ఆత్మ నిగ్రహం మనోధైర్యం లభించుతుంది. **"నా యమాత్మా బలహీనేన లభ్యః"** దుర్బల దేహులు ఆత్మసాక్షాత్కారమునకు అనర్హులు. కనుక మనోనిగ్రహం చేకూరినప్పుడే మన మనస్సు మనకు వశమవుతుంది. అప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. కర్మనిష్ఠులకు ఇనుప కండలు, ఉక్కు నరములతో కూడిన ధృఢ శరీరము కావలయును. కనుక మానసిక ఔన్నత్యాన్ని సాధించడంతో పాటు శారీరక బలమును కూడా సంపాదించవలెనని స్వామి వివేకానంద బోధించాడు. మనది ధీరులనొసర్చగల మతం. వీరాధివీరులను తయారుచేయగల జాతి. మన పూర్వజన్మ సుకృతం వలన భారతావనిలో జన్మించాం అందులో మానవులుగా పుట్టాం. సమస్త జంతువుల కంటెను, దేవతల కంటెను మానవుడే అధికుడు. మోక్షమును పొందవలెననిన దేవతలు సహితం మానవజన్మ ఎత్తవలసినదే. పరిపూర్ణతను బొందునది మానవుడు ఒక్కడే. దేవతలైననూ బొందజాలరు. కనుక అన్నిటికీ మిన్నయైన, ఉత్తమమైన ఈ మానవ జన్మను సార్థకంచేసుకోవాలి. తాపసులలాగ శరీరమును శుష్కింప జేసుకొనరాదు. **'ఆరోగ్యమే మహాభాగ్యం'** అన్నారు గదా పెద్దలు! కనుక శరీర ఆరోగ్యాన్ని కాపాడుకోవడం నీ ధర్మం. శారీరక బలంతోనే సంతృప్తి జెందక ఆధ్యాత్మిక ఔన్నత్యమును కూడ సమకూర్చుకోవలయును. పిల్లలకు నా ఆశీస్సులు. ఇక వుంటా......

ఇట్లు
'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి
5-8-1975.

నీవు, పిల్లలు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. పుస్తకాలు కూడా చేరాయి. శ్రద్ధగా చదువుతున్నాను. **'ఉదయ'** వ్రాసిన ఉత్తరం చాలా బాగున్నది. **"నువ్వు ఎప్పుడు వస్తావని, ఎవరిని అడిగినా సమాధానం చెప్పడం లేదు."** అని వ్రాసాడు. దానిలో వాడి అమాయకత, బాధ ద్యోతకమవుతున్నాయి. సమాధానం ఏమి వ్రాయాలా? అని ఒకరోజా ఆలోచించాను. ఖచ్చితంగా వ్రాయడానికి నా విడుదల నా చేతిలో లేదు గదా ! ఆ విధంగా వ్రాస్తే వాడి మనస్సు బాధపడవచ్చును. తప్పకుండా వస్తాను, సత్యం జయించి తీరుతుంది. భీరువుడనై, క్షమార్పణ చెప్పుకొని, ఆత్మవంచన చేసుకొని, నమ్మకద్రోహంచేసి మాత్రం రానని చెప్పు. స్వాభిమానంతో, సగర్వంగా ఇంటికి తిరిగి వస్తానుగాని కాళ్ళు పట్టుకొని బ్రతిమాలుకొని మాత్రం రాను సత్యం

జయించడానికి కొన్ని కష్టాలు తప్పవు గదా ! ఆ కష్టాలను ధైర్యంతో ఎదిరించినప్పుడు విజయం లభ్యమవుతుంది. చేయరాని పాపం చేసి నేను జైలుకు వెళ్ళలేదు గదా? ఏ విద్రోహ చర్యలకు పాల్పడనప్పటికీ నన్ను జైలులో పెట్టారు. 'కృష్ణుడు' పుట్టుతాడని భయపడి 'కంసుడు' దేవకీ వసుదేవులను చెరలో పెట్టలేదా? అదేవిధమైన చరిత్ర నేడు పునరావృత్తమవుతున్నది. ఎందరో మహానుభావులు సత్యసాధనలో పడరాని పాట్లు పడ్డారు. చివరికి విజయలక్ష్మిని చేపట్టారు. చరిత్రలో ధ్రువతారలలా చిరకాలం వెలుగుతున్నారు. అంతటివారం కాకపోయినా '**చరిత్రహీనులం**' మాత్రం కారాదు కదా! దేశద్రోహులం అంతకన్నా కాదు. మనం భరతమాత పూజారులం. భావితరాల వారి సౌఖ్యంకోసం, వారి ఆనందం కోసం వారి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం నిర్విరామంగా పోరాడుతున్న స్వాభిమానపరులైన వారి కోవకు చెందిన భరతమాత పుత్రులం.

శివాజీలాంటి వీరాధివీరులు దేశానికి కావాలని ప్రతి ఒక్కరూ కోరుకుంటారు. కానీ శివాజీ మాత్రం తన ఇంట్లో పుట్టరాదని భావించే స్వార్థపూరితమైన సమాజంలో ప్రస్తుతం మనం వున్నాం. కనుక నాబోటి వాళ్ళనే ప్రస్తుత సమాజం అసహ్యించు కుంటుంది. తేలికగా చూస్తే కూడ చూడవచ్చు. అంతమాత్రాన భయపడి పిరికిపందలై ధర్మమార్గాన్ని విడనాడటం భావ్యంకాదు గదా? "**సిరిసంపదల్ క్షణభంగురముల్**" అట్టివాటికోసం కక్కుర్తిపడి, స్వార్థంతో చేయరాని తప్పులు చేయడం సముచితం కాదు. సిరిసంపదలు కూడ అవసరమే. సమాజంలో హాయిగా జీవించడానికి కొంతవరకు ఉపకరించే మాట వాస్తవమే. అయినప్పటికి తాత్కాలిక సుఖంకోసం శాశ్వతమైన అజరామరమైన ధర్మాన్ని విడనాడటం విజ్ఞుల లక్షణం మాత్రం కాదు.

ఇతిహాసములు, పురాణములు చక్కగా చదివి ఆకళింపు చేసుకొని, జీర్ణించుకొన్న మీ నాన్నగారి కుమార్తెవైన నీకు యివన్నీ వ్రాయడం అనుచితమే. నీవు కూడ నాకన్నా ఎక్కువ పురాణాలు చదివావు. ప్రస్తుత పరిస్థితులలో వాటి సారాన్ని మన పిల్లలకు కథల ద్వారా బోధించి, వివేకవంతులుగా, ధైర్యశాలురుగా చేయడం ఒక్కటే నీ కర్తవ్యం. అందరి ఇండ్లలోని పిల్లలులాగే మన పిల్లలు పిరికిపందలుగా తయారుకారాదు. స్వార్థపరులు అంతకన్నా కారాదు. స్వాభిమాన పరులు కావాలి. కరుడుగట్టిన దేశభక్తులు కావాలి. అకుంఠిత దీక్షాపరులు కావాలి. ధర్మాధర్మవిచక్షణాపరులు కావాలి. చక్కటి సంస్కార వంతులుగా తయారు కావాలి. వినయ, వివేకాదులను అలవరచుకోవాలి. తమ కాళ్ళమీద తాము నుంచోగల శక్తివంతులు కావాలి. వారికి మనం యివ్వగల్గినది యిదే. సిరిసంపదలు మాత్రం కాదు. ఇప్పటికే చాలా సోది వ్రాసాననుకుంటాను. ఇక వుంటా.........

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు : రాజమండ్రి

ది. 15-8-1975

ప్రియమైన జయ,

ఈరోజు స్వాతంత్ర్యదినం. పరమ పవిత్రమైన భారత భూమిని వందలాది సంవత్సరాలు బ్రిటిష్ సామ్రాజ్యాధినేతలు తమ విష కబంధ హస్తాల మధ్య పెట్టుకొని పీల్చి పిప్పిని చేసారు. తెల్లవారు భరత వీరుల రక్తాన్ని త్రాగారు. ఇక్కడ రైతులు కష్టించి, శ్రమించి, చెమటోడ్చి పండించిన రత్న రాసులను ఓడల మీద తమ దేశానికి తరలించి, యిక్కడివారికి కనీసం త్రాగడానికి గంజి కూడా లేకుండా చేసారు. ఈ పవిత్ర భూమిలో లభ్యమైన మణిమాణిక్యాలను తమ దేశానికి గొనిపోయారు. భరతమాత కన్నీరు కార్చింది. తననాదుకొనే పుత్రులు లేరాయని విలపించింది. ఆ విషాదకర పరిస్థితులను చూచి, అవగాహన చేసుకొని స్వాభిమానంతో రక్తం పొంగి లక్షలాదిమంది దేశభక్తులైన భారత యువకులు కొదమసింహాలవలె స్వాతంత్ర్య సంగ్రామంలోనికి కుప్పించి దూకారు. 24 సంవత్సరాల యువకుడు **"భగత్‌సింగ్'** నవ్వుతూ, నవ్వుతూ ఉరికంబానికెక్కి ఉరిత్రాడును తగిలించుకొని **'వందేమాతరం'** అంటూ నేలకొరిగాడు. వీరుడు చంద్రశేఖర అజాద్ బ్రిటిష్ దొరలను గడగడలాడించి కన్నుమూసాడు. వీరవనిత ఝాన్సీలక్ష్మీబాయి ఆంగ్లసేనానులను ముప్పతిప్పలు పెట్టి వీరస్వర్గమలంకరించింది. లాలాలజపతిరాయి, బిపిన్ చంద్రపాల్‌లు స్వాతంత్ర్య శంఖాన్ని పూరించి ప్రజానీకాన్ని మేల్కొల్పారు. బాలగంగాధరతిలక్ **"స్వాతంత్ర్యం నా జన్మహక్కు"** అని సింహగర్జన చేసాడు. వీరుడు నేతాజీ సుభాస్‌చంద్రబోస్ **"అజాద్ హింద్ ఫౌజ్"** ను స్థాపించి బ్రిటిష్‌వారిని హడలగొట్టాడు. అల్లూరిసీతారామరాజు వంటి వీరులు తమ శౌర్యబల పరాక్రమాదులను ప్రదర్శించి బ్రిటిషువారిని వణికించారు. మహాత్మాగాంధీ తన చాకచక్యంతో అహింసా యుద్ధాన్ని చేబూని ప్రజానీకాన్ని ఒక త్రాటిమీద నడిపించి బ్రహ్మాండమైన మహోద్యమాన్ని నిర్మించారు. వేలాది మంది భరత వీరులు సంవత్సరాల తరబడి బ్రిటిష్‌వారి కారాగారాలలో మ్రగ్గిపోయారు. వారి విషకబంధ హస్తాల మధ్య పడి నలిగిపోయారు. వారి తుపాకి గుండ్లకు బలైనారు. చిట్టచివరకు ఎట్టకేలకు భరతవీరుల త్యాగం ఫలించింది. రవి అస్తమించని బ్రిటీష్‌సామ్రాజ్యం పటాపంచలైంది. కూకటివేళ్లతో పెకలించివేయబడింది. మహాత్మాగాంధీ ఆశించిన సంపూర్ణస్వాతంత్ర్యం సిద్ధించలేదు. ఖండిత భారతభూమి మాత్రమే మనకు దక్కింది. పాక్షిక స్వాతంత్రం మాత్రమే మనకు సిద్ధించింది. దానితోనే మనం సంతృప్తి జెందాం. 1947 ఆగష్టు 15వ తేదీన భారతదేశం రెండుగా విభజించబడింది.

ఒకే ఉపఖండంలో భారత్, పాకిస్తాన్‌లు వెలిశాయి. ఆనాడు లక్షలాదిమంది నిర్భాగ్యులు తమ ఇండ్లు వాకిళ్లను వదలి కట్టుగుడ్డలతో అలో లక్ష్మణా ! అంటూ విలపిస్తూ భారతదేశానికి చేరారు. ఆ కాందిశీకులను ఆప్యాయతతో ఆదరించాం. ఒకప్రక్క స్వాతంత్ర్యదినోత్సవ సంరంభాలు. ఒకచెంప తల్లిదండ్రులను కోల్పోయిన అనాధ బాలల ఆర్తనాదాలు, ఒకవైపు భర్తలను కోల్పోయిన అభాగ్యుల కన్నీటిధారలు, మరొకవైపు వందల సంవత్సరాల తరువాత దేశానికి స్వాతంత్ర్యం లభించినందుకు ఆనందభాష్పాలు, 1947 ఆగష్టు 15వ తేదీన ఈ విధంగా స్వాతంత్ర్యదినోత్సవం జరుపుకున్నాం.

స్వాతంత్ర్యం సిద్ధించింది కాబట్టి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు యింక కొదవ వుండదని భావించాం. భారతీయ రక్తం పంచుకొనిన భారతమాత పుత్రులే ఈ దేశాన్ని పరిపాలించి, దేశ ఔన్నత్యాన్ని ద్విగుణీకృతం చేయడం జరుగుతుందని ఉవ్విళ్ళూరాం. మళ్ళీ ప్రపంచదేశాలన్నింటికి భారతదేశం తలమానికమవుతుందని ఆశించాం. ప్రపంచానికంతటికి ధర్మభిక్ష ప్రభోధించే రోజులు ఆసన్నమవుతున్నాయని ఆనందించాం. జగద్గురు స్థానాన్ని అలంకరించే రోజులు సమీపిస్తున్నాయని సంతోషించాం. ఎన్నో ఆశయాలతో, ఆవేశంతో, నిస్వార్థబుద్ధితో భరతమాత సంకెళ్లను పటాపంచలు చేయడానికి ఎనలేని త్యాగాలు చేసి నవ్వుతూ నవ్వుతూ ఉరికంబాలకెక్కి, బ్రిటిష్‌వారి తుపాకి గుండ్లకు ఆహుతియైన అమరవీరుల ఆత్మలు సంతుష్టి జెందుతాయని ఆశించాం. కాని భరతమాత నిజంగా దురదృష్ట వంతురాలు. చరిత పునరావృతమైంది. భూమి గుండ్రమని మరొక పర్యాయం నిరూపించబడింది. ఇదే ఈనాటి కధ. ఇంతకన్న వ్రాయలేను. నా కలానికి పరిమితమైన స్వాతంత్ర్యం మాత్రమే ఉన్నదని నీకు తెలుసుకదా । ఇక ఉంటా.....

ఇట్లు

'నీ'

గమనిక ;- ఆనాడు ఇంతకన్నా ఎక్కువ వ్రాస్తే జైలు అధికారులు నా లేఖను పోస్టు చేయడానికి అంగీకరించరు).

---

*'నాయకుడు ప్రజలకు తండ్రిలాగా నిగ్రహంతో, వివేకంతో వ్యవహరించాలి. తల్లిలాగా అవధులులేని మమకారంతో ప్రవర్తించరాదు'.*

*- శ్రీ సర్దార్ పటేల్*

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 23-8-1975

ప్రియమైన జయ,

నీవూ మరియు పిల్లలు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. నీ ఆరోగ్యం విషయం మాత్రం అశ్రద్ధ చేయవద్దు. మనో నిబ్బరం అవసరం. పరిస్థితులు ఎల్లకాలం ఒకే విధంగా వుండవు. వాటంతట అవే మారుతుంటాయి. అప్పటిదాకా కొంత ఓర్పును మాత్రం వహించాలి. భగవంతుడ్ని నమ్మినవారికి కష్టాలు ఏమీ చేయజాలవు. బాధలోనే సౌఖ్యం, ఆనందం కూడా యిమిడి వుంటుంది. కష్టాలు దాపురించినప్పుడు కన్నీరు కార్చడం, ఆనందం చేకూరినప్పుడు నా అంతటివాడు లేడని విర్రవీగడం అంత మంచిది కాదు. ఆరిపోయే దీపానికి వెలుతురు ఎక్కువ. నా వెలుగులో ఎవ్వరూ నిలువలేరని విర్రవీగుతుంది. మరుక్షణంలో వచ్చే గాడాంధకారాన్ని ఊహించలేదు. ఆ క్రాంతిని చూచి **"నీవు ఇంద్రుడవు, చంద్రుడవు, నీ కన్నా మించిన మహాశక్తి ఈ ప్రపంచంలో యింతవరకు పుట్టలేదు"** అని స్తోత్రించే స్వార్థపరులు చుట్టూ చేరుతారు. వారిమాటలను నమ్మి కండకావరంతో కన్ను మిన్ను కానకుండా చేయరాని పనులకు తలపడుతుంది. ఇది మానవనైజం. మానవాతీతులైన మహానుభావులు కూడా ఈ జాడ్యం నుంచి తప్పించుకోలేక పోయారు

నిరంతర స్నాన సంధ్యానుష్ఠాన నిష్ఠాగరిష్టుండగు బ్రహ్మాంశ సంభూతుండైన "**రావణబ్రహ్మ**"కు కూడ యిదే జాడ్యం దాపురించింది. సకల శాస్త్ర విద్యా ప్రవీణుడై, ఆగమశాస్త్ర నవవ్యాకరణోత్తమ లక్షణాలంకార కావ్య వ్యాఖ్యానామాన భాషా విభూషణుండైన రావణబ్రహ్మకు సహితం ఇదే గర్వం ప్రస్ఫుటించింది. అతల, వితల, సుతల, తలాతల, మహాతల, భూతలాది చతుర్దశ భువనైక శాసనోద్దండనాధినాధుల కధినాధుడైన రావణబ్రహ్మకు చిట్టచివరికి జరిగింది ఏమిటి? ఒక సామాన్య నిరాబండరుడైన రాముని చేతిలో ఏమైనాడు? కోతుల చేతులలో దుర్దగ్ధమైన బంగారు లంక ఏమైంది? ఇదే నగ్న సత్యాలను మన పురాణాలు ఘోషిస్తున్నాయి. ప్రపంచ చరిత్ర ఋజువు చేస్తున్నది. కనుక ప్రస్తుత పరిస్థితులను ఒక సామాన్య వ్యక్తి ఎదుర్కొనగలడా? ఎదుర్కొని సాధించగలిగేదేముంది ! ఇదే ఈనాటి ప్రశ్న? ఇంతకన్నా వివరించడం నాకు సాధ్యంకాదు. నీవే అర్థం చేసుకుంటావని ఆశిస్తున్నాను ఇక ఉంటా___

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 26-8-1975

మ॥ రా॥ శ్రీ నాన్నగారికి -స ప్రేమ నమస్కారములు.

నేను కులాసా. తమరు వ్రాసిన ఉత్తరం అందింది. మీరేదో బాధపడు తున్నట్లుగా మీ ఉత్తరం చూచి అర్థం చేసుకున్నాను. అది సహజం కూడాను. మీ వార్ధక్యం రోజులలో మీ దగ్గర వుండి మీకు సేవచేసే అవకాశం లేనందుకు విచారిస్తున్నాను. మీ ఆరోగ్యం విషయంలో ఏమాత్రం అశ్రద్ధ చేయవద్దు. తరచుగా డాక్టరుగారికి చూపించుకొని మందులు శ్రద్ధగా వాడగలరు. అమ్మగారిని కూడా మందు తీసుకోమనగలరు. ఏమీ దిగులు పడవద్దు. త్వరలోనే వస్తాను. నేను తప్ప మిగతావారందరూ మీ వద్దనే వున్నారుగదా! దిగులుపడి ఆరోగ్యాన్ని పాడు చేసుకోవద్దు. ఇంటర్వ్యూలకు వచ్చే నెలలో అవకాశం వుండవచ్చును. వీలు చూచుకొని మీరు కూడా రావచ్చును. ఎప్పుడు రావచ్చునో తరువాత తెలియబరుస్తాను. అమ్మగారిని అడిగినట్లుగా చెప్పగలరు.

చి॥ లక్ష్మికి -

మీ నాన్న దీవించి వ్రాయునది ఏమనగా - నేను కులాసా. నీవు భరతనాట్యం, సంస్కృతం నేర్చుకుంటున్నందుకు చాలా సంతోషం. వారానికి రెండు ఉత్తరాలు వ్రాయడానికే నాకు అవకాశం వున్నది. అందువల్ల ఒకే ఉత్తరంలో మీ అందర్కీ వ్రాస్తున్నాను. ఈ సంవత్సరం 7వ తరగతి స్కూలు ఫస్టు రావాలి. శలవలలో లవలి పిన్ని వద్దకు శిలేరు వెళ్ళగలరు. ఒక్క చదువుకే పరిమితం కారాదు. మన ధర్మ సంస్కృతీ పరంపరలను కూడ తెలుసుకోవాలి. ఝాన్సీ లక్ష్మి, రాణిరుద్రమ వీరగాధలు, సీత, సావిత్రి, దమయంతుల పవిత్ర చరిత్రలు కూడ తెలుసుకోవాలి. అవే ఈనాడు కావల్సినవి. నేను తప్పుచేసి మాత్రం జైలుకు వెళ్ళలేదు. ధర్మ, న్యాయాలను నిరూపించడం కోసమే జైలుకు వెళ్ళాననే విషయం అర్థం చేసుకొని ధైర్యంగా వుండాలి. పుట్టినరోజు పండుగ బాగా చేసుకున్నావని తలుస్తున్నాను. వినయ విధేయతలతోపాటు సద్బుద్ధి మంచి సంస్కారం గలదానివి గా తయారవుతావని ఆశిస్తున్నాను.

చి॥ చందుకు......

మీ నాన్న ఆశీస్సులు. నీవు హిందీ పరీక్షకు వెళ్ళుతున్నందుకు చాలా ఆనందంగా వున్నది. మంచి మార్కులు తెచ్చుకోవాలి. నీ పేరు 'చంద్రశేఖర్' కదా! చంద్రశేఖర్ ఆజాద్‌ను మైమరపించే వీరుడవు కావాలి. చంద్రుడు ఇచ్చే ఆహ్లాదకరమైన వెన్నెలలాంటి చల్లదనాన్ని మా అందర్కి యివ్వాలి. పల్నాటి బాల

వీర చంద్రుని బలపరాక్రమాదులను తెలుసుకోవాలి. 'కొమరగిరి' వంశచరిత్ర చిరస్థాయిగా ఆచంద్రార్కము వర్ధిల్లేందుకు కృషి చేయాలి. ఇదే నా ఆశ, ఆశయం.

చి॥ ఉదయకు....

మీ నాన్న ఆశీస్సులు. నీవు సూర్యభగవానుడి లాంటి వాడవనే విషయం నాకు తెలుసు. సూర్యునిలాగే నీవు కూడ యావత్ ప్రపంచానికి వెలుగును ప్రసాదించే వాడవవుతావనే విశ్వాసం నాకు ఉన్నది. సంస్కృతంలో మంచి పండితుడివి కావాలి. ఆదిత్యహృదయం, హనుమాన్ చాలీసా ప్రతి నిత్యమూ చదువుతూ వుండగలవు. వీరహనుమాన్‌కి మించిన వాడవవుతావని నా నమ్మిక. భక్త ప్రహ్లాద చరిత్రను కూడ తెలుసుకోగలవు. నీవాడియైన కిరణాలతో అందర్నీ ఏడిపించక మంచి ప్రవర్తనతో అందర్నీ మురిపించుతావు గదూ!

చి॥ శ్యాం కు,......

మీ నాన్న దీవించి వ్రాయునది ఏమనగా ... "శ్యాం గుడ్‌బాయ్" అని నిన్ను చిన్నప్పటినుంచి పిలిచేవాడనుగదా ! అదే విధముగా మంచిగా తయారు కావాలి. అన్ని విద్యలు నేర్చుకోవాలి. అన్నింటిలో ఫస్టుగా ఉండాలి. శివాజీ, రాణాప్రతాప్, అల్లూరి సీతారామరాజుల వీరత్వాన్ని "బాబాయి" ని అడిగి తెలుసుకో. నీవు నాకోసం దిగులు పెట్టుకోవద్దు. త్వరలోనే వస్తాను. అమ్మను మాత్రం ఏడిపించవద్దు.

చి॥ గౌరికి - నా ముద్దులు

ముద్దు పెట్టుకోవడం లేదని మూతి బిగించి మూలన కూర్చుంటున్నావు గదూ ! ఇదుగో ఇప్పుడే పెట్టుకుంటున్నాను. నిన్ను గాదు నీ ఫోటోను. నేను వచ్చేటప్పటికి ఒకటవ తరగతి పుస్తకం పూర్తిచేయాలి. కోపం తగ్గిందా! ఇక వుంటా...

ఇట్లు

'మీ'

---

*'గత చరిత్ర చూచుకొని గర్వపడుట తెలివి తక్కువ. మన పూర్వులు వేసిన పునాదులపై నిలుచుట కాదు మనకు గర్వము; ఆ పునాదులకు సర్వవిధముల తగిన, సుందరమైన సౌధ నిర్మాణం చేయగలిగినపుడే వారికి తగిన వారసులమని గర్వించవలెను'*

*- శ్రీ లాలాలజపతిరాయ్*

సెంట్రల్‌జైలు - రాజమండ్రి
ది. 5-9-1975

ప్రియమైన జయ,

నేను కులాసా. నీవు వ్రాసిన ఉత్తరం చాలా పర్యాయాలు చదివాను. కోపం మాత్రం రాలేదు. కాని కొంచెం బాధ పడి నవ్వుకున్నాను. నీవు అట్లా వ్రాయడం సహజం. నిన్ను ప్రేమించిన మీ నాన్నగారు శాశ్వతంగా కన్నుమూశారు. వారు పోయిన 5వరోజునే నేను నిన్ను వదలి '**శ్రీకృష్ణజన్మస్థానము**' నకుచేరాను. పిల్లలకు జ్వరాలు. ఇంట్లో తీరుబడిలేని పని. హాస్టల్ వ్యవహారాలు చూచుకోవాలి. విద్యానికేతన్‌లోని పిల్లల యోగక్షేమాలను తెలుసుకుంటుండాలి. శ్రమతోపాటు బాధ్యతగల బరువు కూడ నీమీదనున్నది. ఇటువంటి పరిస్థితులలో ఎవరికైనా కోపంరావడం సహజమే. మానసిక ఆందోళనకు గురికావడం కూడా సహజమే. నీవు నాకు తగినదానివి కాదని నీ అంతట నీవే కించపరచుకోవడం అంత మంచిది కాదు. నేను వ్యక్తం చేసినప్పుడు ఆ విధముగా భావించాలి గాని నీ అంతట నీవే ఆ విధంగా నిర్ణయానికి వచ్చి బాధపడటం ఏ మాత్రం బాగాలేదు. ఈ తడవ ఆ విధంగా వ్రాస్తే నేను చాలా బాధపడుతాను.

**"నేను దుర్బలుడనని, పాపినని, నిర్భాగ్యుడనని, శక్తిహీనుడనని భావించుటయే మహా దోషము"** అని స్వామి వివేకానంద చెప్పారు. దౌర్బల్యమే బాధకు కారణం. దుర్బలుల మగుటచేతనే దుఃఖితుల మగుచుందుము. నా కన్నా ఎక్కువ పురాణాలు చదివిన నీకు యీ విషయాలు తెలియవా? ఓర్పు, ఓర్మి, చాలా అవసరం. కష్టాలు వచ్చినప్పుడు భగవంతుని నిందించడం తూలనాడటం విజ్ఞుల లక్షణం కాదు. ఈ కష్టాలు యిప్పుడు వచ్చింది కొద్దిమందికి మాత్రమే కాదు. యావత్ సమాజానికి వచ్చింది.

ఈ దేశం తపోభూమి, పవిత్రభూమి, పుణ్యభూమి, అని భావించుతూ. యిక్కడి ప్రతి రాయి రప్ప, పుట్ట, చెట్టు, యందలి ప్రతి అణువు పవిత్రమైనదని భావించేవాడు దేశద్రోహులుగా చిత్రీకరించబడుతున్నారు. **"సముద్ర వసనేదేవి, పర్వతస్తన మండలే, విష్ణుపత్ని నమస్తుభ్యం, పాదస్పర్శం క్షమస్వమే"** అని పవిత్ర భావంతో ప్రాతఃకాలమున భూదేవికి నమస్కరిస్తూ, నా అపవిత్రమైన పాదాలతో నిన్ను త్రొక్కవలసివస్తున్నదని బాధపడుతూ క్షమించమని వేడుకుంటున్న భరతమాత పుత్రులు నేడు దేశద్రోహులుగా భావించబడుతున్నారు. ఇచట పవిత్రమైన పుణ్యక్షేత్రాలు, నదీనదాలు, హిమాలయాలు, గౌరీశంకరం, మానస సరోవరం మనవేనని భావించి

పూజించుతున్న అకుంఠిత దేశభక్తులు నేడు ద్రోహులుగా పరిగణింబడుతున్నారు. పాకిస్థాన్, చైనా దేశాలు మన పవిత్ర భారతభూమిని కబళించడానికి ప్రయత్నించినప్పుడు నా అనే ఆత్మీయులు వున్నారనే భావం మనసులోనికి కూడా రానీయకుండా, నిస్వార్థ బుద్ధితో, దేశభక్తి భావంతో వీరోచితంగా అహర్నిశలు పోరాడుతున్న భారత వీర సైనికులకు అండగా నిలచి, సర్వసదుపాయాలను వారికి అందిస్తూ, లక్షలాది రక్తపు సీసాలను సేకరించి యిచ్చిన స్వచ్ఛంద స్వయం సేవకులు నేడు ప్రభుత్వం దృష్టిలో దేశద్రోహులైనారు. చైనా లడక్‌ను ఆక్రమించినప్పుడు **"పోనిద్దూ** ! అక్కడ గడ్డిపరకైనా మొలవదని, మరియు వాసయోగ్యం కాని పాములపుట్ట అయిన **'నీఫా'** కోసం తాపత్రయపడడం అవివేకమని ! పాకిస్థాన్ ఆక్రమించిన **"కచ్"** ఎందుకూ పనికిరాని **"ఎడార"**ని ప్రచారంచేసిన పెద్దలు నేడు దేశభక్తులుగా చలామణి అవుతున్నారు. ఆ భూ భాగాలను తిరిగి ఆక్రమించుకోవాలని వాదించేవారు నేడు దేశద్రోహులుగా చూడబడుతున్నారు.

చరిత్ర మారుతున్నది. దేశద్రోహులు దేశభక్తులుగా; దేశభక్తులు దేశద్రోహులుగా చిత్రీకరించబడుతున్నారు. శబ్దాలకు అర్థాలు మారుతున్నాయి. నిర్వచనాలు తారుమారవుతున్నాయి. ఇదీ ప్రస్తుత పరిస్థితి. ఏది ఏమైనప్పటికీ నిజం నిలకడగ నిదానంగా గుర్తించబడుతుంది. ఎవరు గుర్తించినా గుర్తించక పోయినా, పొగడినా పొగడక పోయినా చిట్టచివరకి నిందించినా, దూషించినా మన మాతృదేశం యొక్క గౌరవ ప్రతిష్ఠలను సంరక్షించడం మన విధి. దేశ సమైక్యతను పరిరక్షించడం మన కర్తవ్యం. మాతృదేశ సంరక్షణకు అవసరమైతే సర్వస్వాన్ని సమర్పించడానికి కూడ ఏమాత్రం వెనుదీయరాదు. మనం పవిత్రంగా భావించే ఈ పవిత్రభూమికి, ఈ పుణ్యభూమికి, ఈ తపోభూమికి మన ఆరాధ్య దేవత అయిన ఈ భరతమాతకు ఏమాత్రం అవమానం జరిగినా సహించరాదు. ఆ నీచానికి ఒడిగట్టే దుష్టశక్తులను అంతమొందించేంతవరకు విశ్రమించరాదు. ఇటువంటి కరడుగట్టిన పవిత్రులైన మనలాంటి దేశభక్తులను దేశవిచ్ఛినకర దుష్ట శక్తులుగా ప్రభుత్వం చిత్రీకరించడం నిజంగా భరతమాత దురదృష్టం. పదిమంది మనల్ని గురించి చెప్పకుంటున్నారా? లేదా? అనేది కాదు. మనకుండవలసినది పవిత్ర భావన. దేశభక్తిభావం. సమాజశ్రేయస్సును కాంక్షించడం, ఇటువంటి పవిత్ర వజ్ర సంకల్పులను ఏ శక్తీ ఎదిరించలేదు. ఒకవేళ దుష్టబుద్ధితో ఎవరైనా సాహసిస్తే వారి గతి అగ్నిలో పడ్డ మిడుత గతే అవుతుంది. ఇక వుంటా.

(పై ఉత్తరాన్ని సెన్సార్ అధికారులు ఇంటికి పంప నిరాకరించారు)



సెంట్రల్ జైలు - రాజమండ్రి
ది. 8-9-1975

డియర్ జయ,

నీ రెండవ ఉత్తరం అందేటప్పటికే నా ఉత్తరం వ్రాసాను. కోపంరావడం అనే ప్రశ్నేలేదు. శ్రీకృష్ణజన్మస్థానంవల్ల మంచి అవకాశం లభించింది. పుస్తకాలు చదువుకోవడానికి, పూజలు చేసుకోవడానికి మంచి తీరిక లభించింది. అంతేకాదు పరిస్థితులను సవ్యంగా అవగాహన చేసుకోవడానికి ఉపయోగపడుతున్నది. "**ఉత్తమేక్షణకోప :**" అనే నీతి సూక్తి సరీగా నీకు సరిపోయింది. అందువలననే మళ్ళీ ఉత్తరం వ్రాయగలిగావు. నాకు వెంటనే ఉత్తరం వ్రాయడానికి పోయిన వారం రెండు ఉత్తరాలు అయిపోయినాయి. వ్రాయాలని వున్నప్పటికీ అవకాశం లేదు గదా! అందువల్ల ఈరోజు వ్రాస్తున్నాను. రెండవ ఉత్తరం వారాంతంలో వ్రాస్తాను. నాకు ముఖ్యంగా కావాల్సింది నీ ఆరోగ్యం. అనవసరంగా బుర్ర చెడగొట్టుకొని బాధపడవద్దు. ఓపిక, ఓర్మి చాలా అవసరం. సత్యం జయించి తీరుతుంది. నిజం నిలకడ మీద అర్థమవుతుంది. రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యం ప్రపంచపటం నుంచి కూకటివేళ్ళతో పెకలించవేయబడి, తమదేశం వరకే వాళ్ళ అధికారం పరిమితం చేయబడింది. తమ సైనిక శక్తితో ప్రపంచాన్నే గడగడలాడించిన హిట్లర్, ముస్సోలినీలు కాలగర్భంలో కలిసిపోయారు. ప్రపంచ చరిత్రలో ఎందరో నియంతలు నాకంటే మొగాళ్ళు లేరని విర్రవీగి సర్వనాశనానికి తలబడిన మహామహులు మంటకలసిపోయారు. త్యాగధనులకు ప్రపంచం మోకరిల్లి తీరుతుంది. అంత దూరమెందుకు ? బ్రిటీష్‌వారి విష కబంధహస్తాల మధ్య భారతీయులు దాదాపు రెండు వందల సంవత్సరాలు నలిగిపోయారు. భారతదేశం పీల్చి పిప్పిచేయబడింది. దేశభక్తులు కారాగారాలలో సంవత్సరాల తరబడి దుర్భర జీవితాన్ని గడిపారు. ప్రజలలో ప్రతీకార వాంఛ బయలుదేరింది. స్వాతంత్ర్యం కోసం కంకణధారులైనారు. ఎనలేని త్యాగాలు చేసారు. కొంతమంది వీరులు తుపాకిగుండ్లకు బలైనారు. మరికొంతమంది ఉరికంబాలకెక్కారు. భారత జాతీయ కాంగ్రెసు ఆధ్వర్యమున మహోద్యమం నడుపబడింది. పదవులకు ఉద్యోగాలకు స్వస్తిచెప్పారు. న్యాయవాద వృత్తులను వదిలిపెట్టారు. స్వంత ఆస్తులను అమ్ముకొని ఉద్యమాన్ని కొనసాగించారు. ఉదాహరణకు ఒక ఉదంతం చెబుతాను. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రధమ రాష్ట్రపతిగా పదవిని స్వీకరించిన బాబూ రాజేంద్రప్రసాద్ జీవితంలోని ఒక ఉదంతాన్ని వ్రాస్తాను. అవి '**క్విట్ ఇండియా**' ఉద్యమరోజులు. భారతదేశాన్ని బ్రిటిషువారు వదలి వెళ్ళాలని బ్రహ్మాండమైన ఉద్యమం జరుగుతున్న

సమయం, బాబూ రాజేంద్రప్రసాద్ పాట్నాలో ఉండేవారు. ఆ రోజులలో మంచి పేరుప్రఖ్యాతుల నందుకున్న ప్రముఖ న్యాయవాది. ఆ రోజులలోనే నెలకు పదివేల రూపాయలు న్యాయవాద వృత్తి మీద సంపాదించేవారుట. ఇల్లు ఇక మహా సత్రం. అనాధలకు చక్కటి ఆశ్రయం. వచ్చి పోయేవారికి లెఖ్ఖలేదు. బంధువులు స్నేహితులతో, ఎప్పుడూ కిటకిటలాడుతూ వుండేది. ఇష్టం వచ్చినన్ని రోజులు వుండి భోజనాలు చేస్తూ వారివారి స్వంత పనులు చూసుకుంటుండేవారు. ఉద్యమకారుల విషయం వేరే చెప్పనవసరంలేదు. అది వారి కార్యకలాపాలకు ప్రధాన కేంద్రం. వారి వారి పనులు అయిపోయిన తరువాత సామానులు సర్దుకొని వెళ్ళేముందు బాబూ రాజేంద్రప్రసాద్ వద్దకు వెళ్ళి నమస్కరించి వెళ్ళుతున్నామని చెప్పేవారుట. అప్పుడు ఆయన ఏ ఊరు వెళ్ళుతున్నారో; ఎంత ఛార్జీ అవుతుందో; పేరు పేరున అడిగి ఖర్చులు యిచ్చి పంపించేవారుట. అన్నంపెట్టి ఆశ్రయం యివ్వడమే గాక ఛార్జీలకు కూడా డబ్బు యిచ్చి పంపడం విశేషమే. ఒకరోజున మహాత్మాగాంధీ నుంచి ఆదేశం వస్తుంది. ఉద్యమంలో పాల్గొని కారాగారానికి వెళ్ళమని గాంధీజి ఆదేశిస్తారు. అప్పుడు వెంటనే గాంధీజీ ఆదేశానుసారం బాబూ రాజేంద్రప్రసాద్ సంచీ సర్దుకొని భార్య వద్దకు వెళ్ళి తన వద్దనున్న తొమ్మిది రూపాయిలు మాత్రం యిచ్చి జైలుకు సన్నద్ధమైపోతాడు. ప్రతినెలా పదివేల రూపాయిలపైన సంపాదించే న్యాయవాది వద్ద జైలుకు వెళ్ళేముందు వున్న మొత్తం తొమ్మిది రూపాయిలు మాత్రమే. అయినప్పటికీ ఆయన భార్య ఆనందంతో సాగనంపింది.

ఇటువంటి త్యాగధనులు ఆనాడు కాంగ్రెసులో అనేక మంది వుండేవారు. టంగుటూరి ప్రకాశం జీవితం కూడ అటువంటిదే. అట్టి త్యాగధనుల జీవితాలను ఆదర్శంగా గైకొని, స్ఫూర్తిని పొంది స్వాతంత్ర్య సంగ్రామం లోనికి అనేకమంది యువకులు దుమికారు. కాని చరిత్ర నేడు తారుమారైంది. జైలు మొఖం చూడని పెద్దలు నాయకులయ్యారు. త్యాగం చేయని చేతులకు అధికారం హస్తగతమైంది. అవినీతి నేడు వికటాట్టహాసం చేస్తున్నది. ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి తారాస్థాయికి చేరింది. అధికార వ్యామోహం పెచ్చు పెరిగింది. కుల మతా రాజకీయాలు స్వైర విహారం చేస్తున్నాయి. ఇటువంటి దుస్థితి స్వతంత్ర భారత్‌కు దాపురిస్తుందని మహాత్మాగాంధీ ముందుగానే ఊహించారు. అందుకోసమనే స్వరాజ్యం వచ్చిన వెంటనే కాంగ్రెస్‌ను రద్దు చేయమని కోరారు. త్యాగధనులకు, సమరయోధులకు నిలయమ్మైన కాంగ్రేసును అప్రతిష్టపాలు చేయవద్దని బ్రతిమాలి చెప్పారు. చరిత్రలో సువర్ణాక్షరాలతో కాంగ్రెసు చరిత్ర లిఖించబడాలంటే కాంగ్రెసునురద్దు చేయడం

మంచిదని **'హరిజ'** పత్రికలో ఆనాడు గాంధీజీ వ్రాసారు. కాంగ్రెసు పేరుతో అధికారంలోనికి వెళ్లవద్దని హితవు చెప్పారు. 18 సూత్రాలతో **'లోక్ సేవక్ సంఘ్'** ను స్థాపించుతానని, దానిలో చేరి నిస్వార్థ బుద్ధితో ప్రజాసేవకు అంకితం కమ్మనమని తన శిష్యులకు గాంధీజీ బోధించారు. కాని ఆయన మాటలు అనుచరులకు రుచించలేదు. అధికారవ్యామోహంలో పడిపోయారు. అధికారం ఎంతటివారినైనా భ్రష్టులను చేస్తుంది అనే నగ్నసత్యం నేడు ఋజువైంది. ఒక్కసారి అధికారం చేజిక్కితే చాలు. దానిని వదులుకోడానికి ఎవ్వరూ యిష్టపడరు. ఏదో విధంగా అధికారాన్ని నిలబెట్టుకోవాలనే కోరికతో ఎంతటి నీచానికైనా వెరువరు. నేడు చెట్టు పేరు చెప్పకొని కాయలు అమ్ముకుంటున్నారు. కాంగ్రెసు పేరు చెప్పకొని బ్రతుకుతున్నారు. కొంతమంది స్వార్థపరులు.

అధికారం మత్తును కలుగజేస్తుంది. అహంభావం ఏర్పడుతుంది. సంస్కృతంలో ఒక చక్కటి నీతిశ్లోకం కలదు. **"యౌవనం, ధనసంపత్తి: ప్రభుత్వమవివేకితా, ఏకైకమప్యనర్థాయ కింయత్ర చతుష్టయమ్"** అనగా యౌవనం, ధనం, అధికారం, అవివేకం - వీటిలో ఏ ఒకటి అయినాసరే సర్వనాశనం చేయడానికి సరిపోతాయి. ఇక ఈ నాలుగు ఒకచోట గనుక చేరితే వేరే చెప్పనవసరం లేదు. ఇప్పుడు ఇదే జరిగింది. గాంధీజీ ఊహించినది నేడు జరుగుతున్నది. అందు కోసమనే గాంధీజీ దూరదృష్టితో అధికారం చేపట్టలేదు. సలహాదారుడుగా మాత్రమే వున్నారు. నేడు మహాత్మాగాంధి లేరు. నేటి ప్రభుత్వానికి సలహాలు యివ్వగల సమర్థులైన గాంధిజీలాంటి మహానుభావులూ లేరు. ఒకవేళ వున్నా (జయప్రకాశ్) వారి సలహాలను పాటించేదెవరు? ఇది ఈనాటి స్థితి. ఇక వుంటా...........

ఇట్లు

'నీ'

గమనిక : ఈ ఉత్తరం ఇంటికి పంపటానికి సెన్సారు అధికారులు నిరాకరించారు.

---

*'స్వరాజ్యం సాధించబడగానే శీల నిర్మాణం, అనుశాసనం, ధైర్యం, శక్తి మున్నగు వానిని జాతిలో నిర్మించేందుకు విశేష కృషి జరగాలి. సాధారణ విద్యార్జనకన్నా కూడా ఇది ముఖ్యం, ప్రస్తుత పఠన ద్వారా జరిగే విద్య కూడా ఈ గమ్యానికి సాధన మాత్రమే కావాలి'.*

*- శ్రీ మహాత్మా గాంధి*

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 10-9-1975

ప్రియమైన జయ,

ఇక్కడ వినాయకచవితి ఘనంగా జరుపుకున్నాం. నీవు వ్రాసిన మొదటి ఉత్తరానికి 5వ తేదీన సమాధానం వ్రాసాను. 8వతేదీన మళ్లీ ఒక ఉత్తరం వ్రాసాను. ఈ రెండు ఉత్తరాలు నీకు అందివుంటాయని, నీకు మనశ్శాంతి చేకూరి వుంటుందని ఆశించాను. కాని దురదృష్టం. ఆ రెండు ఉత్తరాలలో కొంచెం ప్రస్తుతపరిస్థితిని సమీక్షించడం వలన, రాజకీయాలున్నాయని ఆ రెండు ఉత్తరాలను సెన్సారు అధికారులు నాకే త్రిప్పిపంపించారు. అవి నా వద్దనే వున్నాయి. నీవు వుండే ప్రస్తుత పరిస్థితులలో నమ్మడం కష్టమే. కాని యిది యదార్థం.

ఉత్తరాలలో రాజకీయాలు వ్రాయరాదు. పురాణాలు నాకు బాగా తెలియవు. నీవు వ్రాసే ఉత్తరాలు గాని, నేను వ్రాసే ఉత్తరాలుగాని అనేక మంది చేతులలో పడిన తరువాతనే గమ్యస్థానం చేరుతాయి. అందువల్లనే ఆలస్యం అవుతుంటాయి. ఈ పరిస్థితిని గురించి ఎక్కువగా పట్టించుకోవద్దు. మనస్సును పాడుచేసుకోవద్దు.

ఈ సంవత్సరం '**రాక్షసనామ సంవత్సరం**' గదా! ఈ సంవత్సరారంభంలో జరిగిన అనేక పెండ్లిండ్లు దెబ్బతిన్నాయట. కొన్ని చోట్ల పెండ్లికొడుకులు, మరికొన్నిచోట్ల పెండ్లికుమార్తెలు పోయారుట. చూడవచ్చిన చుట్టాలుకూడ మరణించారుట. అసలు ఈ సంవత్సరం పెండ్లిండ్లు చేయవచ్చునా? అని ఈమధ్య పత్రికలలో పండితులు సంశయాలను వెలిబుచ్చారు. ఈ సంవత్సరం ప్రకృతి కూడా ప్రకోపించింది. వరుణదేవుడు విజృంభించాడు. వర్షాలు ఎడతెరిపిలేకుండా కురుస్తున్నాయి. ఇండ్లు పడిపోతున్నాయి. ప్రతి రాష్ట్రంలో వరదల భీభత్సానికి అనేక గ్రామాలు నామరూపాలు లేకుండా పోతున్నాయి. అమాయకప్రజలు ఆహుతి అవుతున్నారు. పంటలు పైర్లు సర్వనాశనమవుతున్నాయి. దైవీశక్తి ముందు మానవశక్తి ఎందకూ పనికిరాదనే విషయం ఋజువవుతున్నది. రాక్షసనామ సంవత్సరం కాబట్టే మనకు కూడా కష్టాలు దాపురించాయేమో ! ఇక వుంటా.....

ఇట్లు

'నీ'

---

**'Not Gold, only men can make a people great and strong'.**

*'బంగారం కాదు, మనుష్యులు మాత్రమే జాతిని గొప్పదిగాను, శక్తివంతంగాను చేయగలరు'*

- శ్రీ ఎమర్సన్

సెంట్రల్ జైలు, రాజమండ్రి,

ది. 19-9-1975

ప్రియమైన జయ,

నా వద్దనుంచి ఉత్తరాలు రావడంలేదని వ్రాసావు. దురదృష్టవశాత్తు నేను వ్రాసిన రెండు ఉత్తరాలు నాకే తిరిగివచ్చాయి. మూడవ ఉత్తరం 10వ తేదీన వ్రాసాను. 15 తేదీకి కూడా అందకపోవడం ఆశ్చర్యంగా వున్నది. ఈ విషయంలో నా పొరపాటు ఏమాత్రం లేదు. ప్రస్తుత పరిస్థితుల ప్రభావం ఆ విధంగా వున్నది. నేను మాత్రం ఏమి చేయగలను?

నీవు కొన్ని అశుభపు మాటలు వ్రాస్తున్నావు. అది మంచిది కాదు. నాకు యిక్కడ అన్ని వసతులూ వున్నాయి. ఇది ఒక హాస్టల్ జీవితం. మన విద్యానికేతన్ హాస్టల్ పిల్లలకు అన్ని వసతులూ యిచ్చాం. కాని వారిష్టం వచ్చినట్లు బజారున పడి తిరగడానికి వీలుండదు గదా ! అదేవిధంగా మాకు వుంటుంది. నన్ను గురించి నీవేమీ బాధపడవద్దు.

ఈ మధ్య నేను ఒక ఉన్నతస్థాయికి చెందిన **"వంశవృక్షం"** అనే పెద్ద నవలను చదివాను. దానిలో హృదయానికి హత్తుకొనిపోయే సన్నివేశాలు, హృదయాన్ని కదిలించే మాటలు ఎన్నో వున్నాయి. అందులో సకల శాస్త్రాలను సాకల్యంగా పరిశీలించి అవగాహన చేసుకున్న ఒక మహనీయుడు ఒక విషయం చెబుతాడు. **"సుఖాన్నెలా స్వీకరిస్తామో, ఆ విధంగానే దుఃఖాన్ని కూడా స్వీకరించాలి. భావనా వేగంతో నిబ్బరం కోల్పోవడం వల్ల ఏ సాధనగాని ఫలించదు"** అని అంటాడు. ఈ మాటలలో ఎంతటి భావం నిగూఢమై వున్నదో ఆలోచించు. **"మాటలు చెప్పడం తేలికే, అనుభవిస్తున్నప్పుడు దానిలోని కష్టం ఎంతటిదో తెలుస్తుంది"** అని నీవనవచ్చు, అదీ వాస్తవమే. అయినప్పటికీ ప్రయత్నించడం అవసరం గదా! అదే పుస్తకంలో ఒక ప్రముఖ విద్వాంసుడు, చరిత్ర పరిశోధకుడుతో అతని భార్యకు కోపం వచ్చి మాట్లాడినప్పుడు అతను చెప్పిన మాటలు ఎంత వాస్తవికంగా వున్నాయో చూడు. **"కోపంగా ఒకరు ప్రశ్నించినప్పుడు, శాంతంగా సమాధానంచెప్పినా, వారి కోపం ఎక్కువవు తుంది. కోపంగా సమాధానమిస్తే, మరింత ఎక్కువవుతుంది. కాబట్టి ఊరుకోవడం వివేకం కదూ?"** అని అంటాడు. అని నేను ఊరుకోవడం లేదనుకో. సమాధానాలు సుదీర్ఘంగా వ్రాస్తునే వున్నాను కదూ ! ఇప్పుడు నీ కోపం తగ్గిందని భావించవచ్చునా?

పరిస్థితుల ప్రభావంవల్ల తన ప్రియుడికి దూరంగా వున్న ప్రేయసి వ్రాసిన లేఖలో **"ఒకసారి ప్రకాశాన్ని చూచిన ఆత్మ తిరిగి అంధకారాన్ని అనుభవించడం ఘోరమైన**

అనుభవం" అని వ్రాస్తుంది. ప్రస్తుతం నీ స్థితి కూడా అదే విధంగా వున్నది కదూ! అది సహజం. హృదయాన్ని కదిలించివేసే మరొక సన్నివేశం కూడా వ్రాస్తాను. **"మానవుడు దిగజారడం సులభం. పైకి వెళ్ళడం కష్టం".** వారి వారి కర్మలను ప్రతి ఒక్కరూ అనుభవించవలసినదే. సంసార సుఖమూ అంతే. భార్య వున్నా నేను యిలా వుండాలని ధర్మం యొక్క సంకల్పం. భర్తను దూరం చేసుకున్న నీవు అలాగే వుండాలని అదే ధర్మం యొక్క సంకల్పం -- మనస్సుకు కష్టమైనా సరే దానిని నిగ్రహించుకోవాలి. ఈ మాటలు ఎంత వాస్తవికతను చాటుతున్నాయి. విధి బలీయమైనది. దానికి ఎంతటి వారైనా తల వంచి తీరాల్సిందే.

ఇంకొక విషయం వ్రాస్తాను. శోత్రిగారు, అంధకారబంధురంలో గమ్యం చేరుకోలేక ఆ తికమకపడుతున్న తన కోడలితో అన్నమాటలు. **"స్వసుఖమనే సంకుచితత్వాన్ని అతిక్రమించి, ఎత్తునుండి చూచినప్పుడు ధర్మాధర్మాలు స్పష్టంగా కంటికి కనపడుతాయి. ఎవరైతే ధర్మానికి తాము సమర్పించుకుంటారో, వారిని ఏ కష్టమూ లేకుండా చేయి పట్టుకొని ధర్మం నడిపిస్తుంది. "** ఇది యదార్థం, వాస్తవం, నగ్నసత్యం కూడాను. ధర్మాన్ని నమ్మిన మనలను కూడా అదే ధర్మం కాపాడుతుంది. దరికిచేర్చి తీరుతుందని నా నమ్మకం.

**"ప్రస్తుతం సింహం బోనులో వున్నది కదూ !"** అని నన్ను గురించి వ్రాసావు. యదార్థాన్ని వ్రాసినందుకు చాలా సంతోషం. ఇదే వాస్తవాన్ని తెలిపే పద్యం ఒకటి భర్తృహరి సుభాషితాలలో వున్నది.

**ఉ.** **గ్రాసములేక స్రుక్కిన జరాకృశమైన విశీర్ణమైన సా**
**యాసమునైన నష్టరుచి యైనను బ్రాణభయార్తమైన సం**
**త్రాసమదేభకుంభ పిశిత గ్రహ లాలస శీల సాగ్రహా**
**గ్రేసర భాసమానమగు కేసరి జీర్ణ తృణంబు మేయునే**

కృశించి ముసలిదై, ఆకలిగొన్నదైన మృగరాజంబగు సింహం, ఎన్ని కష్టములు వచ్చినా ఎండిపోయిన గడ్డిపరకలను మాత్రం తినదు. అట్లే మాన శౌర్య సంపన్నుడైన వాడికి ఎన్ని కష్టములు వచ్చినా నీచ కార్యములు చేయబూనడు. నేనూ అంతే. కష్టాలను చూచి భయపడి నమ్మిన సిద్ధాంతానికి తిలోదకాలివ్వడం పిరికి వాళ్ళ లక్షణం. కష్టాలను ఎదుర్కొనలేక కన్నీరు కార్చడం బలహీనుల మనస్తత్వం. కష్టాలు కలకాలం ఒకచోటే కాపురం చేయవు. ఈ వాస్తవాన్ని గ్రహించినవానికి జీవితంమీద విరక్తి జనించదు. అంతిమ విజయం మనదే. ఇక ఉంటా............

సెంట్రల్ జైలు, రాజమహేంద్రవరం
ది. 22-9-1975

ప్రియమైన జయకు,

నేను కులాసా. ప్రతి ఉత్తరంలో క్రొత్తవిషయాలు వ్రాయాలంటే కొంచెం కష్టంగానే వున్నది. తిరిగే అవకాశం గనుక వుండి వుంటే బాహ్య ప్రపంచ లౌకిక విషయాలను గురించి వ్రాసేవాడను. కాని నాకు ఆ అవకాశం లేదుగదా! మన పూర్వులు వేదాలు, ఉపనిషత్తులను పఠించి, తర్కించి అనేక రూపాలలో ప్రజానీకానికి ప్రసాదించిన అమూల్యమైన పుస్తకాలను చదివి వాటి సారాన్ని మాత్రమే సూక్ష్మరూపంలో వ్రాయగలుగుతున్నాను. చదవటానికి అవసరమైన మంచి పుస్తకాలు అందుబాటులో లేవు. నాకు ముఖ్యమైనవి, తెలిసినవి రాజకీయాలు వ్రాస్తే నీకు ఉత్తరం చేరదు. ఇది నా పరిస్థితి. ప్రస్తుతం నేను త్రిశంకు స్వర్గంలో వున్నాను.

నీ ఉత్తరాలలోని కొన్ని వాక్యాలు ఆలోచించదగ్గవి, మరికొన్ని నిగూఢమైన భావాలు కలవి, యింకా కొన్న బాధను కలిగించేవి -- మొత్తానికి మెదడుకు పని కలిగిస్తున్నాయి. ఆలోచనలు రేకెత్తిస్తున్నాయి. "**ప్రక్క మంచం మొదలగు సౌకర్యాలు వున్నాయా? అని వ్రాస్తూ, అయినా మీరు ఏది లేకపోయినా వుండగలరు. మానివెయ్యాలంటే మానివేయగలరు, నిగ్రహం ఎక్కువ, పట్టుదల ఎక్కువ**" అని కూడా వ్రాసావు. నా మనస్తత్వం నీకు తెల్సినదే గదా! నీవు వ్రాసిన విషయాలు చదువుతుంటే భర్తృహరి సుభాషితములలో ఒకపద్యం గుర్తుకు వస్తున్నది.

మ॥ **ఒకచో నేలను బవ్వళించు, నొకచో నొప్పారు బూసెజ్జపై**
**నొకచో శాకము లారగించు, నొకచో నుత్కృష్టశాల్యోదనం**
**బొకచో బొంత ధరించు, నొక్కొక్క తఱిన్ యోగ్యాంబరశ్రేణి లె**
**క్కకు రానీయడు కార్యసాధకుడు, దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.**

కార్యసాధకుడు కష్టసుఖములను, సుఖదుఃఖములను లక్ష్యపెట్టక ముందుకు సాగిపోవును. ఉన్నప్పుడు అనుభవిస్తాడు. లేనప్పుడు విచారించడు. ఉన్నా లేకపోయినా అతనికి అంతా సమానమే. అటువంటి సమభావం గలవాడు చేబట్టిన పని ఎన్నటికీ చెడదు. తప్పనిసరిగా విజయం చేకూరుతుంది.

ఒక ఉత్తరంలో నిన్ను నీవే కించపరచుకుంటూ దైన్యంగా వ్రాసావు. అది మంచిదికాదు. ఆ విధంగా వ్రాయడం దుర్బలుల లక్షణం. రెండు ఎద్దులు వుంటేనే వ్యవసాయం సక్రమంగా జరుగుతుంది. ఒకే ఎద్దు ఎంత బలిష్టంగా వున్నప్పటికి

ప్రయోజనం లేదు. రెండవది కూడ దానితో సమానంగా వుండాలి. భార్యకు భర్త అండ, భర్తకు భార్య అండ. ఇద్దరూ వుంటేనే కార్యసాధనకు అర్హులు. ఏ పవిత్ర కార్యం నిర్వహించాలన్నా ఇద్దరూ వుండాలి. ఇదే భావాన్ని ప్రస్ఫుటించే మంచి వాక్యాలు "వంశవృక్షం" నవలలో వున్నాయి. **"ఒక మహత్తర కార్యసాధనకై కృషి చేస్తున్న యిద్దరు జీవులు లేక ఒకే దేవి ఉపాసనలో జీవితాలనే అర్పించబూనిన ఇద్దరు భక్తులున్నారే -- ఈ పూజా విధానానికి యిద్దరి కృషి ఆవశ్యకములే. ఒకరు మంత్రం పఠిస్తే, మరొకరు తంత్రం చేసేవారు. ఒకరు వాస్తవిక పూజలో నిమగ్నులైతే, మరొకరు పుష్పాలను సమీకరించి తెచ్చి గంధాక్షతలను సిద్ధపరచేవారు. ఇద్దరూ కలసి చేసే ఉపాసన నిరాంటంకంగా కొనసాగుతుంది"** ఇది ఎంతో వాస్తవం. ఒకరే అయితే పూజ నిర్విఘ్నంగా సాగదు. ఏది కావాలన్నా పూజ మధ్యలో లేచి బయటకు వెళ్ళవలసి వస్తుంది. ఏకాగ్రతకు ఆటంకం ఏర్పడుతుంది. కనుక పూజా ద్రవ్యాలను అందించేందుకు ప్రక్కన ఒకరు తప్పనిసరిగా వుండాలి. పూజలో నిమగ్నుడైన వ్యక్తిని భగవంతుడు ఏవిధంగా అనుగ్రహిస్తాడో, ఆ పూజావిధానానికి తోడ్పడి, సమకూర్చే వ్యక్తిని కూడా భగవంతుడు అదే విధంగా కరుణిస్తాడు. సన్యాసికి అన్ని పుణ్యకార్యాలు చేయడానికి అర్హత లేదు. సంసారికి మాత్రమే అట్టి అర్హత వున్నది. ఈ వాస్తవాన్ని అర్థంచేసుకుంటే అసలు విషయం బోధపడుతుంది. భార్యకు వుండే ప్రాధాన్యత భార్యకు, భర్తకు వుండే ప్రాధాన్యత భర్తకు వున్నది. ఎవరి ధర్మం వారిది, ఎవరి బాధ్యతలు వారివి. ఇందులో ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అని అనుకోవాల్సిన పనిలేదు. కించపరచుకోవాల్సిన అవసరం అంతకన్నా లేదు. ఎవరి ధర్మం వారిది. అంతమాత్రాన ఒకర్ని పెద్దఅని, ఘనుడని, అర్హుడని భావించడం, మరొకరికి అట్టి అర్హతలేదని కించపరచడం న్యాయం కాదు. నిష్కామకర్మతో నీవు చేస్తున్న పని నీకు అదే ధర్మం. నేను చేస్తున్న పని నాకు ధర్మం. ఇద్దరిదీ ధర్మమార్గమే. **'ధర్మో రక్షతి రక్షితః'** ఎవరు ధర్మమును నిష్కామబుద్ధితో ఆచరించుదురో, కాపాడుదురో, అట్టి వారిని ఆ ధర్మమే రక్షించుతుంది. మనుజునకు ధర్మమే జీవితలక్ష్యమై వుండాలి. ధర్మం వున్నచోటనే భగవంతుడు కూడా వుంటాడు. భగవంతుడు ఎచట వుండునో అచట ఐశ్వర్యము, విజయము, నీతి వుంటాయి. అవి లేనిచోట అరాచకం ప్రబలుతుంది. అవినీతి పెచ్చు పెరుగుతుంది. అపజయాలు సంభవిస్తాయి. కరువు కాటకాలు సంభవిస్తాయి. సంక్షోభం ఏర్పడుతుంది. అప్పుడు భగవంతుడు ఏదో ఒక రూపంలో అవతరించుతాడు. దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించడాని కోసం చేయవలసినదంతా చేస్తాడు. ధర్మాన్ని సంరక్షిస్తాడు. ఇదే వాస్తవం భగవద్గీతలో ఈ క్రింది రెండు శ్లోకాలలో చక్కగా వివరించబడింది.

**"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥**
**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"**

ఇది వాస్తవమని ప్రపంచ చరిత్ర ఋజువు చేస్తున్నది. ధర్మం క్షీణిస్తున్నప్పుడు, అధర్మం అభివృద్ధిగాంచుతున్నప్పుడు గనుక ఏదో ఒక శక్తి పుట్టి దానిని ఎదుర్కొనకపోతే మానవాళి మనుగడకే ముప్పు ఏర్పడుతుంది. కనుక ఏమీ భయపడనవసరంలేదు. అంతిమ విజయం ధర్మానిదే. అయితే అప్పటివరకు ఓర్మి వహించాలి. ఆత్మవిశ్వాసంతో జీవితయాత్ర కొనసాగించాలి. ఇక వుంటా....

ఇట్లు
'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 25-9-1975

ప్రియమైన జయ,

నీ ఉత్తరం అందినది. నీలో రానున్న మార్పును గురించి వ్రాసావు. అది ఆశర్యపడేట్లుగా వుండాలిగాని, బాధపడేట్లుగా వుండకూడదు! సంతోషించేట్లుగా వుండాలి గాని, విచారించేట్లుగా వుండరాదు. ఉత్తరం ఆఖరులో కణ్వుడి ఆశ్రమంలోవున్న శకుంతలలాగే వున్నానని వ్రాసావు. ఆ దుష్యంతుడు శకుంతలను మరచిపోయాడు. నేను మాత్రం నిన్ను మరచిపోలేదు. పరిస్థితుల ప్రభావం వలన ఈ యెడబాటు వచ్చింది. ఇది కూడా ఒకందుకు మంచికే జరిగిందేమోనని భావిస్తున్నాను. **"అంతయూ మన మేలు కొఱకే"** అనే విషయం మరువరాదు. జైలుకు రాకమునుపు ఎప్పుడైనా ఇంత పెద్ద ఉత్తరాలు నీకు వ్రాశానా? లేదు. ఇప్పుడు వ్రాస్తున్నాను. వ్రాయడానికోసం చదువుతున్నాను. విజ్ఞానాన్ని సముపార్జిస్తున్నాను. క్రొత్త విషయాలను తెలుసుకుంటున్నాను. ఆధ్యాత్మిక విషయాలను అవగాహన చేసుకుంటున్నాను. తీరుబడి సమయాన్ని సద్వినియోగం చేసుకుంటున్నాను.

ఒక పర్యాయం పండిత జవహర్‌లాల్ నెహ్రూ అమెరికా వెళ్ళడం జరిగింది. వివిధ దేశాధిపతులు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. వాళ్ళ వాళ్ళ దేశాల్లో ఏ రంగంలో ప్రగతిని సాధించారో చెప్పుకుంటూ పోతున్నారు. మనకు స్వాతంత్ర్యం సిద్ధించి కొలది సంవత్సరాలే కావడం వలన మనదేశ ప్రగతిని గురించి

ఏమి చెప్పాలో తోచక పండిత నెహ్రూ మనస్సులో ఆందోళన చెందుతున్నారు. సమయస్ఫూర్తితో మన నెహ్రూ మేము **'ఆధ్యాత్మికంగా అన్ని దేశాల కన్నా ముందున్నాం' అని చెప్పారు.** అందరూ భౌతికవాదులే కాబట్టి నెహ్రూ అభిప్రాయాలను ఎవ్వరూ కాదనలేకపోయారు. ఆధ్యాత్మికతమీద అసలు విశ్వాసం నెహ్రూకు లేకపోయినా చెప్పక తప్పనిసరైంది. అటువంటి ఆధ్యాత్మికత గురించి లోగడ నాకు కూడా ఎక్కువ తెలియదు. దానిలో ఉన్నతములైన విషయాలను తెలుసుకోవడానికి, అవగాహన చేసుకోవడానికి జైలు జీవితం నాకు మంచి అవకాశాన్ని యిచ్చింది. ఇంటివద్ద వున్నప్పుడు మంచి పుస్తకాలు చదవడానికి క్షణం తీరుబడి వుండేది కాదు. వచ్చేవాళ్ళు, పోయేవాళ్ళు, రాజకీయాలు, ప్రయాణాలు, ఉపన్యాసాలు యింకా అనేకం. ఆ హడావిడిలో చదువుకోవడానికి అవకాశం వుండేదికాదు గదా! ఇప్పుడంతా విశ్రాంతే. మహానాయకులందరూ జైళ్లలో వున్నప్పుడే విజ్ఞానాన్ని సముపార్జించారు. పుస్తకాలు వ్రాసారు. నేనూ అదే విధంగా భగవదనుగ్రహంవల్ల లభించిన ఈ అవకాశాన్ని సద్వినియోగం చేయదలచుకున్నాను. అట్లా అని ఎల్లకాలం జైలులోనే వుంటానని భయపడనవసరంలేదు. విశ్రాంతి కోసం అవకాశం వున్నవారు ఉదక మండలం, నీలగిరి మరి యితర ప్రాంతాలకు వెళ్ళుతుంటారు. అదేవిధముగా నేనూ యిక్కడికి వచ్చానని భావిస్తున్నాను. ఈ సదవకాశం కలుగజేసిన శ్రీమతి ఇందిరాగాంధీకి అభినందనలు.

ఒకమాటు ఒక ఉత్తరంలో ఎటువంటి విద్యను నేర్చుకోవాలి? అని వ్రాసావు. దీనిని గురించి కొంత వివరిస్తాను. పొట్టనింపుకోవడానికి అవసరమైన లౌకిక విద్యా? (ఇంగ్లీషు వగయిరాలు) లేక ఆధ్యాత్మిక విద్యా? ఈ విషయమై 'భగవద్గీత' చక్కటి మార్గాన్ని సూచించింది. పరబ్రహ్మ వస్తువును తెలుసుకొనుటయే జ్ఞానము. అదియే సరైన విద్య. అన్ని విద్యలలోను ఆధ్యాత్మిక విద్యయే శ్రేష్టం. ఏల యనిన లౌకిక విద్యలు ఎన్ని నేర్చినను అవి పరిపూర్ణ శాంతిని కలుగజేయజాలవు. **"జరా మరణ మోక్షయ మామాశ్రిత్య యతన్తియే"** జరామరణాది దుఃఖములనుండి విడిపించు కొనవలెననిన, పరమాత్మను ఆశ్రయించే తీరవలెను. ఆత్మజ్ఞానమును, పొందియే తీరవలెను. ఉదాహరణకు **'నారదుడు'** ప్రపంచంలోని అన్ని విద్యల యందును, చతుష్షష్టి కళల యందును ఆరితేరి వాటియందు చక్కటి కుశలత్వమును, పాండిత్యమును సంపాదించెను. కాని ఆ విద్యల ద్వారా అతనికి **'మనశ్శాంతి'** మాత్రం కలుగలేదు. సనత్కుమార మహర్షి వద్దకు వెళ్ళి 'మనశ్శాంతి' ఎట్లు లభించునో తెలుపమని కోరెను. ఆయన **"తరతిశోకమాత్మవిత్"** అని చెప్పెను. ఆత్మజ్ఞాని ఒక్కడు

మాత్రమే శోకమును దాటకలడు. తక్కినవారు కాదు అని చెప్పెను. అల్ప వస్తువు నందు సుఖములేదు. అనంతమైనట్టి ఆత్మ వస్తువునందే సుఖము కలదు. శోకరాహిత్యమునకై అటువంటి ఆత్మను నీవు తెలుసుకొనుము అని చెప్పెను.

దాదాపు ఇదే అభిప్రాయాన్ని యోగి వేమన కూడ ఒక పద్యంలో చెప్పాడు.

**"చదివి చదివి చదివి చావంగ నేటికి**
**చావులేని చదువు చదువవలయు**
**చదువులేక కోటి జనులు చచ్చిరి గదా**
**విశ్వదాభిరామ వినుర వేమా !"**

చదువుయొక్క పరమావధి ఏమిటో చక్కగా వివరించాడు. అలా అని లౌకిక విద్యలను పొందకూడదని కాదు. వాటితోపాటు ఆత్మ విద్యను కూడ సంపాదించ వలెననియే భావము. కనుక శ్రీకృష్ణపరమాత్మ గీతలో **" నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే"** ముల్లోకములందును జ్ఞానమునకు సాటియైన పవిత్ర వస్తువు ఇంకొకటి లేనేలేదు. అని ఖచ్చితంగా చెప్పెను. విద్యలలో **' ఆధ్యాత్మిక విద్య '** తానని చెప్పెను. ఏ విద్య వలన శాంతి సుఖములు లభించునో, ఏది అత్యంత దుఃఖ రాహిత్యమును కలుగజేయగలదో అదియే ఉత్తమమయిన విద్య . ఏది జనన మరణ ప్రవాహములనుండి జీవుని తప్పించగలదో అది విద్యలలో శిరోమణి యనదగును. ఏది మోక్ష సాధనకు ఉపయోగపడుతుందో లదే సరైన విద్య

ఒక పర్యాయం శంకరాచార్యులవారు ఈ విషయంలో **"నహి నహి రక్షతి డుకృఞ్ కరణే "** లౌకిక విద్యలు జననమరణములనుండి రక్షించపజాలవు. కనుక **"భజ గోవిందం -- భజ గోవిందం"** అని దేవుని భజింపుము. భజింపుము దైవ విద్య నభ్యసింపుము -- ఆధ్యాత్మిక విద్యను చేపట్టుము అని చెప్పెను. మానవుడు జన్మించింది దానవుడగుటకు కాదు, దేవుడగుటకు; పశుత్వము నొందుటకు కాదు, పశుపతిగా మారుటకు --- ఇదియే ఆధ్యాత్మిక విద్య అంతర్యం, పరమావధి. కనుక నీవు ఉద్యోగంచేసి సంపాదించే అవసరంలేదు కాబట్టి లౌకిక విద్యలమీద (డిగ్రీలు వగయిరాలు) ఎక్కువ కాలాన్ని వెచ్చించనవసరంలేదు. **'ఆత్మజ్ఞానం '** లేనివారు భగవంతునికి ప్రీతిపాత్రులు కాలేరు. కనుక ఆధ్యాత్మిక విద్యను నేర్చుకోవడం మంచిదని నా అభిప్రాయం. అందులోనే వున్నది ఆనందం, ఆత్మశాంతి. అనవసరంగా ఏదో చాలా వ్రాసాను. ఇక వుంటా............

ఇట్లు

**'వీ'**

సెంట్రల్ జైలు, రాజమహేంద్రవరం

ది. 29-9-1975

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. చాలా సంతోషం. 6వ తేదీన యిక్కడికి పిల్లలతోసహా రాగలవు. ఎక్కువ బాధ్యతలు మీదపడి, వాటిని నిర్వహించాల్సి వచ్చినందుకు విసుగుగా వుండవచ్చు. ఇటువంటి పరిస్థితిని ప్రసాదించినందుకు చిట్టచివరికి భగవంతుని మీద కూడా విరక్తి కలగవచ్చు. ఈ విషయమై ఒక పర్యాయం నీ ఉత్తరంలో ప్రస్తావించినట్లు గుర్తు ఉన్నది. ఈసారి దేవుడికి మొక్కులు మ్రొక్కడంలేదని, అందరిమీద కోపంగా వున్నదని వ్రాశావు గదూ! ప్రస్తుత పరిస్థితులలో నీవు అటువంటి అభిప్రాయానికి రావడం అతిసహజమే. ప్రజలకు ఏ కష్టం వచ్చినా, దేవుడా ! మమ్ములను ఏల యీ విధంగా బాధించుచున్నావని మొరపెట్టుకుంటారు. ఆత్మీయులు మరణించినా, పిల్లవాడు పరీక్ష తప్పినా, ఆర్థిక యిబ్బందులు ఎదురైనా - అన్నిటికి దేవుడే కారకుడని, పనిగట్టుకొని అపకారం చేస్తున్నాడని విలపిస్తారు. అనావృష్టి వలన పంటలు ఎండిపోయినా, అతివృష్టి వల్ల పంటలు మురిగిపోయినా, వరదలు వాగులు ఏకమై సర్వం కొట్టుకొనిపోయినా అదీ దేవునిదే బాధ్యత అని నిందించుతారు. ఇట్టి భావం సరిఅయినది కాదు. హ్రస్వ దృష్టి వలననే యిట్టి ఊహలు జనించుతుంటాయి. తమకు సంభవించిన ఆపదలను చూచి భగవంతుని తూలనాడటం అవివేకం మాత్రమే. మనుష్యులకు కలుగు సుఖదుఃఖములు వారు లోగడ చేసుకున్న పాపపుణ్యము వలననే కలుగును. ఒక పర్యాయం వివేకానందుడు **'ఏ విత్తునాటితే అదేజాతి పండు మనకు లభించును'** అంటాడు. కుంకుడు విత్తు నాటి మామిడిపండు కావాలని కోరుకోవడం అవివేకం. అది ఎన్నటికి సాధ్యపడదు. ఈ ప్రపంచమున సుఖమును గాని, దుఃఖమును గాని మరియొకడు ఇచ్చుట లేదు. తాను చేసిన పుణ్య కర్మల వలననే తనకు సుఖమును, తాను చేసిన పాపకర్మల వలననే దుఃఖమును కలుగుచున్నది. కనుకనే కర్మ గౌరవించబడుచున్నది. బంధమోక్షములకు కర్మయే కారణమని గీత చెబుతున్నది. తన యొక్క విశుద్ధాచరణముచే మోక్షమును, అపవిత్రా చరణముచే బంధమును జీవుడు పొందుచున్నాడు. తాను మలిన సంకల్పముతో కూడి, దోషయుక్తమగు కర్మల నాచరించుతూ సుఖము కొఱకై, బంధ విముక్తి కొఱకై భగవంతుని వేడినచో అతడేమి చేయగలడు? జీవుడు కర్మ కర్త, భగవంతుడు కర్మ ఫలప్రదాత. జీవుని కర్మ ననుసరించి భగవానుడు ఫలముల నొసంగు చుండును. దేవుడు **'పోష్టుమాన్'** లాంటివాడు. ఎవరికి ఏ ఉత్తరము వచ్చుచుండునో

వారికి అదియే యిచ్చుచుండును. ఆ ఉత్తరములోని విషయాలతో అతనికి ఏమాత్రం ప్రమేయముండదు. మరణించిన వార్త వచ్చినా అందజేయును. లాటరీ వచ్చినదనే సంతోషవార్త వచ్చినా యిచ్చును. వార్తలతో **'పోష్టుమాన్'** కు సంబంధం వుండదు. సరిగా సకాలంలో బట్వాడా చేయడం ఒక్కటే అతని కర్తవ్యం. అదే విధముగా భగవంతుడు వారి వారి పుణ్య పాపములకు తగిన సుఖదుఃఖాది ఫలములను వారి వారికి అందజేయుచుండును

ఈనాడు నవ్వుతూ నవ్వుతూ చేసిన పాపకర్మకు రేపు ఏడ్చుచూ దు:ఖమును అనుభవించవలసివచ్చును. ఈ వాస్తవాన్ని అవగాహన చేసుకుంటే భగవంతుణ్ణి మనుష్యుడు అనవసరంగా నిందించడు గదా! అది అర్థం చేసుకోనక తమకు జరిగిన ప్రతి హానికి భగవంతుడే మూలమని భావిస్తుంటారు. ఇక ఉంటా...

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 13-10- 1975.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. ఎట్టకేలకు గమ్యస్థానమునకు క్షేమంగా చేరుకోగలిగినందుకు సంతోషం. మధ్యలో (ప్రయాణంలో) కష్టాలను ఎదుర్కొన్నప్పటికీ గమ్యస్థానం (శీలేరు) క్షేమంగానే చేరటం జరిగింది గదా! అదే విధముగా జీవన ప్రయాణంలో కొన్ని కష్టాలు ఎదురవడం సహజం. ప్రయాణం మధ్యలో ఎన్ని కష్టాలు వచ్చినప్పటికీ, వాటినన్నిటిని తట్టుకొని మానవుడు ఏవిధముగా పట్టుదలతో కొనసాగించి గమ్యస్థానం చేరుకుంటాడో, అదే విధంగా జీవన ప్రయాణంలో ఎన్ని అవాంతరాలు, వడుదుడుకులు సంభవించినా సాధకుడు తన ధ్యేయాన్ని మాత్రం విడనాడడు.

ఈ మధ్య మన ఉత్తరాలలో కొంత బ్రేక్ వచ్చింది. చలమలో నీరు తోడిన కొద్దీ ఊరుతుంది. దానం చేయడం వలననే సంపద ద్విగుణీకృతమవుతుంది. **"అదాన దోషేణ భవేద్దరిద్ర :"** దానం చేయకపోవడం వలననే జీవుడు దరిద్రుడై జన్మించుతాడు. **"దేయం దీన జనాయ చవిత్తం"** దీనులకు దరిద్రులకు తనకున్న దానిలో కొంత యిచ్చి సహాయము చేయవలెనని శాస్త్రములు చెబుతున్నాయి. ప్రత్యుపకారం కోరిగాని, ఫలాన్ని ఆశించిగాని దానం చేయరాదు. సముద్రం

తనలోని జలమును సంతోషపూర్వకంగా మేఘములకు దానం చేయును. ఇచ్చేటప్పుడు ప్రతిఫలాన్ని ఆశించి యివ్వదు. నిష్కామ బుద్ధితో యిస్తుంది. ఆ జలమే మేఘములుగా సముద్రగర్భంలోనికి అనేకరెట్ల రూపంలో చేరుతుంది. నిస్వార్ధ బుద్ధితో ఫలితాన్ని ఆశించకుండా సముద్రం కొంచెం నీటిని దానం చేయడం వలననే, తిరిగి అనేక రెట్ల రూపంలో నీటిని పొందగలిగాడు. అదే విధంగా వ్రాయడం మొదలుపెడితే అనేక భావాలు ఒకదాని వెంబడి ఒకటి తరుముకుంటూ వస్తుంటాయి. వ్రాయకపోతే ఏమీ రావు. విద్య విషయంలో కూడా అంతే. నేర్చుకున్నది యితరులకు చెబుతుంటేనే ద్విగుణీకృతమవుతుంటుంది.

నీవు ఒక ఉత్తరంలో స్వేచ్ఛను గురించి వ్రాశావు. చాలా బాగున్నది. మానవుడ్ని భోగభాగ్యాలు సంతృప్తి పరచలేవు. అతనికి ముఖ్యంగా కావల్సింది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు. ఎలుకబోనులో మంచి రుచి గల పదార్ధాలు తగిలించుతారు. దానిని తినడానికి ఎలుక బోనులో ప్రవేశిస్తుంది. ప్రవేశించగానే తలుపులు మూసుకుంటాయి. అపుడది భీతి చెంది భయంతో పారిపోవడానికి నలువైపులా పరుగెత్తుతుంది. -త్రోవ కానరాదు. బయటకు పోలేక మధన పడుతుంది. ఆ బోనులో ఘుమఘుమలాడుతున్న మంచి రుచిగల పదార్ధాలు వున్నప్పటికీ ఎలుక దానిని తినదు. కారణం! తాను నిర్బంధంలో వున్నానని తెలియడం వల్లనే.

రాజులకు రామచిలుకలను పెంచడం సరదా. ఒకానొక రాజు రామ చిలుకను ప్రేమతో పెంచుతున్నాడు. దానికి ప్రతి దినం స్నానం స్వయంగా చేయించి, అత్తరు వ్రాసి తియ్యటి పండ్లు ఫలహారాలు యిస్తుండేవాడు. అమృతతుల్యమగు క్షీరమును కూడా యిచ్చేవాడు. నిండు సభల యందు దానిచే రామనామం పలికించేవాడు. ఇంత గౌరవము, పోషణ దానికి జరుపుతున్నప్పటికీ ఆ చిలుకకు మాత్రం సంతుష్టి వుండదు. ఎందుకనగా ఆ చిలుక మనసు అచట వుండదు. ఎప్పుడు పోయి చెట్టుకొమ్మమీద వాలుదామాయని ఆరాట పడుతుంటుంది. ఎందుకనగా అరణ్యం దాని జన్మస్థానం. చెట్టుకొమ్మ దాని పుట్టినిల్లు. ప్రకృతిని ఆస్వాదించడం దాని సహజ ప్రవృత్తి. పరస్థలంలో సామాన్యంగా కాలం గడపడం మేలని ఆ చిలుక భావించదు. అట్లే జైలులో వున్నవానికి ఎన్ని వైభవముల నొసగినను, సర్వ సౌకర్యములు యిచ్చినను, విలాసవస్తువులు (షాంపు, ఆయిల్సు వగయిరాలు) అందజేసినను ఆనందించడు. జైలులో అతనిని ఎంత గౌరవంతో చూచినప్పటికీ అతడు స్వేచ్ఛావాయువులను పీల్చడానికి వీలులేదుగదా !అతడు అనుభవించునది పరిమిత స్వాతంత్ర్యమే గదా! పంచభక్ష్యపరమాన్నములకు అతను మురిసిపోడు. విలాసవస్తువులకు ఆనందపడడు. ఎందుకు? తాను బంధము నన్నున్నానని అతనికి పూర్తిగా తెలుసు. బంధ విముక్తి ఒక్కటే అతనిని సంతృప్తి

పరుస్తుంది. కానీ ఏ యితర ఆకర్షణలు, సౌకర్యాలు అతనిని తృప్తి పరచలేవు. అందుకని ఏదో విధంగా, గౌరవానికి భంగకరంగా విడుదలకోసం ప్రయత్నించడం మాత్రం విజ్ఞత లక్షణం ఏ మాత్రంకాదు. అందులో నాబోటి స్వాభిమానపరుడికి ఏ మాత్రం మనస్కరించదు. ఆత్మగౌరవం వున్నవారెవ్వరూఈ నీచానికి పాల్పడరు.

సేవావృత్తిలో పొందు పాయసంకంటే, స్వచ్ఛంద వృత్తిలో కష్టించి గంజి త్రాగుట మేలుగదా! ఇంగ్లీషులో ఒక సామెత వున్నది. "**Man does not live by bread alone**' కేవలం తిండియే మానవునికి పరమావధి కాదు. భౌతిక సుఖాలు మాత్రమే మానవుడ్ని సంతృప్తిబరచజాలవు. ఆత్మ సౌఖ్యాన్ని, ఆనందాన్ని యిచ్చేది వేరొకటి వున్నది. అవే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు.

ధీరులైనవారు తాము ఫలితం పొందేంతవరకు విశ్రమించరు. తాము ఆశించింది సాధించునంతవరకు నిర్విరామ కృషి కొనసాగిస్తూనే వుంటారు. ఎన్ని అడ్డంకులు ఎదురైనా వాటిని లెఖ్ఖచేయరు. లక్ష్యం సాధించడమే వారి జీవిత పరమావధి. నీవు శీలేరు వెళ్ళేటప్పుడు బస్సు చెడిపోయినా, వరద వచ్చినా మధ్యలో ఆగావా? ఏదో విధంగా పట్టుదలతో శ్రమపడి గమ్యానికి చేరావుగదా! ఇంకేమి పోతామని నిరుత్సాహపడుతే వెళ్ళగలిగేదానవా? అదే విధంగా కార్యసాధకుడు ఆరంభించిన పనిని మధ్యలో విడిచిపట్టడు.

భర్తృహరి సుభాషితములలో ఒక పద్యం గుర్తుకు వస్తున్నది.

శ్లో॥ **ఆరంభింపరు నీచ మానవులు, విఘ్నాయాస సంత్రస్తులై**
**యారంభించి పరిత్యజింతు, రు విఘ్నా యత్తులై మధ్యముల్**
**ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్, ధృత్యున్నతోత్సాహులై**
**ప్రారబ్ధార్థమే లుజ్జగింపరు సుమీ, ప్రజ్ఞానిధుల్ గావునన్**

అధములు విఘ్నములు కలుగుననే భయంతో కార్యమునే ప్రారంభించరు. మధ్యములు కార్యమును ప్రారంభించుదురు. కాని మధ్యలో విఘ్నములు కలుగుతే దానిని విడిచిపెట్టుదురు. ధీరులు, ఉత్తములు,వారు ప్రారంభించిన కార్యానికి ఎన్ని అడ్డంకులు వచ్చినా మధ్యలో విడిచిపెట్టరు. గమ్యానికి చేరుకొనేంతవరకు విశ్రమించరు. అటువంటివారికి మార్గం కంటకాకీనమార్గమే అయినప్పటికీ పట్టుదల విడనాడరు. సాధకుని లక్షణం కూడా అదే. అదే నా లక్ష్యం. ఏ మాత్రం భయపడనవసరం లేదు. విజయం తథ్యం. జైలువారు యిచ్చిన కాగితం అయిపోయింది. కావాలన్నా మరొక కాగితం యివ్వరుగదా! వారానికి రెండు కాగితాలు మాత్రమే యిస్తారు. వ్రాయడానికి నా వద్ద సమాచారం వున్నా అవకాశం లేదుగదా ! ఇదీ నా పరిస్థితి. ఇక వుంటా.....

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమహేంద్రవరం

ది. 21-10-1975

ప్రియమైన జయ.

నా వద్దనుండి ఉత్తరాలు లేవని వ్రాశావు. నేను వ్రాస్తూనే వున్నాను. ఆలస్యం కావడానికి నేనుమాత్రం కారణం కాదు. ప్రభుత్వ వ్యవస్థ అంత బాగా వున్నదనే విషయం తేటతెల్లమవుతున్నది. ఈ మధ్య సూర్యం, రాజులు ఉత్తరాలు వ్రాశారు. "రాజు" చాలా బాధపడుతూ వ్రాశాడు. రాజుకు పెద్ద పెద్ద చదువులు చెప్పించాలని తాపత్రయపడ్డాను. ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. మమకారాన్ని పెంచుకున్నాను. ఎక్కువ మమకారం దుఃఖానికి హేతువవుతుంది. దుఃఖమువల్ల ద్వేషం ఉత్పన్న మవుతుంది. ద్వేషంవల్ల కోపం వస్తుంది. కోపం ఒక మానసిక తరంగం. అది మొదట చిన్న గాలివలె ఆవిర్భవించి, సుడిగాలిలా మారి, పెనుగాలిగా రూపొంది క్రమంగా తుఫానులా మారుతుంది. జ్ఞానశక్తి నశిస్తుంది. బుద్ధిని కోల్పోతాం. నా జీవితంలో కూడా జరిగింది అదేగదా ! పాపం ! రాజు చాలా బాధపడుతూ వ్రాశాడు. పశ్చాత్తాపపడుతున్నాడు. అటువంటి వానిని క్షమించడం మన కర్తవ్యం కదూ!

**"గతజల సేతు బంధనం"** గతించిన దానికి వగచి లాభం లేదుగదా! **"సర్వేజనా సుఖినోభవంతు"** అని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అందరి సుఖ సంతోషాలను కోరడం విజ్ఞత లక్షణం. రాజు, సూర్యంలు నన్ను చూడాలని వ్రాశారు. ప్రస్తుతం ఆ అవకాశం లేదు. వాళ్లకు వ్రాయడానికి ఉత్తరాలు కూడా చాలవు. వారానికి యిచ్చే రెండు ఉత్తరాలలో ఇంటి విషయాలను గురించి ఒక ఉత్తరం "రాముడి" కి వ్రాయాలి. లోగడ ఇంటి విషయాలు స్కూలు విషయాలు అన్నీ నేనే చూచేవాడనుగదా! అర్థంతరంగా యిక్కడికి రావడం జరిగింది. ఏ విషయం రాముడికి తెలియదు. అందువల్ల వారానికి ఒక ఉత్తరం వాడికి వ్రాయాలి. నీ మనశ్శాంతి కోసం రెండవ ఉత్తరం నీకు వ్రాయాలి. అందులో ఆలస్యం అవుతుందని ఆగ్రహిస్తున్నావు గదా! వీలు చూచుకొని ఒక ఉత్తరం ఈతడవ వారంలో వ్రాస్తానని నేను వ్రాసినట్లుగా వాళ్లకు ఉత్తరం వ్రాయగలవు.

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు శ్రద్ధగా చదివాను. మళ్లీ మెదడుకు మేత పెట్టావు. నీవు పడుతున్న మానసిక ఆందోళన నాకు అర్థమవుతునే వున్నది. నీవు పడుతున్న బాధను, ఆందోళనను వ్రాసి నన్ను కవ్విస్తున్నావు. కవ్విస్తేనేగాని కలం కవిత్వాన్ని వ్రాయదు. కష్టాలు వస్తేనేగాని కండ్లు కన్నీరు కార్చవు. మనస్సు మధన పడదు. హృదయం ద్రవించదు. బాధలు వస్తేగాని భావాల పరంపర పరవళ్ళు

త్రొక్కదు. కష్టాలు, బాధలు గల సినిమాలు, నవలలను నేను ఎక్కువగా అభిమానించే వాడననే విషయం నీకు బాగా తెలుసుగదా! సుఖదు:ఖాల మిళితమే జీవితం. జీవితంలో తీపి, చేదులు రెండూ వుంటాయి. ఒకడ్ని ఎల్లప్పుడూ తీపే తినమంటే వెగటుతో చచ్చిపోతాడు. సుఖంతోపాటు బాధ కూడ వుంది కాబట్టే జీవితం ఉత్తేజకరంగా వుంటుంది. ఇప్పటివరకు నీవు తీపిని మాత్రమే రుచి చూచావు. ఇప్పుడు చేదునుకూడ రుచి చూడనిమ్ము. బాధలోకూడ ఒకవిధమైన అనిర్వచనీయ మైన ఆనందం వున్నది. వెలుగు తరువాత చీకటి ఎట్లా వస్తుందో, చీకటి తరువాత మళ్ళీ వెలుగు రావడం తథ్యం. ఇది ప్రకృతి లక్షణం. చీకటి వెలుగులు లేకపోయినా, సుఖదుఃఖాలు వుండకపోయినా అసలు ప్రపంచానికే అస్థిత్వం ఉండదు.

పవిత్రురాలైన "**సీత**"ను రావణుడు ఎత్తుకొని పోకపోతే మనకు చదువుకోవడానికి "**రామాయణ మహాకావ్యం**" వుండేదే కాదు. అలనాడు కురుసభలో "**ద్రౌపది**" ని అవమానించని యెడల "**మహాభారతం**" ఈనాడు చదువుకోవడానికి లభ్యమైవుండేదికాదు. సావిత్రి ధైర్యంగా "**యమధర్మరాజు**" ను ఎదిరించడం వల్లనే గదా తన పతిప్రాణాలను రక్షించుకొని పాతివ్రత్య మహిమను ప్రపంచానికి చాట గల్గింది. భక్తప్రహ్లాదుడు ఎన్ని కష్టాలనైనా లెఖ్ఖచేయక భగవానుని నమ్ముకొన్నాడు. కాబట్టే ఆయనకు భగవంతుని దర్శనభాగ్యం కలిగింది. మన భారతీయ ఇతిహాస పురాణాలలో ఇటువంటి ఆదర్శవంతమైన ఉదాహరణలు కోకొల్లలు.

ప్రతి మానవుని జీవితంలో కష్టాలు రావడం సహజమే. పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు సహితం సీత కోసం సామాన్య పామరునివలె విలపించాడు. కాని నిరాశ చెందలేదు. కర్తవ్యపరాయణుడయ్యాడు. హనుమంత సుగ్రీవుల మైత్రిని సంపాదించాడు. రావణుని సంహరించాడు. లంకాపురిని జయించాడు. 'సీత' ను తెచ్చాడు. ధైర్యవంతుల లక్షణం అది. తీవ్రమగు పట్టుదల కార్యదక్షత గలవారలకు త్వరితంగా ఫలితం చేకూరుతుంది.

మరొక విషయం ప్రస్తావిస్తాను. ఒక వస్తువు విలువ ఆ వస్తువు కనపడనప్పుడు, లేనప్పుడు బాగా తెలుస్తుంది. కండ్లు పోయినప్పుడు కండ్ల విలువ అర్థమవుతుంది. కాళ్ళు చచ్చుపడిపోయినప్పుడు కాళ్ళ ఉపయోగం ఎటువంటిదో బాగా తెలుస్తుంది. చంద్రుని విలువ ఎటువంటిదో కాళరాత్రి రోజున గాని అర్థంకాదు. అనారోగ్యం వచ్చినప్పుడు గాని ఆరోగ్యం విలువ అర్థమవుతుంది. "**శరీర మాద్యం ఖలు ధర్మ సాధకమ్**" ధర్మసాధనకు ఉపయోగపడు సాధనలలో శరీరం మొదటిది. శరీరం సరైనస్థితిలో లేనియెడల అనగా అనారోగ్యానికి గురి అయితే సాధనకు ఆటంకం ఏర్పడుతుంది. అందువలన మోక్షసాధకుడు శరీర ఆరోగ్యమును కాపాడుకొనాలి.

మోక్షమునకు ప్రతిబంధకం చిత్తమునందలి దుష్టవాసనలు, దుష్టసంకల్పాలు, దుష్టసంస్కారాలు. అంతేగాని దేహం మాత్రం కాదు. దేహము అమాయకమైనది. దానిని బాధించినచో మోక్షము చేకూరునని భావించుట అవివేకం. రాగాదుల నిర్మూలనకై చిత్తమును తపింపజేయుటయే తపస్సు గాని దేహమును శోషింపజేయుట కాదు. బుద్ధ దేవుడు తన సాధన కాలంలో ఆహారమును పూర్తిగా మానివైచెనట. అప్పుడు శరీరం బాధకు లోనైంది. సాధన సరీగా సాగలేదు. అది గ్రహించిన బుద్ధుడు మితంగా ఆహారం తీసుకొని సాధన చేసేవాడుట. కనుక ఆరోగ్యం ప్రధానం. అది చెడిపోతే చేయగలిగింది ఏమీ లేదు. నీవు వ్రాసిన ఉత్తరంలో నాకు ఆరోగ్యంగా లేదు, మీరైనా ఆరోగ్యంగా వుండండి అని వ్రాశావు. మతి చలిస్తుందేమోనని వ్రాశావు. పోయిన సంవత్సరం సరీగా ఈ రోజులలోనే నీ ఆరోగ్యం చెడిపోయినప్పుడు మేమంతా ఎంత ఆందోళన చెందామో తలచుకుంటే భయం వేస్తుంది. అటువంటి దుస్థితి తిరిగి దాపురించరాదని భగవంతుడ్ని వేడుకుంటున్నాను. కష్టాలు సుఖాలు వస్తూనే వుంటాయి, పోతూవుంటాయి. జీవితం దుఃఖాంతం కారాదు, సుఖాంతం కావాలి. నీకు మనశ్శాంతి చేకూరేంతవరకు ఈ విధంగానే వ్రాస్తూవుంటాను. వ్రాస్తాను, వ్రాస్తాను కన్నీరు కారుస్తూ వ్రాస్తాను. దుఃఖాన్ని దిగమ్రింగి, ఆవేశాన్ని అనురాగంగా మార్చేస్తాను. నా ఆశయాలకొక రూపకల్పన చేస్తాను. నీ హృదయాన్ని కదిల్చి వేస్తాను. నీ కన్నీటి ధారలను ఆపివేస్తాను. నీలోని దుర్బలత్వాన్ని తుడిచివేస్తాను. ఆత్మవిశ్వాసాన్ని కలుగజేస్తాను. అందాకా వ్రాస్తూనే వుంటాను. --ఇదే నాసంకల్పం. ఇక వుంటా

ఇట్లు

'నీ'

---

*'స్వదేశీ ఉద్యమం మనలో ఆత్మగౌరవం* (Self-respect), *ఆత్మవిశ్వాసం,* (Self-confidence), *స్వయం పోషకత్వం* (Self-supporting), *స్వార్థత్యాగం* (Self-sacrifice), *పెంపొందిస్తుంది. మతభేధాలను పోగొట్టి మనల్ని అందరినీ సమైక్య పరుస్తుంది. మన మాతృభూమి కోసం దృఢ విశ్వాసంతో, హృదయపూర్వకంగా చేతులు కలిపి పనిచేయడానికి ఇది తోడ్పడుతుంది. సమైక్య భారతానికి ఈ స్వదేశీ ధర్మమే మత ధర్మంగా వుండాలి'.*

*- శ్రీ లాలాలజపతిరాయ్*

సెంట్రల్ జైలు, రాజమహేంద్రవరం

ది 29-10-1975

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. నేను కులాసాగానే వున్నాను. నన్ను గురించి గాని, ఇంటి విషయాలను గురించి గాని, ఆర్థిక విషయాలను గురించి గాని ఎక్కువగా పట్టించుకోవద్దు. నీటి మీద తామరాకువలె వుండటం మంచిది. పరిస్థితులు ఇంటా బయట వాటంతట అవే చక్కబడతాయి. మనం ఎవర్కి అన్యాయం చేయలేదు. భవిష్యత్తులో కూడా చేయవలసిన అవసరం రాదని నా నమ్మకం. ఇతరులకు చేతనైనంత సహాయం చేశామే గాని హాని ఏమాత్రం చేయలేదు. కనుక మనకు కీడు కలగదని నా విశ్వాసం.

ప్రపంచంలో విభిన్న మనస్తత్వాలు గల మనుష్యులుంటారు. ఒకరకంవారు తాము ఎన్ని ఘనకార్యాలు సాధించినప్పటికీ పరులతో చెప్పుకోరు. ఉబ్బితబ్బిబ్బుకారు. సుఖం కలగడంతోనే తన్మయత్వం జెందరు. దుఃఖం ప్రాప్తించినప్పుడు నిరాశ నిస్పృహలకు లోనుకారు. మరొక రకంవారు తాము ఏమాత్రం సాధించినా పదిమందికి చెప్పుకొని, నాప్రతాపం వల్లనే జరిగిందని గర్వపడుతుంటారు. అటువంటి వారికి ఏమాత్రం కష్టం వచ్చినా తట్టుకోలేరు. నా వరకు నాకు కష్టసుఖాలను గురించి ఒకళ్లకు చెప్పుకొనే అలవాటులేదుగదా! ఎంతవరకు వాటినన్నిటిని దిగమ్రింగి కార్యక్రమాన్ని సాధించడానికి నిర్విరామకృషి సల్పటమే నా ధ్యేయం. అదే నా పంథా. ఏ చిన్న విషయాన్ని గురించి ఒక్క ముక్కయినా నీకు కూడా చెప్పేవాడనుకాదు గదా? చెప్పకూడదని కాదు. చెప్పి నిన్ను బాధ పెట్టకూడదని నా అభిప్రాయం. కష్టం వచ్చినా నష్టం వచ్చినా చెప్పేవాడనుకాదు. అదే విధంగా సుఖం వచ్చినా, లాభం వచ్చినా చెప్పేవాడను కాదు. సుఖ దుఃఖాలను! లాభనష్టాలను సమానస్థాయిలో చూడాలని నా అభిప్రాయం. కాని కొంతమంది ఏమాత్రం లాభాన్ని గడించినా, చిన్న విషయాలను సాధించినా తమ భార్యలకు, స్నేహితులకు, చుట్టుప్రక్కల వాళ్లకు చెప్పుకొని మెప్పును పొందాలని తాపత్రయపడటం వాళ్ల అలవాటు. నేను కాబట్టేఇంత కార్యాన్ని నిర్వహిస్తున్నానని డాంబికాలు కొట్టడం కొంతమంది సహజ ప్రవృత్తి. ఇంగ్లీషులో ఒక సామెత వున్నది. "Empty vessels make much noise" **"ఖాళీ పాత్రలు ఎక్కువ శబ్దాన్ని చేస్తాయి"** అదే విధంగా అధిక ప్రసంగం చేసేవారు పని తక్కువ చేస్తారు. కాబట్టి మనం నేర్చుకోవలసింది ఒకటే. అనవసరమైన మాటలతో కాలాన్ని దుర్వినియోగం చేయడం కన్నా మంచి పుస్తకాలు చదువుకోవడం, భగవధ్యానం చేసుకోవడం మంచిది.

భవనానికి పునాది వేయడమే సాహసం. దానిని నిర్మించడానికి యింకా ఎన్నో యిబ్బందులు ఎదుర్కొనాల్సివస్తుంది. నిర్మించిన తరువాత తుది మెరుగులు దిద్దడం తేలిక. అదే విధంగా ఏదైనా ఒక నూతన సంస్థను స్థాపించడం అంత తేలిక కాదు. స్థాపించినదానిని ఒక స్థాయికి తీసుకొని రావడానికి ఎంతో శ్రమించాలి. ఒకస్థాయి వచ్చిన తరువాత దానంతట అదే నడుస్తుంది. అప్పుడు నా ప్రతిభేనని విర్రవీగితే పునాదిలోనున్న రాయి వెక్కిరిస్తుంది. ఆ అల్పబుద్ధి జీవిని చూచి నవ్వుకుంటుంది.

అన్నీ తెల్సిన నీవు ఎందుకు విచారిస్తున్నావో నాకు అర్థం కావడం లేదు. విజ్ఞానయాత్రకు నేను విదేశాలకు వెళ్ళినచో నీవు ఇంత బాధపడేదానివా? అదే విధంగా నీవు యిప్పుడు ఎందుకు తలచుకోవు? నాకు యిప్పుడు మంచి అవకాశం లభించిందని భావిస్తున్నాను. 40 సంవత్సరాల తరువాత ప్రశాంతంగా వెనుకకు తిరిగి ఆలోచించడానికి ఒక మంచి అవకాశం వచ్చిందని భావిస్తున్నాను. రాజమహేంద్రవరం సెంట్రల్‌జైలు అనే విశ్వవిద్యాలయంలో విద్యను గరుపుచున్నాను. ప్రభుత్వం ఆర్థికసహాయం (స్టయిఫండ్) యిస్తున్నది. **"జ్ఞానము, విజ్ఞానము"** అనే విషయాలమీద యిక్కడ **'రీసెర్చ్'** చేస్తున్నాను. **'జ్ఞానం'** పరానికి సంబంధించినది. 'విజ్ఞానం' ఇహమునకు సంబంధించినది. ఇహపరాలను రెంటిని సాధించడం మానవధర్మం. ఈ రెంటిమీద ఒక సిద్ధాంతం (థీసిస్) వ్రాయదలచాను. దానిలో సఫలీకృతమవుతేగాని **"ఆచార్య"** (డాక్టరేట్) బిరుదు లభించదు. ఎంతకాలం పడుతుందని నీవు ప్రశ్నించవచ్చు. అది నాశక్తి సామర్థ్యాల మీద ఆధారపడి వుంటుంది. సంవత్సరాలు పట్టకపోవచ్చు, నెలలోనే పూర్తికావచ్చు. కాని ఖచ్చితంగా చెప్పటం కష్టం. ఆర్థిక సహాయాన్ని యిచ్చి, సమయాన్ని కలుగజేసి, ప్రశాంతవాతావరణం గల ప్రదేశంలో వుంచిన ప్రభుత్వాన్ని అభినందించడం మన ధర్మం కదా?

ఇకపోతే నీ ఆలోచనాసరళిని గురించి కొంత చర్చిస్తాను. నీవు నాకన్నా ఎక్కువ పురాణాలు చదివావు. అందువల్లనే ఒక నిర్ణయానికి రాలేని స్థితిలో పడిపోయావు. చదివినందువల్ల కాదు. వాటిని మన నిజజీవితంలో ఎంతవరకు తీసుకోవాలో నిర్ణయించుకోలేక మీమాంసలోపడి తేల్చుకోలేని స్థితిలో వున్నావు. అటువంటివారికి "భగవద్గీత" చక్కటి మార్గదర్శకము. **"ఎవడు దైవభక్తితో దైవకార్యములను ఆచరించుచూ దైవధ్యానములో నిమగ్నుడవడంతోపాటు సమస్తప్రాణుల యెడల దయకల్గియుండునో అతడు నన్ను పొందును"** అని శ్రీకృష్ణపరమాత్మ హామీ యిచ్చాడు. వీటిని ఆచరించడానికి అడవులకు పోనవసరంలేదు. ఘోరతపస్సులు చేయనవసరంలేదు. కాషాయవస్త్రాదులను ధరించనవసరంలేదు. భార్యాపిల్లలను

లేక భర్తను, బంధువులను వదలి కీకారణ్యములలో ప్రవేశించనవసరంలేదు. తలను క్రిందపెట్టి కాళ్లను పైకి ఎత్తి మండుటెండలలో మలమలమాడుతూ, వర్షములకు తడుస్తూ, అన్నాహారములు మాని నెలల తరబడి శరీరాన్ని బాధలకు గురిచేసి శుష్కింపచేయనవసరంలేదని "గీత" బోధిస్తున్నది. ఫలితాన్ని ఆశించకుండా కర్మను చేయడమే మానవుని కర్తవ్యం. దానినే **'నిష్కామకర్మ'** అందురు. భగవద్భక్తి కలవానికి భగవదనుగ్రహం లభించును. భగవదనుగ్రహం కలవానికి **'ఆత్మజ్ఞానము'** ఉదయించును. ఆత్మజ్ఞానము కలవానికి సులభముగా బంధవిముక్తి చేకూరును. ఇదే గీతాసార సంగ్రహం. కర్మచే భక్తి, భక్తిచే జ్ఞానం, జ్ఞానముచే మోక్షము లభించును. దీనిని ఈ సంసార నావలో పయనిస్తూ సాధించవచ్చునని భగవానుడు నిరూపించాడు. బోధించిన శ్రీకృష్ణుడు గృహస్థే. ఇది మాటలు చెప్పినంత తేలిక కాదు. ఆచరించడం బహు కష్టమని ప్రయత్నాన్నే విడనాడటం విజ్ఞుల లక్షణం కాదు. **'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం'** శ్రద్ధగలవానికే జ్ఞానోదయం అవుతుంది. కనుక కార్యసాధకునికి శ్రద్ధతోపాటు పట్టుదల కూడా తప్పనిసరిగా వుండాలి. ఇకపోతే పిల్లలకు ఒక చక్కటి **"నీతికథ"** ను వ్రాస్తున్నాను.

**నీతికథ :**

చి॥ లక్ష్మి, చందు, ఉదయ్, శ్యాం, గౌరీలు--- అందరూ శ్రద్ధగా వినండి! పూర్వం ఒక గ్రామంలో ఒక చిన్న చురుకైన పిల్లవాడు వుండేవాడు. చాలా తెలివిగలవాడు. బాగా చదువుకొనేవాడు. కాని ఒక చిన్న దుర్గుణం వాడిలో వుండేది. అది ఏమనగా ! ఎవరైనా యిద్దరు పెద్దలు రహస్యంగా గదిలో మాట్లాడుకుంటుంటే చాటున పొంచివుండి ఆ మాటలు వినేవాడు ఆ విన్న మాటలు తోటి పిల్లలతోగాని, పెద్దవాళ్ళతోగాని చెప్పేవాడుట. ఆ అబ్బాయి తండ్రి ఎంత చెప్పినా వాడికి ఆ అలవాటు పోలేదు. స్నేహితులు వచ్చి వాళ్ళ నాన్నగారితో ఏవైనా వ్యవహారాలు మాట్లాడుతుంటే తలుపుచాటున నక్కి వినేవాడు. ఆ పిల్లవాని తల్లిదండ్రులు ఏమైనా ఇంటి విషయాలు చర్చించుకుంటుంటే చాటున వుండి ఆలకించేవాడు. వినడమేకాక ఆ విషయాలు బయట అందరికి చెప్పేవాడు. ఏమి చేయాలో తోచక తల్లిదండ్రులు చాలా బాధపడుతుండేవారు. ఒకరోజున ఒక స్నేహితుడు వాళ్ళింటికి వచ్చి ఒక రహస్య విషయం చర్చించాలని ఆ అబ్బాయి నాన్నగార్ని కోరాడు. వాళ్ళిద్దరూ కలసి పెరటిలోనున్న ఒక చిన్న డాబా గదిలోనికి వెళ్ళి తలుపులు వేసుకొని మాట్లాడుకుంటున్నారు. ఇది గమనించిన ఆ చిన్నవాడు ఆ గది వద్దకు వెళ్ళి తలుపుసందులలో చెవిపెట్టి ఆ పెద్దవాళ్ళు యిద్దరూ మాట్లాడు కుంటున్న విషయాలను వింటున్నాడు. ఇంతలో ఏదో పురుగు చెవిలో దూరినట్లని

పించింది. దురద ప్రారంభమైంది. ఇంకా కొద్దిసేపటికి మంట పుట్ట నారంభించింది. తేలుకుట్టినట్లుగా బాధ పుట్టింది. ఆ బాధకు తట్టుకోలేక పెద్దగా ఏడుస్తూ క్రిందపడి దొర్లడం మొదలుపెట్టాడు. ఆ ధ్వని విని లోపల మాట్లాడుకుంటున్న ఆ అబ్బాయి తండ్రి, ఆయన స్నేహితుడు బయటకు వచ్చారు. పిల్లవాడు పెద్దగా ఏడుస్తున్నాడు. అర్థంగాక వైద్యుని పిలిపించారు. వైద్యుడు చెవిని పరీక్షించి చెవులో మందు వేశాడు. కొంతసేపటికి చచ్చిపోయిన కందిరీగ చెవులోనుండి బయటపడింది. తలుపు సందులో చెవి పెట్టినప్పుడు, ఆ సందులోనున్న కందిరీగ ఆ అబ్బాయి చెవులో దూరిందన్నమాట. ఈ కథను బట్టి మీరు నేర్చుకోవలసినది ఏమనగా, ఎవరైనా రహస్యములు మాట్లాడుకుంటుంటే చెవిపెట్టి వినిన యెడల ఆ చిన్నవాడికైన శాస్తి మీకు జరుగుతుంది. కనుక ఇతరుల రహస్య సంభాషణలు వినరాదు. ఒకవేళ మన ప్రయత్నం లేకుండానే ఏమైనా రహస్య విషయాలు మన చెవినపడినయెడల వాటిని అక్కడే మరచిపోవలెను. ఇతరులకు చెప్పరాదు. మీరందరూ అదే విధంగా చేస్తారు గదూ ! ఇక వుంటా.........

ఇట్లు

'మీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది 3-11-1975

ప్రియమైన జయ,

ఈ రోజు దీపావళి. గాడాంధకారంగా వున్న ప్రపంచానికి వెలుగు. చిమ్మచీకట్లతో, కారుమబ్బులతో ఆవరించివున్న దేశానికి క్రాంతి. దీపం అంటే వెలుగు గదా ! చీకటిని పారద్రోలేది గదా! దేశంలో ఎక్కడ చూచినా దీపపు తోరణాలు. ఎటు చూచినా ఆనందోత్సవాలు. ఏ ఇల్లు చూచినా అలంకారాలతో, దీపపు కాంతులతో, టపాకాయల మోతలతో, మతాబులు చిచ్చుబుడ్లతో దేదీప్యమానంగా శోభిస్తూ వుంటాయి. పిల్లల ఆనందానికి అవధులుండవు. ఆడబిడ్డలు మంగళ హారతులు పడుతుంటారు. తండ్రులు, సోదరులు కానుకలర్పించి సంతోషపెడు తుంటారు. పండుగలలోకెల్లా మకుటాయమైనది. ముఖ్యంగా పిల్లలకు ఆనందదాయకమైనది. అసలు భారతదేశమే పండుగలకు పుట్టినిల్లు. ప్రతి పండుగ వెనుక ఏదో ఒక గాథ, త్యాగం, విశేషం వుంటుంది సంవత్సరంలో ప్రధానమైన పండుగలు ఐదు వస్తుంటాయి. ప్రజలు తమ బాధలను, కష్టాలను మరచిపోయి ఆ పండుగ దినాలలో ఆనందోల్లాసాలలో తేలిపోతుంటారు. మన చరిత్ర, సంస్కృతి,

పురాణాలను ఒక పర్యాయం నెమరు వేసుకుంటారు. స్ఫూర్తిని పొందుతారు. కర్తవ్యపరాయణులవుతారు. అందులో **'దీపావళి'** కి ఒక ప్రత్యేకత వున్నది. ఈ రోజున ప్రతి గ్రామం, నగరం దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వుంటుంది. సత్యభామ కృష్ణులు కలిసి లోక కంటకుడైన నరకాసురుని వధించిన ఆనందంతో ఈ పండుగ చేసుకుంటాం. పదునాలుగు సంవత్సరాల వనవాసం తరువాత శ్రీ రామచంద్రుడు ఈరోజే అయోధ్యకు చేరాడని ఉత్తరాదివారి నమ్మకం. అందువలన ఈ వేడుకలు వారు చేసుకుంటారు సముద్ర మధనానంతరం లక్ష్మీదేవి అవతరించిన పవిత్రమైన రోజు యిదేనని కొందరి నమ్మిక. ప్రాంతానికొక నమ్మిక, ప్రదేశానికొక వేడుక. మొత్తానికి ఏదో ఒక దృక్పథంతో ఈ దీపావళిని భరతదేశమంతా ఘనంగా చేసుకుంటారు. కొందరికి పండుగ, మరికొందరికి ఎండుగ. కొందరికి ఆనందం మరికొందరికి దుఃఖం. ఒకే వీధిలోనున్న ఒక భవనం దేదీప్యకాంతులతో ధగధగా యమానంగా శోభిల్లుతూ వుంటుంది. దాని ప్రక్కనే పూరిగుడిశలలోనున్న మిణుకు మిణుకుమంటున్న దీపం గాలికి ఆరిపోయి గాఢాంధకారం అలుముకుంటుంది. ఇదీ ప్రపంచం. ఇది భగవంతుని లీల. ఈ సృష్టి రహస్యాన్ని తెలుసుకున్నవారు చాలా కొద్దిమంది మాత్రమే. నాకు ఊహ తెల్సిన తరువాత దీపావళి పండుగ వేడుకలలో పాల్గొనకుండా వున్న సంవత్సరం యిదేనేమో! ఈ విధంగా వుండమని భగవంతుని ఆదేశం. దానిని ఆచరించడం మన ధర్మం గదా! పదిమందితో చావు పెండ్లితో సమానమంటారు. నాలాంటి నిర్భాగ్యులు యిక్కడ చాలా మంది వున్నారు. పైకి ఎవరూ తమ బాధను వెలిబుచ్చుకోలేరుగదా! దహించి వేస్తున్నబాధను హృదయంలోనే అణచిపెట్టుకుంటారు. భోరున ఏడుస్తే ప్రక్కవాడు నవ్వుతాడేమోనని ఎవరికి వారే ఏడ్వలేక నవ్వుతుంటారు. ఇక్కడ మేమూ స్వీట్స్, హాట్సు చేసుకొని లోపలనుంచి వస్తున్న దుఃఖాన్ని బయటకు రానివ్వకుండా నోట్లోపెట్టుకొని నమిలి (మ్రింగి) వేసాం. సూర్యుడు అస్తమించాడు, కారుచీకటి క్రమ్ముకున్నది. దూరాన టపాకాయ మ్రోతలు వినిపిస్తున్నాయి. మతాబులు చిచ్చుబుడ్ల వెలుగు మాత్రం కనుపించడం లేదు. ఊరుకోలేక ప్రమిదలు మాత్రం వెలిగించాం. బయటనుంచి వచ్చే హోరుగాలికి అవి కూడా ఆరిపోయాయి. ఏమి చేయాలో తోచక ప్రక్క మీదకు చేరాను. నిద్రాదేవి ఒడిలో కన్ను మూసాను. ఇది మా దీపావళి. అక్కడ పిల్లలంతా సంతోషంగా పండుగ వేడుకలను చేసుకొనివుంటారని ఆశిస్తున్నాను. నీ బాధ నాకు తెలుసు కాని ఏమి చేయమంటావు. ఏదో మనస్సులో కలిగిన ఆవేదనను వ్రాశాను. ఇక మరచిపోదాం. ఉంటా............

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 4-11-1975

ప్రియమైన జయ,

ఈ రోజు నుంచి కార్తీకమాసం గదా! ఒక మిత్రుని సూచన ప్రకారం మే మిద్దరం ఈ నెలరోజులూ ఉపవాసం వుండదలిచాం. పగలల్లా ఏ అల్పాహారం తీసుకోదలచుకోలేదు. పాలు మాత్రం త్రాగుతాం. రాత్రి మాత్రం భోజనం చేస్తాం. మా నిర్ణయం నీకు ఆశ్చర్యంగా వున్నది కదూ. భోజనానికి కొంచెం ఆలస్యమైతే హడావిడి చేసేవాడను గదా! ఉదయం టిఫెన్ లేకపోతే ఊరుకునేవాడనుకాదు గదా! అటువంటి నేను ఏమీ తినకుండా పగలంతా వుండాలని నిర్ణయించుకోవడం నీకు ఆశ్చర్యమే కలుగజేస్తుంది. ఈ నిర్ణయం అనుకోకుండా జరిగింది. అంతయూ మన మేలుకొఱకే గదా! దీనిలో ఇహం-పరం రెండూ యిమిడివున్నాయ్. అసలు మన పూర్వీకులు సమాజాన్ని కట్టుదిట్టంగా వుంచడానికి కొన్ని నియమ నిబంధనలను ఏర్పరిచారు. వాటిని దేవునితో ముడిపెట్టారు. భక్తికి అన్వయించారు. మానవునికి కొన్ని హద్దులు ఏర్పరిచారు. ఆ హద్దులుమీరి ప్రవర్తించినవారు భగవదానుగ్రహం పొందలేరని చెప్పారు. శనివారం రాత్రి భోజనం చేయకపోవడం ఏడుకొండలవానికి ప్రీతి అన్నారు. రాను రాను శనివారం వుండేవాళ్ల సంఖ్య దినదినాభివృద్ధి జెందుతున్నది.

పాకిస్థాన్ దురాక్రమణ చేసినప్పుడు అప్పటి ప్రధాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రిగారు ప్రతి మంగళవారం రాత్రి ఉపవాసంవుండి పొదుపుచేయమని ప్రజానీకానికి విజ్ఞప్తి చేసారు. కొంతకాలంవరకు చాలామంది ఆ ఆదేశాన్ని పాటించారు. కాని యిప్పుడు వారంలో ఆయన చెప్పిన దినం ఏదో కూడా గుర్తులేదు. కాని సనాతనంగా వస్తున్న మన సంప్రదాయాలను ఎవరు ఎప్పుడు నిర్ణయించారో కూడా తెలియదు. అయినప్పటికి వాటిని అనుసరిస్తునే వున్నాం. తూచా తప్పకుండా పాటిస్తూనే వున్నాం. ఆ ఆచరించేవారి సంఖ్య నానాటికి పెరుగుతున్నదేగాని తరగడంలేదు. కారణం? ఋషులు నిర్దేశించిన ఆజ్ఞ వెనుక వారి తపఃశక్తి వున్నది. వారు నైతిక విలువలకు ప్రాధాన్యత నిచ్చేవారు. ఆధ్యాత్మిక శక్తి సంపన్నులు. అందువలననే వారి మాటకు విలువ వున్నది. జ్ఞానులు తర్కించి, దాని ప్రాముఖ్యతను అవసరాన్ని గుర్తించి ఆచరించుతారు. పెద్దలు, అనుభవజ్ఞులు చెప్పారనే విశ్వాసంతో నమ్మకంతో పామరులు వారిని అనుసరిస్తారు. ఎవరు ఏవిధంగా అనుసరించినప్పటికీ, ఉపాసించినప్పటికి ధ్యేయం ఒకటే గదా! ఉపవాసాలను ఏర్పాటుచేయడానికి మూడు ముఖ్య కారణాలు వున్నాయి.

1. పరానికి చెందినది (మోక్షం కోసం) 2. ఆరోగ్యము 3. ఆర్థికము. మొదటి దానిని పొందటం చాలా కష్టం. అయినప్పటికీ లక్ష్యసిద్ధికై, అకుంఠిత దీక్షతో, పట్టుదలతో నిర్విరామ కృషి సల్పాలి. ఉపవాసదీక్షలో వుంటారు కాబట్టి మనస్సు నిర్మలంగా వుంటుంది. నిర్మలమైన మనస్సు జ్ఞానాభివృద్ధికి దోహదమిస్తుంది. జ్ఞాన దీక్ష, మోక్షానికి మార్గదర్శకమవుతుంది. ఇకపోతే రెండవది. ఆరోగ్యమే మహాభాగ్యము కదా ! ఉపవాసం ఆరోగ్యానికి మంచిది. మూడవది ఆర్థికం. ఇది అందరికి అర్థంకాదు. దేశంలో ఆహారధాన్యాల కొరత ఏర్పడినప్పుడు ధరలు పెరుగుతాయి. ప్రభుత్వం కంట్రోళ్లను విధిస్తుంది. వస్తువులు చీకటి బజారులోనికి పోతాయి. నెలకు రెండు కిలోల పంచదార సరిపోయేవారు కూడా వచ్చేనెలలో దొరకదేమోననే భయంతో నిల్వచేసుకోవడం జరుగుతున్నది. అసలే అవసరానికి సరిపోను ఉత్పత్తి లేకపోవడం, రెండవది స్తోమతవున్నవారు ఎక్కువ కొనుక్కొని నిల్వచేసుకోవడం వలన వస్తువుల కొరత ఏర్పడి సామాన్యులకు దొరకక నానా అవస్థల పాలవుతున్నారు. ఆహారధాన్యాలు, నిత్యజీవితావసర వస్తువులు, పప్పులు పరిమితంగానే వాడాలని ప్రభుత్వం కంట్రోళ్ళు పెట్టినా ఎవరూ ఆచరించడంలేదు. ఎవరో ఎప్పుడో చెప్పారో లేదో తెలియదు. అయినప్పటికి భక్తిపేర ముక్తి కోసం ఈ దేశంలో శనివారాలు, ఏకాదశులు, కార్తీకమాసాలు యింకా అనేక పర్యాయాలు ప్రజలు ఉపవాసాలు ఉంటున్నారు. ఎవరి ఆదేశం లేకుండానే ప్రజలు ఉపవాసాలు ఉంటున్నారు. ఎవరి ఆదేశాలు లేకుండానే ప్రజలు వారంతటవారే అనాదిగా వస్తున్న ఆచారాలను పాటిస్తూ ఉపవాసాలు చేస్తున్నారు. ఎటువంటి నిర్బంధం లేకుండా ప్రతి ఇంట్లో పొదుపు జరుగుతున్నది. పొదుపు చేయమని, ప్రభుత్వం పనిగట్టుకొని ప్రచారం చేస్తున్నా ఎవరూ ఆచరించడం లేదు. అందుకోసమనే మన పూర్వీకులు భౌతిక, ఆర్థిక విషయాలకు ప్రాముఖ్యత యివ్వకుండా, నైతిక ఆధ్యాత్మిక విషయాలకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు. దేవుడు, భక్తి అని చెప్పడంవల్లనే ప్రజలు ఉపవాస దీక్షను పూనుతున్నారు. పొదుపుకోసం అని చెబుతే మాత్రం ఎవ్వరూ ఆచరించరు ఈ రహస్యాన్ని. అంతేకాదు ఈ ప్రజల మనస్తత్వాన్ని మన పెద్దలు ఏనాడో అవగాహన చేసుకున్నారు. మన ఋషివర్యులు దూరదృష్టితో ఆలోచించి మార్గదర్శక సూత్రాలను నిర్ణయించారు. సమాజాన్ని ఒక క్రమ పద్ధతిలో నడిపించడానికి అవసరమైన నియమ నిబంధనలను నిర్దేశించారు. వాటిని ఆధ్యాత్మికవిషయాలతో ముడిపెట్టారు. దైవభక్తికి అన్వయించారు. **'దైవానికి ప్రీతిపాత్రులం కావాలంటే ఈ పని చేయాలి.'** అని స్పష్టంగా చెప్పారు. సమాజాన్ని కట్టుబాట్లలో పెట్టారు. నైతిక విలువలను పెంపొందించేందుకు అవసరమైన శ్రద్ధను తీసుకున్నారు. మన

సంస్కృతిలోవుండే గొప్పతనం యిదే. మన ధర్మంలోవుండే విశేషం కూడా అదే. 'అయితే నవనాగరికులమని చెప్పకొని విర్రవీగేవారికి యిది అర్థంకాదు. వారికి పేపర్లలోపడుతేగాని, సైంటిష్టులు చెబితేగాని నచ్చదు. సనాతనంగా వచ్చే ఆచారాలు మూఢమైనవని ప్రక్కకు త్రోసేస్తారు. మన పూర్వీకులు పెట్టిన ఆచారాలు అన్నీ మూఢమైనవికావు. కొన్ని వుంటే వుండవచ్చు. కాని చాలావరకు శాస్త్ర విజ్ఞానరీత్యా కూడా ఆలోచించి కొన్ని పద్ధతులను నిర్ణయించి, అందరిచేత ఆచరింపజేయడానికి భగవంతునిముందు పెట్టారు. ఇప్పటి భౌతికవాదులు, నాస్తికులు అటు శాస్త్ర విజ్ఞానాన్ని అవగాహనచేసుకొని ఆరోగ్య సూత్రాలను పాటించనూ పాటించడంలేదు. రక్తపోటు(Blood Pressure) ను క్రమబద్ధం చేయడానికి ఆసనాలు వేయడం మంచిదని ఈ మధ్య కాశీలో సమావేశమైన సైంటిష్టులు చెప్పారు. మా జైలులోనున్న భైతికవాదులందరూ ఆసనాలు వేయడం మొదలుపెట్టారు. తులసీదళాల ప్రాముఖ్యతను గురించి ఈ మధ్య 'ఈనాడు' వ్రాసింది. ప్రతి భౌతికవాది తులసీదళాలను తిననారంభించారు. మన పూర్వీకులు ఏనాడో ఈ విషయాలను గురించి అనుభవంతో చెప్పారు. మొన్నటివరకు వాటిని సనాతనమని నిర్లక్ష్యంగా మాట్లాడారు భౌతికవాదులు. ప్రతి ఇంట్లో మన ఆడవాళ్ళు తులసి పూజలు చేస్తుంటారు. తులసి ఆకు రోజూ ఒకటి తింటారు. తులసితీర్థం త్రాగుతారు. ఇది మూఢాచారమంటారు భౌతికవాదులు. తులసి ఆకు ఎంతో ఆరోగ్యప్రదమైనది కావడం వలననే మన పూర్వీకులు తులసి చెట్టును దైవంతో సమానంగా పూజించమని ఆదేశించారు. ప్రజలు దానిని దైవసమానంగా భావించి పూజిస్తున్నారు. కనుక సనాతనంగా వస్తున్న సాంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు అన్నీ మూఢమైనవని భావించరాదు. వాటిలో కూడా ఏదో ఒక విశేషం వుండబట్టే ఎంతోకాలంనుంచి ప్రజలు వాటిని ఆదరిస్తున్నారు. కొన్ని మూఢాచారాలు లేకపోలేదు. కాని అన్నీ మూఢాచారాలని భావించడం మాత్రం పొరపాటు. ఇక వుంటా........

ఇట్లు

'నీ'

---

*'వ్యక్తుల ఆత్మబలానికి పరీక్షా సమయమిది. నేటి గడ్డు పరిస్థితులలో నిలద్రొక్కుకుని దేశభక్తిని ప్రజ్వలింపచేసినవాడే రేపు జాతి చేత ప్రేమించబడేది'.*

*- శ్రీ థామస్ పైన్*

సెంట్రల్‌జైలు, రాజమండ్రి
ది. 6-11-1975

ప్రియమైన జయ,

నీవు వ్రాసినట్లుగా భగవంతుడ్ని అర్థంచేసుకోవడం అంత తేలిక కాదు. ఆయన లీలలు సామాన్యులకు అంత తేలికగా అర్థంకావు. ఒకనికి మంచి చేస్తాడు. వాడి ప్రక్కవాడికే కీడుచేస్తాడు. ఒకనికి మంచిగా మాధుర్యంగా గానం చేయడానికి మృదుమధురమైన కంఠాన్ని ప్రసాదిస్తాడు. మరొకనికి గార్ధభ స్వరాన్ని కలుగజేస్తాడు. సంగీతం ఎంత నేర్చుకోవాలని తాపత్రయపడ్డా అబ్బేదికాదు. కవిత్వం కూడా అంతే. వ్రాయాలని పట్టుదలతో కాగితాలు ఖరాబుచేసినా, బుడ్డెడు సిరా ఖర్చు చేసినా కవిత్వం రాదు. కొంతమంది ఆశుకవిత్వం చెబుతారు. చిన్నతనంలోనే శరపరంపరగా కవిత్వం చెప్పేవాళ్ళున్నారు. బాగా ఛందస్సును పఠించి కవిత్వం వ్రాయాలని కూర్చున్నా కొంతమందికి ప్రయోజనం ఉండదు. నాయకత్వం కూడా అటువంటిదే. ఒకడు బజారులో అడుగు పెట్టడంతోనే నాయకుడు అవుతాడు. మరొకడు కావాలని ఎంత త్రాపత్రయపడ్డా వాడికి లభించదు. ఉపన్యాసం చెప్పాలని ఎంత ప్రయత్నించినా ప్రయోజనం వుండకపోగా కాళ్ళు వణికి చెమటలు పడుతాయి. అదే విధంగా పదిమంది నన్ను మెచ్చుకోవాలి. పొగడాలి, గౌరవించాలి అని కోరుకున్నందువల్ల ఉపయోగం వుండదు. పైవన్నీ కావాలని కోరుకుంటే వచ్చేవి కావు. లభించేవి అంతకన్నా కావు. కొందామనుకుంటే బజారులో లభించవు. డబ్బు ఖర్చుపెట్టినా ప్రయోజనం శూన్యం. **'చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ'** తనకు అర్హతలేని స్థానమెవ్వడును అధిష్ఠించలేడు. కావాలని కోరుకోవడం, అందని పండుకోసం ప్రాకులాడటంలాంటిదే. మన తాహతు ఏమిటో అర్థంచేసుకుంటే నిరాశ ఉద్భవించదు, నిస్పృహ జనించదు. ఈ యదార్థాన్ని అవగాహన చేసుకొనక, అవివేకంతో బాధపడుతుంటారు. తాను పొందలేనిది ఎదుటివారు పొందుతుంటే చూచి ఓర్వలేరు. అసూయ చెందుతారు. ఈర్ష్య జనిస్తుంది. తద్వారా క్రోధం ఉత్పన్నమవుతుంది. శరీరం కంపిస్తుంది. అప్రయత్నంగా పరుషమయిన మాటలు నోటినుండి వస్తాయి. **"అసూయ"** అనునది వేరుపురుగులాంటిది. అది జీవుని శక్తిని కబళించివేస్తుంది. సాధకుడు కష్టపడి సంపాదించిన సద్గుణములను అన్నింటిని ఒక్క క్షణంలో బూడిద పాలు చేస్తుంది. అసూయ అనునది క్షీరములో పడిన విషపు బిందువెంత హానిచేస్తుందో అంతకన్నా ఎక్కువ హానిని కలుగజేస్తుంది. మనిషియొక్క ప్రవర్తన, నడవడి, యోగ్యత, తాహతు, శక్తి సామర్థ్యాలు, సిరిసంపదలు మొదలగునవి పూర్వజన్మ సుకృతాలు. మానవుడు చేసుకున్న సత్కర్మలవల్ల

సత్ఫలితములును; దుష్కర్మలవల్ల దుష్టఫలితములును కలుగుచుండును. సిరిసంపదల కోసం ఎంత కష్టపడినను, ఎంతమందిని మోసం చేసినను రావలసినంతవరకే వస్తుందిగాని ఆశించినంత ఎక్కువ మాత్రం రాదు. ఒకవేళ వచ్చినా నిలువదు. మరికొంతమందికి వద్దన్నా వస్తుంది. ఎప్పుడు ఎట్లా వస్తుందో, ఎట్లా పోతుందో ఊహించడం కూడా కష్టమే.

ఈ విషయమై సుమతీశతకంలో ఒక చక్కటి పద్యం ఉన్నది.

క॥ **"సిరి దా వచ్చిన వచ్చును**
**సలలితముగ నారికేళ సలిలము భంగిన్**
**సిరి దా బోయిన బోవును**
**కరి మ్రింగిన వెలగపండు కరణిన్ "**

కొబ్బరికాయలో ఏ రీతిగా నీరు చేరునో ఆ విధంగానే సిరి వచ్చిన వచ్చును. అట్లే సిరి పోవునపుడు ఏనుగు విసర్జించిన వెలగపండులో గుజ్జు మాయమయిన రీతిగా పోవును. అంతేకాదు ఎంత ప్రాప్తముంటుందో అంతే లభిస్తుంది. ఈ విషయమై భర్తృహరి కూడా చక్కగా వర్ణించాడు.

చ॥ **వనజభవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము ఘనంబో కొంచెమో**
**ధనమధికంబురాదు కడుదైన్యముమాను ధనాఢ్యులందున**
**వినుమరుభూమి కేగిన లభించును మేరువు: జేరబోయినన్**
**వ్యసనిధి నూత: దుల్యముగ వారి గ్రహించు ఘటంబు సూడుమా**

బ్రహ్మ మన నొసట ఎంత ధనము కలుగునట్లు వ్రాసియున్నాడో, అంతకు ఏమాత్రం తక్కువ లేకుండా స్మశానానికి వెళ్లినా లభిస్తుంది. బంగారు పర్వతము వద్దకు వెళ్లినా అంతకన్నా ఏ మాత్రం ఎక్కువ లభించదు. కనుక డబ్బు కోసం ధనవంతుల వద్ద దీనత్వము చూపరాదు. కుండను బావిలో ముంచినా, సముద్రంలో ముంచినా దాని పరిమాణమునకు సరిపోయే నీటిని మాత్రమే తీసుకుంటుంది. ఎవరు ఎక్కడికి పోయినా ఎంత శ్రమపడినను వారి ప్రాప్తం ఎంతో అంతే లభిస్తుంది. మనం దేనికి అర్హులమో దానిని మాత్రమే పొందగలుగుతాం. దీనిని తెలుసుకోలేక జ్ఞాన హీనులు ఇదంతా నా వల్లనే జరిగిందని విర్రవీగుతుంటారు. ఎదుటి వాళ్లను తేలికగా చూస్తారు. అవహేళన కూడా చేస్తారు. కష్టాలలో నున్నవార్ని ఓదార్చకపోగా కించపరచే విధంగా మాట్లాడుతారు. వీటన్నిటిని పట్టించుకోరాదు. ఏనుగు పోతుంటే బజారులో కుక్కలు అనేకం మొరుగుతుంటాయి. కుక్కలు మొరిగినంత మాత్రాన ఏనుగు విలువ తగ్గుతుందా? ఒకరి విలువను మరొకరు తీసివేయలేరు. కనుక మనల్ని ఎవరన్నా ఏమన్నా, చులకనగా మాట్లాడినా మనకు పోయేది ఏమీ

లేదు. మన విలువ తగ్గనూ తగ్గదు, లేనిది పెరగదు. కాని మనకు వుండవలసినది మాత్రం ఓర్పు, ఓర్మి. ఈ రెండూ వున్నవారిని ఎవరూ ఏమీ చేయలేరు. ఇది నగ్నసత్యం. ఈ రెంటితో పాటు శాంతం సహనం వున్న వ్యక్తిని ఎవ్వరూ ఏమీ చేయలేరు. ఈ నాలుగు ఒకే వ్యక్తిలో మూర్తీభవించిన వారు మహానుభావుల కోవకు చెందినవారే అవుతారు. మీ నాన్నగారు ఆ కోవకు చెందినవారనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. ఆయన నుండి మనం నేర్చుకోవలసిన విషయాలు అనేకం. అట్టి మహనీయుని సహితం కొంతమంది అపార్ధం చేసుకున్నవారున్నారు. ఆయనకు నేను అంతా దోచిపెడుతున్నానని భావించిన అవివేకులు లేకపోలేదు. ప్రపంచం అటువంటిది. ఇద్దరు స్నేహంగా మెలుగుతుంటే చూడలేరు. అసలు వాళ్ళు దురభిప్రాయపడకపోయినా, ప్రక్కవాళ్ళు కలుగచేస్తారు. జీతానికి మించి నయాపైసా కూడ ఎన్నడూ యివ్వలేదు. శలవలు వస్తే జీతంలేదు. మనకు అద్దెమాత్రం యిచ్చేవారు. పోసిన పాలకు వెలకట్టి యిచ్చేవారు. పొలం అమ్మిన డబ్బు మొత్తం దాచమని నాకే యిచ్చారు. నాకు అవసరమైనప్పుడు వాడుకుంటూ వుండేవాడను. ఈ విషయాలు నీకు కూడా తెలియవు. నా స్వంత వ్యవహారాలలో గాని, ఆస్తుల విషయంలోగాని ఎన్నడూ ఏమీ అడిగేవారు కాదు. నేను అంతకన్నా చెప్పేవాడనుకాదు. అసలు నీకే చెప్పేవాడనుకాదు గదా? కాని ఒకనాడు ఎవరో అన్నమాటలతో ఆయన హృదయం చాలా బాధపడ్డది. తరువాత ఒకరోజున నన్ను పిలిచారు. **"ఆస్థి కోసం ఒకర్ని అన్యాయం చేయరాదు. నీవాటా కూడా మీ తమ్ముళ్ళకు యిచ్చివేయి. అదృష్టం వుంటే మళ్ళీ సంపాదించుకోవచ్చు. లేకపోతే ఎంత పట్టుకొని వ్రేలాడినా వున్నది కూడా దక్కదు."** అని నాకు హితవుచెప్పారు. న్యాయంకోసం తన కూతురు సిరిసంపదలను కూడ లెఖ్ఖ చేయని మహనీయుడు. ఆయన ఈ లోకాన్ని వదలి వెళ్ళేటప్పుడు ఏమీ బాధపడలేదు. తాపత్రయపడలేదు. పిల్లల్ని గురించిగాని ఆస్థులను గురించిగాని ఏమీ చెప్పలేదు. ఫలానారోజున, ఫలానా తేదీన పోతానని మనం ఢిల్లీ నుంచి వచ్చిన రోజునే (మార్చి నెలాఖరులో 1975) నాకు చెప్పాడు. నేను నమ్మలేదు. ఖచ్చితంగా అదే రోజు (ది. 21-6-1975) న లింగైక్యమైనారు. ఆయన నిజంగా' **కర్మయోగి** ' అంతేకాదు '**జ్ఞాని**' ఆయన ఆశయాలకు ఒక రూపకల్పన చేయడం మన ధర్మంగదా!

<u>చిన్నకథ</u> :-

సీత, తార అను ఇద్దరు స్నేహితురాండ్రు ఒక తోటకు వెళ్ళారు. అక్కడ చెరి మూడు మళ్ళ వంకాయలు కొనుక్కొని గంపలోవేసుకొని నెత్తిమీద పెట్టుకుని మార్కెట్‌కు బయలుదేరారు. సీత ఉల్లాసంగా ఏవో మాటలు చెబుతూ హుషారుగా

నడుస్తున్నది. 'తార' మాత్రం మూలుగుతూ విసుక్కుంటూ నడవలేక నడుస్తున్నది. అదే విధంగా కొంత దూరం నడిచేటప్పటికి 'తార' కొంచెం వెనుకబడింది. ముందుగా నడుస్తున్న 'సీత' నుపిలిచి 'మనమిద్దరి గంపలలో సమానంగా కూరగాయలు వేశాం. నీవు నాకన్నా బలమైనదానవు కూడా కాదు. అయినప్పటికి నేను మోయలేక వెనుకబడ్డాను. నీవు మాత్రం హుషారుగా వడివడిగా నడుస్తున్నావు?' అని తార అడిగెను. అప్పుడు' సీత ' **"నీవు చెప్పిందంతా నిజమే. నా గంప బరువు తగ్గుటకు అసలుకారణం దానిమీద రెండు మూలికలు పెట్టాను. అందువలన నా గంప బరువు తగ్గింది"** అని, చెప్పెను. అంతట 'తార' ఆతురతగా "వాటిని నా గంప మీద కూడా ఎందుకు వేయలేదు?" అని ప్రశ్నించింది. అంతట 'సీత' ఆ మూలికలు అందరికి కనపడవు. అందర్కి సాధ్యమయ్యేవి కూడా కావు. వాటి పేరు 'ఓర్పు, ఓర్మి'. వాటిని కలిగివున్నవారు చాలా అదృష్టవంతులు. ఎంతటి కష్టమునైనను, బరువైనను తొలగించగల సామర్థ్యం వానిలో వున్నవి. ఆ రెంటిని నేను పొందడం వలననే, సాధించడం వలననే నా గంప బరువనిపించడంలేదు. ఆ రెండు నీకు లేకపోవడంవలన సహనం చచ్చి బాధపడుతున్నావు." అని బదులుచెప్పెను. నిజంగా ఈ కథ ఎంతో వాస్తవంగా వున్నది గదూ ! ఓర్పు, ఓర్మి గలవారిని ఎటువంటి కష్టాలు ఏమీ చేయలేవు. అతనిని విజయలక్ష్మి తప్పకుండా వరిస్తుంది. పండుగకు పిల్లలంతా టపాకాయలు బాగాకాల్చారను కుంటాను. ఈ లేఖలో నీ ప్రశ్నకు సమాధానం వచ్చిందనుకుంటాను. ఆర్థిక విషయాలు యిబ్బందులు అంతగా ప్రస్తావించక నా బుర్రకు పని కల్పించే విషయాలు వ్రాస్తావు కదూ! ఇంకా అనేక విషయాలు వ్రాయాలనుకుంటున్నాను. నేను వ్రాసిన ఉత్తరాలు అన్నీ జాగ్రత్త పరచగలవు. ఇక వుంటా....

ఇట్లు

'నీ'

---

'An optimist sees an opportunity in every difficulty; a pessimist sees a difficulty in every opportunity'. *ఆశావాది ప్రతి కష్టంలోనూ ఒక అవకాశాన్ని చూస్తాడు; నిరాశావాది ప్రతి అవకాశంలోనూ ఒక కష్టాన్ని చూస్తాడు'.*

*- శ్రీ యానస్*

సెంట్రల్‌జైలు, రాజమండ్రి
డి. 17-11-1975.

ప్రియమైన జయ,

నీ ఉత్తరం చూస్తుంటే కొంచెం నీకు కోపం వచ్చినట్లుగా కనుపిస్తున్నది. నేను ఒకర్ని దృష్టిలో పెట్టుకొని ఉత్తరాలు వ్రాయడం లేదు. భవిష్యత్తులో కూడ అందరికి ఉపయోగపడాలని నా కోరిక. అందరూ అన్ని గ్రంథాలు చదవలేరుగదా! కనుక ఆ పుస్తకాల సారాన్ని క్లుప్తంగా, నిత్యజీవితంలో ఉపయోగపడే విధంగా వుండాలనే తలంపుతో వ్రాస్తున్నాను. నీవు వ్రాసినట్లు 'ఓర్పు, శాంతి, సహనాలు గురించి చెప్పడం తేలికే, ఆచరించడం చాలా కష్టం. ఇవి స్వభావసిద్ధంగా రావాలిగానీ నేర్చుకుంటే వచ్చేవి కాదన్నావు. కొంతవరకు నిజమేకావచ్చు. కాని పూర్తిగా నిజమని చెప్పడానికి వీలులేదు. లోగడ తాము చేసిన పుణ్య పాపకర్మలననుసరించియే ప్రస్తుత జీవితగమనం ఆధారపడి వుంటుంది. కొంతమందికి పుట్టుకతోనే భగవద్భక్తి అబ్బుతుంది. మరికొంతమంది నాస్తికులుగా దేవుడు లేడని వాదిస్తుంటారు. కొంతమందికి పుట్టుకతోనే ఉన్నతభావాలు, సాత్వికప్రవృత్తి అబ్బుతుంది. మరికొంతమంది క్రూరస్వభావులుగా పుట్టుతారు. కొంతమంది ఆదిలో దుష్ట ప్రవర్తనగలవారై, మధ్యలోగాని, అంతిమదశలోగాని విరక్తి వైరాగ్యములు కలుగుతాయి. కొంతమంది చిన్నప్పుడు తక్కువ మార్కులు వచ్చేవారు రానురాను పెద్దవారైనకొద్దీ మంచి మార్కులు తెచ్చుకుంటారు. దీనికి కారణం ? వారు తాము పూర్వజన్మలో చేసుకొన్న సంస్కార ఫలితాలేనని నిస్పృహజెంది ఏ ప్రయత్నమూ చేయకుండా అంతా భారము దైవము పైననే వేసి మన 'గీత' ఏ విధంగా వ్రాసి వుంటే ఆ విధంగానే జరుగుతుందని మెదలకుండా ఊరుకోవడం మాత్రం విజ్ఞత అనుపించుకోదు. మంచి గురువులవద్ద శుశ్రూష చేయాలి. శాస్త్రాలు, పురాణాలు, నీతి గ్రంథాలలోని మంచి విషయాలను తెలుసుకోవాలి. గురువులు, పెద్దలు మార్గమును చూపుదురే గాని, నడువవలసినది, ఆచరించ వలసినది మనమే. మన కాళ్ళతో మనము నడుపవలెను. మన కండ్లతో మనం చూడవలెను. మనచెవులతో మనం వినవలెను. మన ఆకలిని మనమే పోగొట్టుకోవలెను. సోమరులై ఏది ఎట్లా జరగాల్సివుంటే అట్లాగే జరుగుతుందని నిరాశచెంది మెదలకుండా కూర్చుంటే ప్రయోజనం వుండదు. అట్టివారికి భగవంతుడు కూడా ఏమీ సహాయం చేయడు. ఇంగ్లీషులో ఒక సామెత వున్నది. **"God helps those who help themselves"**అనగా తమ్ము తాము ఉద్ధరించుకొనజూచువారికి మాత్రమే భగవానుడు సహాయం చేయును. దేనికైనా

పురుషప్రయత్నం అత్యవసరం. ఫలితాన్ని ఆశించకుండా శక్తివంచన లేకుండా కృషి చేయడం మన ధర్మం. అటువంటి నిష్కామకర్మ చేయువారికి భగవదనుగ్రహం తప్పకుండా లభిస్తుంది. దానికి కొంత సాధన అవసరం. అభ్యాసం వుండాలి. పట్టుదలతలో కూడిన ప్రయత్నం వుండాలి. ఇప్పుడు చేసిన జపము. పరోపకారము, దానధర్మాలు వచ్చే జన్మలో కూడా ఉపయోగపడుతాయి. దీనిని విస్మరించరాదు.

ఇకపోతే కలియుగంలో తప్ప స్త్రీ ఎప్పుడైన బయటకు వచ్చిందా? అని ప్రశ్నించావు? భారతదేశంలో స్త్రీకి ఎప్పుడూ సముచితమైన గౌరవస్థానం వున్నది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వుండేవి. వారికి అత్యున్నతమైన స్థానం వున్నది. దుష్యంతుని ముందర సభలో శకుంతల కొన్ని వేదవాక్యాలను పేర్కొని చక్రవర్తి బాధ్యతలను గుర్తుచేసి ఆ సభలో వున్నవారందర్ని ఆశ్చర్యచకితులను చేసినట్లుగా పురాణాలు ఘోషిస్తున్నాయి. సీత, దమయంతి మొదలగువారు బాగా చదువుకున్నారని చెబుతున్నారు. స్త్రీ విద్య శ్రుతి స్మృతి పురాణసమ్మతమైనదనటంలో ఏమాత్రం సందేహం లేదు. భోజరాజు రాజ్యము చేయునప్పుడు ఒక బ్రాహ్మణ కుటుంబం అనగా తల్లి, భార్య, కోడలు ఆయన కొలువులో సంస్కృతశ్లోకములు వల్లించినట్లు చరిత్ర చెబుతున్నది. శ్రీకృష్ణదేవరాయలు కాలంలో కూడ అనేకమంది స్త్రీలకు సంస్కృతంలో మంచి ప్రవేశం వున్నట్లు తెలుస్తున్నది. భారతదేశంలో స్త్రీకి ఆదర్శమైన మాతృత్వస్థానము వున్నది. పాశ్చాత్యదేశాలలో 'స్త్రీ' అనగా భార్య అనే భావం వున్నది. మన దేశాన్ని '**Mother Land**' మాతృభూమిగా భావిస్తాం. పాశ్చాత్యులు వాళ్ల దేశాన్ని '**Father land** ' పితృభూమిగా భావిస్తారు. పాశ్చాత్యులు వాళ్ల దేవుడ్ని 'ఓ తండ్రీ' అని సంబోధిస్తారు. మనం '**ఓ దేవా**' అని సంబోధిస్తాం. మనం తండ్రినిగాని, తల్లిని గాని పేరుపెట్టి పిలవము. పాశ్చాత్యదేశాలలో పిల్లలు వాళ్ల తల్లిదండ్రులను పేరుపెట్టి పిలుస్తారు. మన తండ్రిని గాని, తల్లిని గాని పేరుపెట్టి పిలవము. ఇదే మన సంస్కృతిలో నున్న గొప్పవిశేషం. ఒకపర్యాయం వివేకానందుడు అమెరికాలో స్త్రీలతో ముచ్చటిస్తున్నప్పుడు '**ఔనుతల్లి!**' అని సంబోధిస్తూ మాట్లాడగా వారికి కోపం వచ్చిందట. అక్కడ '**తల్లి**' అనగా '**ముసలిది**' అని వారి అభిప్రాయము. స్త్రీకి మాతృస్థానం యిచ్చి గౌరవించడం మన అలవాటు. అందుకోసమనే మనం మొదట స్త్రీ పేరు చెప్పి తరువాత పురుషుని పేరు సంబోధిస్తాం. ఉదాహరణకు సీతారాములు, పార్వతీపరమేశ్వరులు అంటాం. శ్రీకృష్ణదేవరాయల కాలంలో "**మొల్ల**" అను స్త్రీ రామాయణమును రచించింది. అదే "**మొల్ల రామాయణం**" గా ప్రసిద్ధిగాంచింది. ప్రాచీనకాలంలో Co-education కూడా వుండేది. పూర్వం స్త్రీలకు విద్యగఱపు పద్ధతి, శిక్షణ యిచ్చు విధానమును తెలిపే గ్రంథాలు అనేకం వున్నాయి. ప్రాచీన

విద్యాపీఠమునకు బాలుర తో సమానంగా బాలికలు కూడా వచ్చేవారని పూర్వం గ్రంథములు చాటుతున్నాయి. విదేశీ దురాక్రమణలకు గుర్త్తె మనదేశ సంస్కృతీ సాంప్రదాయాలు ఛిన్నాభిన్నమైనాయి. ఇప్పుడు నాగరికత పేరుతో నైతిక విలువలకు తిలోదకాలివ్వడం జరుగుతున్నది. స్వేచ్ఛ పేరుతో సత్సాంప్రదాయాలను సర్వనాశనం చేస్తున్నారు. విద్య వలన వినయ వివేక సద్గుణములు కలుగడానికి బదులు అవిధేయత, అవివేకము, సంప్రాప్తమవుతున్నాయి.

ఇకపోతే **"శాంతిసహనాలు"** కలవారిని చేతకానివారి క్రింద జమకడుతారు. అని వ్రాశావు. ఇది కొంతవరకు యదార్థమే. చేతకానివాడు, బలహీనుడు చెప్పే శాంతివచనాలను ఎవ్వరూ లెఖ్కచేయరు. అతను ఏమీ చేయలేక ఒట్టి శాంతివచనాలను వల్లెవేస్తుంటాడు. కాబట్టి అవే శాంతివచనాలను బలవంతుడు చెబుతే వేదవాక్కులాగే పాటిస్తారు. కారణం? **"సంఘేశక్తి కలౌయుగే"** శక్తివంతుడిదే రాజ్యం. శక్తివంతుడు చెప్పేధర్మానికి, న్యాయనికే విలువ వుంటుంది. అదే ధర్మాన్ని బలహీనుడు ప్రవచించితే ఎవరూ పాటించరు. కనుక శక్తివంతులం కావాలి. ముభావంగా వుండటం, మొహమాట పడటం మంచిదికాదు. శక్తిని సముపార్జించిన తరువాత విర్రవీగరాదు. దుష్కృత్యాలకు పాల్పడరాదు. శక్తిని మంచి పనులకు వినియోగించాలి. చెడుపనులకు ఏమాత్రం సహకరించరాదు. **"జీవితసమరంలో నెగ్గాలంటే మొహమాటం ముందు వదులుకోవాలి"**. అది మహా చెడ్డది. మనిషిని ముందుకు పోనివ్వదు. మొహమాటం వదులుకోవడం అంటే దేబిరించడం కాదు. స్వాభిమానాన్ని చంపుకోవడం అంతకన్నాకాదు. ఉన్నది ఉన్నట్లు ధైర్యంగా, నిష్కర్షగా చెప్పగలగడం. ఈ లోకంలో అనేకరకాల వ్యక్తులుంటారు. అందులో పెద్దపులులు, తోడేళ్ళలాంటి వారు కొందరుంటారు. క్రూరస్వభావం గలవారు, నయవంచకులు అనేక మంది వుంటారు. మొహమాట పడేవారు, అమాయకులు అట్టి వారికి ఎర అయిపోతుంటారు. కనుక ఎప్పుడూ మెళుకువగా వ్యవహరించడం నేర్చుకోవాలి. ఎవరి హక్కులను వారు ఎప్పుడూ కాపాడు కుంటుండాలి. ఏమి అడగాలనుకున్నా మొహమాటపడకుండా స్పష్టంగా అడగడం నేర్చుకోవాలి. **"అడగందే అమ్మయినా పెట్టదుగదా!"** అనే లోకోక్తిని మరువరాదు. ఇవి నేర్చుకుంటే జీవితంలో మొదటిపరీక్ష నెగ్గినట్లే అవుతుంది. నిత్యజీవితంలో అనేక అడ్డంకులు, అవరోధాలు ఏర్పడు తుంటాయి. వాటిని సహనంతో ఎదుర్కొంటూ ముందుకు సాగిపోవడం నేర్చు కోవాలి. ఊహించనటు వంటి భయంకర పరిస్థితులు ఏర్పడుతుంటాయి. వాటిని చూచి భయపడి ధైర్యాన్ని కోల్పోయి శోకించరాదు. ధైర్యంగా ఎదుర్కోవడం నేర్చుకోవాలి. అప్పుడే గమ్యస్థానాన్ని చేరుకోగలుగుతాము.

చిరంజీవులకు - నా ఆశీస్సులు,

మీకు ఒక చిన్నకథ వ్రాస్తున్నాను. అందులోని నీతిని గ్రహించి మంచివాళ్ళు అవ్వాలని నా కోరిక. పూర్వం ఒకతండ్రి ఉంగరం చేయించుకోవటానికి తన ముద్దుల కుమారునికి 4 వరాలు ఇచ్చాడు. అనగా బంగారు నాణెం యిచ్చాడన్న మాట. దానిని ఆ బాలుడు బల్లమీద పెట్టి చదువుకుంటున్నాడు. ఇంతలో 'గౌరి' లాంటి ఆ అబ్బాయి చెల్లెలు వచ్చి, ఆ బంగారునాణెమును చూచి, 'అన్నయ్యా! ఇది **ఏమిటి? అని నాణెమును పట్టుకుని అడిగింది. అది ఎక్కడిది? అని ప్రశ్నించింది?'** అప్పుడు వాళ్ళ అన్నయ్య ఇది వరాల చెట్టుకు కాసినది. దీనిని తీసుకునినేలలో పాతిపెట్టిన మొక్క మొలచి తీగె అయి చాలా కాయలు కాస్తాయి. ఆ కాయలలో ఇటువంటి వరాలు చాలా ఉంటాయని చెప్పి చదువుకుంటున్నాడు. ఆ అమ్మాయి కూడా మన **'గౌరి'** లాంటి **'చిలిపిపిల్ల'**. ఆ పిల్ల నెమ్మదిగా **"ఆ వరాలు తీసుకుని బావి వద్దకు వెళ్ళి చిన్నగొయ్యి తీసి ఆ వరాలను పాతిపెట్టింది"** ఆ బాలుడు తన చదువును పూర్తిచేసుకుని బల్లమీద చూడగా **"వరాలు"** కనపడలేదు. ఆతురతతో వాళ్ళ చెల్లెలును అడిగాడు. అప్పుడు ఆ చెల్లెలు **'వరాలకాయలు'** కాయడాని కోసం బావివద్ద పాతిపెట్టానని చెప్పింది. త్వరగా పరుగెత్తికొని వెళ్ళి చూడగా అక్కడ **'వరాలు'** కనుపడలేదు. ఆ బాలిక బావి వద్ద పాతిపెడుతుండగా నీళ్లకు వచ్చిన వాళ్లెవరో చూచి వాటిని దొంగిలించి వుంటారు. ఆ బాలుడు ఏడుస్తూ, వాళ్ళ అమ్మతో ఈ విషయం చెప్పాడు. తన చెల్లెలును కొట్టాడు కూడాను. అప్పుడు వాళ్ళ అమ్మ జోక్యం చేసుకొని **"అబద్ధమాడినందుకు నీకు తగిన శాస్తి జరిగింది"** అని చెప్పెను. కాబట్టి ఈ కథ వలన మనం నేర్చుకోవలసినది ఒకటి, అమాయకులైన చిన్నపిల్లలతో అబద్ధం మాటలు చెప్పరాదు. అసత్యమాడరాదు. ఆ బాలుడు, వాళ్ళ చెల్లెలుకు అబద్ధపు మాటలు చెప్పడం వలన ఆ బాలునికి వచ్చే ఉంగరం కాస్తా పోయింది. కనుక ఆటలలోనయినా పరిహాసంగా అబద్ధం చెప్పరాదు. అనే విషయం తెలుసుకోవాలి ఇక వుంటా_టా! ___టా!___

ఇట్లు

'మీ'

---

**'Democracy without education means hypocracy without limitation.** *'విజ్ఞతలేని ప్రజాస్వామ్యం అంతులేని వంచన'.*

*- శ్రీ అబ్రహం లింకన్*

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 22-11-1975

ప్రియమైన జయు,

మన మార్కండేశ్వరరావుకు నేను లోగడ ఒక ఉత్తరం వ్రాశాను. సమాధానం లేకపోవడంతో కోపం వచ్చిందేమోనని భావించాను. ఈమధ్యనే వాడి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. వాడు నిజంగా భోళాశంకరుడే వాడు వ్రాసిన ఉత్తరం నాకు చాలా సంతృప్తినిచ్చింది. లోగడ ఒక ఉత్తరం కూడా వ్రాశానని వ్రాశాడు. అది మాత్రం అందలేదు. శంకరం 'ఇన్‌లాండ్ కవరు' వ్రాశాడు. కాని అడ్రస్సు వున్న ఒకే పేజీ మాత్రమే నాకు అందింది. సగానికి చించి నాకు సగమే వచ్చింది. రెండవపేజీ ఏదైనా వ్రాసి, వాడేకొట్టేసి చించివేశాడా? లేక నా ఆత్మీయులు, నా యోగక్షేమాలను చూస్తూ ఉత్తరాలను తనిఖీ చేసే ప్రభుత్వాధి కారులు చించివేశారా? ఈ రెంటిలో దేనికైనా అవకాశం వున్నది. తెల్సుకొని వ్రాయగలవు. ప్రభుత్వం నిఘా ఎక్కువగా వుండటం వల్ల(సెన్సారు అధికారులు నా ఉత్తరాలను చాలాచోట్ల చూడాలిగదా!) నాఉత్తరాలు ఆలస్యంగా అందుతూ వుండవచ్చు. ఆలస్యంగా అయినప్పటికి అసలు ఉత్తరాలు అందుతే అదే సంతోషం.

ఈమధ్య కీ॥శే॥ జవహర్‌లాల్ నెహ్రూగారి 'ఆత్మకథ' ను చదువుతున్నాను. దాదాపు 850పేజీల ఉద్గ్రంథం. ఆయన పడిన మానసిక వ్యథ, ఆవేదన, జైళ్లలోని అనుభవాలు అనేకం వ్రాశారు. ప్రతి రాజకీయవేత్త, ప్రభుత్వాన్ని పాలించే అధినేతలు దానిని తప్పకుండా చదవాలి. ఉట్టిగా చదివినందువల్ల ప్రయోజనం లేదు. ఆయన పడిన బాధలను విశాలభావంతో అర్థంచేసుకొని వాటిని తీర్చిన రోజున, ఆయన ఆవేదనను అవగాహన చేసుకొని తరుణోపాయాన్ని కనుగొనిన శుభదినాన, ఆయన ఆశయాలకు ఒక రూపకల్పన చేసి అమలుపరిచిన రోజున ఈ దేశంలో ఇటువంటి దుస్సంఘటనలకు అవకాశం వుండనే వుండదు. ఆయన ఆత్మకథలో (పేజీ 124) జైలులో వున్నప్పుడు **"మేము యిట్లు కాలం గడుపుచుండ దినములు వారములుగ, వారములు మాసములయ్యెను. ఒక నిత్యజీవితమునకు మేమలవడితిమి కాని బయట ప్రపంచంలో భారమంతయూ తల్లులపయిన, భార్యలపైన, సోదరీమణులపైన పడెను. చిరకాల వియోగమువలన వారు విసుగు చెందిరి. వారి ప్రియులందరు జయిళ్లలో వుండ వారి స్వేచ్ఛయే వారికొక కళంకముగ తోచెను. నాకు, నాతండ్రిగారికి విధించిన జుల్మానాలను వసూలు చేయుటకు పోలీసులు తరుచుగా ఆనందభవనమును దర్శించేవారు. జుల్మానాలను చెల్లించరాదని కాంగ్రెసు ఆంక్ష విధించెను. కనుక పోలీసులు ప్రతిదినము వచ్చి చిన్న చిన్న సామాగ్రిని తీసుకొనిపోయేవారు. ఇందిర - నా నాలుగేండ్ల**

**కూతురు - ఈ పోలీసుల యీ నిరంతర దాడిని సహింపక తన యసహ్యతను వారికెరింగించెను. "** అని ఆయన పడిన మానసిక బాధను తన 'ఆత్మకథ' లో వ్రాసుకున్నారు. ఆ పుస్తకం భావితరాలవారికి ఆదర్శనీయం. నిజంగా జయిలులో పడ్డ ప్రతి "డిటెన్యూ" మనస్సులో పడుతున్న ఆవేదనకూడ అదే. అయితే శిక్షించడం, తప్పు చేసినవారిని దండించడం ప్రభుత్వ విధి కదా? అని నీవు ప్రశ్నించవచ్చు! నిజంగా అది ప్రభుత్వం చేయవలసిన పనే. ఎవరూ కాదనరు. అయితే ప్రభుత్వం చర్య విచక్షణాజ్ఞానం కలదిగా వుండాలి. ఈ విషయంలో యింతకన్నా వ్రాయలేను. (అవకాశం కూడా లేదు)

నెహ్రూగారు మరొకచోట ఆయన 'ఆత్మకథ' (పేజీ 450) లో "ఆర్డినెన్సులు **వచ్చెను. మాజిస్ట్రేటులకు, పోలీసు ఉద్యోగులకు చాలా అధికారములివ్వబడెను. పౌరసత్వములు నశించెను. (పేజీ 454) ఆర్డినెన్సులు - అన్ని విధములగుస్వేచ్ఛలను అరికట్టుట, వార్తాపత్రికలు ముద్రణాలయముల మూతులు కట్టివేయుట, విచారణ లేకుండగనే ప్రజలను ఖైదు చేయుట - ప్రతిదినము జరుగు విషయాలే. "** అని వ్రాసుకొనును. నేను ఆ మహానుభావుని అభిప్రాయాలను విమర్శించదలచలేదు. దానికి మనం అర్హులం కూడా కాదు. కాని నా మనస్సులోని బాధ, ఆవేదన ఒకటే. అది ఏమనగా దానిని వ్రాయలేక, నిస్సహాయస్థితిలో వుండి పోవడమే. అసలు ఈఉత్తరం నీకు అందుతుందని ఒకవేళ అందినా కొట్టివేతలు లేకుండా నీ చేతిలో పడుతుందనే నమ్మకం నాకు మాత్రం లేదు. నేను చేస్తున్న పొరపాటు ఒకటే. 18 సంవత్సరాలు భారత దేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా, మకుటములేని మహారాజు వలె పరిపాలించిన పండిత జవహర్‌లాల్‌గారి ఆత్మకథ లోని విషయాలను వ్రాయడమే. ఇది కూడా పొరపాటే అవుతే, చేయరాని మహాపాపమే అయితే ప్రజాస్వామ్యానికే నిర్వచనం మార్చుకోవాల్సివస్తుంది. ఆఖరుమాట (పేజీ 510) "ఆదర్శములు **మలినము గాక, స్పష్టముగా వుండి, యుత్సాహము మొక్క వోకున్నచో నపజయము కలుగజాలదు"** అని నెహ్రూగారు 'ఆత్మకథ' లో వ్రాశారు. ఇదే నా ఆశయం, నా ధ్యేయం, నా విశ్వాసం. నా ధైర్యం కూడా అదే. ఇక వుంటా....

ఇట్లు

'నీ'

---

**'Liberty postulates dignity of man'.** *'స్వేచ్ఛ అనునది మనుష్యుని గౌరవమునకు మూలము'.*

- శ్రీ జాన్సుటువార్టు

సెంట్రల్‌జైలు, రాజమండ్రి
ది. 27-11-1975.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన రెండవ ఉత్తరం అందినది. మొదటిది మాత్రం అందలేదు. ఒక పర్యాయం లోగడ కూడా రెండవ ఉత్తరం తరువాత మొదటి ఉత్తరం అందింది. అందువల్ల చెడు కన్నా ముందుగ మంచినే వింటున్నాను. చదువుతున్నాను. ఇది సంకల్పబలమేనని నా అభిప్రాయం. సంకల్పం మంచిగా, ధృఢతరంగా వుంటే మంచే చేకూరుతుందని నా విశ్వాసం. సంకల్పబలాన్ని ఎదిరించే ధైర్యం, శక్తి దేనికీ వుండదని నా నమ్మకం. మన సంకల్పం గట్టిగా వుంటే కష్టాలు వాటంతట అవే తొలగిపోతాయని నా ధృఢ విశ్వాసం. అందువల్లనే నాకు, నీవు తీవ్రంగా వ్రాసిన రెండు ఉత్తరాలు ముందుగా అందలేదు. పోస్టల్ వారి ఆలస్యం కావచ్చును. సి.ఐ.డి ల సద్బుద్ధి కావచ్చు. లేక మరెవరి మంచి గుణమైనా కావచ్చును.

ఇకపోతే నా ఉత్తరాలు నీ మనశ్శాంతికి దోహదం చేస్తున్నట్లుగతోచడం లేదు. అది నా లోపమే కావచ్చు. లేక నీ స్థాయికి సరిపోయేవిగా వుండకపోవచ్చు. ఏది ఏమైనప్పటికి నా ప్రయత్నం మాత్రం విడనాడను. ప్రయత్నం మానవధర్మం. ప్రయత్నం చేయకుండా అంతా భగవంతునికే వదలడం, పూర్వజన్మ సుకృతం అని భావించడం విజ్ఞుల లక్షణం మాత్రం కాదు. "కష్టేఫలి" అన్నారు పెద్దలు. ఫలితం కష్టపడుతేగాని రాదు. అదికూడా ఫలితాన్ని ఆశించకుండా కర్మను మనస్ఫూర్తిగా చేస్తేనే దక్కుతుంది. "గీత" బోధించినా, వేదాలు ఆదేశించినా, పురాణాలు చెప్పినా మానవ ప్రయత్నం ముఖ్యమన్నాయి. తరువాత భగవదనుగ్రహం. కనుక మన ప్రయత్నంలో లోపముండరాదు. మనం బజ్రారుకు వెళ్ళి రు5/- ల వస్తువును రు 4-75 కు యివ్వమన్నా యివ్వరు. అదే విధంగా ప్రయత్నలోపం ఏమాత్రం తక్కువ వున్నా ఆశించిన ఫలితం పూర్తిగా రాదు. నీకు అన్ని విషయాలు తెలుసు. ఆచరణలోనికి వచ్చేటప్పటికి కొంచెం దెబ్బతింటున్నావు. వ్రాయడం తేలికే. ఆచరించడం మాత్రం బహుకష్టం. అయినప్పటికీ ప్రయత్నం విడువరాదు. నేను ఇంటివద్దనున్నప్పుడు ఇన్ని విషయాలు నీతో చర్చించేవాడనా? లేదు. అసలు అవకాశం వుండేది కూడా కాదు. ఇప్పుడు భౌతికమైన శరీరం మాత్రం నీ ఎదుట లేదు కాని నా మనస్సు, భావం, ఆలోచన, ఆశయం, ఆదర్శం ఉత్తరాల ద్వారా స్పష్టంగా అర్ధమవుతున్నవి గదా! 'అంతయు మన మేలుకొరకే' అన్నట్లుగా ఇటువంటి అవకాశం లభించడం కూడ మంచిదేనని నా అభిప్రాయం. ఇకపోతే నీకు భగవంతుని మీద సంపూర్ణమైన విశ్వాసం వున్నది గదా! ఉండబట్టే క్రితం సంవత్సరం

వచ్చిన జబ్బు భగవదానుగ్రహంవల్ల నీకు నయమైనది. భౌతికమైన మందులు ఏమి చేయలేక పోయాయి. అయితే ఒక భగవంతుని మీదనే విశ్వాసం వుంచితే సరిపోదు. భగవంతుడు, వేదాలు, గీత, పురాణాలు, కావ్యాలలో చెప్పిన అమూల్యమైన విషయాలమీద విశ్వాసం వుండడంతో పాటు వాటిలో చెప్పబడిన విషయాలను ఆచరించినప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. భగవంతుడు ఎక్కడ వుంటాడో, అతని కరుణాకటాక్షములు ఎవరిమీద వుంటాయో ఈ క్రింది శ్లోకములో చక్కగా వర్ణించబడింది. దానిని మంచిగా అవగాహన చేసుకొని, అర్థం చేసుకొని ఆచరిస్తే మానవునికి ఏ భయమూ వుండదు.

**"ఉత్సాహం, సాహసం, ధైర్యం, బుద్ధి, శక్తి : పరాక్రమ :**
**షడేతే యత్ర తిష్టన్తి , తత్రదేవోపి తిష్ఠతి"**

ఉత్సాహము, సాహసము, ధైర్యము, సద్బుద్ధి, శక్తి, పరాక్రమము అను ఆరు సుగుణములు ఎచట వుంటాయో అచట సాక్షాత్ భగవంతుడు కాపురముంటాడు. నీవద్ద మానవునిలో వున్న అంత : శత్రువులైన శోకము, 'సద్బుద్ధి' మాత్రం ప్రస్తుతం వున్నది. మిగతా ఐదు గుణాలను అలవరచుకోవాలి. అప్పుడే భగవదానుగ్రహం లభిస్తుంది.

'గీత' లో తత్వబోధ, కర్తవ్యాన్ని గురించి బోధించడానికి ముందు శ్రీ కృష్ణుడు **"నిర్భయత్వాన్ని"** గురించి బోధించాడు.

**"క్లై బ్యం మాస్మగమ : పార్థ, నైతత్త్వ యుపపద్యతే**
**క్షుద్రం హృదయ దౌర్బల్యం ,తక్త్వోత్తిష్ఠ పరన్తప "**

"ఓ అర్జునా ! అధైర్యమును పొందకుము. ఇది నీకు తగదు. నీచమగు ఈ మనో దుర్బలత్వమును విడనాడి యుద్ధము చేయుటకు లెమ్ము." అని ప్రబోధించాడు. **"పౌరుషవిహీనుడవై పిరికితనముతో అధైర్యమును పొందకుము"** అని హెచ్చరించాడు. ఉపనిషత్తులలో వున్న శ్లోకమును తీసుకొని ప్రజలను ఉత్తేజ పరిచాడు. స్వామి వివేకానంద. **"ఉత్తిష్ట" !- ఉత్తిష్ఠత ! జాగ్రత! ప్రాప్యవరాన్ని బోధత"** అనగా లెమ్ము! మేల్కొనుము! మహనీయులను సమీపించి విజ్ఞానమును పొందుము ! కార్యశూరుడవు కమ్ము! కర్తవ్యమును పాలింపుము! గమ్యస్థానము చేరువరకు విశ్రమింపకుము ! అని హెచ్చరించాడు.

బాహ్య శత్రువులను ఎదుర్కొనడం ఒకపని. అంతకన్నా మరొక ముఖ్య విషయం కూడ వున్నది. మానవునిలో వున్న అంత: శత్రువులైన శోకము, మోహము, అధైర్యము, పిరికితనము మొదలగు దౌర్బల్యములను కూడ ధైర్యంగా ఎదుర్కొనాలని

మహనీయులు చెబుతున్నారు. కనుక భగవదానుగ్రహం పొందాలని కోరిక వున్నవారు తీవ్ర సాధన చేయాలిగదా! మనకు ప్రస్తుతానికి భగవంతుని దయవల్ల సంసారం గడవడానికి ఎట్టి ఆర్థిక యిబ్బందులూ లేవు గదా! కావల్సిందల్లా మనశ్శాంతి మాత్రమే. ఇక్కడ వున్న డిటెన్యూలలో కొంతమంది ఇండ్ల వద్ద కుండలు డింకీలు కొడుతున్నాయి. సరిగా ఒకపూట కూడ గడవని నిర్భాగ్యులున్నారు. ఇక వాళ్ల పరిస్థితి ఏమిటి? నీకు గుర్తుండియే వుండవచ్చును. మనం బందరులో వుండగా మనం వున్న ఇంటివారు నెలాఖరులో రాత్రిపూట అన్నంతినేవారుకాదు. కారణం? వారి ఆదాయం వారికి పూర్తిగా నెలకు సరిపోయేది కాదు. కావాలంటే ఒకటవ తేదీకి ముందే అద్దె యిస్తానని చెప్పగా ఆ తల్లి తీసుకోవడానికి నిరాకరించింది. కారణం కూడా చెప్పింది. ఒకటవతేదీ రాకమునుపే తీసుకొని వాడుకుంటే వచ్చేనెలలో ఎనిమిది రాత్రిళ్ళు ఉపవాసం వుండాల్సి వస్తుందికదా అని చెప్పింది. కష్టం అంటే అది. పగవారికి కూడ అటువంటి కష్టాలు రాకూడదు.

శారీరక కష్టానికన్నా మానసిక కష్టమును ఎదుర్కొనడం కష్టంకదా? అని నీవు ప్రశ్నించవచ్చు. అది కూడ నిజమే. కాని రెండు కష్టాలను ఏకకాలంలో అనుభవించేవారి పరిస్థితి ఏమిటి? అని నా ప్రశ్న. ఈ దేశంలో వున్న కోట్లాది నిర్భాగ్యులకన్నా మనం చాలా అదృష్టవంతులం. పూర్వజన్మ సుకృతం వల్ల మనం కడుపునిండా అన్నం తింటున్నాం. అదీ నోచుకోని నిర్భాగ్యులు అనేకమంది వున్నారు. లేనివారిని చూచి సంతృప్తి జెందడం నేర్చుకోవాలి. ఉన్నవారిని చూచి ఈర్ష్య పడరాదు. భవిష్యత్తు జన్మలో కూడ సుఖంగా జీవించడానికి కోసం ఈ జన్మలో కొంత మంచి పని చేయాలి. కృషి అత్యవసరం. ఒకే పర్యాయం **'జన్మరాహిత్యం'** సామాన్యులమైన మనకు లభించడం అంత తేలిక కాదు.

ఒకే పర్యాయం ఏ విద్యార్థి యం.ఏ. ప్యాసుకాలేడు. ప్రాథమిక విద్య, సెకండరీ విద్య, కాలేజి విద్యలు పూర్తిచేసినగాని యం. ఏ. చదవడానికి అర్హుడు కాడు. ఈ భౌతిక విద్యను నేర్చుకోవడానికే చాలా కాలం పడుతుంది. అక్షరాభ్యాసం తరువాత ఒక విద్యార్థి ఎక్కడా తప్పకుండా ప్రతి పరీక్షలో ఉత్తీర్ణుడవుతూ పోతే యం. ఏ. ప్యాసుకావడానికి 17 సంవత్సరాలు పడుతుంది. అటువంటప్పుడు అతి కష్టమైనటువంటి, క్లిష్టమైన **"ఆధ్యాత్మిక విద్య"** లో ఉత్తీర్ణుడవడం అంత తేలికైన విషయమా? అయినప్పటికి ప్రయత్నం విడువరాదు. ధృఢ సంకల్పంతో సాధించాలి గాని పిరికిపందలై ధర్మమార్గాన్ని విడనాడరాదు.

**"ధర్మం"**ను గురించి లోగడ వ్రాస్తానని చెప్పాను, కాని వ్రాయలేక పోయాను. కొంత సమాచారాన్ని ప్రోగుచేస్తున్నాను. అవకాశం వున్నప్పుడు వ్రాస్తాను. ఈ

దేశంలో కొంతమందికి తిండి కొరత, గుడ్డ కొరత, ఉద్యోగాల కొరత, డబ్బు కొరత, నాకు యిక్కడ ఉత్తరాల కొరత. అందువల్ల అన్ని విషయాలు సమగ్రంగా వ్రాయలేక పోతున్నాను. మీ బామ్మ, అమ్మ, హేమలకు, మన పిల్లలకు ధైర్యాన్ని యివ్వవలసిన దానివి నీవే గదా! నీవే ధైర్యాన్ని కోల్పోతే వారు ఏమి కావాలి? పిల్లలందరికి నా ముద్దులు. **'పిలకాగణపతి'**బాగా చదువుకుంటున్నాడని భావిస్తున్నాను.

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 29-11-1975

ప్రియమైన జయ,

నీ విషాదభరితమైన ఉత్తరం నిన్ననే అందినది. శ్రద్ధగా చదివాను. కోపం రాలేదు. జాలి వేసింది. నీ మనస్సులోనున్న బాధను, వ్యధను, ఆందోళనను కక్కివేసినందుకు సంతోషం. అది మనస్సులో పెట్టుకొని మధనపడితే ప్రమాదం. మానసికమైన ఆందోళన భౌతికమైన శరీరాన్ని కూడ కృంగతీస్తుంది. అన్నియూ తెలిసి కూడ అవివేకంలో పడుతున్నావు. చిన్న చిన్న విషయాలను గురించి పట్టించు కోవడం అంత మంచిది కాదు. అందరి మనస్తత్వాలు నీకు తెలుసు. మన మంచితనాన్ని ఒకరు కాజేయలేరు. మన మంచే మనకు గౌరవాన్ని తెచ్చిపెడుతుంది. అవివేకంతో ఒకళ్ళు మనల్ని నిందిస్తే మన మంచితనానికి కళంకం రాదు. పైపెచ్చు యినుమడిస్తుంది. సంకుచితబుద్ధితో వ్యవహరించే వాళ్ళను చూచి జాలిపడాలి. భగవంతుడు యింత చిన్నబుద్ధి వారికి ప్రసాదించినందుకు బాధపడాలి. వాళ్ళు మాట్లాడే మాటలను విని ఒక చిరునవ్వు నవ్వాలి. అంతకన్నా వాటికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వరాదు. **"దూరానవుండి ఎన్నయినా వ్రాస్తారు. మీకేమి తెలుస్తుంది. బాధపడే వాళ్ళకు తెలుస్తుందిగాని, ఉపన్యాసాలు వ్రాయడం తేలికే"** అని నీవు భావించడం కూడ సహజమే. లోగడ నాకు కూడా నీలాగానే కోపం వచ్చేది. ఇక్కడ అనేక అనుభవాలను పొందాను. అనేక పుస్తకాలలోని మహోన్నత విషయాలను అవగాహన చేసుకోవడానికి మంచి అవకాశం లభించింది. జైలు జీవితం ఆత్మపరీక్షకు ప్రోత్సహించుతుంది. సింహావలోకనమునకు మంచిఅవకాశం. భవిష్యత్తులో ఆచరణలో పెట్టగలననే విశ్వాసం కలుగుతున్నది. అభ్యాసము, ప్రయత్నము, ధృఢసంకల్పము మానవునికి అత్యవసరములు. తరువాత భగవదానుగ్రహము.

నీ ఉత్తరము చదువుతుంటే సుమతీ శతకంలోని పద్యము గుర్తుకు వస్తున్నది.

**"తన కోపమె తన శత్రువు**
**తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ**
**దన సంతోషమె స్వర్గము**
**తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ"**

ఎవరి కోపం వారికే శత్రువు అవుతుంది. నీకు కూడా అంతేకదా జరిగింది. కోపం వచ్చింది. అమాయకులైన పసిపిల్లలను కొట్టావు. నరాలు పట్టుతప్పాయి. స్పృహతప్పి పడిపోయావు. అంతేగదా జరిగింది. నీ కోపం నీకూ హాని చేసింది గదా! కనుక విజ్ఞతను ప్రదర్శించడం అవసరం. అందుకోసమే 'గీత' లో భగవానుడు **"శత్రు మిత్రులయందును, మానావమానములందును, శీతోష్ణములందును, సుఖ దు:ఖములందును, జయాపజయములందును, నిందాస్తుతులందును సమముగా నుండువారు అనగా ఎట్టి ఒడుదుడుకులకు లోనుకాకుండా స్థిరమైన నిశ్చయముగల మనుజులంటే నాకు యిష్టము"** అని చెప్పాడు. అటువంటి ధృఢసంకల్పులు మాత్రమే ఈ జీవిత నౌకలో ప్రశాంతంగా, సురక్షితంగా ప్రయాణం కొనసాగించగలుగుతారు. లక్ష్యమును చేరగలుగుతారు. అటువంటి ఉచ్ఛస్థితిని చేరుకోవడానికి ప్రయత్నించాలి. కాని చిన్న చిన్న విషయాలకు ప్రాధాన్యతనివ్వరాదు. మనస్సు పాడు చేసుకోరాదు.

జీవితం అంటే అంత సులువైన విషయం కాదు. జీవన ప్రవాహంలో సంభవించే పోరాటాలు, సంఘర్షణలు ఒక్కొక్కప్పుడు మంచిని చేకూరుస్తాయి. సంతోషాన్ని కలుగజేస్తాయి. మరొక్కప్పుడు నిరాశనుకూడా ఎదుర్కోవాల్సివస్తుంది. ఈ రెంటిని సమభావంతో చూడగలవారే నిజమైన ధైర్యశాలురు. ఈ జీవన పోరాటంలో పాల్గొనడం అందర్కి చేతకాదు. ప్రస్తుతం పరిస్థితిని గురించి ఆలోచించగా సుమతీశతకం పద్యం స్ఫురణకు వచ్చింది. ప్రస్తుతానికి ఆ విధంగా నడచుకోవటం ఒకటే తరుణోపాయం అని అభిప్రాయపడుతున్నాను.

**"ఎప్పటి కెయ్యది ప్రస్తుత**
**మప్పటికా మాటలాడి, అన్యుల మనముల్.**
**నొప్పింపక, తా నొవ్వక**
**తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ".**

ఏ సమయమున ఏది అవసరమో గ్రహించి, ఆ సమయమునందు ఆ అవసరమైన మాటలనే పలుకుచు, ఎదుటి వారి మనస్సు బాధపడకుండా, తాను కూడా బాధపడకుండా, తెలివిగా మసలుకోవడం ఒక్కటే నీవు చేయవలసిన పని. మిగతా

విషయాలు నేను వచ్చిన తరువాత మాట్లాడుకుందాం. తొందర పనికిరాదు. ఆవేశంతో ఆలోచన చేయలేము గదా! ప్రశాంతంగా ఆలోచించినప్పుడే సరైన నిర్ణయాలు గైకొనగలుగుతాం. ఆ విధంగా ఆలోచించావు కాబట్టే రెండవ ఉత్తరం విజ్ఞతతో వ్రాయగలిగావు. ఏది ఏమైనప్పటికి నీ కోసం పిల్లలకోసం నీ ఆరోగ్యం బాగా వుండాలి. మంచివారికి మంచిరోజులు తప్పకుండా వస్తాయి. ఎక్కువ కాలం పట్టదు. సత్యం జయించి తీరుతుంది.

చిరంజీవులకు -----నా ఆశీస్సులు

మీరంతా శ్రద్ధగా చదువుతున్నారని ఆశిస్తున్నాను. మీ అందరికి ఒక చిన్నకథ వ్రాస్తున్నాను. లోగడ వ్రాసిన రెండు కథలు అర్థమయ్యేవుంటాయని నమ్ముతున్నాను. ఒక గ్రామంలో ఒక బాలుడుండేవాడు. **'ఉదయ'** లాంటి **'దుడుకు'** పిల్లవాడన్నమాట. ఆ గ్రామం చుట్టూ కొండలున్నాయి. పిల్లతో ఆడుకుంటూ, ఆడుకుంటూ కొండల దగ్గరకు వెళ్ళాడు. అక్కడ చెట్లను, పరిసరాలను చూచి ఆనందంతో పెద్దగా **'ఓ'** అని కేకవేశాడు. అప్పుడు ఆ కొండవైపునుండి **'ఓ'** అని మరల పెద్ద శబ్దం ఆ బాలునికి వినిపించింది. అది విని ఆశ్చర్యపడి తననెవరో మరియొక బాలుడు వెక్కిరిస్తున్నాడని భావించాడు. కోపం వచ్చింది. **'అరే నువ్వెవడవు?"** అని మరల పెద్దగా కేక వేశాడు. అప్పుడు వెంటనే **'అరే! నువ్వెవడవు?'** అని మరల వెంటనే కేక వినపడింది. ఆ బాలునకు ఇంకా కోపం వచ్చింది. కొండల చాటున ఉండి మరొక బాలుడు వెక్కిరిస్తున్నాడని మొదటిబాలుడు భావించాడు. **'అరేయ్ నాతో కుస్తీకిరా!'** అని బిగ్గరగా కేకవేశాడు. మళ్ళీ అదేవిధముగా కేక వినపడింది. ఇంకా కోపం వచ్చి తిట్టడం ప్రారంభించాడు. మళ్ళీ అవే తిట్లు వినపడుతున్నాయి. దానికి సహించలేక మొదటిబాలుడు తనను తిడుతున్న బాలుని కోసం ఆ పరిసరాలను వెదికాడు. కాని ఎవ్వరూ కనిపించలేదు. విసుగు పుట్టింది. పౌరుషంతో ఏడుస్తూ ఇంటికి వెళ్ళి వాళ్ళమ్మతో జరిగిన కథంతా చెప్పాడు. అసలు విషయాన్ని వాళ్ళ అమ్మ గ్రహించింది. **'అబ్బాయీ! ఆ కొండ దగ్గర నిన్ను నీవే తిట్టుకున్నావు. మరెవ్వరూ నిన్ను తిట్టలేదు. అక్కడ నీవు విన్నది, నీ మాటల ప్రతిధ్వనియే గాని మరేమీ కాదు'** అని చెప్పెను. ఆ కొండలమధ్య నీవు తిట్టకుండా మంచి మాటలు మాట్లాడి వుంటే అవే మంచి మాటలు నీకు వినపడేవి అని వాళ్ళ అమ్మచెప్పింది. మనం గుళ్ళోకి పోయి గాలిగోపురం వద్ద అరచినా అదే విధంగా **'ప్రతిధ్వని'** వినపడుతుంది. దీనివలన నేర్చుకోవలసిన నీతిఒకటి ఉన్నది. మనం ఇతరుల యెడల ఎట్లు ప్రవర్తించుదుమో, మన యెడల ఇతరులు కూడా అట్లే ప్రవర్తించుదురు. మనం ప్రక్క పిల్లలతో మంచిగా మాట్లాడుతే వాళ్ళు మనతో మంచిగా మాట్లాడుతారు.

ఒకవేళ మనం ప్రక్కపిల్లలను తిడుతే వాళ్ళు మళ్లీ మనల్ని తిడుతారు. కనుకనే నోటినుండి మంచి మాటలేరావాలిగాని చెడ్డమాటలు రాకూడదు. అటువంటి మంచి పిల్లలు పెద్దవారైన తరువాత మంచి పేరును తెచ్చుకుంటారు. ఇక వుంటా......టా....టా....

ఇట్లు

'మీ'

సెంట్రల్‌జైలు , రాజమండ్రి.

ది 6-12-1975.

డియర్ జయ,

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు అందినాయి. పిల్లల ఆలోచనాసరళి నాకు తెలుసు. అది సహజం. వాళ్ల వయస్సు అటువంటిది. వాళ్ళకు ధైర్యం చెప్పడం నీ పని. ఉన్నన్నాళ్ళు ఇక్కడ వుండకపోవచ్చు. పరిస్థితులు ఏ విధంగా మారుతాయో చెప్పలేము. **'జవరాళ్ళ చిత్తముల్ క్షణ క్షణ భంగురముల్'** అన్నారు పెద్దలు. కనుక ఎప్పుడు ఎటువంటి నిర్ణయాలను గైకొంటారో! చెప్పలేము. ఈనెల 26కు ఆరునెలలు పూర్తిఅవుతాయి. అత్తగారు మళ్లీబట్టలు పెడుతుందో? లేక ఇంటికి వెళ్ళమంటుందో వేచి చూడాలి. పాపం! రాముడికి నావల్ల చాలా శ్రమ కల్గిందనుకుంటాను. స్కూలు పని హాస్టల్ పని రెండూ ఒకరే చూచుకోవడం చాలా కష్టం. అయినప్పటికీ ఓపికగా చేస్తున్నందుకు చాలా సంతోషం. హాస్టల్ వగయిరాలు నేనున్నప్పటికన్నా బాగా నడుపుతున్నందులకు కూడా చాలా సంతోషం. నా కన్నా సమర్థులు కావాలనే నాకోరిక. నాకు బరువు తగ్గుతుందన్నమాట. రెక్కలు వచ్చేంతవరకు పిల్లల్ని పోషిస్తుంది తల్లి. ఎగరడానికి వచ్చిన తరువాత తల్లి బాధ్యత తగ్గుతుంది.

**'సర్వేజనా సుఖినోభవంతు'** అన్నారు పెద్దలు'. అందరూ సుఖంగా హాయిగా వుండాలని కోరుకోవడం మన ధర్మం. అప్పుడే మనకు ఆనందం. పరుల సుఖాన్ని కోరుకోవడం మన ధర్మం. నీవు కూడ ఉత్తరాలు మంచిగా, ఆలోచనాయుతంగా వ్రాస్తున్నావు. నేను దూరంగా కొంతకాలం వుండటం మంచే కల్గిందని నా అభిప్రాయం. స్వశక్తితో ఆలోచించి, కష్టించి. పని చేయడం అలవాటుపడింది అందరికి. నేను వచ్చిన తరువాత నాకూ కొంత శ్రమ కూడా తగ్గుతుంది. నా అమూల్యమైన కాలాన్ని కొంత ఇహానికి మరి కొంత పరానికి ఉపయోగించవచ్చు. నీవు కూడ ప్రస్తుతపరిస్థితులలో, నీ ఆరోగ్యం దృష్ట్యా నీవు యిప్పుడు నిర్వహించే

పనిని చాలావరకు తగ్గించుకోవడం మంచిది. వాళ్ళు చూసుకుంటారు. బరువు బాధ్యతలు వాళ్ళమీదే వుంటాయి. కొంత నష్టపడ్డప్పటికీ బాధ్యత తెలుస్తుంది. అనుభవాన్ని గడిస్తారు. మంచి చేకూరుతుంది. నీకు కొంత విశ్రాంతి చిక్కుతుంది. ఆరోగ్యం కుదుట పడుతుంది. ఆ విరామ సమయాన్ని ఆధ్యాత్మిక చింతనలో గడుపవచ్చు. ఈ విషయాన్ని నా హృదయ పూర్వకంగా వ్రాస్తున్నాను.

నేను అక్కడికి వచ్చిన తరువాత ఒకరికి అన్యాయం గాని, శిక్షగాని చేయను, వేయను. మంచిని చేయడానికే వస్తాను. మన వల్లనే ఈ సృష్టి ఆగదు, నడవదు. భగవద్గీతలో చెప్పినట్లుగ అన్ని కర్మలు మనం చేస్తూపోతూ వుండాలి. అంటీ ముట్టనట్లుగా వుండాలి. సిరిసంపదలను నేను కోరుకోవడం లేదు. నీ ఆరోగ్యం నాకు ముఖ్యం. సిరిసంపదలు ఎప్పుడైనా సంపాదించుకోవచ్చు. కాని అవి మనల్ని సంపాదించలేవు. కనుక అనవసరమైన శ్రమ పడవద్దు. ఒకళ్ళ మాటలు పట్టించుకోవద్దు. వారి అల్ప ప్రవర్తనకు విచారించనూ వద్దు. మనం ఎవరికి లోగడ అన్యాయం చేయలేదు. భవిష్యత్తులో చేయనవసరంలేదు. చేయాలని తలంపుకూడా లేదు. కనుక మనల్ని భగవంతుడు కూడా అన్యాయం చేయడని నా నమ్మకం. కష్టాలు అంటావా? సాక్షాత్ భగవదాంశ సంభూతుడైన శ్రీరామచంద్రునికి కూడ తప్పలేదు. పరమ పవిత్రురాలైన సీతాదేవి కూడా కష్టాలను ఎదుర్కోవాల్సి వచ్చింది. ఆ కష్టాలు భావితరాలవారికి ఆదర్శవంతమైనాయి. కనుక కష్టాలను చూచి పారిపోకుడదు. పారిపోవడం ప్రారంభించుతే తప్పుకోవడం అసాధ్యమవుతుంది. ధైర్యంగా ఎదుర్కొనగల శక్తిసామర్థ్యాలను సంపాదించుకోవాలి. **"నేను ఏమీ చేయలేను. బలహీనుడను, నావల్ల ప్రయోజనం శూన్యం"** అని భావించు కోరాదు. ప్రతి వ్యక్తి ఎప్పుడో ఒకప్పుడు, ఎందుకో ఒకందుకు ఉపయోగపడి తీరుతాడు. శ్రీరామచంద్రుడు **'వారధి'** నిర్మించేటప్పుడు ఎందుకూ పనికిరాని, కొఱగాని **"ఉడుత"** సహితం తన భక్తిని ప్రదర్శించుకొని మన్ననలను పొందలేదా? **"ఉడుత"** చేసిన సహాయం చాలా కొద్దిదే కావచ్చు. అయినప్పటికీ శక్తివంచన లేకుండా చేసింది, శ్రీరాముని మెప్పును పొందగల్గింది. చేసేపని చిన్నదా? పెద్దదా? అని కాదు. మనస్ఫూర్తిగా, హృదయపూర్వకంగా చేయడం ముఖ్యం. కనుక తలచుకుంటే, పట్టుదలవుంటే ప్రతి వ్యక్తి ఎంతో ఒకంత మంచి చేయగలుగుతాడు. ఇది యదార్థం. ప్రతి వ్యక్తి తన మనస్సులోని బలహీనతలను మొదట తుడిచి వేయాలి. స్థిర సంకల్పంతో ముందుకు నడవడం నేర్చుకోవాలి. స్వశక్తి మీద ఆధారపడాలి. అప్పుడు విజయం తప్పకుండా లభిస్తుంది.

ఇక నుండి నెలకు రెండుసార్లు నన్ను చూడటానికి రావచ్చును. భార్యాపిల్లలు, సోదరులు, బావమరుదులు, తల్లిదండ్రులు రావడానికి అవకాశం వుంది. (షుమారు అరెష్టు అయిన 5నెలల తరువాత ఆత్మీయులు జైలుకు వచ్చి నన్ను చూడటానికి ప్రభుత్వం అంగీకరించింది)

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 11-12-1975

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. నీవు పడుతున్న ఆవేదన, దుఃఖం నాకు అర్థమవుతునే వున్నవి. ఏ పరిస్థితులలో నీవు అక్కడ వున్నావో, పరిసరాలు ఎటువంటివో కూడ నాకు తెలుసు. కాని ఒక్కొక్కప్పుడు పరిస్థితుల ప్రభావంవల్ల జరుగుతున్న సంఘటనలకు తట్టుకోలేక నీరసపడిపోతున్నావు. దానికి నాకు ఏమీ కోపం రావడంలేదు. నిన్ను ఒక ధైర్యంగల మనిషిగా తయారుచేయాలనేదే నా సంకల్పం.

మనం ఈ జన్మలో చేసేపనులమీద పూర్వజన్మ సంస్కార ప్రభావం వుంటుందని కొందరి నమ్మకం. అది కొంతవరకు యదార్థమే కావచ్చును. అంత మాత్రంచేత పురుష ప్రయత్నం వ్యర్థమని ఎవరూ భావించరాదు. పూర్వజన్మలో మనం చేసుకున్నదాని మీదనే ఈ జన్మ పరిస్థితి ఆధారపడి వుంటుందని భావించి మానవ ప్రయత్నం విడనాడరాదు. ప్రతి మనిషిలో1.పూర్వజన్మ సంస్కారం 2. ఇహ జన్మ పురుష ప్రయత్నం అనేవి రెండూ వుంటాయి. ఈ రెంటికి మధ్య నిరంతరం ప్రతి మనిషిలో సంఘర్షణ జరుగుతునే వుంటుంది. ఇహ జన్మలో పురుష ప్రయత్నం తక్కువైన యెడల, పూర్వజన్మ సంస్కార ప్రభావం మానవుని కప్పివేయును. కనుక ప్రతి ఒక్కరూ ఈ జన్మలో తీవ్ర ప్రయత్నం సలిపి, దైవ సంస్కారములను అభ్యసించవలెను. అప్పుడు ఒకవేళ పూర్వజన్మలో కొంత పాపం చేసినప్పటికి, యిప్పటి జన్మలో చేసిన పుణ్య ప్రభావం హెచ్చయినచో పూర్వజన్మ పాప ప్రభావం మనమీద వుండదు. రాబోయే జన్మలో పాపం చేస్తామో? పుణ్యం చేస్తామో? మనకు తెలియదు కాబట్టి తెలిసిన ఈ జన్మలోనే పుణ్యకార్యాలను ఎక్కువగా చేస్తే, వచ్చే జన్మకు కూడా కొంత ఉపయోగపడవచ్చు. ఇప్పుడు నీలో కూడ యిదే సంఘర్షణ జరుగుతున్నది.

ధైర్యంగా ఆలోచిస్తున్నప్పుడు వెనుక విషయాలు మరచిపోతున్నావు. అంతేకాదు నిన్ను ఏమీ చేయలేకపోతున్నాయి. ధైర్యం సడలేటప్పటికి పూర్వజన్మ సంస్కార ఫలితం నిన్ను ఆవరిస్తున్నది, దుఃఖిస్తున్నావు. మానసిక ఆందోళనకు గురిఅవుతున్నావు. అందువల్లనే భగవద్గీతలో ప్రతి మనిషికి మనోనిగ్రహం, నిశ్చలత్వం అవసరమని చెప్పబడింది.

అలలు సముద్రంలోనున్న పర్వతాలను ఏమీ చేయలేవు సూర్యుని, మెరుపులు, పిడుగులు, వర్షం బాధించలేవు. ఏనుగును కుక్కలు ఏమీ చేయలేవు. అదేవిధముగా జీవితంలో సంభవించే అవాంతరాలు ధైర్యశాలిని ఏమీ చేయలేవు. విశ్వకవి రవీంద్రనాథ్‌టాకూర్ జీవితం ఏవిధంగా వుంటుందో, ఏవిధంగా నడుచుకోవాలో చక్కగా చెప్పాడు. **"ఏకాకి గానే పయనించాలి. నీ పోరాటాలతో (జీవితంలో సంభవించే) నీవు రాజీపడుతే, తాత్కాలికంగా, భౌతికంగా కొంత సంతృప్తి కలుగవచ్చు. నీలోని సృజనాకాంక్షలు అణచివేసుకుంటే శాశ్వతానందం మాత్రం నీకు లభించదు. దానివల్ల భావితరాలు నష్టపోతాయి"** అని అంటాడు. జీవితం నిజంగా విచిత్రమైనది. అంతేకాదు అనేక కవ్వింపులతో, సంఘర్షణలతో కూడుకొని వుంటుంది. జీవిత సమరంలో మానవుడు అనేక వేదనలను, బాధలను ఎదుర్కొనవలసి వస్తుంది. విభిన్న మనస్తత్వాల వ్యక్తులు తారసిల్లుతుంటారు. అనుకోని ఊహించని సంఘటనలు జరుగుతుంటాయి. ఒకే వ్యక్తిని ఒకరు ద్వేషిస్తారు. మరొకరు ప్రేమిస్తారు. ఎవరు ఎందుకు ద్వేషిస్తారో, ఎందుకు ప్రేమిస్తారో చెప్పడం కష్టం. విచిత్రమైన అనుభూతులను పొందుతాం. ఒక్కొక్కప్పుడు అనేక కష్టనష్టాలకు గురి అవుతుంటాం. మరొకప్పుడు భోగభాగ్యాలను అనుభవిస్తాం. అంతమాత్రంలో నిరాశ నిస్పృహలు చెందరాదు. ఉబ్బితబ్బిబ్బైపోరాదు. ఒకటే మాత్రం వాస్తవం. **"నిజం నిద్రపోదు! న్యాయానికి నశింపులేదు! మంచికి మరణం లేదు! సత్యానికి చావులేదు"**. కాని జీవితంలో అడుగడుగునా చెలరేగే పెనుతుఫానులు, దుమారాలు, వడగాలుల తాకిడికి తాత్కాలికంగా తలవగ్గి మనకు కనిపించకపోయినా, కాలభ్రమణంలో చిరస్థాయిగా నిలబడి తాము నిర్దోషులమని ఋజువు చేసు కుంటాయి. అబద్ధం, అన్యాయం, అవినీతి, అసత్యం, చెడులకు ప్రస్తుత సంఘంలో తాత్కాలికంగా గౌరవం, మర్యాదలు లభించినట్లుగా, నిజం, న్యాయం, నీతి, సత్యం, మంచిలకు లభించకపోవచ్చును. ప్రజానీకం చేత అంతత్వరితంగా గుర్తించపడక పోవచ్చును. కారణం? తరతరాల నుంచి స్వార్థపరుల విష కబంధ హస్తాలలోపడి, నలిగి, మణిగి, చితికిన మానవహృదయాలకు నిజం ఏదో?! అబద్ధం ఏదో?! న్యాయం ఏదో?! అన్యాయం ఏదో?! నీతి ఏదో?! అవినీతి ఏదో?! సత్యం ఏదో?!

చిన్నకథ :

చిరంజీవులకు - ఆశీస్సులు

ఒక గ్రామంలో ఒక బాలుడు వుండేవాడు. అతని పేరు 'శ్యాం' వాళ్ల నాన్నగారితో అప్పుడప్పుడు పొలానికి వెళ్ళుతుండేవాడు. ఒకరోజున వరి పొలానికి వెళ్ళాడు. వారిద్దరూ గట్టుననడుస్తూ పొలాన్ని చూస్తున్నారు. ఆ పొలంలో కొన్ని వరి కంకులు నిటారుగా వుండి పైకి కనపడుతున్నాయి. మరికొన్ని కంకులు వంగి వ్రాలిపోయి వున్నాయి. ఆ పిల్లవాడికి ఆశ్చర్యంవేసింది. అప్పుడు బాలుడు **"నిటారుగా వున్న కంకులు మంచివా? లేక వంగివున్న కంకులు మంచివా"?** అని వాళ్ల నాన్నను అడిగాడు. అప్పుడు వాళ్ల నాన్నగారు ఆ అబ్బాయిని వంగివున్న కంకి ఒక దానిని, నిటారుగావున్న కంకిని ఒకదానిని కోసుకొని రమ్మనమని చెప్పారు. అదేవిధంగా ఆ బాలుడు రెండు రకాల కంకులను కోసి తీసుకొని వచ్చి వాళ్ల నాన్నకు యిచ్చాడు. వాళ్ల నాన్నగారు ఆ రెండు కంకులను విడివిడిగా కొట్టి ఆ బాలునికి చూపించాడు. నిటారుగా పైకి కనపడుతూవున్న కంకిలో అన్నీ తప్పలేవున్నాయి. అనగా అన్నీ తాలుగింజలు అన్నమాట వంగివున్న కంకిలో గట్టి గింజలువున్నాయి. తాలు తప్పలవల్ల మనుష్యులకు ఉపయోగం వుండదు. గట్టి గింజలవల్లనే ఉపయోగం. ఆ రెంటిని చూపించి వాళ్ల నాన్నగారు ఒక **"నీతి"**ని చెబుతారు. 1. లోకంలో చాలామంది ప్రజలు డాబుసరిగా, బడాయిలు చెప్పుకుంటూ, తలెత్తుకొని కాలర్ పైకి లేపుకొని విర్రవీగుతూ తిరిగే మనుష్యులు నిటారుగా పొలంలో పైకి కనపడే కంకులలాంటి వాళ్ళు. పైకి కనుపించే కంకులలో ఏవిధంగా తాలు, తప్పగింజలు వుండునో, డాబ్సరీకొట్టేవాళ్లవద్ద కూడా లోపల ఏమీ సరుకు వుండదు. అంటే వాళ్ళు చదువు సంధ్యలు లేనివారని అర్థం. 2. ఇకపోతే బాగా చదువుకొని అన్ని విద్యలూ నేర్చుకొనినవారు వంగిపోయిన కంకిలాంటివారు. అన్నీ వున్న విస్తరి అణిగి,మణిగి వుంటుంది. బాగా చదువుకుంటూ మంచి మార్కులు తెచ్చుకొనేవారికి గర్వం వుండదు. వినయవిధేయతలతో అందరి మెప్పును పొందుతారు. ఏమి లేని విస్తరి ఏవిధంగా ఎగిరెగిరి పడుతుంటుందో మొద్దులు కూడా అదేవిధంగా విర్రవీగుతుంటారు. అంటే మేడిపండులాంటి వారన్నమాట. మేడిపండు పైకి చూడటానికి బాగా వుంటుంది. **'పొట్టవిచ్చి చూడ పురుగులుండు'**. కనుక మీరందరూ పైపై అలంకారాలకు ప్రాముఖ్యత యివ్వకుండా మంచి విద్య నభ్యసించాలి. వినయ విధేయతలతో పెద్దల మెప్పును పొందాలి. కనుక మీరందరూ ఈ క్రింది వేమన శతకం పద్యమును కంఠస్థం చేసి అర్థం చేసుకోవాలి.

**"మేడిపండు చూడ మేలిమైయుండును**
**పొట్ట విచ్చి చూడ పురుగులుండు**
**పిరికివాని మదిని బింకమీలాగురా**
**విశ్వదాభిరామ వినురవేమ."**

మీ అందరికీ మంచి మార్కులు వచ్చినందులకు చాలాసంతోషం. మరియు అందరూ ఉత్తరాలు వ్రాసినందులకు మిక్కిలి సంతోషం. 'శ్యాం','ఉదయ్' వ్రాతబాగాలేదు. ఉత్తరములు వ్రాసేటప్పుడు తప్పులుండరాదు. 'writting' బాగుండాలి. 'writting' బాగుంటేనే పరీక్షలలో మార్కులు ఎక్కువ వేస్తారు. కనుక మంచిగా కుదురుగా వ్రాయడం నేర్చుకోండి. ఇక వుంటా. టా!..టా...

ఇట్లు
"మీ"

సెంట్రల్‌జైలు, రాజమండ్రి.
ది. 17-12-1975

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. నీ ఆరోగ్యం నానాటికి దిగజారి పోతున్నందుకు విచారంగా వున్నది. నా ఆరోగ్యం ఒక్కటే కాదు ప్రధానం. అందరి ఆరోగ్యం బాగుంటేనే ఆనందం. కాలి గోరు దెబ్బ తిన్నా శరీరం మొత్తం బాధపడుతుంది. అన్నీ తెలిసి కూడా అయోమయంలో పడుతున్నావు. నా ఉత్తరాల వల్ల నీకు ప్రయోజనం చేకూరుతున్నదనే నమ్మకం నానాటికి సన్నగిల్లుతున్నది. నీకేమీ ఫరవాలేదు. కీకారణ్యములో వదలినా సాహసంతో బయటపడగలవనే నమ్మకం నాకున్నది. హేమ పెళ్లి మీ నాన్నగారు పోయిన సంవత్సరంలోపు చేయాలి గదా! దానికి ప్రయత్నాలు చేయగలరు.

ఇకపోతే 'మాధురి' విషయం సలహా అడిగావు. అమె కష్టసుఖాలు ఆమె ఆలోచించుకోవాలి. నా యొక్క అభిప్రాయాన్ని 'మాధురి' కోరింది కాబట్టి వ్రాస్తున్నాను. **"పుస్తకం వనితా విత్తం పర హస్తం గతం గతః-అథవా పునరాయాతి జీర్ణం. భ్రష్టాచ ఖండశః"** అనే నీతిని మరువకుండా వుంటే ఎక్కడికి పోయినా ఫరవాలేదు.

**"ఆత్మ బుద్ధిస్సుఖంచైవ, గురుబుద్ధిర్వి శేషతః, పరబుద్ధిర్వినాశాయా, స్త్రీబుద్ధిః ప్రళయాంతకః,"** అనే నీతి శ్లోకాన్ని కూడ మరవరాదు. ప్రస్తుత ఆర్థిక పరిస్థితులలో మంచి జీతం యిచ్చేట్లయితే **"సూపర్ బజార్"** మంచిదే. కాని బాధ్యతతో కూడుకొని

వుంటుంది. అక్కడ ఏ లోపాలు జరిగినా "సేల్సుమన్" మీద పడుతుంది. చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. దానికన్నా ముఖ్యం మెట్రిక్ పాసవడం, దానితోపాటు మిగిలిన హిందీ పరీక్షలు కూడా పూర్తిచేస్తే మంచి "టీచర్" ఉద్యోగం వస్తుంది. జీవితాన్ని సుఖంగా గడపవచ్చు. అయితే రెండు సంవత్సరాలు కృషిచేయాలి. అప్పటిదాకా మనవద్దనే వుండవచ్చు. ఒక్క "మాధురి" విషయంలోనేకాదు, కష్టాలలో, యిబ్బందులలో వున్న వారందర్నీ ఒక దరికి చేర్చడం మన ధర్మం. నా అభిప్రాయం యిది. వాళ్ల అమ్మను కూడా అడిగి ఆలోచించి ఏది మంచిదని తోస్తే అది చేయమను. పిల్లలందర్కి నా ఆశీస్సులు, నీవు వచ్చేటప్పుడు గిరీశాన్ని కూడా తీసుకొని రాగలవు. వుంటా-----

ఇట్లు

"నీ"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 24-12-1975

ప్రియమైన జయ,

నీవు వ్రాస్తున్న ఉత్తరాలు అందుతున్నాయి. నీ మనస్సులోని అభిప్రాయాలు వివరంగా వ్రాస్తున్నందుకు సంతోషం. జైలు జీవితం మానవుని జీవిత యాత్రలో ఒక మలుపు. పూర్వాపరాలు చర్చించుకొని, అవగాహన చేసుకోవడానికి యిది ఒక మంచి అవకాశం. ఆరోగ్యాన్ని అభివృద్ధి పరచుకోవడానికి, మానసికాభివృద్ధికి ఉపకరిస్తుంది. కాని **"పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణసంకటం"** అన్నట్లుగా జైలులో వున్నవాళ్లకు (సద్వినియోగపరచుకుంటే) మంచి అవకాశం. వాళ్ల మీద ఆధారపడ్డ వారికి మాత్రం తద్విరుద్ధం. అది ఎప్పుడూ సహజమే. ప్రపంచంలో కొన్ని దేశాలకు పగలు, అదే సమయంలో మరికొన్ని దేశాలకు రాత్రి, కొంతమందికి తింటే ఆయాసం, తినకపోతే నీరసం. కొంతమందికి తినడానికి తిండిలేక బాధ, మరికొంత మందికి డబ్బు ఎక్కువై ఎలా దాచాలో తోచక యిబ్బంది ఇదే విచిత్రం. ప్రజలకు అర్థంకాని విషయం. అయినప్పటికి జీవన ప్రయాణాన్ని కొనసాగించ వలసినదే. ఇక వుంటా.

ఇట్లు

"నీ"

సెంట్రల్‌జైలు, రాజమండ్రి

ది. 2-1-1976.

ప్రియమైన జయ,

ఈ మధ్య ఒక సంస్కృత పండితులు గారికి కూడా మాతో వుండే అవకాశం లభించింది. వారిపేరు శ్రీ సూరి సుబ్రమణ్యంగారు. సంస్కృతం నేర్చుకోవడం ప్రారంభించాం. నిజంగా విద్యార్థి జీవితంగానే వున్నది. నీకు తెలుసుగదా! నేను దేనిలో పడితే దానిలో అంతం చూడందే వదిలే స్వభావం కాదు గదా! నీ ఉత్తరం చూచి చాలా సంతోషించాను. **"మనం ఎవరికీ అన్యాయం చేయలేదు. అవసరమైతే మనమే కష్టాలను ఎదుర్కొందాం"** అని లోగడ నీకు ఒక పర్యాయం వ్రాశాను. ఆలస్యం గానైనా సరే మన మంచిని గ్రహించకపోరు. కానీ అంతవరకు ఓపిక మాత్రం వుండాలిగదా! హేమ పెండ్లి లగ్నం మార్చిలో పెట్టించగలవు. అవకాశం యిస్తే **'పెరోల్'** లో వస్తాను. సుదీర్ఘమైన ఉత్తరాలు వ్రాసే అవకాశం కుదరటంలేదు. సంస్కృతాధ్యయనంలో పడ్డాను గదా ! ఇక వుంటా........

ఇట్లు

"నీ"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 7-1-1976.

ప్రియమైన జయ,

నాకు అత్తగారు క్రొత్త బట్టలు పంపించారు. ప్రతి ఆరునెలలకురు.50/ల కిమ్మత్తు చేసే బట్టలు ప్రభుత్వం యిస్తుంది. ఆరునెలలు నిండి 7వ నెలలో అడుగు పెట్టాంగదా! బట్టలు యిచ్చారని సంతోషిస్తున్నారా? అని నీవడగవచ్చు. సంతోషించడం లేదు గాని విచారించడం పిరికివాడి లక్షణంకదా! పిరికివాళ్లు ధ్యేయాన్ని చేరుకోలేరు. ధైర్యవంతులు మాత్రమే కష్టాలను ఎదిరించగలుగుతారు. ఇదే సత్యాన్ని మనచరిత్ర, పురాణాలు ఋజువు చేస్తున్నాయి. మహాపురుషులు, ధైర్యశాలురు సంపదలను, ఆపదలను సమభావంగా చూడగలుగుతారు. ఈ విషయమై చక్కటి నీతి శ్లోకం ఒకటి వ్రాస్తున్నాను.

**"సంపత్తె చ విపత్తె చ మహతామేకరూపతా**
**ఉదయె సవితా రక్తోరక్తశ్చాస్తమయేతధా"**

అనగా మహాపురుషులు సంపదలు వచ్చినప్పుడును, ఆపదలు సంభవించినప్పుడును ఒకే విధంగా వుందురు. అనగా సంపదలకు ఉబ్బితబ్బిబ్బుకారు. ఆపదలకు విచారంతో క్రుంగిపోరు. సూర్యభగవానుడు ఉదయించేటప్పుడు, అస్తమించేటప్పుడు, రెండు వేళలయందును ఎఱ్ఱగానే ఉండును. కనుక సూర్య భగవానుని ఆదర్శంగా గైకొని కష్ట సుఖములయందు సమభావంతో వుండవలెను. అట్టివారే విజయలక్ష్మిని చేబట్టగలుగుతారు. ఇకవుంటా...

ఇట్లు

" నీ"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 8-1-1976.

ప్రియమైన జయ,

ఈ మధ్య ఉత్తరాలు వ్రాయడానికి సమయం చాలటం లేదు నిజంగానే తీరిక లేదు. **'గానుగ ఎద్దు తిరిగినట్లుగా'** తిరుగుతున్నాను. ఏదో ఒక పని కల్పించుకోవాలి గదా! మిమ్ముల నెవర్ని ముఖ్యంగా నిన్ను మరచిపోలేదు. 17 సంవత్సరాల సాంగత్యాన్ని ఒక్క ఆరునెలలలో మరచిపోగలనా ! నీవు అనవసరంగా ఎక్కువ ఆలోచించి మనస్సు పాడుచేసుకుంటున్నావు. జీవితంలో సంభవించే విపత్తులకు భయపడి పారిపోవడం, మనస్సు చలించడం పిరికివాళ్ల లక్షణం. వాటిని ఎదుర్కోవడం ధైర్యవంతుల లక్షణం. ధైర్యం కలవానికి అపజయం అనేది వుండదు. ప్రతి మనిషికి ఒక ధ్యేయం వుండాలి. దానిని సాధించడానికి అవసరమైన ధైర్యం కూడా వుండాలి. జీవిత సమరంలో నెగ్గాలంటే **"ధ్యేయం - ధైర్యం"** రెండూ వుండాలి.

మన భరతమాత గొప్పతనాన్ని కొంత వివరిస్తాను. ప్రపంచానికి మన భారతదేశం ఆధ్యాత్మిక బిక్షను ఏనాడో పెట్టింది. ఇతర దేశాలలోని ప్రజలు ఆకులలములు తిని బ్రతుకుతున్న దశలో, గోచీ కూడ పెట్టుకోవడం తెలియని స్థితిలో, మనిషిని మనిషి తినే రోజులలో భారతదేశంలో నాగరికత ఉచ్ఛస్థితిలో నున్నది. ప్రపంచానికి అత్యున్నతమైన జ్ఞానబోధను చేయగలిగింది. నాగరికతను వెదజల్లింది. దురదృష్టవశాత్తు విదేశీ దండయాత్రల మూలాన మధ్యలో మన అభివృద్ధి కొంత కుంటుపడింది. ఎప్పుడో వేదకాలంలో చెప్పిన విషయాలు, ఉపనిషత్తులలో పేర్కొన్న వాస్తవాలు యిప్పుడిప్పుడే ప్రపంచం తెలుసుకుంటున్నది. ఆ విషయాలమీద **"సైంటిష్టులు" "రీసెర్చి"** ప్రారంభించారు. వాటిలోని గొప్పతనాన్ని

అవగాహన చేసుకుంటున్నారు. ప్రస్తుత సమాజానికి అవి చాలా అవసరమని భావిస్తున్నారు.

ఈ మధ్య ఒక పత్రికలో ధ్యానయోగం గురించి చదివాను. దీని ప్రాముఖ్యతను గురించి మన ఋషులు ఏనాడో చెప్పారు. భగవద్గీతలో **'ధ్యానయోగం'** మీద అనేక విషయాలు వ్రాయబడినాయి. స్వామి వివేకానంద **'ధ్యానయోగం'** మహిమను గురించి ప్రపంచానికిచాటారు. నవనాగరికులమనీ, అభ్యుదయవాదులమని భావించి విర్రవీగే విద్యావంతులలో చాలామంది **"ధ్యానయోగం"** అనగానే అదేదో సనాతనులు చెప్పే ఛాందస ప్రక్రియయని, అరణ్యాలలో ఏకాంతంగా కూర్చొని ముక్కుమూసుకొని పనిలేనివాళ్ళు చేసేపని అని వెక్కిరించేవారు. కానీ ఈనాడు పెద్ద పెద్ద సైంటిష్టులు, ఈ విషయాలమీద **'రీసెర్చి'** ప్రారంభించారు. అమెరికా లాంటి సంపన్న దేశాలలోని ధనవంతులకు నిద్రపట్టడం లేదు. ఏమిచేయాలో తోచక నిద్రమాత్రలు మింగుతున్నారు. మత్తు పదార్థాలకు అలవాటు పడుతున్నారు. అయినప్పటికీ మనస్సుకు మనశ్శాంతి చేకూరటంలేదు. రకరకాలైన విచిత్ర రోగాలకు గురి అవుతున్నారు. కొత్త మందులను కనిపెడుతున్నారు. కానీ ప్రయోజనం కనపడటంలేదు. ఆయా దేశాలలోని శాస్త్రజ్ఞులు భారతదేశంలోని వేదాలను, ఉపనిషత్తులను, పురాణాలను పరిశీలిస్తున్నారు. **'ధ్యానయోగం'** మహిమను అర్థం చేసుకుంటున్నారు.

అమెరికాలోని ఫెయిర్ ఫీల్డుకు చెందిన శాస్త్రజ్ఞుడు, ఇంటర్ నేషనల్ యూనివర్‌సిటీ ప్రెశిడెంట్, ఫిజియోలజీ ప్రొఫెసర్ అయిన డా. రాబర్టు కేన్ వెలెన్ మరియు హార్వర్డు కెన్సన్‌లు తీవ్ర పరిశోధనలు జరిపి **"రెండు రాత్రుల నిద్రవల్ల కలిగే విశ్రాంతి ఎంతో, అది ఇరవైనిముషాలపాటు ఆచరించే ధ్యానంవల్ల లభ్యంకాగలదు."** అని తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. నేడు విదేశాలలో అనేక చోట్ల **'ధ్యానయోగం'** నేర్పే విద్యాలయాలు వెలుస్తున్నాయి. **'యోగాభ్యాసం'** మీద మోజు పెరుగుతున్నది. **"యోగాసనాలు"** వేసే విదేశీయుల సంఖ్య పెరుగుతున్నది. ఈ శాస్త్రం మీద మోజు విదేశాలలో నానాటికి పెరిగిపోతున్నది. వీటికి పుట్టినిల్లయిన మన దేశంలో మాత్రం ఆచరణ తగ్గి పోవడం నిజంగా దురదృష్టకరం.

మనం ధ్యానంలో నిమగ్నమైనప్పుడు ప్రాణవాయువు అవసరం చాలా తగ్గిపోతుంది. శరీరంలోని అవయవాలు పనిచేయనవసరం ఉండదు. రక్తనాళాలన్ని క్రియాశూన్యమైపోతాయి. ధ్యానసమయంలో శ్వాస అవసరం కూడా తగ్గిపోతుంది. మామూలు స్థితిలో వున్న మనిషి మెదడులోని ఆలోచనా తరంగాలకు, ధ్యానసముద్రంలో వున్నప్పటి మనిషి ఆలోచనలకు ఎంతో

వ్యత్యాసముంటుంది. ధ్యానంవల్ల మనిషిలో పరిపక్వత, భావములలో ఒక నిశ్చలత ఏర్పడుతుంది. శరీరానికి అవసరమైన విశ్రాంతి ఏర్పడుతుంది. మనశ్శాంతి లభిస్తుంది.

హవాయి యూనివర్‌సిటీలో కాలియర్, షీటన్, జాన్సన్ అనేవారు ధ్యానయోగాన్ని గురించి ఎన్నో పరిశోధనలు జరిపి, **"ఈ ధ్యానయోగం అవలంబించే విద్యార్థులలో స్మరణశక్తి, జిజ్ఞాసాప్రవృత్తి పెరుగుతుంది. మత్తుపదార్థముల యెడల విరక్తి కలిగి సేవించడం మానుకుంటారు"** అని చెప్పారు. 1968 సం॥ నుండి 1973 సం॥ వరకు రెండు లక్షలమంది విద్యార్థులు ఈ ధ్యానయోగమును అభ్యసించి అమలు జరపడం ప్రారంభించారని, ఒక్క అమెరికాలోనే ప్రతి మాసం 14 వేలమంది విద్యార్థులు దీనిని సాధన చేస్తున్నారని వీరు ప్రకటించారు.

ఇటీవల ఢిల్లీలో జరిగిన ఇంటర్‌నేషనల్ ఫిజియోలజీ కాంగ్రెస్ 26వ మహాసభలో డా॥ కేన్ వెలెన్ మాట్లాడుతూ**"మానసిక వికాసంతో పాటు, మనిషి వ్యక్తిత్వాన్ని సహితం ఈ ధ్యానయోగం పెంపొందింపజేస్తుంది. వినమ్రత వస్తుంది. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. కార్యదక్షత అభివృద్ధి జెందుతుంది. మద్యం, సిగరెట్ల యెడల హేయభావం కలుగుతుంది. ఉద్రేకాలు, ఆవేశకావేశాలు అంతరిస్తాయి. హింసాప్రవృత్తిని విడనాడటం జరుగుతుంది. నిద్రపట్టక పోవటం అంటూ వుండదు. గుండె జబ్బు, రక్తపుపోటులతో బాధపడటం తగ్గిపోతుంది"** అని చెప్పారు. న్యూమెక్సికోలో ఖైదీలకు ధ్యాన యోగం నేర్పి పరిశోధన చేయగా రెండు మాసములలో వారి మానసిక పరిస్థితులలో ఎంతో మార్పు వచ్చినట్లు తెలిసింది. ఇలాగే మత్తు పదార్థములు బాగా సేవించే 1862 మంది వ్యక్తులను 20మాసాలపాటు ధ్యానాభ్యాసం చేయించారట. ఆ తరువాత వాళ్ళకు మత్తు పదార్థముల మీద విరక్తి కలిగి వాటిని సేవించడానికే నిరాకరించారుట. హార్ట్ ఫోర్డు ఇనిస్టిట్యూట్ ఆఫ్ లివింగ్ డైరెక్టర్ **"ధ్యానయోగం మెంటల్‌ట్రీట్‌మెంటుకు ఎంతో ఉపయోగకరమైనది "** అని చెప్పారు.

హార్‌వర్డ్ యూనివర్సిటీకి చెందిన డా॥శార్వటోజ్ ధ్యానయోగమనేది అత్యంత సహజమైనదనీ, లాభదాయకమైనదని, ఆటవిక జాతికి చెందినవారు ప్రతిరోజూ ప్రశాంతంగా కళ్ళుమూసుకుని కదలకుండా కొంతసేపు చెట్టుమీద కూర్చుంటారని, కోతులు కూడా రోజూ కొంతసేపు మౌనంగా కూర్చుంటాయని చెప్పారు. ఆ విధంగా ధ్యానయోగము, యోగశాస్త్రములను గురించి పరిశీలించి, పరిశోధించి, ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తలు తమ అభిప్రాయాలను వెలిబుచ్చుతున్నారు.

పొరుగింటి కూర పుల్లగా వుంటుందిగదా ! మనపూర్వీకులు మహర్షులు చెబితే ఛాందసంగా భావిస్తున్నారు, ఈనాడు మన నవనాగరికులు. ఇతర

దేశీయుల సైంటిప్టులు పరిశోధనలు సలిపామని చెప్పి అవే విషయాలను ప్రకటిస్తుంటే ఎంతో ఆసక్తితో మనవారు స్వీకరిస్తున్నారు. విదేశీ పత్రికలమీద మనవాళ్ళకు మోజు పెరుగుతున్నది. మన భారతదేశంలో ఏనాడో నాగరికత విలసిల్లింది. ఎంతో దూరదృష్టితో మన మహర్షులు అనేక విషయాలు వెల్లడిచేశారు. పై విషయాలను గమనిస్తే మన పూర్వీకుల మేధస్సు ఎంతటిదో ఋజువవుతున్నది. అనేక విషయాలమీద మన దేశంలో ఏనాడో **"రిసెర్చి"** జరిగింది. అయితే దేనికైనా ప్రచారం కావాలిగదా! ఇక వుంటా......

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 13-1-1976.

ప్రియమైన జయ,

1973 జనవరిలో ఆంధ్రోద్యమ సమయంలో ఇదే జైలులో వున్నాను. మళ్ళీ యిప్పుడు ఇక్కడ వుంటున్నాను. కాలచక్రం వేగంగా తిరిగి పోతున్నది. 40సంవత్స రాల జీవితంలో సాధించింది ఏమిటి? ఈ ప్రశ్నకు పూర్తిగా సమాధానం లేకపోయినప్పటికీ, దేశంకోసం, ప్రజల హక్కులను కాపాడటాని కోసం కొంత వరకైనా చేసాననే సంతృప్తి మాత్రం వున్నది. అయితే ఇంకా చేయవలసింది చాలావున్నది. చేయాలని కోరిక కూడా వున్నది. అయితే ప్రస్తుతానికి ఆ అవకాశం లేదుగదా! జైళ్లకు వెళ్లడం కొంత మంది దృష్టిలో నీచమైనది. ఒక ఆశయ సిద్ధి కోసం జైలుకు రావడం గౌరవప్రదమైన విషయమేనని నా అభిప్రాయము. ఈ భావంతో అందరూ ఏకీభవించక పోవచ్చును. ఏకీభవించినా, ఏకీభవించక పోయినా న్యాయమార్గాన్ని విడనాడటం విజ్ఞత లక్షణం కాదు. ధీరుల పంథా అంతకన్నాకాదు. ఇబ్బందులు, కష్టాలు అంటావా? శ్రీరామచంద్రుడంతటి వానికే తప్పలేదు. కొంత మందికి కష్టాలు వాటంతటవే వచ్చి మీద పడుతుంటాయి. మరి కొంత మంది కష్టాలు కావాలని కోరుకుంటారు. శ్రీరామచంద్రుడు తండ్రి ఆజ్ఞను శిరసావహించడానికి అడవుల పాలైనాడు. లక్ష్మణుడు మాత్రం కష్టాలు కోరి తెచ్చుకున్నవే.

సహజంగా మన ఇండ్లలో జైళ్ళకు గాని, దూర ప్రదేశాలకు గాని ఎవరైనా వెళ్తుంటే,తల్లి తండ్రులు భార్యా పిల్లలు విలపిస్తారు. కాని లక్ష్మణుని తల్లి సుమిత్ర

మాత్రం ఆ విధంగా చేయలేదు. ఎంతో హుందాతనంగా ప్రవర్తించింది. అడవులలో 14 సం॥లు ఉండాలని తెలిసి కూడా ఏమాత్రం విచారించక, శ్రీరామునితో లక్ష్మణుని పంపడానికి అంగీకరించింది. అంతేకాదు. వెళ్ళేటప్పుడు లక్ష్మణునికి అత్యున్నతమైన నీతిని కూడా బోధించింది. ఆమె అప్పుడు చెప్పిన మాటలను తలచుకుంటుంటే శరీరం గగుర్పొడుస్తుంది. ఆశ్చర్యం వేస్తుంది. ఆనందం కూడా కల్గుతుంది. అంతే కాదు ఆ వీరమాతకు హృదయ పూర్వకంగా జోహారు లర్పించాలని, అభినందించాలని అన్పిస్తుంది.

**"రామం దశరథం విధి**
**మాం విద్ధి జనకాత్మజాం**
**అయోధ్యాం అటవీం విద్ధి**
**గచ్ఛ తాత యధా సుఖమ్"**

అనగా, శ్రీరాముని దశరధునిగా భావించుము. (తన తండ్రిగ్రా) సీతను నన్ను (సుమిత్ర)గా భావించుకొనుము. అడవిని అయోధ్యగా భావింపుము. అబ్బాయీ! అంతా సుఖముగా భావించి వెళ్ళుము. అని తల్లియైన సుమిత్ర అడవులకు వెళ్ళేటప్పుడు లక్ష్మణునితో చెప్పిన మాటలు ఇవి. అడవిలో అష్టకష్టాలను అనుభవించాల్సి వస్తుందని ఆమెకు పూర్తిగా తెలుసు ఐనప్పటికి పుత్రశోకాన్ని కూడా దిగమ్రింగి లక్ష్మణుని అడవికి పంపించింది సుమిత్ర. మరొక చెంప భరతునికి రాజ్యం సంక్రమించినా దానిని అనుభవించడానికి అతను సుతరామూ ఇష్టపడలేదు. శ్రీరాముని పాదుకలను తెచ్చి వాటికి పట్టాభిషేకం చేసి, అయోధ్యలో అడుగు పెట్టకుండా సకల రాజభోగాలను త్యజించి, నారబట్టలను ధరించి, నంది గ్రామములో మకాం పెట్టి, కందమూలాదులను మాత్రమే తింటూ శ్రీరామప్రతినిధిగా పదునాలుగు సంవత్సరాలు రాజ్యం చేసి, చివరకు శ్రీరామచంద్రునికి రాజ్యాన్ని ఒప్పగించిన మహాత్యాగి భరతుడు. త్యాగం అంటే అది. అందువల్లనే, రామాయణాన్ని ఒక మహా నీతి కావ్యంగా భావించి ప్రజానీకం దానిని నేటికి గౌరవిస్తుంది.

భారతీయ సంస్కృతి, పరంపర, సంప్రదాయాలంటే పడనివారు, విదేశీ వ్యామోహంలో పడి వారిని గ్రుడ్డిగా అనుకరించే ప్రబుద్ధులకు మాత్రం రామాయణం అంటే, ఇష్టం లేకపోవచ్చు. అట్టివారు రామాయణం పూర్తిగా చదివి అవగాహన చేసుకొనకుండానే, విమర్శిస్తుంటారు. ఎంతో మంది రామాయణాన్ని కించపరుస్తూ ఎన్నో పుస్తకాలు వ్రాసినవారు కూడా ఉన్నారు. ఈ మధ్యనే శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మగారి **"రామాయణ విషవృక్షం"** కూడా వెలువడింది. మంచి పనిచేసి ప్రజల చేత మెప్పును పొందడం చాలా కష్టం. ఏదో ఒక చెడు చేస్తే తేలికగా,

త్వరగా అందరి నోళ్లలో పడవచ్చును. మహాత్మాగాంధి యొక్క గొప్పతనం ఆయన ఎన్నో సంవత్సరాలు కృషి చేస్తేనేగాని అందరికి తెలియలేదు. ఒక నియమబద్ధమైన, నిరాడంబరమైన ఆదర్శవంతమైన జీవితాన్ని గడపడం వల్లనే ఆయనను ఈనాటికీ మహాత్మునిగా ప్రజలు కొలుస్తున్నారు. మహాత్మాగాంధీజీకి కీర్తి ప్రతిష్టలు రావడానికి ఎంతో కాలం పట్టింది. ఎన్నో సంవత్సరాల పాటు ప్రజలకోసం పోరాటం సలపవలసి వచ్చింది. ఐతే ఆ మహాత్ముని కాల్చిచంపిన "గాడ్సే" మాత్రం ప్రపంచానికి ఒక్క క్షణంలో పరిచితుడైనాడు. ఐతే ఇక్కడ ఒకటి మనం గమనించాలి. మంచికి ఉన్న విలువ, చెడుకు మాత్రం లేదు. మంచి చేసేవారికన్నా, చెడు చేసేవారికి పేరు త్వరగా రావచ్చును. కాని మన సమాజం గౌరవించదు. మంచినే ఆహ్వానిస్తుంది ఐతే, మంచి చేసే వారికి కష్టాలు తప్పవు. ఎప్పుడో, ఏకాలంలోనో శ్రీరామచంద్రుడు ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపి ప్రజలకు ఆదర్శపురుషుడైనాడు. అందువల్లనే, మారుమూలనున్న కుగ్రామములలో, గుడిసెలలో నివసించే అతి పేదవానికి కూడా శ్రీరాముడు తెలుసు. రామనామము స్మరించనిదే అతడు నిద్రపోడు. ప్రజలందరూ ఆయనను పూజించాలని ఎన్నడూ శ్రీరామచంద్రుడు కోరుకోలేదు. నిష్కామకర్మను ఆచరించాడు. ఫలితాన్ని ఆశించలేదు. అందువలననే ప్రజలకు గౌరవనీయుడైనాడు, పూజనీయుడైనాడు. ఇదే మన భారతీయ ఆదర్శము. దీనిని అర్థం చేసుకొనలేక విదేశీ వ్యామోహంలో పడి, నవ నాగరికులమని చెప్పుకునే వారు ఈనాడు విదేశాల వైపు ఆర్రులు చాస్తున్నారు.

తల్లి ఆజ్ఞానుసారం లక్ష్మణుడు అడవికి వెళ్లాడు. శ్రీరాముని తండ్రి కన్నా మిన్నగా గౌరవించి సేవచేసేవాడు. సీతను తల్లిగానే భావించి సపర్యలు చేసేవాడు. ఒక సంఘటన దీనిని ఋజువు చేస్తుంది. సీతను రావణాసురుడు ఆకాశ మార్గమున తీసుకొని వెళుతున్న సమయంలో ఆమె, తన ఆభరణాలను మూట కట్టి క్రింద పడవేస్తుంది. అవి ఋష్యమూక పర్వతం మీద పడతాయి. ఆ మూటను సుగ్రీవునికి ఒప్పగిస్తారు భటులు. కొంతకాలానికి రామలక్ష్మణులు సీత కోసం పరితపిస్తూ, వెతుక్కుంటూ సుగ్రీవుని వద్దకు చేరుతారు. అప్పుడు సుగ్రీవుడు ఆ వస్తువుల మూటను శ్రీరామునికి ఇవ్వగా, ఆ మూటను లక్ష్మణునికి ఇచ్చి ఆ నగలు సీతవేమోనని గుర్తించి చెప్పమని ఆజ్ఞాపిస్తాడు. అప్పుడు లక్ష్మణుడు ఆ నగల మూటను విప్పి చూచి విలపిస్తూ ఈ విధంగా అంటాడు.

**"నాహం జానామి కేయూరే**
**నాహం జానామి కుండలే**
**నూపురే త్వభి జానామి**
**నిత్యం పాదాభి వందనాత్"**

అనగా, నాకు దండ కడియములు తెలియవు. కుండలములను తెల్సుకొన లేకున్నాను. కాళ్ళకు పెట్టుకున్న కడియాలు మాత్రం నాకు తెలుసు. ఎందుకనగా, ప్రతి దినము వినయముతో సీత పాదములకు నమస్కరించుట వలన అవి మాత్రం నాకు బాగా తెలుసు. మిగతా వస్తువులను నేనెప్పుడు చూడలేదు. అని విలపిస్తూ అంటాడు. అనగా సీత మొహంకాని, ఒళ్ళునిగాని పరిశీలనగా ఆయన ఎప్పుడు చూచి ఉండలేదు. తల్లికి నమస్కరించినట్లు ప్రతిదినము ఆమె పాదములకు మాత్రమే నమస్కరించేవాడు. సీతను ఎల్లప్పుడూ మాతృభావంతోనే లక్ష్మణుడు చూసేవాడని దీనివల్ల మనకు తెలుస్తుంది. ఇటువంటి మహత్తరమైన నీతిని ప్రభోధించే ఉద్ధంధము ప్రపంచంలో మరెక్కడా కన్పించదు.

భారతదేశం త్యాగపురుషులకు నిలయం. ఉత్తమగ్రంథాలకు పుట్టినిల్లు. ఈ పవిత్ర భూమి మీద ఎందరో మహానుభావులు జన్మించారు. ఎన్నో ఉత్తమగ్రంథాలను రచించారు. వారి అడుగు జాడలలో నడవడం మన విధ్యుక్త ధర్మం. ఆ పవిత్ర గ్రంథాలను పఠించి, ఆచరణలో పెట్టడం మన కర్తవ్యము.

ఈ రోజు ముక్కోటి. మూడు కోట్ల మంది దేవతలు వైకుంఠ ద్వారాన్ని తెరచి భక్తులకోసం వేచి చూస్తుంటారు ఈ పవిత్రదినాన. పుణ్యాత్ములకు వైకుంఠ ప్రాప్తి ఈరోజు కల్గుతుందని హిందువుల నమ్మకం. ఇక వుంటా....

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 22-1-1976.

ప్రియమైన జయ,

మన విద్యానికేతన్ పిల్లలకు **"వినోదయాత్ర"** తేదీలు నిర్ణయమయినాయని భావిస్తున్నాను. రాజమండ్రి సెంట్రల్ జైలు చూడటానికి అనుమతి యిచ్చారు. తిరిగి వెళ్లేటప్పుడు రాగలరు. వాళ్ళతోపాటు నీవు పిల్లలు కూడా రాగలరు. నీ ఉత్తరాలు చదువుతుంటే నాకు నవ్వు వస్తున్నది. నా కన్నా ఎక్కువ పురాణాలు చదివావు. కాని మనోనిబ్బరాన్ని కోల్పోతున్నావు . అదీ ఒక రకమైన బలహీనతే. గీతలో రెండవ అధ్యాయంలో **'స్థితప్రజ్ఞు'** ని లక్షణాలు చక్కగా వర్ణించబడ్డాయి. 1. దుఃఖమునందు కలత నొందకుండుట. 2. సుఖము అందు ఆసక్తి లేకుండుట. 3. రాగ, భయ, క్రోధములు లేకుండుట. నీలో పై అన్ని లక్షణాలు వున్నాయి. కాని మొదటిది మాత్రం

కొంచెం లోపించినట్లు కన్పిస్తున్నది. సామాన్యమైన స్త్రీలలో వుండే సహజమైన సంకుచితమైన లక్షణాలు నీలో లేకపోవటం విశేషం. ఉన్నత భావాల అన్వేషణకు ఉత్తమ పుస్తకాలు ఆసక్తితో చదువుతూ వుండటం నీలో వున్న మెచ్చుకోదగ్గ మంచి లక్షణం.

**"ఉద్రేకంలో వున్నప్పుడు ఏ సమస్యకూ పరిష్కారమార్గమంటూ ఏదీ కనుపించదు. ప్రశాంతంగా వున్నప్పుడే అది సాధ్యమవుతుంది"** అని మెకాలే అంటాడు. ఇది యదార్థం. నిజం నిలకడమీద గాని బయటపడదు. ప్రస్తుత రాజకీయ వాతావరణంలో కూడ కొంత మార్పు కనుపిస్తున్నది. తొందర మాత్రం పడరాదు.

ఈ మధ్య సైకాలజీ (మానసిక శాస్త్రం) ని గురించి ఒక పేపరు చదివాను. **"సీత"** అనే అమ్మాయికి తన స్నేహితురాలు **"సావిత్రి"** అంటే తగని కోపం, ద్వేషం వుండేది. కారణం? సావిత్రిని అందరూ మెచ్చుకుంటుంటారు. అందరూ ఆత్మీయతతో గౌరవిస్తుంటారు, ప్రేమిస్తుంటారు, ఆమె చెప్పినట్లు వింటుంటారు. సావిత్రి కన్నా సీత అందమైనదే, అయినప్పటికీ సావిత్రినే స్నేహితులందరూ అనుసరిస్తుంటారు. ఇది చూచి సీతకు బాగా కోపం వస్తుండేది. సావిత్రి కన్నా సీత అందమైనది. డబ్బుగల కుటుంబంలో జన్మించింది. తండ్రి మంచి హోదాలో వున్నాడు. అయినప్పటికి "సీత" స్నేహితులను ఆకర్షించలేకపోతున్నది. దీనికి కారణం? 'సీత' లో వున్నది అందం, "సావిత్రి" లో వున్నది వ్యక్తిత్వం. అందువల్లనే సావిత్రి అందర్ని ఆకట్టుకోగలుగుతున్నది. నిజానికి ఈ **"వ్యక్తిత్వం"** అనే దానికున్న విలువ జీవితంలో మరి దేనికీ వుండదు. అసలు ఈ **"వ్యక్తిత్వం"** అంటే ఏమిటి? అది వ్యక్తికి సంబంధించిన ప్రతి విషయంలోను, ప్రతి చిన్న అంశంతోనూ, ముడిపడి వుంటుంది. వ్యక్తి చేసే ఆలోచనలూ, ఆశయాలు, శక్తిసామర్థ్యాలు,ఇష్టాఇష్టాలు నలుగురిలో అతను ప్రవర్తించే విధానం, నడవడి, మాటతీరు, ఆప్యాయత, ఆదరము, ప్రేమ, ఉదార భావము, పరోపకార బుద్ధి, వాత్సల్యము, శీలము, సద్బుద్ధి, అతని జీవితపు విలువలు - ఇవన్నీ కలుస్తే ఆవిర్భవించేదే **"వ్యక్తిత్వం"**. ఇటువంటి వ్యక్తిత్వం వల్లనే ఏమనిషి అయినా ఇతరులను ఆకర్షించుతాడు ! ఆకట్టుకోగలుగుతాడు. అందరికి ఇటువంటి వ్యక్తిత్వం వుండదు. అందరూ ఇతరులను ఆకర్షించలేరు. జనం కొంతమంది యిష్టపడినట్లుగ, ప్రేమించినట్లుగ అందర్ని ఇష్టపడరు. ప్రేమించరు. పనిచేసేవారుకూడ కొంతమంది మాట మాత్రమే వింటారు. మరికొంతమంది మాట అసలే వినరు. పిల్లలుకూడా అంతే. కొంతమంది మాట వింటారు. అల్లరి కూడ చేయరు. మరికొంతమంది మాట అసలే వినరు. కొందరిని ద్వేషించినట్లుగ అందర్ని ద్వేషించరు దీనికి కారణం? వారి వారి వ్యక్తిత్వాలలోని

గుణగణాలే. అయితే అందరూ మెచ్చుకొనేలాగ, అందర్నీ ఆకర్షించగలిగేలా వుండాలంటే ఏమి చేయాలి? వాంఛనీయమైన, ఆకర్షవంతమైన మంచి వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవాలి. పై సద్గుణాలను అలవరచుకోవాలి. అది సాధ్యమేనా అంటే, సాధ్యమేనని కొందరు మానసిక శాస్త్రవేత్తలు చెబుతున్నారు. పూర్వజన్మ సుకృతం అని అంటారు వేదాంతులు. ఈ రెండూ నిజమే. మానవ ప్రయత్నం వల్ల మనిషి ప్రవర్తనలో మార్పు తెచ్చుకోవచ్చు. అసలు గీతలో లేనిదే మార్పు దుర్లభం అని కొందరి అభిప్రాయం. దీనిలో కూడ కొంత యదార్థం వున్నది గాని ఆ విధంగా భావించి దేవుని మీద భారం వేసి మెదలకుండా కూర్చోవడం మాత్రం విజ్ఞత లక్షణం కాదు. ఏది ఏమైనప్పటికీ మానవప్రయత్నాన్ని మాత్రం విడనాడరాదు. మానవ ప్రయత్నం వుంటేనే దైవానుగ్రహాన్ని కూడ పొంద గలుగుతారని పెద్దలు అనుభవజ్ఞులు చెబుతున్నారు. శరీరానికి మనస్సుకు గల సంబంధం విడదీయరానిది. శరీరం బలహీనమై రోగాలకు ఆలవాలమైతే, మానసిక ఆరోగ్యం కూడ దెబ్బతింటుంది. అదీ కాక శరీర ఆరోగ్యం దెబ్బతింటే శరీర అందం, ఆకర్షణలు కూడా నశిస్తాయి. ఆకర్షణ కూడా **"వ్యక్తిత్వం"** లో ఒక భాగమే గదా! కాబట్టే శరీర ఆరోగ్యం కూడ దెబ్బ తినకుండా చూసుకోవడం అత్యవసరమని మానసిక శాస్త్రవేత్తలు కూడ చెబుతున్నారు. ముఖం మటమటలాడుతూ, చిర్రుబుర్రు లాడుతుంటే ఎవరూ దగ్గరకు రారు. "Face is the index of mind" అనే సామెత ఇంగ్లీషులో వున్నది. ముఖం ఆ వ్యక్తి ఆలోచనలకు దర్పణం లాంటిది. ముఖం చూడగానే ఆ వ్యక్తి మనస్తత్వం ఎటువంటిదో, అతని ఆలోచనలు ఏ విధంగా వుంటాయో తెలుసుకోవచ్చు. శరీరానికి మనస్సుకు అవినాభావ సంబంధ ముంటుంది. ఇది ఏ సైంటిస్టు కాదనలేని నగ్న సత్యం. శరీర ఆరోగ్యం బాగున్న వాడి మనస్సే నిశ్చలంగా నిర్మలంగా వుంటుంది. అటువంటివారికి మంచి ఆలోచనలు వస్తాయి. కష్టాలు వచ్చినప్పటికీ కంగారుపడక ప్రశాంతంగా ఆలోచించి వాటిని ఎదుర్కొనగలుగుతారు. ఒకరి వ్యక్తిత్వాన్ని అంచనా వేయడానికి వారి శారీరక ఆకర్షణే ప్రధానం కాదు. వారి మాట తీరు, కంఠస్వరం సంస్కారం, నైతిక ప్రవర్తనల వల్ల కూడా వారి వ్యక్తిత్వం ఇనుమడిస్తుంది. చక్కటి ప్రవర్తన గల వారు పలువురను ఆకట్టుకోగలుగుతారు. పదిమంది చేత మెప్పును పొందుతారు. కనుక ప్రతివారు నవ్వుతూ, కమ్మగా మాట్లాడడం నేర్చుకోవాలి.

ఈ మధ్య **"భాగవతం"** చదువుతున్నట్లు వ్రాశావు. భక్తి ప్రధానమైన ఉత్తమ గ్రంథం. భక్తి శ్రద్ధలతో చదువవలసిన పవిత్ర గ్రంథం. గీతలో శ్రీకృష్ణుడు **'భక్తిమాన్ మే ప్రియో నరః'** అంటాడు. 35 సద్గుణాలను గురించి వివరించి వాటిని ఆచరణలో పెట్టువాడే నిజమైన భక్తుడని పేర్కొంటాడు. అట్టి సుగుణములు గల భక్తుడే నాకు

ప్రియుడు అని చెబుతాడు. ప్రతి వానికి భగవంతుని యందు ప్రీతి వుండవచ్చు. కాని భగవంతునికి మన మీద ప్రీతి కలిగేట్లుగా చేసుకోవడమే కష్టం. భక్తుడు ప్రారంభంలో సహజంగా దేవుని పత్ర పుష్పాలతో పూజిస్తాడు. తదుపరి మనఃకుసుమాలతో భగవానుని ఆరాధిస్తాడు. శంకర భగవత్పాదులవారు ఈ సందర్భమున ఒక చక్కటి శ్లోకాన్ని చెప్పారు. బాహ్య పుష్పములతోపాటు, సద్గుణ రూప మనః పుష్పములచే కూడ భగవంతుడ్ని ఆరాధించవలెనని చెప్పారు.

"అహింసా ప్రథమం పుష్పం,పుష్పమిన్ద్రియ నిగ్రహః
సర్వభూత దయాపుష్పం, క్షమా పుష్పం విశేషతః
శాన్తి పుష్పం తపః పుష్పం, ధ్యాన పుష్పం తథైవచ
సత్యమష్ట విధం పుష్పం, విష్ణోః ప్రీతికరం భవేత్"

అనగా అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము అను యెనిమిది పుష్పములు విష్ణుభగవానునకు చాలా ప్రీతి కరములు. ఈ శ్లోకం ద్వారా ప్రజానీకానికి చక్కటి మార్గాన్ని శంకరులవారు చూపించారు. పూజ అనగానే చాలామంది పత్ర పుష్పములతో, కుంకుమతో పూజించడం అని భావిస్తుంటారు. అది బాహ్యమునకు కనుపించే పూజ. అసలు పూజ మనసుకు సంబంధించినది. వారు చెప్పినట్లు పై యెనిమిది సలక్షణాలను అలవరచుకోవాలి. ఆచరణలో పెట్టాలి. వాటిని ఆచరించినవానికే భగవదానుగ్రహం లభిస్తుంది. అతనినే నిజమైన భక్తునిగా భావించవచ్చు భక్తుడే కాదు మహా జ్ఞాని కూడా అవుతాడు. మహానుభావులు, వాటిని అవగాహన చేసుకోలేక అవన్నీ మూఢమైనవని నవనాగరికులు విమర్శిస్తున్నారు. మహాత్ములు, వేదాంతులు ఎన్నో గొప్ప విషయాలను ప్రపంచానికి వెదజల్లారు. వాటిని ఆకళింపు చేసుకొనే శక్తి లేక అవన్నీ బూజు పట్టిన సనాతన సిద్ధాంతాలని త్రోసిపుచ్చుతున్నారు. నాగరికత పేరిట నాస్తికత్వం ప్రబలుతున్నది. నాస్తికత్వం పెచ్చుపెరగడం వలన మనిషికి మానసిక శాంతి లేకుండా పోతున్నది. అవాంఛనీయమైన దుస్సంఘటనలు జరుగుతున్నాయి. అరాచకం ప్రబలుతున్నది. కల్లోలం సృష్టించబడుతున్నది. తిరిగి దేశంలో శాంతి పునఃప్రతిష్ఠించబడాలంటే ఆధ్యాత్మిక బోధనలను ప్రచారం చేయాలి. ఉత్తమ గ్రంధాలలోని అమూల్యమైన విషయాలను ప్రజలకు బోధించాలి. నైతిక విలువలను పెంపొందించేందుకు అవసరమైన నీతి సూక్తులను ప్రజలకు వివరించాలి. అప్పుడే దేశంలో శాంతియుత వాతావరణం నెలకొంటుంది. ఇక వుంటా....

ఇట్లు
'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 29-1-1976

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. నేను కులాసా. 'హేమ' వివాహము కుదిరినందుకు చాల సంతోషం. మంచి లగ్నం పెట్టించగలవు. **'వినోదయాత్ర'** ఏర్పాట్లలో వున్నారనుకుంటాను. నీవు పిల్లలు అందరూ రాగలరు. ప్రయాణంలో విద్యానికేతన్ పిల్లలందర్ని జాగ్రత్తగా చూడగలరు. పరిశుభ్రంగా వుండేటట్లు చూడగలరు. బస్సులో చేతులు బయటపెట్టకుండా చూడగలరు. ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు జాగత్తగా చూచుకోగలరు. అల్పాహారములు ఏమైనా చేయించి పిల్లలకు పెట్టగలరు. యిక్కడికి కూడా రాగలరు. జెయిలో విసుగు విరామం లేకుండా జీవించగలవారు చాలా అదృష్టవంతులు. అందుకోసమే ఏదో ఒక పని కల్పించు కున్నాం. ప్రతిక్షణం ఊరికినే పోనివ్వడం లేదు. చదవాలనుకున్న వాటికి నిజంగా సమయం చాలడం లేదు. ఒకదాని వెంబడి ఒకటి తీరుబడి లేకుండా చేస్తున్నాం. అట్లా పని కల్పించుకోననివారు ఎప్పుడూ ఏదో వ్యాకులత చెందుతుంటారు. 8వనెలలో ప్రవేశించాం. 7నెలలు అయిపోయినాయంటే నాకే ఆశ్చర్యంగావున్నది. మానవుడు తనను నిర్మించుకోవడంలోనే వుంటుంది విశేషం. మానవుడు దేవుడూ కాగలడు. రాక్షసుడూ కాగలడు. మంచివాడు అవుతాడు. క్రూరుడూ అవుతాడు. అంతా మనమనుసరించే విధానం మీద ఆధారపడి వుంటుంది. మనం నిర్మించుకునే సౌధం మీద వుంటుంది. పరులకుపకారం చేసేవాడు దేవుడవుతాడు. అపకారం చేసేవాడు రాక్షసుడవుతాడు. తన బలాన్ని, సాహసాన్ని తెలివిని, త్యాగాన్ని పరులను అన్యాయం నుండి రక్షించడానికి ఉపయోగపెట్టడం మానవధర్మం, విశాలభావం. పరోపకారాలను గురించి చెప్పడం తేలికే. కాని తనవరకు వచ్చేటప్పటికి అందులోని యిబ్బంది ఏమిటో అర్థమవుతుంది. అర్థం చేసుకొని ఆచరించడంలోవున్న గొప్పతనం మరి దేనిలో వుండదు. దూరంగా వుండి అదెంతపని అని వ్యాఖ్యానించడం తేలిక. అదే పనిని తాను చేయవలసి వచ్చినప్పుడు దానిలోని సాధకబాధకాలు అర్థమవుతాయి. అర్థమైన అనుభవాన్ని ఆచరణలో పెట్టడంలోనే వున్నది మానవుని ప్రజ్ఞ. గతంలోని అనుభవాలు భవిష్యత్తుకు రాజమార్గాలు. గతాన్ని తలచుకొని భవిష్యత్తును అంధకారం చేసుకోవడం విజ్ఞత లక్షణం కాదు. తరుణోపాయాన్ని అన్వేషించడం విజ్ఞుని లక్షణం. కష్టసుఖాల మిళితమే జీవితం. చేదు రుచి తెలుస్తేగాని తీపి ప్రాముఖ్యత తెలియదు. అదే విధంగా కష్టం యొక్క అనుభవాన్ని పొందుతేగాని సుఖము విలువ తెలియదు.

ఈ రెండు అనుభవాలను పొందినప్పుడే జీవితం సార్ధకమవుతుంది. ఆ రెంటిని సమభావంతో చూడటంలోనే గొప్పతనం వున్నది. కష్టాలు వచ్చినప్పుడు ధైర్యాన్ని కోల్పోవడం, సుఖము వచ్చినప్పుడు వళ్ళుమరచి పోవడం మంచిది కాదు. ఈ రెంటిని సక్రమంగా, సమ్యంగా అర్థంచేసుకున్నవారికి అపజయం వుండదు. జీవితం సాఫీగా సాగిపోతుంది. అందుకోసమే **'కష్టేఫలి'** అని పెద్దలు చెప్పారు. ఇక వుంటా.

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 14-2-1976

ప్రియమైన జయ,

నేను కులాసా. మీరందరూ కులాసా అని భావిస్తున్నాను. కొంతకాలం అతివృష్టి, మరి కొంతకాలం అనావృష్టి. నీ వద్ద నుండి ఉత్తరాలు ఆ విధంగా వున్నాయి. నీవు వెళ్లిన తరువాత ఒక ఉత్తరం మాత్రం అందినది. పెండ్లి సమాచారం ఏమైనా వ్రాయాలేమోనని శనివారం వరకు ఆగి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. **'పెరోల్'** కు పంపాను. శంకరం పంపనవసరం లేదు. శుభలేఖలు ప్రింటు కావడంతోనే రెండు పంపగలవు. వరంగల్ వారిని కూడా రెండుశుభలేఖలు పంపమని వ్రాయగలవు. శ్రీయజ్ఞనారాయణగారు హైద్రాబాద్ నుండి వచ్చారు. ఆయన కూడా **'పెరోల్'** కు పెట్టారు. ఎంక్వయిరీకి వస్తే వివరాలు చెప్పగలరు. పెండ్లి పనులలో అందరూ నిమగ్నులయినారనుకుంటాను. సుదీర్ఘమైన ఉత్తరాలు వ్రాయడానికి సమయం ఉండటం లేదు. ఎక్కువ సమయం సంస్కృతం నేర్చుకోవడానికి సరిపోతున్నది. మిగతా కొంతసమయం చదువుకోవడానికి. ఉదయం, సాయంత్రం ధ్యానం. మొత్తానికి ఉదయం లేచిన దగ్గర నుంచి రాత్రి 11గంటలవరకు ఏదో ఒక పనితో సరిపోతున్నది. వారానికొక పర్యాయం సంస్కృతంలో పరీక్షలు. ఇప్పటికి రెండు పరీక్షలు అయినాయి. రెంటిలో నాదే ఫస్టుమార్కు (నూటికి 88మార్కులు, 96మార్కులు) ఇంకా రెండు నెలలు ఈ విధంగా చదువుతే మన విద్యానికేతన్ పిల్లలకు చెప్పే స్థితి వస్తుంది. సంస్కృతం వచ్చివుంటే మూలమైన గ్రంధాలు చదవడానికి అవకాశం వుంటుంది కదా. భగవద్గీత పూర్తి చేశాను. దాని మీద యింకా మూడు పుస్తకాలు (వాఖ్యలు) చదివాను. ఇంకా అనేకమంది వాఖ్యలు వ్రాసారు. అవి కూడా చదవాలని తలంపు. ఉపనిషత్తులు కూడా చదవాలి.

మొత్తానికి భవిష్యత్తులో సామాన్య ప్రజలకు అర్థమయ్యేవిధంగా, నిత్యజీవితంలో ఎదుర్కొనే సమస్యలకు పరిష్కారమార్గాలు సూచిస్తూ భగవద్గీత మీద 'వ్యాఖ్య' వ్రాయాలని తలంపు కల్గింది. ఇంకా కొన్ని పుస్తకాలు బాగా చదవాలి. అది వ్రాయడానికి యింకా రెండు మూడు సంవత్సరాలు పట్టవచ్చు. ఈలోపు కావల్సిన సమాచారం సేకరించాలి. ఇంతవరకూ నాకు రాజకీయాలు తప్ప మిగతా సాహిత్యపథంలో గాని, ఆధ్యాత్మిక విషయాలలో గాని అనుభవం లేదుగదా! తెల్సిన రాజకీయాలు, వాటిలోని మంచి, చెడులను బహిర్గతం చేసే అవకాశం ప్రస్తుతానికి లేదు. వ్యాకరణం వగయిరాలు కాకుండానే 60 శ్లోకాలవరకు ఈ రెండునెలల్లో కంఠస్థం చేశాం. రోజుకు ఒక శ్లోకం మరి వ్యాకరణం చదువుతున్నాం. రాత్రి పూట ఒక గంట సుందరాకాండ చదివి మా మాష్టరుగారు చెబుతున్నారు. సుమారు 20 సంవత్సరాల తరువాత ఒక విద్యార్థిగా శ్రద్ధగా చదువుకుంటున్నాం. మేము బయటవుంటే ప్రమాదమని భావించి మమ్మల్ని జైలులో పెట్టింది ప్రభుత్వం. అంతయూ మన మేలునకే అన్నట్లు, ఇదీ మంచిదే అయింది. బయట వుంటే యింత శ్రద్ధగా చదివే అవకాశం వుండదు గదా! భగవంతుని ఆజ్ఞ లేనిదే ఒక వ్యక్తిని మరొకవ్యక్తి ఏమి చేయలేడు. పాడు చేయాలను కొనినా బాగుపడుతాడు. భగవత్ చిద్విలాసాన్ని అర్థం చేసుకోలేక అంతా నావల్లనే నడుస్తున్నదని విర్రవీగుతారు కొంతమంది ప్రబుద్ధులు. కాదు అహంభావంతో, అహంకారంతో అధికారాన్ని దుర్వినియోగం చేస్తారు మరికొంతమంది అధినేతలు. ఇవే గతచరిత్ర ఋజువు చేస్తున్న నగ్నసత్యాలు. ఇక వుంటా....

ఇట్లు

'నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది.19-2-1976.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు అందినాయి. హేమ పెండ్లి శుభలేఖలు కూడా అందినాయి. వాటిని మన వారందరికీ ముందుగా పంపగలవు. ఖర్చు సాధ్యమైనంత తక్కువయ్యేట్లుగా చూడాలి. హేమ పెండ్లి చేసే యోగ్యత మీ నాన్నగారికి లేకపోయింది. ఒకవేళ నేను వచ్చినా చుట్టంగా వచ్చినట్లేకదా (ప్రభుత్వం పెరోల్ నిరాకరించింది) విధి బలీయం. ఈ పెండ్లి నిర్వహించే బాధ్యత నా చేతుల్లోగాని, మీనాన్నగారి చేతుల్లోగాని లేదు. 'రాజు' పెండ్లి ఎంతో ఘనంగా

చేయాలనుకునే వాడనుకానీ చేయగలిగానా? పరమేశ్వరుడు చూపిస్తున్న 'సినిమా' ను చూచే ప్రేక్షకులు మాత్రమే మానవులు. ఆ కాసేపు చూచి ఇది బాగున్నది, అది బాగాలేదని విమర్శిస్తుంటారు. బాగుకు, చెడుకు బాధ్యులు చూచే ప్రేక్షకులు కాదుగదా! ఎవరు చేసినా ఎవరిచేతులతో జరిగినా నాలుగు కాలాలపాటు సుఖంగా జీవించి మంచి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవాలనేదే అందరి కోరిక. ఇదంతా ఒక విధమైన అనుభవం. పరిస్థితుల ప్రభావం వలననే మానవుడు అనుభవాన్ని పొందుతాడు, రాటుదేలుతాడు. ఇదే చరిత్ర ఋజువు చేస్తున్న 'నగ్నసత్యం'. ఇక వుంటా......

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 26-2-1976.

ప్రియమైన జయ,

నేను కులాసా. మీరందరూ కులాసా అని భావిస్తున్నాను. నీ వద్ద నుండి ఉత్తరాలు లేక చాలా దినములైంది. జయిలు అధికారులు యిచ్చిన ఉత్తరాలను సద్వినియోగం చేయాలి కదా! అందువల్ల వారానికి రెండు తప్పనిసరిగా నేను వ్రాస్తున్నాను. చి॥ లక్ష్మికి సంస్కృతంలో ఉత్తరం ఒక పేజిలో వ్రాసాను. సంస్కృతం అందరు అధికారులకు రాదు కదా! నేను ఏదో రహస్యాలు వ్రాసివుంటానని వారు భావించడం సహజం. పిల్లలు దేవుళ్లతో సమానమన్నారుగదా! ఎవరైనా దేవునితో అబద్ధాలు, రహస్యాలు చెప్పడానికి సాహసిస్తారా? అదేవిధంగా అబద్ధాలు, రహస్యాలు, కుట్రలువ్రాసి అమాయకులైన, పసిహృదయాలను నిర్మలమైన మనస్సులను గాయపరచుతారా? ఎవరైనా అట్లాచేసేవారుంటే అట్టివార్ని అవివేకులు, మూర్ఖులు అనక తప్పదు. అధికారులకు తెలియడానికోసం సంక్షిప్తంగా ఆ సంస్కృత ఉత్తరం భావం వ్రాస్తున్నాను. అర్థం వ్రాస్తూ మళ్లీ సంస్కృతంలో ఉత్తరం దేనికి? అని నీవు ప్రశ్నించవచ్చు. నేను నేర్చుకుంటున్నట్లు మీ అందర్కితెలియాలి గదా! నా క్షేమము, మీ క్షేమాలు, పరీక్షలు దగ్గర పడుతున్నాయని, శ్రద్ధగా చదివి ఫస్టుమార్కు తెచ్చుకోవాలని ఉపాధ్యాయులు బాగా చెబుతునే వుంటారని, చందు వగయిరాలు అల్లరి చేస్తున్నారా లేక చదువుతున్నారా? నాగేశ్వరరావు, వెంకయ్య బాగా

పనిచేస్తున్నారా? గేదెలు పాలు యిస్తున్నాయా? ప్రతిరోజు పాలనే త్రాగమని, కాఫీ వద్దని, నీతి వాక్యాలు, విద్యానికేతన్ ఆదర్శాలను పిల్లలు ఆచరించాలని వ్రాసాను. జాగ్రత్తగా చదువుతే అన్నీ తెల్సినమాటలే. అర్థం కాకపోతే 'మాధురి' తో గాని, హిందీ మాష్టారుగారు శ్రీ ఆచార్యులుగారితో గాని చదివించగలరు. పిల్లలందరూ హిందీ అక్షరాలు, మాటలు నేర్చుకుంటే నేను వచ్చిన తరువాత సంస్కృతం నేర్పుతాను. ఇక వుంటా....

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది 28-2-1976.

ప్రియమైన జయ,

తొమ్మిదవ నెలలో అడుగుపెట్టాం. కాలచక్రం వేగంగా తిరిగిపోతున్నది.. నిత్యం ఏదో ఒక పనిని కల్పించుకోవడంవలన కాలం దొర్లిపోతున్నది. 'పెరోల్' విషయంలో ఎవరైనాఅధికారులు **"ఎంక్వయిరీ"** కి అక్కడికి వచ్చారా? పెండ్లి ఖర్చు పొదుపుగా చేయగలరు. ఇప్పుడు చేతినిండా డబ్బు వున్నట్లు కనపడుతుంది. ఆఖరికి వచ్చేటప్పటికి అనుకోని ఖర్చులు, ఊహించనివి వచ్చి పైనబడుతాయి. చివరికి అప్పు చేయవలసి వస్తుంది. ఇంత ఖర్చు అయిన తరువాత ఈ చిన్న విషయంలో వెనుకాడటం మంచిది కాదనిపిస్తుంది. ఎదుటివారు మనల్ని ఎక్కడ లోభిష్టులనుకుంటారోనని ప్రతిష్ఠకోసం ప్రాకులాడవలసివస్తుంది. **"ఇల్లుకట్టి చూడు, పెండ్లి చేసి చూడు"** అన్నారు పెద్దలు. దూరంగా వుండి అదెంతపని అని తేలికగా చెప్పవచ్చు. మోసేవాడికి బరువు తెలుస్తుంది. నేను అక్కడ వుండి వుంటే అంతా బాధ్యత నామీద వుండేది. మీకందర్కి యింత బాధ్యత వుండేది కాదు. **'అంతయూ మన మేలునకే'** అన్నట్లు పరిస్థితిలే మానవుడ్ని తయారుచేస్తాయి. వ్యక్తిత్వాన్ని సృష్టించి పెడుతాయి. **'శంకర్'** యిప్పుడు **'మైనర్'** కాదు. ఆ ఇంటికి మేజరు. నిజమైన జీవితంలో అడుగిడక మునుపే హఠాత్తుగా బరువు వాడిమీదపడింది. ఇదీ ఒకందుకు మంచిదే. ప్రారంభ దశలోనే కష్టాలు ఎదుర్కోవడం మంచిది. రాటుతేలుతాడు. జీవితం అంటే సుఖమొక్కటేకాదు, కష్టాన్ని ఎదుర్కొనాలని తెలియడం చాలా మంచిది. ఏది ఏమైనప్పటికి చక్కగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోగలరు. పెద్దలు యిచ్చి వెళ్ళిన

ఆస్థిని ఖర్చు పెట్టడం తేలిక. సంపాదించి నిల్వచేయడం మాత్రం కష్టం. కనుక పొదుపుగా నిర్వహిస్తారని ఆశిస్తున్నాను.

ఈరోజు **"మహా శివరాత్రి".** ఈరోజు ఉపవాసం వుంటున్నాము. ఇక వుంటా..

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది 3-3-1976.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు చదివాను. సుదీర్ఘమైన ఉత్తరాలు ఈ మధ్య వ్రాయనందుకు కోపం వచ్చినట్లు కనబడుతున్నది. ఒకటి సమయం తక్కువగా వుండటం. ప్రతి ఉత్తరంలో ఒక నూతన భావాన్ని వ్రాయడం కూడా అంత తేలిక కాదు. ఇంగ్లీషులో ఒక సామెత ఉన్నది. " An idle man's brain is devil's workshop" పని లేని సోమరి బుర్ర దయ్యాలకొంపతో సమానం అన్నారు. ఈ బుర్రను ఖాళీగా వుంచుతే రకరకాలైన చెడు ఆలోచనలకు అవకాశమిచ్చిన వారమవుతాము. కనుక నిత్యమూ ఎడతెగని పని కల్పించుకుంటున్నాను. జీవితం చాలా విలువైనది. అందులో మానవజీవితం మరింత అమూల్యమైనది. ఈ జీవితంలో సాధించవలసిన అమూల్యమైన విషయాలు ఎన్నో ఉన్నాయి. ఏదో ఒకటి సాధించి సంతృప్తి చెందరాదు. ఎన్ని సాధించినా, యింకా సాధించవలసినవి, నేర్చుకోవలసినవి చాలా వున్నాయి. నిరంతర సాధనలోనే సంతృప్తి వున్నది. ఆనందం కూడా వున్నది. అదే అన్వేషణలో నా మనస్సు పరుగెడుతున్నది. అందువల్ల సుదీర్ఘమైన ఉత్తరాలు వ్రాయడానికి తీరుబడి లభించడం లేదు. అంతేకాని మీ అందర్ని ఏమాత్రం మరచిపోలేదు. అది ఎన్నటికీ జరుగదు. ఏమాత్రం భయపడ నవసరంలేదు.

కొంతమందికి నా స్వభావం విచిత్రంగా కనబడుతుంది. జైలులో పడ్డందుకు విచారించాల్సింది పోయి ఇదీ ఒక మంచి సదవకాశమని భావించే నాలాంటివాడిని పిచ్చివాడేమోననుకుంటే అనుకోవచ్చు. కాని నేను ఆశావాదిని. ఆశావాది ప్రతి కష్టంలో ఒక అవకాశాన్ని చూస్తాడు. బాధలో సౌఖ్యాన్ని పొందుతాడు. చెడులో నుంచి గూడా మంచిని చూడగలుగుతాడు. తన దృష్టిని వెలుగువైపుకే పోనిస్తాడు. చెట్టుకున్న ముండ్లను చూడడు, లెఖ్కచేయడు. దానికిపూసిన అందమైన గులాబీల

మీద మాత్రమే తన చూపు పోతుంది. నిరాశావాది దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తాడు. అతనికి ఆత్మవిశ్వాసం వుండదు. ధైర్యం అసలే వుండదు. నిరాశా నిస్పృహలు అతన్నిలో ఎల్లప్పుడూ తాండవిస్తుంటాయి. సంశయాలతో, అనుమానాలతో సతమతమవుతూ వుంటాడు. నిత్యమూ నరకాన్ని అనుభవిస్తూ వుంటాడు.

దూరదృష్టితో ఆలోచిస్తే కష్టమూ, సుఖమూ, బాధా, సౌఖ్యమూ అనేవి వేరే ఎక్కడా లేవు. మన మనస్సులలోనే వున్నాయి. మన భావనలోనే వున్నాయి. దృఢసంకల్పులకు అంధకారంలోనే కాంతి రేఖ కనుపిస్తుంది. దుర్బలులకు పట్టపగలే చిమ్మచీకటిగా గోచరిస్తుంది. ఇది వారివారి మనస్తత్వం మీద ఆధారపడి వుంటుంది. అసలు మానవునిలో వుండవలసినది మనోధైర్యం, ఆత్మవిశ్వాసం.

ప్రపంచంలో ఏ ఆశయం, ఏ ఆదర్శం, బాధలు యాతనలు అనుభవించ కుండా సాధించబడలేదు. బాధలను నవ్వుతూ నవ్వుతూ ఎదుర్కోవడం వలన ఎవరూ ఏమీ నష్టపోరు. పైపెచ్చు ధృఢసంకల్పచిత్తులవుతారు. స్వామి వివేకానంద ఒక ఉపన్యాసంలో కష్టాలను గురించి చెబుతూ **"కొండను ఎలుక ఏమీ చేయలేదు. నన్ను కష్టాలు ఏమీ చేయలేవని నిశ్చలంగా భావించగలవాడే జీవితాన్ని ఎదుర్కొనగలడు"** అని అంటాడు. ఈ సుదీర్ఘమైన జీవితయాత్రలో కష్టాలనేవి కొంతకాలం మాత్రమే మనతో వుంటాయి. అంతమాత్రాన వాటిని చూచి భయపడి, నిరాశ చెంది జీవితం మీదనే విరక్తి కలగడం ఏమంత మంచిది కాదు. ఇది బలహీనుల లక్షణం. భగవంతుడు ప్రసాదించిన ఈ మానవ జీవితం విలువైనది గదా! దీనిని సద్వినియోగపరచుకోవాలి. ప్రతి మనిషి తన్ను తాను ప్రశ్నించుకోవాలి. నేను ఎవరి కొఱకు జీవిస్తున్నాను? ఎందుకు జీవిస్తున్నాను? నా గమ్యం ఏమిటి? అని తనను తాను తర్కించుకోవాలి. ప్రతి వ్యక్తికి ఒక ఆశయం వుండాలి. ఒక ధ్యేయం వుండాలి. వాటిని సాధించడం కోసం తీవ్రప్రయత్నం చేయాలి. జీవితాన్ని ఒక క్రమపద్ధతిలో నడిపించాలి. ఇతరులపై ఆధారపడకుండా స్వశక్తిపైననే ఆధారపడి ముందుకు నడవాలి. అంతేకాదు ఇతరుల కష్టాల యెడల సానుభూతితో చేయూత నివ్వాలి. కొంగ తన ముక్కుతో తన కడుపును మాత్రమే నింపు కుంటుంది. మనిషి ఈ విధంగా ప్రవర్తించరాదు. తనవలన అనేక మంది బ్రతుకుతున్నారనే సంతృప్తి వుండాలి. తన ఆశ్రయంలో అనేకమంది నిర్భాగ్యులకు వుండటానికి అవకాశం కల్పించగలిగాననే ఆనందం పొందాలి. అట్టివాని జీవితమే ధన్యం. అది అందర్కి సులభంగా లభ్యంకాదు. అయినప్పటికి దానిని సాధించి తరించాలి. ఇక ఉంటా...

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 6-3-1976.

డియర్ బ్రదర్,

భగవంతుని దయవల్ల నేనింత వరకు కులాసాగానే యున్నాను. ది. 11-3-76 న మన విద్యానికేతన్ వార్షికోత్సవం జరుపుకుంటున్నందుకు చాలా సంతోషం. నేను లేకుండా జరుపుకుంటున్న వార్షికోత్సవం బహుశా యిదే మొదటిదేమో? చిన్నప్పటి నుంచి చదువు సంస్కారాలను నేర్పించి అతి ముద్దుగా ప్రేమించి పెంచి పోషించిన తనయునకు జరుగుతున్న సన్మానమహోత్సవానికి హాజరుకాలేని తండ్రి మనస్సు ఏవిధంగా పరితపిస్తుంటుందో, అదే విధంగా నా మనస్సు ఈరోజు వ్యధ చెందుతున్నది.

ఈ సంవత్సరం నేను లేకపోయినప్పటికీ మిక్కిలి శ్రద్ధ తీసుకొని , కష్టపడి చదువుచెప్పి, వార్షికోత్సవాన్ని కూడ విజయవంతంగా నిర్వహిస్తున్న మన ఉపాధ్యాయ బృందానికి నా హృదయపూర్వకమైన అభినందనలు. క్రమశిక్షణతో కడు శ్రద్ధగా విద్య నభ్యసిస్తున్న బాలబాలికలకు నా ఆశీస్సులు.

ఈ సంవత్సరం మన విద్యానికేతన్‌లో 7వతరగతిలో ఉత్తీర్ణులైన బాలబాలికలు వచ్చే సంవత్సరం మరొక విద్యాలయంలో విద్యనభ్యసించడానికి వెళ్లవచ్చు. వారందరూ ఈ నీతి శ్లోకాన్ని పఠించి మననం చేసుకుంటూ, అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టే ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుతూ చక్కటి భావి భారత పౌరులుగా తయారుకావాలని నా ఆకాంక్ష, నా ఆశయం.

**"ఉద్యమం సాహసం ధైర్యం బుద్ధి శ్శక్తిః పరాక్రమః**

**షడేతే యత్ర వర్తన్తే తత్ర దేవః సహాయకః**

ప్రయత్నము, సాహసము, ధైర్యము, బుద్ధి (సద్బుద్ధి), శక్తి, పరాక్రమము - - అను ఈ ఆరుగుణములు కలవారికే దైవ సహాయము కూడ కలుగును. పై గుణములు లేనివారికి దైవ సహాయము కూడా వుండదన్నమాట. కనుక బాలబాలికలు ఈ ఆరు సద్గుణములు అలవరచుకోవాలి. నిత్యజీవితంలో ఆచరణలో పెట్టేవారికి పరాజయం అంటూ వుండదు. అన్నిరంగాలలో విజయలక్ష్మిని చేబట్ట గలుగుతారు.

వీటితో పాటు మన విద్యానికేతన్ ఆదర్శాలను కూడ మరువరాదు. **"విద్య, విజ్ఞానము, క్రమశిక్షణ, సచ్ఛీలము, దేశభక్తి"** మన విద్యానికేతన్‌కు పట్టుగొమ్మలు. పిల్లలు వీటిని కూడ నిత్యజీవితంలో అలవరచుకొని ఆచరించాలి.

"విద్యా విహీనః పశుభి స్సమానాః" విద్య లేనివాడు పశువుతో సమానం అని పెద్దలు ఏనాడో చెప్పారు. మన పూర్వులు విద్యకు ఎటువంటి ప్రాధాన్యత యిచ్చారో గమనించండి. 'విద్య' అంటే కేవలం చదవడం, వ్రాయడం కాదు. వినయ వివేకాది సద్గుణములను నేర్పునదియే విద్య. యుక్తాయుక్త వివేకమును కలిగించి తిన్నగా నడచుటకు ఉపయోగపడేదే సరైన విద్య. మంచి మార్గమున నడువగల శక్తినిచ్చునదియే సరియైన విద్య. కనుక బాలబాలికలు లౌకికవిద్యతోపాటు వినయం, సత్ప్రవర్తన అలవరచుకోవాలి. దేశభక్తి భావాలను పెంపొందించు కోవాలి. క్రమశిక్షణ గల పౌరులుగా తయారుకావాలి. కనుక ఇటువంటి అత్యున్నతమైన ఆశయాలతో కూడిన విద్యను అభ్యసించాలని నా ఆకాంక్ష

పై శ్లోకాలను ఊరికినే వల్లె వేసినందువల్ల ఏమాత్రం ప్రయోజనం లేదు. ఆకళింపు చేసుకోవాలి, ఆచరణలో పెట్టాలి. పట్టుదల వుంటేవీటిని సాధించవచ్చు. అధైర్యం మాత్రం చెందరాదు. వీటిని సాధించగలమా? లేదా? అనే అనుమానం ఎవరి మనస్సులో రాకూడదు. దేనినైనా సాధించితీరగలమనే ఆత్మవిశ్వాసం ప్రతి ఒక్కరిలో వుండాలి. ఆదర్శాలువల్లె వేసినంత మాత్రాన ప్రయోజనం లేదు. కోరికలు నెరవేరవు. ఆశించిన ఫలితం చేకూరదు. ప్రయత్నముచే ఎటువంటి పనులనైనా సాధించవచ్చును. ఈ సందర్భమున ఒకచక్కటి నీతిని బోధించే శ్లోకమును వ్రాస్తున్నాను.

**"ఉద్యమేన హి సధ్యన్తి , కార్యాణి న మనోరథైః**

**న హి సుప్తస్య సింహస్య , ప్రవిశన్తి ముఖే మృగాః"**

పనులు ప్రయత్నము చేతనే సిద్ధించుచున్నవి. కోరికల చేత కాదు. (వేటాడక) నిద్రపోవుచున్న సింహము యొక్క నోటియందు జంతువులు వాటంతట అవే ప్రవేశించవు గదా! సింహం మృగరాజైనప్పటికీ వేటాడకుండ ఒక మూల కూర్చుంటే ఆహారం లభ్యం కాదు. అదేవిధంగా ప్రయత్నం చేయకుండా భగవంతుని దయవుంటే తప్పకుండా పాసవుతానులే అని కూర్చుంటే పరీక్ష ప్యాసుకావడం అసాధ్యం. ప్రయత్నం లేకుండా పరీక్ష ప్యాసవుతే దేవుడికి కొబ్బరికాయ కొడతామని మ్రొక్కుకున్నందువల్ల కూడా ప్రయోజనం లేదు. ఎవరి ప్రయత్నం వారు శక్తివంచన లేకుండా చేయాలి. ప్రయత్నం చేసేవారు మాత్రమే భగవదనుగ్రహానికి పాత్రు లవుతారు, సోమరులను భగవంతుడు ఏమాత్రం హర్షించడు. కనుక బాలబాలికలు ప్రయత్నంలో ఏమాత్రం లోపం చేయరాదు.

సంస్కృతం అమృతభాష . భారతీయ భాషలన్నింటికి తల్లి లాంటిది. మన సంస్కృతికి నిలయం సంస్కృతం. సమస్త భారతీయ భాషలకు స్ఫూర్తికేంద్రం

సంస్కృతం. అమరవాణి దానిలో వున్నది. ఈనాడు ప్రపంచంలోని అనేక దేశాలలో సంస్కృతం ప్రత్యేకంగా అధ్యయనం చేయబడుతున్నది. అటువంటి అమృత భాషను నేర్చుకోవాలనే తలంపు నాకు కల్గింది. ఒక విద్యార్థివలె నిత్యమూ నేనిక్కడ సంస్కృతాన్ని నేర్చుకుంటున్నాను. మా తరగతిలో నేనే అన్ని పరీక్షలలో ప్రప్రథమునిగా ఉత్తీర్ణుడవుతున్నాను. మీ అందరూ కూడా మంచి మార్కులు తెచ్చుకుంటారని ఆశిస్తున్నాను.

గౌ॥అధ్యక్షులవారికి, విద్యాశాఖాధికారికి, ముఖ్యఅతిథికి వార్షికోత్సవానికి విచ్చేసిన తల్లిదండ్రులకు నా హృదయపూర్వకమైన అభినందనలు. జైభారత్

భవదీయ

(సం) కొమరగిరి

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది10-3-1976.

ప్రియమైన జయ,

నీ కోపం తగ్గిన తరువాత వ్రాసిన రెండు ఉత్తరాలు అందినాయి. ప్రశాంతంగా ఆలోచించి ఉత్తరం వ్రాయగలవని నాకు తెలుసు. కోపం రావడం మానవసహజం. పశ్చాత్తాపపడి పొరపాటును గ్రహించి కోపాన్ని తగ్గించుకోవడం విజ్ఞత లక్షణం. పెండ్లి పనులు చురుకుగా చేస్తున్నందుకు సంతోషం. మీరు పడుతున్న శ్రమలో నేను పాలుపంచుకోలేకపోయినందుకు విచారిస్తున్నాను. ఆ శుభలగ్న సమయానికైనా రాగలనో ! లేదో! మన చేతులలో లేదు గదా! ఏది ఎట్లా జరిగినా శుభకార్యం నిర్విఘ్నంగా జరగాలని నా అభిలాష. ఇటువంటి పరీక్షా సమయంలోనే నిలబడగలగాలి.

మన విద్యానికేతన్ వార్షికోత్సవ ఆహ్వానం వచ్చింది. ఇంతకు పూర్వమే నా సందేశాన్ని రాముడికి పంపాను. పోయిన ఉత్తరంలో కొన్ని ధర్మ సందేహాలను ప్రస్తావించావు. అందర్కి ఒకే సమాధానం వర్తించదు. మనిషికి మనిషికి మారుతుంది. దేశ కాలమాన పరిస్థితులను బట్టి బాధ్యతలు మారుతూ వుంటాయి. ఒక వ్యక్తి 'నా' అనే వారందర్ని వదలిసర్వసంగ పరిత్యాగం చేసి కానలకేగి, ముక్కు మూసుకొని మోక్షసాధనకు పడరానిపాట్లుపడి ఎన్ని కష్టాలనైనా ఎదిరించి సాధించేందుకు తీవ్రకృషి చేస్తుంటాడు. మరొకవ్యక్తి తనకు చేతనయినంత పరోపకారం చేస్తూ **"మానవసేవే మాధవసేవ"** అని భావిస్తూ సంతృప్తి పడుతుంటాడు. మరొకడు దేశకళ్యాణంకోసం, ప్రపంచ మానవ సముద్ధరణకోసం, నిస్వార్థ బుద్ధితో

'నా' అనే భావనను దరికి చేరనీయకుండా విశాల భావాలతో ప్రజాసేవలో మునిగితేలుతూ వుంటాడు. మరొకవ్యక్తి తన స్వధర్మాన్ని విడనాడకుండా, తన స్వంత వృత్తిని చేసుకుంటూ, న్యాయసమ్మతంగా, ధర్మబద్ధంగా జీవితాన్ని గడుపు తుంటాడు. మరికొంతమంది తమ తల్లిదండ్రులకు సపర్యలుచేస్తూ, సేవిస్తూ అదే ధర్మంగా భావించి తన్మయత్వం చెందుతుంటారు. మరికొంతమంది భర్తే దైవంగా భావించి తమ గృహస్థధర్మాన్ని శ్రద్ధగా ఆచరిస్తూ ఆనందాన్ని పొందుతుంటారు. ఎవరి పరిధిలో వారు వారియొక్క ధర్మాలను ఆచరిస్తూ ముక్తిని పొందినవారున్నారు. వీరందరిలో ఎవరు అధికులు? ఎవరు గొప్పవారు? అని చెప్పమంటే తేల్చి చెప్పడం అసాధ్యం. అసలు అడగడం కూడా విజ్ఞత అనిపించుకోదు. సర్వసంగపరిత్యాగి అయిన సన్యాసి - గృహస్థధర్మమును నిర్వహిస్తున్నవారు ఎందుకు పనికిరానివారని భావించరాదు. అదే విధంగా గృహస్థు - సన్యాసిని చూచి వట్టి తిరుగుబోతని భావించరాదు. ఎవరి స్థానంలో వారే గొప్ప, ఎవరి ప్రాముఖ్యత వారిదే.

పూర్వం ఒక రాజు మహాపండితులందర్ని ప్రశ్నించేవాడట. ఎవ్వడధికుడు? సంసారమును త్యజించిన సన్యాసియా? లేక స్వధర్మానురక్తుడగు గృహస్థుడా? ఆ కథ నీకు తెలుసుగదా! చీకటి రాత్రులలో ఒక చెట్టు కింద శయనించిన బాటసారి కుటుంబం ఆకలి తీర్చుటకు చెట్టుమీదనున్న కపోతములు చేసిన త్యాగం జగద్విదితమే. భర్త (మగ కపోతము) తరువాత భార్య (ఆడ కపోతము) తరువాత వాటి పిల్లలు అన్ని అగ్నిలోపడి బాటసారి ఆకలి తీర్చిన కపోతముల కథ కూడా నీకు తెలుసు. తన స్వంత వృత్తి అయిన కసాయి వృత్తిని న్యాయసమ్మతంగా చేస్తూ తరించిన **"ధర్మవ్యాధు"** ని కథ కూడా నీకు తెలుసు. భిక్ష కోసం వెళ్లిన సన్యాసిని కొంచెం ఆగమని చెప్పి పతిసేవలో నిమగ్నురాలైన సాధ్వీమణి కథ కూడా నీకు తెలుసుగదా! దీనివల్ల మనం నేర్చుకోవలసినది ఎంతో వున్నది. సంసారివై వుండదలచిన యెడల పరహితార్థమై ఆత్మార్పణ మొనర్చ సంసిద్ధుడవై ఆ కపోతముల వలె జీవింపుము. సంసారమును త్యజించదలచిన యెడల సౌందర్య స్వరూపిణి యగు రాకుమార్తెను, రాజ్యమును, సకలరాజ్యభోగములను తృణప్రాయంగా పరిగణించి కానలకేగిన ఆ సన్యాసివలె వర్తింపుము. ఎవరి స్థానంలో వారే గొప్ప. ఒకని ధర్మము మరియొకని ధర్మము కానేరదు.

భిక్ష కోసం వచ్చిన ఆ సన్యాసినిసహితం లెక్కచేయక తన భర్త సేవలో నిమగ్నురాలైన ఆ సాధ్వీమణి చెప్పిన విషయం తెలుసుకుంటే స్వధర్మమేమిటో బోధపడుతుంది. **"స్వధర్మాచరణముచే నాకు జ్ఞానోదయమైంది. నీ యోగములు గాని, నీ సాధనగాని నాకు తెలియవు. జబ్బులో నున్న భర్తను సేవించడమే నా ధర్మమని**

భావిస్తున్నాను. పెండ్లి కాక పూర్వం నా తల్లిదండ్రులను సేవించడమే నాపరమ ధర్మమని భావించాను. ఇదే నేను చేయు యోగసాధన. అందువల్లనే నీవు కాకిని, కొంగను చంపిన విషయాన్ని కూడ కనుగొనగలిగాను." అని ఆ ఇల్లాలు ఆగ్రహావేశపరుడైన ఆ సన్యాసితో చెప్పింది. అదే విధంగా ధర్మవ్యాధుడు "చిన్నప్పటి నుండి మాంసం అమ్ముకొనుట నావృత్తి. ఆ వ్యాపారాన్ని ధర్మబద్ధంగా, న్యాయసమ్మతంగా చేయుచున్నాను. అక్రమ లాభార్జన చేయడం లేదు. గృహస్థుడుగా నా తల్లిదండ్రులను సేవిస్తున్నాను. నేను అడవులకు పోలేదు. సన్యాసిని కాలేదు. నా స్వధర్మమును మాత్రం తూ చా తప్పకుండా పాటిస్తున్నాను'అని అంటాడు. ఈ ఉదంతం భారతంలో "వ్యాధగీత' అని పేరు గాంచింది. దీని వలన మనం నేర్చుకోవలసింది ఒకటున్నది. ఎవరి ధర్మాన్ని వారు, చేతనైనంత ధర్మ యుతంగా, న్యాయసమ్మతంగా నిర్వహించడంలోనే వున్నది గొప్పతనం. మోక్షాన్ని కూడా అటువంటివారే పొందగలుగుతారు. భగవద్గీత కూడ స్వధర్మాచరణ అన్నిటికన్నా ముఖ్యమైనదని చెబుతున్నది. 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' తన ధర్మ మందు మరణమైనను శ్రేయస్కరమే యగును. ఇతరుల ధర్మము భయదాయక మైనది. అర్జునుడు క్షత్రియుడు. యుద్ధము చేయుట అతని ధర్మము. దానిని వదిలివేసి సన్నసించుట లేక ఇతరుల ధర్మమును స్వీకరించుట ఉత్తమము కాదు. స్వధర్మమగు యుద్ధము నందు మరణించినను అతనికి శ్రేయస్సే. వీరస్వర్గాన్ని అలంకరిస్తాడు. మోక్షానికి అర్హుడవుతాడు. తన ధర్మాన్ని పాటించి యుద్ధం చేయకుండా అస్త్రసన్యాసం చేసి మరొక ధర్మాన్ని స్వీకరిస్తే అతనికి మోక్షం లేదు. కనుక స్వధర్మాచరణకు మించిన ధర్మం మరొకటి లేదని భగవద్గీతసహితం మనకు బోధిస్తున్నది. అంతే కాదు మరొక ముఖ్య విషయం గూడ గుర్తుంచుకోవాలి. "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" పరులకు ఉపకారం చేయడమే పుణ్యం. పరులను పీడించడమే పాపం. ఇది తెల్సుకుంటే నేనెవరి కోసం, ఎందుకు దేనికి జీవిస్తున్నాను? అనే ప్రశ్నకు సమాధానం రాక మానదు.

ఆశ్రమములలో "గృహస్థాశ్రమము" ఉత్కృష్టమైనది. ధర్మములలో "గృహస్థధర్మము" నకు మించినది లేదు. దైవ, పితృ ఋణములు ఈ ఆశ్రమముల వల్లనే తీరును. ఈ ఆశ్రమముననే జీవి ఐహిక సుఖమును అనుభవించును. దీనితోపాటుగ ధర్మనిర్వహణము ద్వారా, పారిమార్థికా భ్యుదయము కూడా ఈ ఆశ్రమమున పొందును. పుత్ర శోకానికి తట్టుకోలేక వియోగాన్ని, భరించలేక శ్రీరామునితో అడవులకు బయలుదేరుతుంది తల్లి 'కౌసల్య' కాని శ్రీరాముడు అంగీకరించడు. సాధ్వీమణియగు స్త్రీ ధర్మం భర్తను అనుసరించడం, భర్తకు సేవ చేయడం మాత్రమేనని కనుక దశరథునికి సేవ చేస్తూ అయోధ్యలో వుండటమే

తల్లి కౌసల్య ధర్మమని శ్రీరాముడు చెబుతాడు. రామాయణం భారతీయ గృహస్థాశ్రమ ధర్మ వైశిష్ఠమును చాటుచున్నది. భార్యగా కౌసల్య ధర్మం దశరధునికి సేవచేస్తూ అయోధ్యలో వుండటం. కుమారునిగా శ్రీరామచంద్రుని ధర్మం తండ్రి ఆజ్ఞను శిరసావహిస్తూ అరణ్యాలకు వెళ్ళడం, భార్యగా సీత ధర్మం శ్రీరాముని అనుసరించి అరణ్యాలకు వెళ్ళడం, ఎవరి ధర్మాన్ని వారు సక్రమంగా నిర్వర్తించాలి. మరొకరు చేసేపనిని మనం చేయలేక పోయామేనని బాధపడనవసరం లేదు. ఎవరి పనిని వారు సక్రమంగా నిర్వర్తించాలి. ఒక పని గొప్పదని, మరొకపని నీచమైనదని భావించరాదు. ఎవరి విద్యుక్తధర్మాన్ని వారు శక్తివంచన లేకుండా నిర్వర్తించాలి. ప్రతి ఒక్కరి కర్తవ్యం అదే. ఇక వుంటా..

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది 15-3-1976.

డియర్ బ్రదర్

నేను కులాసా. నాకు "పెరోల్" తిరస్కరించినట్లు 3వ తేదీన తెల్సినది. ముందుగా తెలియపరచిన యెడల మీరందరూ నిరుత్సాహపడుతారని తెలియ జేయలేదు. "పెరోల్"కు పెట్టకపోతే మీరందరూ బాధపడుతారని పెట్టాను. అసలు యివ్వరని నాకు ముందు గానే తెలుసు. అధికారులను ఆశ్రయించేవారికే నెలల తరబడి "పెరోల్సు" వస్తాయి. ఇంకా ఎక్కువగా ఆశ్రయించడం చేతనయిన వారికి, రికమండేషన్సు వున్న వార్కి విడుదల (releases) లు కూడా వస్తున్నాయి. ఆ నీచమైన పనికి మనం వ్యతిరేకులం గదా! ఒకరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడటం అంటే ఆత్మవంచన చేసుకోవడమే గదా! నమ్మిన సిద్ధాంతం కోసం అవసరమైతే ఎంతటి త్యాగానికైనా వెరవనటువంటి సమాజంలో వాతావరణంలో యింతవరకు మెలిగాం. ఏదో విధంగా ఒకరి మెప్పును సంపాదించాలని గాని, మరొకర్ని సంతృప్తిపరచాలని గాని భావించే మనస్తత్వం నాదికాదు. మనకు స్వామి వివేకానంద ఆదర్శం. ఆయన వాక్కు మనకు వేదవాక్కు. ఆయన ఒకపర్యాయం '**మీకు ఎట్టి విపత్కర పరిస్థితులు సంభవించినా లెఖ్ఖ చేయకుడు. లక్ష్యము నంటిపెట్టుకొని యుండుడు. ఆశయము కొఱకు జీవింపుడు. పరమోత్కృష్టమైన సత్యమును ధైర్యంగా ప్రకటింపుడు.**" పరమోత్కృష్టమైప ఆశయాన్ని సాధించడంలో అనేక యిక్కట్లు ఎదురు కావచ్చు.

అంతమాత్రాన వాటిని చూచి భయపడి పారిపోరాదు. పరిస్థితుల ప్రభావంవలన, వత్తిడుల వలన సంభవించే యిబ్బందులకు వ్యక్తి, తన సహజమైన ఉన్నత సుగుణాలను కోల్పోరాదు. ఆత్మ గౌరవంతో, స్వశక్తితో జీవించాలనే ఆకాంక్షను పెంపొందించుకోవాలి. ఆత్మవిశ్వాసాన్ని కోల్పోరాదు. భయపడి సత్యమార్గాన్ని విడనాడరాదు. ఒక వ్యక్తి తాను నమ్మిన ఆశయాన్ని సాధించడంలో అనేక కష్టములను ఎదుర్కొనవలసి వస్తుంది. చివరికి మరణించినను మరణించవచ్చు. ప్రతిదీ నశిస్తుంది ఏదీ శాశ్వతం కాదు. అసలు ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతి వ్యక్తీ మరణిస్తాడు. ఆశయాలు ఆదర్శాలు మాత్రం నశించవు. వాటికి చావు లేదు. వ్యక్తి మరణానంతరం ఆదర్శాలు అతని ఆశయాలు ద్విగుణీకృతోత్సాహంతో వాటంతట అవే పెరుగు తుంటాయి. వాటికి విస్తృత ప్రచారం కూడ లభిస్తుంది. ఆదరణ పెరుగుతుంది. అసలు ప్రపంచంలో ఏ ఆదర్శమూ బాధలకు గురికాకుండా, కష్టాలను ఎదుర్కొన కుండా, యాతనలను అనుభవించకుండా సాధించబడలేదు. ఒకప్పుడు నేతాజీ సుభాస్‌చంద్రబోస్ యిదే వాస్తవాన్ని చాటాడు. **"జాతి జీవించడం కొఱకు వ్యక్తి త్యాగం చేయాలి. అవసరమైతే మరణించాలి. ఈనాడు నేను మరణిస్తాను. అందుమాత్రాన భారతదేశం జీవిస్తుంది. స్వతంత్రాన్ని పొందుతుంది. ఇక్కడి ప్రజలు స్వేచ్ఛా వాయువులను పీలుస్తారు"** అని అంటాడు. ఈమాటలలో ఎంత సత్యం యిమిడి వున్నదో ఊహించవచ్చు.

ఇకపోతే 'హేమ' పెండ్లి ఏర్పాట్లన్నీ అయివుంటాయని ఆశిస్తున్నాను. సూర్యం, రాజులు వచ్చి వుంటారని భావిస్తున్నాను. ఏమీ మాట రాకుండా ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోగలరు. పెండ్లి మన ఇంట్లో కదా! నేను రాలేదని ముఖ్యంగా నాన్నగారు, అమ్మగారు మీవదిన బాధపడుతూ వుండవచ్చు. ఎంతోకాలం నుంచి ఎదురు చూస్తూవున్న పిల్లలకు నిరాశ కలగనూ వచ్చు. ఇదంతా సహజం. హృదయంలోని బాధను ఎవరూ తీసివేయలేరు గదా! ఏమి చేయను? మన చేతలలో ఏమీ లేదు గదా! అనుకోనని, ఊహించని సంఘటనలు జీవితంలో అప్పుడప్పుడూ సంభవిస్తూవుంటాయి. మన **"రాజు"** పెండ్లి ఎంతో ఘనంగా చేయాలనే ఆకాంక్షతో ఎంతో పట్టుదలతో ఇల్లు పూర్తి చేశాను. మామయ్య బ్రతికి వుండగానే **"హేమ"** పెండ్లి చేయాలని ఎన్నో సంవత్సరాలు తీవ్రంగా ప్రయత్నించాను. **"కన్యాదానం"** చేసే అదృష్టం ఆయనకు లేకుండా పోయింది. ఆయన నామీద వదలి వెళ్ళిన బాధ్యతను నేను నిర్వర్తించలేకపోయాను. కనీసం వివాహమహోత్సవాన్ని తిలకించి, ఆశీర్వదించే అవకాశం కూడా నాకు లేకుండాపోయింది. విధి బలీయం. తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లున్నది. కొంచెం బాధగానే వున్నది కాని ఏమి చేయగలను?

ఈమధ్య ఒక నెలరోజులనుంచి ప్రతిరోజూ రాత్రి మా "గురువు" గారు "సుందరకాండ" పారాయణం చేస్తున్నారు. దానిలో సీతాదేవి పడుతున్న కష్టాలు, హనుమంతుని మానసిక ఆందోళన, అతని శౌర్య పరాక్రమాలు చక్కగా వర్ణించాడు వాల్మీకి మహర్షి.

"మాన్యా గురు వినీతస్య, లక్ష్మణస్య గురు ప్రియా

యది సీతాపి దుఃఖర్తా, కాలో హి దురతిక్రమః॥

"వినయ విధేయతలు సకల శక్తి సామర్థ్యములు గల లక్ష్మణునికి గౌరవనీయురాలును, మహా బలసంపన్నుడు, సత్యసంధుడు అయినశ్రీరామునికి అమిత ప్రియమైనదియగు సీతాదేవి సహితం దుఃఖములకు లోనుకాకుండా తప్పించుకోలేకపోయింది గదా! కాలగతిని అధిగమించుట ఎవరికినీ శక్యము కాదు గదా! " అని హనుమంతుడు అశోకవనంలో శోకనిమగ్నురాలై, కుమిలి కృశించి పోతున్న సీతను చూచి దుఃఖిస్తాడు. నిజంగానే కాలం బహు విచిత్రమైనది. అనేక ఒడుదుడుకులకు లోనవుతూ అగ్ని పరీక్షలను ఎదుర్కొంటూ వుంటుంది. అంతమాత్రాన అధైర్యపడి నిరుత్సాహపడరాదు. సీత కోసం లంకాపురిని తీవ్రంగా గాలిస్తాడు. సీత కనపడదు. హనుమంతుని అంతటి వానికి కూడా నిరుత్సాహం జనిస్తుంది. మానసిక దౌర్బల్యం అతనిని ఆవరిస్తుంది. ఎంతో బాధపడుతాడు. కుమిలిపోతాడు. కాని కర్తవ్యాన్ని మాత్రం విస్మరించడు. ఉత్సాహాన్ని తిరిగి తెచ్చు కుంటాడు. మళ్ళీ వెదకడం ప్రారంభిస్తాడు. అశోకవనంలో సీతను కనుగొంటాడు. శ్రీరాముని సందేశాన్ని అందజేస్తాడు. తిరిగి వచ్చేటప్పుడు అడ్డగించిన రాక్షసులను సంహరిస్తాడు. లంకాపురిని దగ్ధంచేస్తాడు. ఈ వృత్తాంతాన్ని శ్రీరామునికి తెలియ బరుస్తాడు. అందరూ కలిసి వారధిని నిర్మిస్తారు. లంకను జయిస్తారు. రావణాసురుని సంహరిస్తారు. సీతను తీసుకొని వెళ్లుతారు. ఇదీ రామాయణం. దీనివల్ల నేర్చుకోవాల్సిన నీతి ఒకటున్నది. ధైర్యవంతులు, ఆత్మవిశ్వాసం గలవారికి అపజయం అడ్డురాదు. అంతిమ విజయం తథ్యం. మధ్యలో మాత్రం కష్టాలను ఎదుర్కోవాల్సి వస్తుంది.

శ్రీ జూపూడిగారు రాజలాంఛనాలతో పెండ్లికి రావచ్చును. వారికైనా ఒకరోజు 'పెరోల్' దొరికినందుకు చాలా సంతోషం. వారి వెంట రిజర్వుపోలీసులు వుంటారు. కాబట్టి పెండ్లి హడావుడిలో మన ఇంటికి ఎటువంటి భయమూ వుండదు. మ.రా.శ్రీ మార్కండేశ్వరరావు, రాజేశ్వరరావు మామయ్యగార్ల సలహా సంప్రదింపులతో, సూర్యం, రాజు, శంకరం, రాధా కృష్ణమూర్తుల సహకారంతో వివాహం విజయవంతం

చేయగలవు. ముఖ్యంగా సర్వశ్రీ శివప్రసాద్, హనుమంతరావు, వెంకటేశ్వరరావు గార్లకు నా అభినందనలు. శ్రీమతి హైమవతిగార్ని కూడా అడిగినట్లు చెప్పగలవు. ఇకవుంటా....

ఇట్లు

'నీ' "అన్న"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 15-3-1976.

వధువు చిరంజీవి హేమకు - నా శుభాశీస్సులు

నీ వివాహ శుభసమయానికైనా రాలేకపోయినందుకు నిజంగా బాధపడుతున్నాను. కాని ఏం చేస్తాను. మీ నాన్నగారికి నీ **"కన్యాదానం"** చేసే అవకాశం లేకపోయింది. నా చేతులతో నీ వివాహాన్ని చేసే ప్రాప్తం అంతకంటే లేకుండా పోయింది. అయినప్పటికి వివాహం విజయవంతంగా జరుగుతున్నందుకు మిక్కిలి ఆనందిస్తున్నాను. ఇక్కడ నుంచే దీవిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను నా చేతులతో నిన్ను అత్తవారింటికి పంపిస్తానని భావించాను. కనీసం ఆ శుభ సమయంలో అక్షింతలు వేసే అవకాశము కూడా లేకుండా పోయింది. కాని ఈ ఉత్తరం ద్వారా నిన్ను అత్తవారింటికి సాగనంపదలిచాను.

సర్వసంగపరిత్యాగి అయిన కణ్వమహర్షి శకుంతలను దుష్యంతుని ఇంటికి పంపేటప్పుడు ఎంతో బాధపడుతాడు. పెంచిన మమకారంతో కన్నీరు కారుస్తాడు. శకుంతలకు ఎన్నో నీతులు బోధిస్తాడు. హృదయం పరితపిస్తుంది. కంఠం స్తంభించి పోతుంది. చూపు మందగిస్తుంది. అరణ్యవాసమే నివాసముగా గల తనకే పెంచిన మమకారం ఇంతటి కలతను తెచ్చిపెట్టిందే అని ఆశ్చర్యపోతాడు. సన్యాసి అయిన తనకే ఇంత మమకారం వుంటే, ఇక కని పెంచిన తల్లితండ్రులకు, తమ కన్నకూతుర్ని అత్తవారింటికి పంపించేటప్పుడు ఎంత బాధపడుతారోగదా యని విలపిస్తాడు. నేను ప్రస్తుతం అదే స్థితిలో వున్నాను. ఆనాడు శకుంతలకు కణ్వమహర్షి చెప్పిన శ్లోకాన్నే నీకు ఈ ఉత్తరం ద్వారా వ్రాస్తూ నిన్ను అత్తవారింటికి సాగనంపుతూ వున్నాను.

**"శుశ్రూష స్వగురూన్ కురుప్రియ సఖీ, వృత్తిం సపత్నీ జనే**
**భర్తుర్వి ప్రకృతా పి రోషణ తయా, మాస్మప్రతీపంగమః**
**భూయిష్టం భవ దక్షిణా పరిజనే, భాగ్యేష్వనుత్సేకినీ**
**యాన్త్యేవం గృహిణీ పదం యువతేయో, వామాః కులస్యాధయః**

అనగా " నీ భర్త ఇంటియందున్న అత్తమామలను, పెద్దలను సేవింపుము. నీ భర్త స్వజనులైన ఆడుబిడ్డలను, తోడికోడళ్ళయందు ప్రియమైన స్నేహితురాలివలె నడుచుకొనుము. ఒకవేళ భర్త కోపగించినయెడల రోషముతో ప్రతీకారభావమును ప్రదర్శించకుము. అక్కడున్న సేవకుల విషయమున మిక్కిలి దయాదాక్షిణ్యములు కలదానవుగా ప్రవర్తించుము. సంపదల విషయమునందు గర్వము లేనిదానవు కమ్ము. ఇటువంటి సత్ప్రవర్తనలతో నడుచు స్త్రీలు **"ఉత్తమ ఇల్లాలు"** స్థానమును పొందుదురు. దీనికి వ్యతిరేకమైన నడవడి గలవారు యిరు వంశములకు తీరని మనోవ్యధను చేకూర్చిన వారవుతారు సుమా! " అని కణ్వమహర్షి అత్తవారింటికి పంపించుతున్న శకుంతలకు చెప్పిన నీతి వాక్యాలనే నేను నీకు వ్రాస్తున్నాను. తూ.చా తప్పకుండా ఆచరిస్తూ ఇటు పుట్టింటికి, అటు మెట్టినింటికి మంచిపేరుప్రతిష్ఠలను తీసుకొని వస్తావని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను. అట్టి సామర్థ్యమును, శక్తిని నీకు ప్రసాదించమని ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులను ప్రార్థిస్తున్నాను.

చిరంజీవులు గౌరీశంకర్, హేమలకు నాశుభాశీస్సులు

ఇట్లు

"నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 16-3-1976.

ప్రియమైన జయ,

చి॥హేమకు శుభాశీస్సులు పంపాను. అందియే వుండవచ్చును. నేను పెండ్లికి రావడంలేదనే విషయం ఈపాటికి నీకు తెలిసే వుండాలి. నాకు **"పెరోల్"** రాలేదని ముందుగా మీ అందరికీ తెలుస్తే నిరుత్సాహపడతారని తెలియజేయలేదు. పెండ్లి నిర్విఘ్నంగా విజయవంతంగా జరగాలని నాఅభిమతం. నేను రానందుకు అందరికి బాధగానే వుండవచ్చు. ముఖ్యంగా నీవు ఎక్కువ బాధపడుతావనే విషయం కూడా నాకు తెలుసు. కాని మన చేతులలో ఏమీ లేదు గదా! మీ నాన్నగారు శాశ్వతంగా ఈ లోకాన్ని వదలి వెళ్ళారు. అందువల్ల వారు వివాహానికి వచ్చే ప్రశ్నేలేదు. నేను ఈ లోకంలో వుండే రాలేకపోతున్నాను. విధి నిర్ణయం ఆ విధంగా వున్నది. నిరుటి సంవత్సరం ఈ రోజులలో ఉత్తరదేశయాత్రలో వున్నాం. మనం ఇంటికి వచ్చేటప్పటికి మా అత్తయ్య ఈ లోకాన్ని వదలివెళ్ళింది. ఆమె ఎంతోకాలం నుంచి మన దగ్గర ఉన్నది. నీవు ప్రత్యేకంగా ఆమెకు సేవ చేసావు. ఆఖరిలో మాట దక్కలేదు.

మనకోసం కలవరిస్తూ ఆమె కన్ను మూసింది. అదే సమయంలో మీ నాన్నగారు కూడా మంచం ఎక్కారు. ఆయనను చూసే యోగ్యత మనకున్నది. అఖరి క్షణం వరకు మాట్లాడుతూనే వున్నారు. పోతారని ఎవరూ ఊహించలేదు. బాగానే వున్నాడని ఆ రోజు ఉదయమే (ది. 21-6-1975) శంకరం కోదాడ వెళ్లాడు. అనుకోకుండా సాయంత్రానికి మీ నాన్నగారు కన్నుమూసారు. ఆయన పోయిన నాలుగు రోజులకే మీ అందర్ని వదిలిపెట్టి నేను యిక్కడకు వచ్చాను. నాకే ఆశ్చర్యంగా వున్నది. ఇదంతా ఒక కలలా ఉన్నది. **"హేమ"** పెండ్లికి నేను తప్పకుండా వస్తానని నీవు భావించివుంటావు. మనపిల్లలూ ప్రతిపూటా ఎదురుచూస్తూ వుండవచ్చు. వాళ్లకు నిరాశ, నీకు బాధ కలగడం సహజమే. ఎంతో ఘనంగా చేయాలని కుతూహలపడ్డ **"రాజు"** పెండ్లిని నా చేతులతో చేయలేకపోయాను. "హేమ" పెండ్లి చేయాలని ఎన్నో సంవత్సరాలు తీవ్రంగా ప్రయత్నించాను. పొలం అమ్మి డబ్బు సంతన చేసి కూర్చున్నారు మీనాన్నగారు. కాని ఏమి లాభం. ఆయన జీవితకాలంలో చేయలేక పోయారు. నాకూ ఆ అవకాశం లేకుండా పోయింది. ఒకప్రక్క "హేమ' పెండ్లి అవుతున్నదనే ఆనందం, మరొకచెంప మీ నాన్నగారు పోయారనే దు:ఖం, నేను కూడా రాలేదనే వ్యధ - అన్నీ నీ మనస్సులో ఒకదాని వెంబటి ఒకటి లీళ్లమాదిరిగా తిరుగుతూ వుంటాయి. మీ బామ్మ పరిస్థితిని ఆలోచిస్తుంటే నాకే బాధగా వున్నది. భర్తపోవడం, మీ నాన్నగార్ని పెంచుకోవడం, ఆయనకు సుస్తీచేయడం, ఆస్థిలో చాలా భాగం అమ్మడం, చివర్కి ఆమె బ్రతికివుండగానే మీనాన్నగారు పోవడం - నిజంగా ఆమె దురదృష్టవంతురాలే. **'చిత్రమైనదీ విధీనడక'** అన్నాడు ఒక సినిమాకవి. సినిమాలోనే కాదు జీవితంలో కూడ యిది యదార్థమే. కష్టాలనేవి ఒక్క సామాన్యులకు మాత్రమే కాదు. వీటి నుండి రాజాధిరాజులు కూడా తప్పుకోలేక పోయారు. వీరాధివీరుడైన శ్రీరామచంద్రునికే తప్పలేదు. సకలగుణ సంపన్నురాలైన సీతాదేవి సహితం కష్టాలను ఎదుర్కొన్నది. సత్యసంధుడైన హరిశ్చంద్రుడు కూడ ఈ కష్టాలను చవిచూచాడు. ధర్మ పరాయణుడైన ధర్మరాజే ఈ కష్టాలకు గురియైనాడు. అంతటివారికే తప్పలేదు. సామాన్యులమైన మనం ఎంతటివారం.

రామాయణం నిజంగా మహాకావ్యం. మనం నేర్చుకోవలసిన విషయాలు దానిలో ఎన్నో వున్నాయి. ముఖ్యంగా కష్టాలలో వున్నవారు చదువుతే కొంత ఊరడింపు కలుగక మానదు. లంకాపురిలో **"సీతాదేవి"** ఎదుర్కొనిన భీకర భయంకర పరిస్థితులను చదువుతుంటే వళ్ళు గగుర్పొడుస్తుంది. మనకే కాదు, అంతటి ధైర్యశాలి అయిన హనుమంతుని హృదయం సహితం ద్రవీభవిస్తుంది. బాధపడుతాడు, వ్యాకులత చెందుతాడు. **"సుందరకాండ"** లోని ఒక శ్లోకాన్ని వ్రాస్తాను.

"క్షితిక్షమా పుష్కర సన్నిభాక్షీ
యా రక్షితారాఘవలక్ష్మణా భ్యామ్
సా రాక్షసీభిర్వికృతేక్షణాబిః
సంరక్ష్యతే సంప్రతి వృక్షమూలే"

భూదేవివంటి ఓర్పు కలదియును, పద్మములతో సమానమైన నేత్రములు కలదియును అగు ఏ సీతాదేవి సత్య బల పరాక్రమ సంపన్నులైన రామలక్ష్మణుల చేత రక్షింపబడుచుండెడిదో, ఆ సీతాదేవి యిప్పుడు చెట్టుకింద వికృతమైన భయంకరమైన రాక్షస స్త్రీలచేత కాపలా కాయబడుచున్నది గదాయని హనుమంతుడు విలపిస్తూ **"కాలోహి దురతి క్రమః"** కాలము దాటుటకు శక్యము కానిదిగదా! అని అనుకుంటూ బాధపడుతాడు. అందుకోసమనే ఒక సినీకవి **"తప్పలేదీ విధీ బాధలు వారికైనా, తప్పునా సామాన్యులకునైనా"** అని తన బాధను ఒక సినిమాలో వ్యక్తం చేస్తాడు.

లంకాపురిలో సంభవించిన కష్టాలకు తట్టుకోలేక సీతాదేవి ఆత్మహత్య చేసుకొనివుంటే **"రామాయణ మహాకావ్యాన్ని"** మనకు అందించి వుండేవాడు కాదు వాల్మీకి మహర్షి. కొన్ని కొన్ని సమయాలలో సుఖము కంటే దుఃఖమువలననే జ్ఞానోదయం అవుతుంది. అనుభవాన్ని గడిస్తాం. ప్రపంచ చరిత్రను పరికిస్తే, లోకశ్రేష్ఠులైన మహానుభావుల జీవితాలను పరిశీలిస్తే, మనకు ఒకే ఒక నగ్నసత్యం కనపడుతుంది. దుఃఖాల నుండి, కష్టాలనుండి మాత్రమే విశేషమైన, మహోత్కృష్ట మైన ప్రబోధనలు చేసారు. **'ప్రచండ దుఃఖంలోనే మానవుడు తన అస్థిత్వాన్ని గుర్తిస్తాడు'** అంటాడు ఒక మహాప్రవక్త. **"బాధలవంటి కఠినపాఠాలు వేరొకటి వుండవు. వాటిని సాధించినవారికి జీవితంలో అపజయం వుండదు"** అంటారు శ్రీజవహర్‌లాల్ నెహ్రూ. ప్రతి జీవికి బాధలు, కష్టాలు రావడం సహజం, ధైర్యంతో ఆత్మవిశ్వాసంతో వాటి నెదుర్కొనాలి. కాని వాటికి దాసులం మాత్రం కారాదు. నవ్వుతూ నవ్వుతూ వాటిని ఆహ్వానించాలి, ధైర్యంతో తిరిగికొట్టాలి! ఓర్మితో అనుభవించాలి, పరాక్రమంతో పారద్రోలాలి! ఓర్పుతో వ్యవహరించాలి, సాహసంతో తరిమివేయాలి! సద్బుద్ధితో స్వీకరించాలి, స్వశక్తితో ఎదుర్కొనాలి - ఇదే ఈనాటి మన కర్తవ్యం, విద్యుక్త ధర్మం. ఇంకా కన్నీరు కారుస్తున్నావా? లే? అవి ఆనందబాష్పాలుగా మారాలి. శుభముహూర్తం సమీపిస్తున్నది. విషాదఛాయలు నీ మోమున కన్పడరాదు. సంతోషంతో పెండ్లి వారిని ఆహ్వానించు. ఉత్సాహంతో వివాహ మహోత్సవాన్ని విజయవంతం చేయాలి. నీవే దిగులుపడి కూర్చుంటే మీ అమ్మ పరిస్థితి ఏమి కావాలి. మీ బామ్మ స్థితి ఊహించావా? "హేమ" పరిస్థితి ఎట్లా వుంటుందో ఆలోచించావా. ఇటువంటి

క్లిష్ట సమయంలోనే నీ బోటివాళ్లు విజ్ఞతను ప్రదర్శించాలి. అందర్ని రక్షించేవాడు, నడిపించేవాడు ఆ భగవంతుడే. ఆయన మీద భారంవేసి ముందుకు సాగిపోవటం ఒక్కటే ఈనాటి మన కర్తవ్యం. రాముడికి వ్రాసిన ఉత్తరంలో 'రాజు' విషయం కొంచెం ప్రస్తావించాను. వాడికి బాధ కలిగివుండవచ్చు. నాకు ఎవ్విధమైన కోపం వాడిమీద లేదు. నాకు కల్గిన బాధను వ్రాసాను అంతే. బందరు నుంచి ఉత్తరం 'రాజు' వ్రాశాడు. చాలా ఆనందించాను. వాడు, గాయత్రీ యిక్కడికి వస్తామన్నారు. పంపగలవు. శంకరానికి చిన్నవయస్సులోనే బాధ్యతలు మీదపడ్డాయి. వాడికి ధైర్యంచెప్పగలవు. గిరీశం చిన్నవాడు. వాడికి కూడా నీవే ధైర్యం చెప్పాలి. మీరందరూ ధైర్యంగా విజయవంతంగా వివాహ ప్రయత్నాలు చేస్తున్నందుకు చాలా ఆనందంగా వున్నది. నేను లేకపోయినప్పటికీ నా తమ్ముళ్ళు ఎక్కువ శ్రద్ధ తీసుకొని "హేమ" వివాహాన్ని జరిపించుతున్నందుకు గర్విస్తున్నాను. పెండ్లిలో వచ్చే చిన్న చిన్న విషయాలకు ప్రాధాన్యత యివ్వకుండా, లౌకికంగా వ్యవహరించి శుభకార్యాన్ని విజయవంతం చేస్తారని ఆశిస్తున్నాను. పట్టుదలకు పోవద్దు. హుందాతనంగా వ్యవహరించి పెండ్లివారిని సంతోషంగా సాగనంపుతారని విశ్వసిస్తున్నాము. అందరిని అడిగినట్లు చెప్పగలవు. ఇక వుంటా.....

ఇట్లు

"నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 31-3-1976.

ప్రియమైన జయ,

చాలాకాలం తరువాత నీ సుదీర్ఘమైన ఉత్తరం చూచి చాలా సంతోషించాను. వివాహ విషయాలను గురించి వివరంగా వ్రాసినందుకు మిక్కిలి సంతృప్తి జెందాను. నేను రాలేకపోయినప్పటికీ నీ **"ప్రత్యక్ష వ్యాఖ్యానం"** వలన అన్ని విషయాలు చూచినట్లుగానే భావించాను. ఈరోజు **"ఉగాది"**, వచ్చే నెల9వతేదీన **'శ్రీరామనవమి'** ఆ పండుగతో ఒక సంవత్సరంలో వచ్చే అన్ని పండుగలు **'శ్రీకృష్ణ జన్మస్థానం'** లోనే జరుపుకున్నట్లవుతుంది. కొంతమందికి ఆనందాన్ని చేకూర్చే పండుగలే మరికొంతమంది హృదయాలలో దావాగ్నిని రగులుకొలుపుతాయి. కొంతమందికి సంతోషం, మరి కొంతమందికి దుఃఖం, కొంతమందికి ఉల్లాసం, మరికొంతమందికి నీరసం, కొంతమందికి మంచి, మరి కొంతమందికి చెడు.

సుఖదుఃఖముల మిళితమే జీవితం. అదే అర్థం కాదు మానవులకు. భగవంతుని లీలలు అదే విధంగా వుంటాయి. ముఖ్యంగా మనలాంటివారికి సంక్షోభాన్ని తెచ్చిపెట్టిన రాక్షస నామసంవత్సరం వెళ్ళిపోయింది. నల నామ సంవత్సరంలో అడుగుపెట్టాం. అంతా శుభమే కలుగవచ్చునని భావించడంలో పొరపాటు లేదేమో. కాని పోయిన సంవత్సరము యొక్క దుష్ఫలితాలు, నూతన సంవత్సరంలోని మొదటి భాగంలో కొంతవరకు వుంటాయని పెద్దలు చెబుతుంటారు. కాలం గడుస్తే గాని తెలియదు. సుఖము, దుఃఖము అనెడి కిరీటాలు రెండూ కలిసి మానవుని దగ్గరకు వస్తాయట. అయితే అమాయకుడైన మానవుడు సుఖమనే కిరీటానికి మొదట స్వాగతం చెప్పి నెత్తిమీద పెట్టుకుంటాడు. సుఖాన్ని కోరే మానవుడు దుఃఖాన్ని కూడా ఏదో ఒకరోజున స్వాగతం చెప్పి తీరవలసి వస్తుంది. ఈ రోజు సంవత్సరాది, మొదటి పండుగ. పొద్దున లేచి కాలకృత్యాలు నెరవేర్చుకొని చేదుగా వున్న వేప ప్రసాదమును తింటాం. దాని తరువాతనే ఏదైనా ఆరగిస్తాం. ఇది మన పెద్దలు ఏనాడో ఏర్పాటు చేసిన సాంప్రదాయం. జీవితం చేదుతో ప్రారంభమవుతుందని దీని అర్థం. అంటే విషతుల్యమైన కష్టాన్ని కూడా మ్రింగడానికి సంసిద్ధం కావాలని పెద్దలు ఈ సంప్రదాయాన్ని దూరదృష్టితో ఏర్పర్చారు. చేదుని చవిచూచిన నోరు, తీపిని సంతోషంతో స్వీకరించ గలుగుతుంది. తీపిని తిన్ననోటికి చేదు వెగటుగా తోస్తుంది. అనగా కష్టపడ్డవాడు సుఖపడటం తేలిక. సుఖపడ్డవాడు కష్టపడటం కష్టం. ఈ రెంటిని సమదృష్టితో చూడాలని మన పెద్దల ఆదేశం.

**"ఏదైనా కాలమే నిర్ణయించాలి"** అని నీవు వ్రాశావు. అది నిజమే. కాని కాలం మీద భారం వేసి ప్రయత్నం చేయకుండా వుండటం మాత్రం విజ్ఞత కాదు. సత్యం కోసం ప్రాకులాడేవారు అనేక యిక్కట్లపాలు కావడం అనాదిగా వస్తున్న సాంప్రదాయమే. పిరికితనంతో వెనుకంజ వేయడం మాత్రం మంచిది కాదు. కడుపునిండా తినడానికి కూడా నోచుకోనటువంటి నిర్భాగ్యుడు, చేతిలోచిల్లిగవ్వ లేకపోయినా, సహాయం చేసేవారు కనుచూపులో కనుపించకపోయినా, అమెరికాలో జరుగుతున్న ప్రపంచ మత మహాసభలకు వెళ్ళాలని నిశ్చయించు కున్నాడు స్వామి వివేకానంద. ఎన్నో కష్టాలకు గురైనప్పటికి ధైర్యాన్ని విడనాడలేదు. తీవ్రప్రయత్నం చేసాడు. అమెరికా వెళ్ళాడు. ఎంతో కష్టంమీద కొన్ని నిముషాలు మాత్రం ప్రసంగించటానికి అనుమతిని పొందాడు. ఆ సభలో ప్రవేశించడానికి కూడా అంగీకరించని పెద్దలే ఆయనకు తరువాత నీరాజనాలర్పించారు. ప్రతి పట్టణాన స్వాగత తోరణాలు కట్టారు. ఆయన మహోపన్యాసాలను వినడానికి వేలాది మంది ప్రజలు వచ్చేవారు. పాశ్చాత్య దేశాలలో వివేకానంద పేరు మారుమ్రోగింది.

భారతీయ సంస్కృతీ ఔన్నత్యాలను ప్రపంచానికి చాటాడు. ప్రపంచానికి ఎప్పటికైనా ధర్మభిక్ష పెట్టగలిగేది ఒక్క భారతదేశమేనని నిరూపించాడు. వారిచేత వప్పించాడు. ఆనాటి విపత్కర పరిస్థితులకు స్వామి వివేకానంద తల ఒగ్గివున్నట్లయితే భారతీయ ఘనత ప్రపంచానికి చాటబడి వుండేదా? భారతీయుల గొప్పదనం విదేశీయులకు అర్థమయ్యేదా? ఆ మహాశక్తి నుండి మనం నేర్చుకోవలసింది ఎంతోవున్నది. ఆయన ఒక పర్యాయం మాట్లాడుతూ "**సత్యమునే అనుసరించుము. సత్యమును విశ్వసించుము. సత్యమునకై దేనినైనను త్యజించవచ్చు కాని, దేని కొఱకైనను సత్యమునే మాత్రం త్యజించరాదు. నాకు కావల్సింది సత్యం. సత్యమునకు ఎప్పుడూ అసత్యముతో పొత్తు కుదరదు. విశ్వమంతయు ప్రతిఘటించిననూ సరే సత్యము తుదకు నెగ్గి తీరును**" అని ఎంతో ఆత్మవిశ్వాసంతో చెబుతూ "**ప్రశాంతత, నిలకడ, దీక్ష**" మాత్రం కావలెనని అంటారు. మహానుభావుల జీవితాలు ఇవే నిరూపించాయి. ఏ పని అయినాసరే ప్రయత్నం లేకుండా జరుగదు. చిట్టచివరకు అడగందే అమ్మయినా అన్నం పెట్టదు. ఇదే వాస్తవాన్ని ఈ నీతిశ్లోకం చాటుతున్నది.

"గచ్ఛన్ పిపీలికా పంక్తిః, సముద్రమధిగచ్ఛతి
అగచ్ఛన్ వైనతేయో పి, పదమేకంనగచ్ఛతి"

అతి నెమ్మదిగా నడుచుచూ వెళ్ళుచున్న చీమలబారు ఎప్పటికో ఒకప్పటికి సముద్రమును కూడ చేరగలవు. అతి బలవంతుడు, వాయువుతో సమాన వేగం గల గరుత్మంతుడు సహితం తన బలమైన రెక్కలను ఆడించకుండా, కదలకుండా కాళ్ళు ముడుచుకొని కూర్చుంటే ఒక్క అడుగుకూడా ముందుకు పోలేడు. దీనివల్ల మనం ఒక నీతిని నేర్చుకోవచ్చును. ప్రయత్నంమీద ఎంత చిన్నవారైననూ గొప్ప పనిని సహితం సాధించవచ్చు. ఎంతటి గొప్పవారైననూ ప్రయత్నం చేయకుండా, కనీసం చిన్నకార్యాన్నయినా సాధించలేరు. కనుక ఫలితాన్ని ఆశించకుండా విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించడం మన విధి. మొదట కావలసింది దృఢమైన సంకల్ప బలం. మిగతావన్నీ వాటంతట అవే సమకూరుతాయి. మనం ఆశించకపోయినా, మన కర్తవ్యాన్ని మనం నిర్దుష్టంగా నిర్వర్తిస్తుంటే ఫలితాలు వాటంతట అవే వస్తాయి. శ్రమపడటం నేర్చుకోవాలి. ఈ జీవనసాగరాన్ని దాటాలంటే వట్టి మాటలవల్ల ప్రయోజనం లేదు. కృషి అత్యవసరం. నరకాన్ని దాటిన తరువాతనే స్వర్గానికి చేరుకోగలుగుతాం. అందుకోసమే స్వామి వివేకానంద "**లక్ష్యమునంటి పెట్టుకొని ధైర్యంగా ముందుకు సాగిపొండు. వెనుకకు తిరిగి చిన్న చిన్న తప్పులను, అల్పవిషయాలను చూడకుడు, పోరాటమునకు వజ్రసంకల్ప మవసరం.**" అని హెచ్చరించాడు. సుఖాన్ని పొందటానికి కష్టాన్ని చవిచూడాలి. ఆనందాన్ని అనుభవించడానికి దుఃఖాన్ని రుచి

చూడాలి. చేదు యొక్క రుచి చవి చూస్తే, తీపి యొక్క మాధుర్యం ఎంతటిదో అర్థమవుతుంది. కష్టాలను నవ్వుతూ, నవ్వుతూ ఎదుర్కొంటేనే సుఖాన్ని చేరుకోగలుగుతాం. కష్టాల్లకు తలవంచుతే అదే ప్రవాహంలో కొట్టుకొని పోతాం. ఇంకా బయటపడలేం. ఈ వాస్తవాన్ని అర్థం చేసుకొని ముందుకు ధైర్యంగా సాగిపోవాలి. ఇక వుంటా.....

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 12-4-1976.

ప్రియమైన జయ,

శ్రీరామనవమి విజయవంతంగా జరిగింది. **'సుందరకాండ'** పారాయణం పూర్తి అయిన సందర్భమున శాంతి సంతర్పణ చేశాం. రాత్రి పూట ఆర్కెస్ట్రాతో భజనలుకూడా చేశాం. ప్రస్తుతం దేశం ఎదుర్కొంటున్న విపత్కర పరిస్థితులను అధిగమించడానికి **'శ్రీరామచరితం'** ఎంతో ఉపయోగపడుతుందని నా విశ్వాసం. అందువలన రామాయణ మహాకావ్యంలోని కొంతమంది ప్రముఖుల వ్యక్తిత్వాలను గురించి క్లుప్తంగా వివరించదలిచాను.

**"రామాయణ మహాకావ్యము యావత్ భారత జాతి యొక్క సర్వస్వమై వెలయుచున్నది. శతాబ్దముల తరబడిగ జాతి యొక్కవిచారధారను, కావ్య ప్రపంచమును ఇంతగా ప్రభావిత మొనర్చిన మతియొక కావ్యము ప్రపంచముననే సాహిత్యముననుకానరాదు."** అని జర్మన్ పండితుడు **'వింటర్ నిట్జ్'** వ్రాశాడు.

ఈ మహాకావ్య విశిష్టతను, శ్రీరాముని ప్రతిభను గ్రహించిన కీ॥శే॥ మహాత్మాగాంధి **'రామరాజ్యాన్ని నెలకొలపటమే నా పరమావధి'** అని చెప్పారు. కాని కొంతమంది అభ్యుదయవాదులమని భావించే నాయకులకు ఇది ఏమాత్రం నచ్చలేదు. ఈ పిచ్చికొల్లాయి కట్టిన ముసలిగాంధి సనాతనమైన రామరాజ్యాన్ని అభిలషిస్తున్నాడని విమర్శించారు. కాని గాంధీజీ తన ఆశయాన్ని విడనాడక రామరాజ్యాన్ని గురించే ప్రచారం చేయసాగాడు. కారణం శ్రీరాముని వ్యక్తిత్వం అటువంటిది. ఆయన ఆదర్శప్రాయుడు, పురుషోత్తముడు, మాతాపితృభక్తుడు, ఏకపత్నీ వ్రతుడు, సర్వలక్షణ సంపన్నుడు, సత్యసంధుడు, జితేంద్రియుడు, ధర్మరక్షణపరాయణుడు, శరణాగత రక్షకుడు, మహా బల సంపన్నుడు, రాజనీతి

కోవిదుడు, వేదవేదాంగ తత్వజ్ఞుడు, ప్రజానురంజకుడు, విశుద్ధమైన ప్రజాస్వామ్యవాది. అందువలననే **"రామరాజ్యాన్ని'** పునఃప్రతిష్టించాలని మహాత్మాజీ తహతహలాడేవారు.

శ్రీరాముడు ప్రజాభిప్రాయానికి మిక్కిలి ప్రాముఖ్యత నిచ్చేవాడు. సామాన్య ప్రజల మనోభావాలను ఎప్పటికప్పుడు తన గూఢచారి విభాగం ద్వారా తెలుసు కుంటూ, తదనుగుణంగా, ఆదర్శవంతమైన, ధర్మ పరిపాలన కొనసాగించాడు. ప్రజాభిప్రాయాన్ని మన్నించిన మానవోత్తముడు. **"లోకారాధన కోసం స్వజనులపట్ల స్నేహాన్ని మానుకోవలసివచ్చినా, దయను, మమకారాన్ని విడచి నిష్ఠూరంగా వ్యవహరించ వలసి వచ్చినా, సుఖ రాజ భోగాలను త్యజించవలసి వచ్చినా, అన్నింటికీ మించి "సీత" ను పరిత్యజించవలసి వచ్చినా నేను బాధపడను'.** అని శ్రీరాముడు అంటాడు. తన జీవిత సమరంలో తాను ఆ ఆదర్శాలను ఆచరించి, ఆదర్శమైన పరిపాలన కొనసాగించాడు మారుమూల గ్రామంలోని పూరిగుడిశనుంచి అర్ధరాత్రి వినపడిన మాటలను తన వేగులవారి ద్వారా విని, నిండుచూలాలు అయిన తన ప్రియురాలైన, తన సహధర్మచారిణి అయిన సీతను నిర్దాక్షిణ్యంగా అరణ్యానికి పంపించివేశాడు. ప్రజాభిప్రాయాన్ని శ్రీరాముడు ఏవిధంగా మన్నించేవాడో ఈ ఉదంతంవల్ల అర్థం చేసుకోవచ్చు. ఈనాటి స్వార్థపూరిత వాతావరణంతో పోల్చుకుంటే రామరాజ్య వైశిష్ట్యమును బాగా అర్థం చేసుకోవచ్చు.

తండ్రి యాజ్ఞానుసారం 14 సంవత్సరాలు వనవాసం చేసిన పితృభక్తి పరాయణుడు. ధర్మాచరణం అతని ప్రాణం. అరణ్యవాసానికి బయలుదేరేటప్పుడు తల్లి అయిన కౌసల్య విలపిస్తుంది, తనతోపాటు అరణ్యానికి వస్తానంటుంది, చివరికి చచ్చిపోతానని బెదిరిస్తుంది. అప్పుడు శ్రీరాముడు తల్లిని ఓదారుస్తూ **"తండ్రి వాగ్దానమును నిలబెట్టడం పుత్రుని కర్తవ్యం. కనుక నేను అడవులకు వెళ్ళుతున్నాను. పతివ్రతయగు స్త్రీకి భర్త సేవ చేయడం కంటే వేరొకధర్మము లేదు. కనుక అయోధ్యలో వుండి నా తండ్రిదశరథునికి సేవ చేయడం నీ ధర్మం."** అని అంటాడు. తరువాత జటాజినధారియై, సీతాలక్ష్మణులతో సహా శలవు తీసికొనడానికి తండ్రి వద్దకు వెళ్ళుతాడు. వారిని చూచి శోకావేశపరుడై దశరథుడు మూర్ఛిల్లుతాడు. రామలక్ష్మణులు కొంచెం సేపు సపర్యలు జరుపగా తెలివి వస్తుంది అడవులకు వెళ్ళవద్దని పట్టాభిషిక్తుడై రాజ్యాన్ని పాలించమని కోరుతాడు. శ్రీరాముడు అంగీకరించడు. **"నాకు రాజ్యముపైన గాని, రాజ్యసుఖములపైనగాని ఎట్టి వ్యామోహం లేదు. నీ వాగ్దానం నిలబెట్టుటే నా పరమావధి. పుత్రవ్యామోహ పరవశుడవై దుఃఖింపకుము. నేను కోరునది ఒకటియే. నీవు సత్యమును పాలించుట, వాగ్దానభంగం చేయకుండుట"** అని చెప్పి సత్యసంధుడైన శ్రీరామచంద్రుడు తండ్రి వాగ్దానమును నిలబెట్టుటకై అడవులకు పయనమైపోతాడు,

శోకావేశపరుడై పుత్రశోకంతో దశరథుడు మరణిస్తాడు. భరతుడు సపరివారంతో దండకారణ్యానికి వెళ్ళి రాజ్యాన్ని స్వీకరించమని ప్రార్థిస్తాడు. జాబాలి, వశిష్ఠులు కూడా కోరుతారు. 14 సం॥రాల వనవాసాన్ని తానే చేస్తానని భరతుడంటాడు. ప్రయోజనం లేకపోవటం వలన చిట్టచివరికి భరతుడు ప్రాయోపవేశమునకు పూనుకుంటాడు. అప్పుడు శ్రీరాముడు భరతుని ఓదారుస్తూ **"నేను తండ్రి ఆజ్ఞను శిరసావహించి అడవులకు వచ్చాను. ఇది నా ధర్మం. నీవు కూడా తండ్రి యాజ్ఞానుసారము రాజ్యపరిపాలన చేయుట నీ ధర్మము"** అని చెప్పి పంపించి వేస్తాడు భరతుణ్ణి. దీనివల్ల శ్రీరాముని ఉదారత, ధర్మ నిష్టా పరాయణత్వం, నిస్వార్థబుద్ధి అవగతమవుతున్నది. ఏదో విధంగా అధికారం పొందాలనే తాపత్రయం ఆయనలో ఏ మాత్రం గోచరించదు. రాజ్యాధికారాని కన్నా, ధర్మానికే ఎక్కువ విలువ యిచ్చి భావితరాల వారికి ఆదర్శప్రాయుడైనాడు. అందువల్లనే మహాత్మాగాంధీజీ దూరదృష్టితో రానున్న విష పరిణామాలను ముందుగానే ఊహించి శ్రీరామచంద్రుని ఆదర్శంగా గైకొనమని తన అనుచరులకు, ప్రజలకు బోధించాడు.

శ్రీరాముని భాతృప్రేమ వర్ణనాతీతము. సోదరులంటే అతనికి అమితమైన ప్రేమ. ఒకమారు లక్ష్మణునితో **"భరతుడుగాని, శత్రుఘ్నుడుగాని, నీవుగాని లేకుండా ఎట్టి అల్పమగు సుఖమును కోరను. ఒకవేళ అటువంటి కోరిక ఉదయిస్తే దానిని అగ్నిహోత్రుడు భస్మము చేయుగాక! ఈ భూమిని నా కొఱకు గాక, మీ కొఱకు కావలెనని కోరుచున్నాను. మిమ్ము సంతోషపెట్టుటకును, సుఖమును కలుగజేయుటకును నాకు రాజ్యమపేక్షితము"** అని శ్రీరాముడు అంటాడు. అంతేగాక యుద్ధంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు విలపిస్తూ **"నాకు రాజ్యముతోనేమి పని? అతను లేకుండగ బ్రతికి మాత్రమేమి చేయుదును? ఇక యుద్ధము మాత్రమేల చేయవలెను? నేను వనమునకు బయలుదేరునపుడు, ఎట్లు ఈ మహాద్యుతియగు లక్ష్మణుడు బయలుదేరెనో? యట్లే యమసదనము కరుగు లక్ష్మణుని వెంట నేను బయలుదేరుదును. ఏ దేశమునకు వెళ్ళినను భార్యలు దొరుకుదురు. బంధుత్వ మేర్పర్చుకొనవచ్చును. కాని సహోదరుడగు "భ్రాత" లభించు దేశమేదియూ కానరాదు"** అని శ్రీరాముడు విలపిస్తాడు. ఆదర్శవంతమైన సోదరప్రేమ ఏ విధంగా వుంటుందో ఆచరించి, అనుసరించి మనకు చూపించాడు శ్రీరాముడు.

తనను అరణ్యవాసానికి పంపడానికి కారణభూతురాలైన కైకను చూచి **"అమ్మా! అడవిలో వుండి శరీరపోషణం చేసుకొనే భారం మాత్రం నామీద పెట్టావు. పాపం! కుర్రవాడు భరతుని మీద సమస్త భువనపోషణ భారమూ మోపావు. మా ఇద్దరిలో ఎవరికి ఎక్కువ సౌకర్యము కల్గించావని** విచారిస్తే నీకు నా యెడలనే పక్షపాతం ఉన్నట్లు

**కనిపిస్తున్నది"** అని శ్రీరాముడు అంటాడు. విషాన్ని కూడా మధురంగా స్వీకరించగల విశాల ఉదార సంపన్నుడు శ్రీరాముడు. తనను ద్వేషించినవారిని కూడా మృదుమధురంగా పలుకరించగల సహనశీలి. అంతేకాదు సహజ సహన స్వభావ శక్తియుక్తులు కలవాడు శ్రీరాముడు.

యుద్ధంలో నిరాయుధుడైన రావణుని చంపకుండా **"రాక్షసరాజా! లంకాపట్టణములోకి వెళ్ళి కొంచం విశ్రాంతి తీసుకో! రథారూఢుడవై ధనుస్సుతో సహా తిరిగి మళ్ళీరా! అప్పుడు నాతో పోరాడు"** అని ఎంతో హుందాతనంగా, ఔదార్యంతో - నిస్సహాయుడై యున్న రావణునితో యుద్ధభూమిలో అంటాడు. ప్రియమైన తన అర్ధాంగియైన సీతను అపహరించిన దుష్టుడైనప్పటికీ, అవకాశం దొరికింది గదాయని అధర్మంగా చంపలేదు. యుద్ధనీతిని తూచా తప్పకుండా అనుసరించిన ధర్మశ్రేష్టుడు. సర్వశక్తి సంపన్నుడు, యుద్ధనీతి కోవిదుడు శ్రీరామచంద్రుడు.

శత్రువులకు కూడా శ్రీరాముని యెడల అత్యున్నతమైన గౌరవ భావం వుండేదని ఈ సంఘటనవల్ల అర్ధమవుతున్నది. రావణుని కుమారుడైన మేఘనాధుని యుద్ధంలో లక్ష్మణుడు చంపుతాడు. భార్య సులోచన సహగమనం చేయ సంకల్పించుకుంటుంది. భర్త శవం యుద్ధభూమిలో పడి ఉన్నది. అప్పుడు రావణుడు తన కోడలిని శ్రీరాముని శిబిరానికి వెళ్ళి భర్త శవం తెచ్చుకోమంటాడు. శత్రుశిబిరానికి బంటరిగా వెళ్లడానికి సంశయిస్తుంది సులోచన. అప్పుడు రావణుడు **"బాలబ్రహ్మచారి హనుమంతుడు, జితేంద్రియుడు లక్ష్మణుడు. ఏకపత్నీవ్రతుడు రాముడున్న చోటికి నిర్భయంగా వెళ్ళవచ్చును. అమ్మా!"** అని అంటాడు. అప్పుడు **"మీరు రాముని భార్యను తెచ్చారే అలాంటి రాముని దగ్గరికి మీ కోడలిని పంపటం ఉచితమా!"** అని సందేహాన్ని వెలిబుచ్చుతారు మంత్రులు. అప్పుడు **"పరస్త్రీని అపహరించడం ఈ రావణుని పనికాని రామునిపని కాదు"** అని రావణుడు అంటాడు. శత్రువులకు కూడా శ్రీరాముని యెడల ఎటువంటి సద్భావం వుండేదో దీనివల్ల మనం అర్ధం చేసుకొనవచ్చు.

సీత అడవులలో వున్నప్పుడు అశ్వమేధయాగం చేయ సంకల్పించుకుంటాడు. సతీసమేతుడైనవాడే ఈ యాగాన్ని చేయటానికి అర్హుడు. అటువంటి సమయంలో కూడా ద్వితీయ పత్నిని పరిగ్రహించడానికి అంగీకరించక సువర్ణ సీతామూర్తిని ప్రక్కన పెట్టుకొని యాగం పూర్తిచేస్తాడు. ఆరోజులలో బహుభార్యాత్వం తప్పుకాదు. తండ్రియైన దశరథుడికి 350 మంది పైనే భార్యలుండేవారుట. అటువంటి సమాజ పరిస్థితులలో కూడా శ్రీరాముడు **"ఏకపత్నీ వ్రతాన్ని"** విడనాడలేదు. ఈ సంఘటన శ్రీరాముని సౌశీల్యాన్ని యినుమడింపజేసింది.

సచ్ఛీల గుణసంపత్తి గలవాడు కావటంవల్లనే శ్రీరాముని మహాత్మా గాంధీజీ ఆదర్శంగా గైకొనినాడు. ఆ మహనీయుని ఈనాటి పాలకులు అనుసరిస్తే సంక్షోభమనేదానికే తావుండదు. అందుకోసమనే వేల సంవత్సరాలైనప్పటికి శ్రీరాముని ప్రజలు మరువలేదు, మరువరు. భారతదేశంలోని అన్ని తరగతుల ప్రజలలో ఆ మహనీయునికి స్థానం ఎల్లప్పుడూ ఉంటుంది.

మిగతా వివరాలు వచ్చే ఉత్తరంలో వ్రాస్తాను. ఇకపోతే నీవు వ్రాసే ఉత్తరాలు చాలా ఉన్నతస్థాయిలో ఉంటున్నాయని 'ఇంటెలిజన్స్' అధికారుల అభిప్రాయం. కష్టాలువచ్చి నప్పడే భయకంపితులు కాకుండా నిశ్చలమైనబుద్ధితో హుందాతనంగా వ్యవహరించడంలోనే ఉన్నది గొప్పతనం. ఇక్కడ డిటెన్యూలకు వారి భార్యలు వ్రాస్తున్న ఉత్తరాలను కూడా అధికారులు పరిశీలించి నీవు వ్రాస్తున్న ఉత్తరాలను చూచి, అధికారులు నీ ఉత్తరాల ఉన్నతస్థాయిని ప్రశంసిస్తున్నారు. నాకు చాలా ఆనందంగా ఉన్నది. ఈ మధ్య అనగా ది. 5-4-76 న అమ్మగారు, నాన్నగారు, సూర్యం, రాజు, గాయత్రి, భారతి వగైరాలు నన్ను చూడటానికి వచ్చారు. అప్పడు నాన్నగారు నన్ను చూచి దుఃఖం ఆపుకోలేక ఏడిచారు. పావుగంట అయిన తరువాత నిభాయించు కున్నారు. ఆయన ఆనాడు పడిన వేదనను చూచి నేను బాధపడ్డాను. అయితే చేయగలిగిందేమీ లేదు గదా! ఇంకా వుంటా..

ఇట్లు
'నీ '

సెంట్రల్ జైలు రాజమండ్రి
ది. 15-4-1976.

ప్రియమైన జయ,

**"ఏ దేశ వాఙ్మయము నైనను శ్రీరామచంద్రుని వంటి పురుషోత్తములు లభించిన లభించవచ్చునేమోగాని, సీత వంటి యాదర్శచరిత్రగల పతివ్రతా తిలకము లభించుట దుర్లభము"** అని స్వామి వివేకానంద అంటారు. అందువల్లనే శ్రీమద్రామాయణ మహాకావ్యమందు వాల్మీకి సీతాదేవికి శ్రీరామునితో సమానమగు ప్రాధాన్యత యిచ్చాడు. అంతేకాదు! ఈ మహాకావ్యమునకు **"సీతాయాశ్చరితమ్"** అని పేరుకూడా పెట్టాడు. ఆమె ఒక్క భారతనారీ లోకమునకే గాక యావత్ ప్రపంచ నారీలోకానికే ఆదర్శప్రాయురాలైంది. నిశ్చలమగు పతి భక్తి, పెద్దలయెడల గౌరవము, ధర్మనిష్ఠ, వినయ వివేక సౌశీల్యాదులు, కష్టములయందు అచలత్వము, అసాధారణమగు

క్షమ, కరుణ, నిర్మలప్రేమ,పవిత్రత మొదలగు సద్గుణములన్నియూ ఈమెలో ఇమిడి నిబిడీకృతమై వున్నవనుటలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. స్త్రీ యొక్క నడవడిక, సుగుణశీల సంపత్తులు ఏ విధంగా వుండాలో, తన జీవనగమనం ద్వారా చూపించిన మహాసాధ్వీమణి, పతివ్రతా శిరోమణి సీతాదేవి.

తండ్రి ఆజ్ఞానుసారం శ్రీరామచంద్రుడు అరణ్యానికి బయలుదేరేటప్పుడు తనను కూడా తీసుకొని వెళ్ళమని బ్రతిమాలుకుంటుంది, ప్రాధేయపడుతుంది. శ్రీరామునితో **"భర్త లేని స్వర్గసుఖములకంటే, భర్తతో అరణ్యవాస దుఃఖమునే వరింతును. నీతో నుండుటయే స్వర్గము. నీతో కలిసియున్నచో నా కదియే పరమ సుఖము. నిన్ను విడిచి వుండుటయే నాకు నరకము. కనుక నన్ను తీసుకొనిపొమ్ము.'**అని విలపిస్తూ వెంటబడుతుంది. మరియు **"నన్ను ఐశ్వర్యముగాని, ధనముగాని లోభపెట్ట చాలవు. సూర్యుని విడిచి వెలుగు ఎట్లుండదో నిన్ను విడిచి నేను అట్లుండలేను."** అని అంటుంది. తనను వనవాసమునకు తీసుకొని వెళ్లనియెడల విషము త్రాగియో, నీటిలో పడియో, అగ్నిలో దుమికియో మరణిస్తానని బెదిరిస్తుంది. శ్రీరాముడికి తప్పనిసరి అవుతుంది. వనవాసానికి తనతోపాటు తీసుకొనివెళ్లుతాడు. సుఖములోనే కాక, దుఃఖములో కూడా పాలు పంచుకోవటం నిజమైన భారత నారీ ధర్మమని నిరూపించింది సీత. అరణ్యవాసమున ఎట్టి కష్టములు కలుగజేయనని , పత్ర, పుష్ప,ఫలాదులలో ఏమి యిచ్చినప్పటికి దానినే అమృతప్రాయంగా స్వీకరించి, ఏమాత్రం భారం లేకుండా అనుసరిస్తానని వాగ్దానం చేస్తుంది సీత శ్రీరామునికి. నిర్మలమైన ప్రేమ, నిష్కపట బుద్ధికి యివి నిదర్శనములు కావా!

సీతాదేవి యెంత పతివ్రతయో అంత త్యాగమూర్తి. విరాధుడను రాక్షసుడు రామలక్ష్మణులను ఎత్తుకొని పారిపోవుచుండుట చూచి ఆమె పెద్దగా రోదిస్తూ "మాంహరోత్సృజ కాకుత్ స్థౌ నమస్తే రాక్షసోత్తమ" (తనను భక్షించి రామలక్ష్మణులను వదిలివేయమని) అని వేడుకుంటుంది. తన పతి కొరకు తన జీవితాన్ని సంతోషంగా త్యజించటానికి ఏమాత్రం వెనుకంజ వేయలేదనే విషయం ఈ సంఘటనవల్ల అర్థమవుతున్నది.

సీతాదేవి ఉత్తమ గృహిణి. ఆమె తన అత్తమామలను జననీ జనకులవలె గౌరవించి ప్రేమించింది. అంతేకాదు శ్రీరాముని వనవాసానికి కారణభూతులైన దశరథుని గాని, కైకను గాని, పల్లెత్తుమాట అనలేదు. అతిథుల మర్యాద చేయటంలోగాని, ఉచితరీతిన సత్కరించటంలో గాని ఆమెకు ఆమే సాటి. గృహస్థ ధర్మమును చక్కగాపాటించిన సౌశీల్యవతి సీత.

సీతయొక్క పాతివ్రత్య ప్రతాపసౌందర్యమును "సుందరకాండ"లో వాల్మీకి చక్కగా వర్ణించాడు. మానవుని యొక్క వ్యక్తిత్వము కష్టములయందే కనిపించును. అదేవిధముగా రావణునికి బందీగా అశోకవనములో క్రూరులైన రాక్షస స్త్రీల మధ్య వున్నప్పుడు సీతయొక్క వ్యక్తిత్వం బాగా కనపడుతుంది. సామాన్య వ్యక్తులు, అనుకూల పరిస్థితులలో, దైవానుకూల్యముచే ఉన్నతస్థితి నందుకొనినను, విషమ పరిస్థితులలో లక్ష్య భ్రష్టులగుదురు. మహాత్ములట్లుగాక విషమ పరిస్థితులు దాపురించినప్పుడు గూడ భయపడక, ఆత్మస్థయిర్యమును కోల్పోవక, ధైర్యంతో పరిస్థితులను ఎదుర్కొని తమ లక్ష్యమును, కర్తవ్యమును, ధర్మమును విడవక, అవసరమైతే తమ ప్రాణముల నైననూ బలి పెట్టుటకు ఏమాత్రం వెనుకాడక, లక్ష్యసిద్ధికై నిరంతరమూ పోరాడుచునే యుందురు. సాధ్వీమణురాలైన సీతకూడా యిదేవిధంగా పన్నెండు నెలలపాటు ఆహార నిద్రాదులను సయితం విడనాడి, నిర్భయంగా రాక్షస స్త్రీల యొక్కయు, రావణుని బెదిరింపులకును ఏమాత్రం లొంగకుండా కాలాన్ని గడిపింది, ధైర్యంతో కష్టాల నెదుర్కొన్నది, యమయాతనలనుభవించింది, శీలాన్ని కాపాడుకుంది, లక్ష్యాన్ని సాధించింది.

సీత తన పతియైన శ్రీరాముని గూర్చి హీనంగా, మాట్లాడుతూన్న రాక్షస స్త్రీలకు ధైర్యంగా సమాధానం చెప్పింది.

**"దీనోవా రాజ్యహీనోవా, యోమే భర్తా సమే గురుః**

**తం నిత్యమను రక్తాస్మి, యథా సూర్యం సువర్చలా"**

అనగా దీనుడు గాని లేక రాజ్యహీనుడు గాని, నా భర్త నాకు పూజ్యుడు. సూర్యునియందు సువర్చలవలె రామునియందు నేను నిత్యానురక్తియై యుందునని సీతాదేవి ఏ మాత్రం సంకోచించకుండా సమాధానం చెబుతుంది.

తనను వివాహమాడి పట్టమహిషివి కమ్మని రావణుడు ఎంతో ప్రాధేయ పడుతాడు, అర్థిస్తాడు, చివరకు బెదిరిస్తాడు. అయినప్పటికీ సీత ఏమాత్రం చలించదు. ధైర్యంగా రావణునితో **"నీవు నన్ను చూచి భ్రమించితివి. జంబుకం వంటి నీకు, ఆడుసింహము వంటి నేను దుర్లభురాలునని ఎరుగుము. ఒకవేళ వజ్రధరుడగు ఇంద్రుని భార్యను అవమానించి బ్రతికిన బ్రతుకవచ్చునేమోగాని, శ్రీరామచంద్రుని భార్యనగు నన్ను బలాత్కారముగా హరించి, నీవు అమృతమును త్రావియుండినను మృత్యువును మాత్రం తప్పించుకొనజాలవు"** అని సీతాదేవి అంటుంది. ఎటు చూచినా నూరు యోజనాల సముద్రం. నా అన్నవారు ఎవరూ సమీపాన లేరు. ఎటుచూచినా అతి భయంకరులైన రాక్షసులు. వారు పెట్టే బాధలు, రావణాసురుని బెదిరింపుల మధ్య నిస్సహాయురాలై

వుండి కూడా ఏమాత్రం చలించక, ఆత్మవిశ్వాసాన్ని కోల్పోక, ధైర్యాన్ని విడనాడక, పరిస్థితుల ప్రభావానికి లొంగక రావణుని భోగభాగ్య ఐశ్వర్యములను కాలదన్ని, భారతనారీ ఔన్నత్యాన్ని లోకమునకు చాటినది. భారతస్త్రీకి 'పాతివ్రత్యము' అనునది ఒక మహత్తరమగు తపమని, అట్టి తపోనిష్ఠురాండ్రగు స్త్రీలను వంచించువారు, ఎంతటి బలపరాక్రమ సంపన్నులైనను, అగ్నిలో పడిన మిడుతలవలె దగ్ధమై పోవుదురని 'సీత' లోకానికి చాటినది. ఎన్ని కష్టము లొచ్చినను వాటిని లెక్క చేయక, ధైర్యంతోఎదిరించి పోరాడగల ఆత్మబలం, నైతికశక్తి భారత స్త్రీలకు కలదని సీతాదేవి నిరూపించింది.

హనుమంతుడు, అశోకవనంలో సీతయొక్క విషాదకర పరిస్థితిని కన్నులారా చూచి **"నీవు నా వీపుపై ఎక్కుము, నిన్ను శ్రీరామునివద్దకు చేరుస్తాను' అని అంటాడు. కాని సీత అంగీకరించదు. "నీచకార్యమాచరించిన రావణుని, అతని అనుచరులగు రాక్షసులను సంహరించకుండా, నన్ను తీసుకొని వెళ్ళినచో, అది శ్రీరామునికి తగినట్లుండదు"** అని సీత అంటుంది. ఈ మాటలు ఆమె యొక్క స్వాభిమానానికి నిదర్శనం. అంతేకాదు, శ్రీరాముని బలపరాక్రమాదులయందు గల విశ్వాసం అటువంటిది. అంతేకాదు, అవకాశం దొరికింది గదాయని తొందరపడి హనుమంతునితో వెళ్ళటానికి అంగీకరించినయెడల, రావణుడు ఏ విధంగా దొంగతనంగా సీతను అపహరించాడో, అదేవిధముగా శ్రీరాముడు కూడా దొంగతనంగా హనుమంతుని ద్వారా తీసుకొనివెళ్ళాడనే అపవాదు వస్తుందని సీత అభిప్రాయపడింది. శ్రీరాముడి పరాక్రమాన్ని రాక్షసులు చవిచూచే అవకాశం లేకుండా పోతుందని భావించింది. ఎంతటి కష్టాలనైనా భరించటానికి సిద్ధపడింది గాని, శ్రీరామునికి అపవాదు రావటానికి మాత్రం సీత ఇష్టపడియుండలేదు. సంవత్సరకాలం పాటు భర్త వియోగబాధను, దుష్టుడైన రావణుని బెదిరింపులను, రాక్షస స్త్రీలు పెట్టే బాధలను ఓర్మితో సహించిన సాధ్వీమణి సీతాదేవి.

రావణ వధానంతరం అతని భార్య మండోదరి విలపిస్తూ **'పతివ్రతాయాస్తవ సానూనం దగ్ధో పి మే ప్రభో'** (నీవు పతివ్రతయగు సీతయొక్క తేజము చేత దగ్ధమైనావు) అని యనును. సీతయొక్క పాతివ్రత్య తేజమును, శీలసంపదను రాక్షసులు సయితమూ గుర్తించినారనడంలో ఏమాత్రం సందేహం లేదు.

రావణవధానంతరం, శ్రీరాముని శంకితాపూరితమైన మాటలు విని ఎంతో వ్యధ చెందుతుంది. తాను దైవముగా భావించిన భర్త పదిమందిలో చులకనగా మాట్లాడి, తన శీలాన్ని శంకించినప్పటికీ, ఆ పతివ్రతా తిలకము తన ఓర్పును విడనాడలేదు. భర్తను నిందించలేదు. శ్రీరాముని ఆజ్ఞానుసారము లక్ష్మణుడుచితిని

ప్రజ్వలింపజేయగా, తన భర్తకు ప్రదక్షిణం చేసి, దేవతలకు ప్రణామ మొనర్చి అగ్నిలో దుమికేముందు **"నా యొక్క హృదయము నిత్యమూ రాఘవుని తప్ప ఇతరుని మీదకు పోకుండ నున్నచో, నన్ను సకల విధములఅగ్ని రక్షించుగాక!"** అని అగ్నిలో ప్రవేశిస్తుంది. అగ్ని ఆరిపోతుంది. **"ఓ రామా! పాపరహితురాలగు ఈ సీతను పరిగ్రహింపుము"** అని అగ్నిదేవుడు చెబుతాడు. నిండుచూలాలిగా నున్న సమయమున తనను ఘోరారణ్యముల యందు విడిచి వచ్చిన సమయమున కూడ, తన భర్తను గురించి ఒక్క పరుషమైన మాటను కూడా అనలేదు. మీదు మిక్కిలి శ్రీరాముని హితమును, క్షేమమును కోరినట్లు తెలుస్తున్నది. సీతా సాధ్వి తన లోకోత్తరములగు శీలవృత్తము చేతను, క్షమాకరుణల తోడను, స్నేహవాత్సల్యములతోడను, సర్వలోకముల నాశ్చర్య చకిత మొనరించుటతో బాటుగ భారతనారీ యొక్క మహత్వమును లోకము ముందుంచినది. భారతనారి యొక్క గౌరవప్రతిష్ఠలను తన పవిత్ర చారిత్రముచే యినుమడింపజేసింది. సకల స్త్రీ జాతికి ఆదర్శముగా నిలచినది. ఈయమ్మ చరిత్రము సకల నారీ లోకమునకు గర్వకారణము. రానున్న ఉత్తరాలలో లక్ష్మణుడు, భరతుడు, హనుమంతుల గురించి వివరించటానికి ప్రయత్నిస్తాను.

నీవు వ్రాసిన ఉత్తరాలు శ్రద్ధగా చదివాను. స్వాభిమానంతో వ్రాసిన ఉత్తరాన్ని చూచి గర్వించాను, రెండవ ఉత్తరాన్ని చూచి విచారించాను. అన్నీ తెల్సిన నీవే ఈ విధంగా దిగులు పడితే మన పిల్లల పరిస్థితి ఏమిటి? చిరంజీవులకు నా ముద్దులు.

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 19-4-1976.

ప్రియమైన జయ,

గత రెండు ఉత్తరములలో శ్రీరాముని, సీతను గురించి వ్రాసాను. రామాయణ మహాకావ్యమునుండి హనుమంతుని మినహాయిస్తే అసలు కథే లేదేమోననిపిస్తుంది. శ్రీరామునికి ఆత్మార్పణము గావించిన పరమభక్తుడు ఈయన. సర్వశక్తిసంపన్నుడు. సకల విద్యావేత్త, నవవ్యాకరణవేత్త, అద్భుతమైన వక్త - వీటన్నిటి కన్నా అద్భుతమైన ప్రభుభక్తి కలవానిగా, కార్యాచరణ శక్తియుక్తులు కలవానిగా, మరియు దౌత్యకర్మను నిర్వహించంటంలో అతి చాకచక్యము, నైపుణ్యము

కలవానిగా వాల్మీకి హనుమంతుని గూర్చి వర్ణించాడు. పెక్కు పురాణములు అతనిని శివావతారముగా కూడా వర్ణించాయి.

**"దుష్టానాం శిక్షణార్థాయ శిష్టానాం, రక్షణాయక**
**రామకార్యార్థ సిద్ధ్యర్థం జాతశ్శ్రీ, హనుమాఞ్ఛ వః"**

అనగా దుష్టులను శిక్షించుట కొఱకును, శిష్టులను రక్షించులకును, రామకార్యసిద్ధి కొఱకును శివుడే హనుమంతునిగా అవతరించియున్నాడని పురాణములు ఘోషిస్తున్నాయి. సీతాన్వేషణకు హనుమంతుడు చేసిన సాహస కృత్యములను, సామాన్య మానవుడుగాని, వానరుడుగాని చేయలేడనే విషయం సుస్పష్టం. అతను దైవాంశ సంభూతుడు కావటంవల్లనే రాముని కార్యాన్ని విజయవంతంగా నిర్వహించగలిగాడు. అతను కారణజన్ముడు. అతి దుర్లభ కార్యం నిర్వహించటం వల్లనే శ్రీరాముడు సహితం **"జానకిని కనుగొని నన్ను, నావంశమును పరిరక్షించినావు. అతని బాహుబలము వలననే నేను లంకను జయించితిని. సీతను తిరిగి పొందగలిగితిని. లక్ష్మణుడు తిరిగి దక్కినాడు. విజయము లభించినది. రాజ్యము లభించినది"** అని హనుమంతుని పొగుడుతాడు. అతనిలో ఉత్తమ దౌత్యలక్షణాలు ఎన్నో వున్నాయి. బలము, బుద్ధి పరాక్రమాదులే కాక, దేశ, కాల పరిస్థితుల నెరిగి సంచరించగల తెలివితేటలుకూడా వుండటం వల్లనే, సీతను చూచి రమ్మంటే, లంకాపురిని దగ్ధం కావించి రావణుని భయకంపితుని చేసి వచ్చాడు. అంతేకాదు జంబుమాలిని, అక్షయ కుమారుని 5 గురు సేనాపతులను 7 గురు మంత్రి కుమారులను మరియు అనేక మంది రాక్షసవీరులను సంహరించాడు. హనుమంతుని బలపరాక్రమాదులను ఇంద్రజిత్ కూడా చవి చూశాడు. మాడు అదర బట్టే ఇంద్రునితో సమానమైన ఇంద్రజిత్తును పిలిచి రావణుడు **"హనుమంతుడు సాధారణ బలసంపన్నుడు కాదు. అతని ముందు మన సేనలు ఎందుకూ పనికి రావటంలేదు. వజ్రాయుధము వంటి ఆయుధములు సయితం అతనిని ఏమీ చేయజాలకున్నవి. అతని గతి మారుతుని గతి, అతని శక్తి అగ్నిహోత్రుని అతిక్రమించినది. బ్రహ్మాస్త్రాన్ని పొందిన నీవు తప్ప, ఈ కోతిని ఎదిరించగల శక్తి సామర్థ్యములు గల వారెవ్వరూ నాకు కనిపించటంలేదు. వీడితో బాహాబాహీ యుద్ధము పనికిరాదు. ఏమి చేయాలో బాగా ఆలోచించి, నువ్వు అతడ్ని ఎదిరించి విజయంతో తిరిగి రా!"** అని ఆజ్ఞాపిస్తాడు.

లంకా యుద్ధమునందు హనుమంతుడు ప్రదర్శించిన బలపరాక్రమాదులను వర్ణించ శక్యము కాదు. ధూమ్రాక్షి, అకంపన, దేవాంతక, నికుంభాది రాక్షస వీరులను వధించగా, అతని పరాక్రమమును చూచి నివ్వెరపోయి, త్రిలోక విజేతయగు రావణాసురుడే **"సాధు వానర వీర్యేణ శ్లాఘనీయో సిమే రిపుః"** (ఓ వానరా! శభాష్, నీవు శ్లాఘము నందుకొనుటకు తగిన శత్రువుడవు) అని మెచ్చుకుంటాడు. అతని

చాకచక్యము, సమయస్ఫూర్తితో ప్రదర్శించిన బలపరాక్రమాదులు, నిర్భీకత్వము, అతడనుసరించిన దౌత్యవిధానము దర్బారులో మనకు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. హనుమంతుడు ఎంతో హుందాతనంగా, ధైర్యంతో రావణుని దర్బారులో హెచ్చరిస్తాడు, హితవును కూడా బోధిస్తాడు. "నేను సుగ్రీవుని దూతను. నా ప్రభువైన సుగ్రీవుడు రామలక్ష్మణులతో సఖ్యం చేసుకొనినాడు. అతి బలాఢ్యుడైన వాలిని ఒక్క వేటుతో సంహరించి సుగ్రీవుని కోరికను నెరవేర్చినాడు రాముడు. కృతజ్ఞతతో సుగ్రీవుడు తన వానర సేనలను సీతాదేవి జాడను తెలుసుకొనుటకు భూలోకమంతా వెతకమని పంపించినాడు. ఆ సందర్భమున నేను వేయి యోజనముల సముద్రమును లంఘించి లంకలో అడుగు పెట్టాను. సీతను అశోకవనంలో చూచాను. అటువంటి పతివ్రతా శిరోమణిని అపహరించటం ధర్మవిరుద్ధం. అది కులనాశనానికి దారి తీస్తుంది. పరాయి స్త్రీని కోరటం మహాపాపం. సర్వశక్తివంతుడైన శ్రీరామునితో వైరం అంతమంచిది కాదు. అది మీ వంశ సర్వనాశనానికి దారి తీస్తుంది. ఏ శక్తీ తమర్ని రక్షించలేదు. ఈ లంకాపురిని, రాక్షసులందర్ని ధ్వంసం చేయగల శక్తి నాకొక్కనికే వున్నప్పటికీ, శ్రీరాముని ఆజ్ఞలేదు కాబట్టి ఆపనికి నేను పూనుకోలేదు. సీతయొక్క పాతివ్రత్య తేజము చేతనూ, శ్రీరాముని కోపాగ్ని చేతను నీవు, నీ అనుచరులు నాశనమవుతారు. కనుక నా పలుకులను ఆలకించి, పతివ్రతాశిరోమణి అయిన సీతను శ్రీరామునికి అప్పగించి, మీ లంకాపురిని, మీ పరివారాన్ని బంధుమిత్రులను రక్షించు కోవటం సముచితం" అని బందీనయినాననే భయం కూడా లేకుండా స్పష్టంగా చెబుతాడు. హనుమంతుని మాటలు వినిన లంకేశ్వరుడు కోపోద్రిక్తుడై యీ కోతి తోకకి నిప్పు ముట్టించి తరిమి వేయండని ఆజ్ఞాపిస్తాడు. హనుమంతుడు విశ్వరూపం దాల్చి మండుతున్న తోకతో లంకాపురి నంతా దగ్ధంచేసి, అశోకవనము నకు వెళ్ళి సీతకు ధైర్యాన్ని చెప్పి సముద్రం దాటుతూ వుండగా తనకు విశ్రాంతి యివ్వటానికి పైకి వచ్చిన మైనాకునితో "నేను ఆగుటలేదని కోపించకు. ప్రొద్దుగుంకు తున్నది. నా పై గల కార్యభారమును బట్టే నేను ఆగుటకు వీలులేదు" అని చెప్పి చేతితో అతనిని స్పశించి పైకి ఎగిరి తన మార్గంలో పోతాడు. ఈసంఘటనను బట్టి హనుమంతునిలోని కర్తవ్య పరాయణత్వము, కార్యదీక్ష పట్టుదల ఎంతటిదో మనకు బోధపడుతుంది. దూత అయినవాడు ప్రభు కార్యమును నిర్వహించటంలోనే తన దృష్టిని, శక్తినంతటిని కేంద్రీకరించవలెనుగాని, తన స్వసుఖ, సంతోషములకాశపడి ప్రభు కార్యాన్ని నిర్లక్ష్యం చేయరాదనే నీతిని, హనుమంతుడు పాటించి చూపించాడు. నేటి రాయబారులు, దూతలు హనుమంతుని ఆదర్శంగా గైకొంటే ఎంతో బాగుంటుంది. రాచకార్యములను నిర్వహించువారు అప్రధానమగు కార్యములతో ఆకర్షించబడకుండా, అసలు కార్యాన్ని సకాలంలో నిర్వహించాలి.

హనుమంతుడు నిర్వహించిన అద్భుత దూతకృత్యములకు శ్రీరాముడు సంతసించి, "ఇటువంటి మహత్తర కార్యాన్ని, ఈ భూమండలంలో హనుమంతుని లాగే

మరెవ్వరూ నిర్వహించలేరు. ఇతను చేసిన పనివల్ల మొత్తం రఘువంశమే విపత్తుకు గురి కాకుండా రక్షించబడింది" అని ప్రశంసిస్తాడు.

హనుమంతుడు సముద్రాన్ని దాటాలని సంకల్పించుకున్నప్పుడే ఒక నిశ్చయానికి వస్తాడు. తన మనో నిశ్చయాన్ని ఆనాడే ప్రకటించుతాడు. "శ్రీరాముని బాణ వేగమువలె లంకకు పోవుదును. అక్కడ సీత కనపడనియెడల రావణునితో సహా లంకాపురిని పెకలించి తీసుకొని వచ్చి శ్రీరాముని ముందు పెడుతాను" అని అంటాడు. అతని మాటలనుబట్టి అతనికి శ్రీరాముని యెడల గల భక్తిప్రపత్తులు, చేబట్టిన కార్యాన్ని నిర్వహించటంలోగల పట్టుదల అచంచలమైన విశ్వాసం ఎట్టిదో గోచరమవుతున్నది, ప్రస్తుత పరిపాలకులలో అటువంటి దృఢ విశ్వాసపరులైన కర్తవ్యనిష్ఠులు లేకపోవటంవల్లనే రాచకార్యాలు దెబ్బ తింటున్నాయి.

విదేశములకు వెళ్లు రాయబారులు, విదేశాంగ మంత్రులు - ఇతర దేశములతో దౌత్యమును ఎటుల జరుపవలెనో, విదేశములకు వెళ్ళువారియందు ఏయే గుణములుండవలెనో, హనుమంతుని పాత్రను సరీగా అవగాహన చేసుకున్న యెడల, విదేశాలతో విజయవంతంగా, దౌత్య సంబంధాలు నిర్వహించగలుగుతారు. హనుమంతుని వ్యక్తిత్వం యీ భూమిమీద మానవకోటియున్నంతవరకు, శాశ్వతంగా కొనియాడబడుతునే వుంటుంది.

ఇకపోతే నీ ఉత్తరం సాకల్యంగా చదివాను. నీవు వ్రాసిన సలహా గుర్తించ వలసిందే. నేర్చుకోవటంలోనే మురిసిపోకుడదు. నేర్చుకొన్నవాటిలో కొన్నింటినైనా నిత్యజీవితంలో ఆచరణలో పెట్టగల్గుతేనే ప్రయోజనం వున్నది. ప్రయత్నం చేయటం మన కర్తవ్యం కదా! ప్రయత్నం చేయకుండా ఏపని దానంతట అదే సాధించబడదు. పనులు కోర్కెల వలన నెరవేరవు. ప్రయత్నం వలన నెరవేరుతాయి. మృగరాజైన సింహము కూడా, ఏమాత్రం ప్రయత్నం చేయకుండా, నేను యీ అరణ్యానికంతటికీ రాజునని విర్రవీగుతూ నిద్రబోయిన యెడల దానికి కడుపు నిండుతుందా? ఆ నిద్రబోతున్న సింహం నోటిలోనికి మృగములు ఆహారంగా వాటంతట అవేవస్తాయా? ఏమాత్రంరావు. మృగరాజైన సింహము సహితము వేటాడితేనే కడుపునిండుతోంది. అదే విధంగా ప్రయత్నంవల్లనే కోరికలు నెరవేరుతాయి. ఇదే భావాన్ని తెలియ బరుస్తున్న యీ శ్లోకము అర్థం చేసుకుంటే చాలు.

**"ఉద్యమేన హి సిధ్యంతి, కార్యాణి న మనోరథైః**
**న హి సుప్తస్య సింహస్య, ప్రవిశంతి ముఖేమృగాః"**

చిరంజీవులకు నా ఆశీస్సులు, ఉంటా.....

ఇట్లు

'నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 21-4-1976.

ఇంతకు పూర్వం ఉత్తరాలలో శ్రీరాముని, సీతను, హనుమంతుని గురించి వ్రాసాను. శ్రీరామునికి బహిఃప్రాణమైన లక్ష్మణుని గురించి ప్రస్తావించటం అత్యవసరం గదా! అతని భాతృభక్తి వర్ణనాతీతము. లక్ష్మణుడు మహావీరుడే కాదు. మహాత్యాగి కూడా. అనుశాసన ప్రియుడు, జితేంద్రియుడు, పర స్త్రీలను మాతృభావంతో చూడగల పరమోత్కృష్టమైన ఉత్తమ శీలసంపన్నుడు. ఎవ్విధమైన రాజభోగములను కోరకుండా, తన జీవిత సర్వస్వమును శ్రీరామచంద్రునికి సమర్పించిన మహాత్యాగి. శ్రీరాముని సేవించుటకు, తన స్వసుఖాలన్నింటిని తృణప్రాయంగా పరిత్యజించిన త్యాగశీలి. శ్రీరాముడు అరణ్యవాసానికి బయలుదేరేటప్పుడు లక్ష్మణుడు కూడా బయలుదేరుతాడు. రాముడువద్దని వారించినా, లక్ష్మణుడు అంగీకరించడు. "**నీవు లేకుండగ త్రిలోకైశ్వర్యము నిచ్చి నను నేను దానిని కోరను**" అని స్పష్టంగా చెప్పి శ్రీరాముని వెంబడిస్తాడు. అరణ్యవాసంలో శ్రీరామునితో సకల కష్టాలను అనుభవిస్తాడు. తండ్రి వాగ్దానాన్ని నిలబెట్టటము కోసము శ్రీరాముడు అడవులకు వెళ్లుతే, సకల భోగభాగ్యములను స్వయంగా త్యజించి శ్రీరాముని అనుసరించటంలోనే వున్నది లక్ష్మణుని త్యాగనిరతి. అంతేకాదు వనవాసానంతరం, రావణసంహారం జరిగిన తరువాత, అయోధ్యకు వెళ్ళి శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన తరువాత, యువ రాజ్యాభిషేకము పొందవలసిందని లక్ష్మణుని ఆహ్వానిస్తాడు శ్రీరాముడు. కాని ఎంత బలవంతంచేసినా అంగీకరించడు. అతని జీవితమంతయును త్యాగమయము. అధికారవ్యామోహం లేని నిస్వార్థ త్యాగపురుషుడు. తన కర్తవ్యముపట్ల మిక్కిలి కఠోరుడు. శ్రీరామచంద్రుని పట్ల అతనికి గల ప్రేమ వర్ణనాతీతం. 'కబంధుడు' అను రాక్షసుడు రామలక్ష్మణులను బంధించినపుడు,లక్ష్మణుడు సమయస్ఫూర్తితో కర్తవ్యాన్ని ప్రబోధిస్తాడు. "**ఓ రామా! నన్ను గూర్చి ఆలోచింపకుము. నన్ను ఈ కబంధునికి బలిగా వర్పించి నీవు సుఖముగా పో! కొద్ది కాలంలోనే నీకు తప్పకుండా 'వైదేహి' లభ్యమవు తుంది. వనవాసమును పూర్తిచేసుకొని తిరిగి అయోధ్యకు వెళ్ళి సుఖముగా రాజ్యమును పాలింపుము**" అని రాముని వేడుకుంటాడు. తన అన్న కొరకు తన శరీరమును సయితం బలి చేయటానికి ఏ మాత్రం వెరువని త్యాగజీవి. త్యాగానికి మరొక పేరు లక్ష్మణుడు అనిన ఏమాత్రం అతిశయోక్తి కాదు. సీతారాముల వివాహమయిన తరువాత 12 సం॥లు అయోధ్యలో, 13 సం॥లు అరణ్యములో వారికి సహచరునిగా నున్ననూ, సీత యొక్క మోమును కూడా లక్ష్మణుడు చూచి ఎరుగడు. సీతాదేవి

విడచిన నగలమూటను, సుగ్రీవుడు ఋష్యమూకపర్వతము మీద శ్రీరామునికి చూపగా, వాటిని లక్ష్మణునికి చూపించి, "మీ వదినవేనా? చూడు!" అని అడిగినప్పుడు

**"నా హం జానామి కేయూరే, నా హం జానామి కుండలే**
**నూపురే త్వభి జానామి, నిత్యం పాతాభి వందనాత్"**

అనగా ప్రతి నిత్యం నేను పాదములకే నమస్కరించటంవలన, ఆమె పాదములపై గల అందెలను మాత్రమే ఎరుగుదును. మిగతా శరీరంమీద నున్న నగలు నాకు తెలియదంటాడు. లక్ష్మణుని యొక్క నిర్మల చరిత్రకు యిది ఒక మచ్చు తునక. వదినగారి యెడల అతని హృదయమందు గల మాతృభక్తికి ఈ ఉదంతం ఒక నిదర్శనం. లక్ష్మణుడు తండ్రియైన దశరథుని కంటే శ్రీరామునే మిక్కిలిగా ప్రేమించాడు, పూజించాడు, అనుసరించాడు, సేవించాడు. **"భ్రాతా, భర్తాచ, బంధుశ్చ పితాచ మమ రాఘవ:"** అను లక్ష్మణుని వచనములను బట్టి శ్రీరాముని యెడల అతని భావము స్పష్టముగా గోచరిస్తున్నది. సోదర ప్రేమ అంటే ఏవిధంగా వుండాలో తన జీవన గమనంలో చూపించి, నిరూపించి, అనుసరించి చూపిన ప్రేమస్వరూపుడు, కరుణామయుడు. నేటి సమాజం లక్ష్మణుని ఆదర్శంగా స్వీకరిస్తే వైరుధ్యాలకు తావే వుండదు.

లక్ష్మణుడు కర్తవ్య పాలన విషయంలో కూడా పరమ కఠోరుడు. శ్రీరామ చంద్రుడు ఒక పర్యాయము బ్రాహ్మణవేషంలో వచ్చిన కాలయమునితో రహస్య సంభాషణలు చేయవలసి వస్తుంది. అప్పుడు లక్ష్మణుని ద్వారంవద్ద కాపలా వుంచి, ఎవరైనా ఆ సమయంలో లోపలికి రానిచ్చినగాని, లక్ష్మణుడు చూచి ఎరుగడు. సీతాదేవి విడచిన నగలమూటను, సుగ్రీవుడు ఋష్యమూకపర్వతము మీద శ్రీరామునికి చూపగా, వాటిని లక్ష్మణునికి చూపించి, 'మీ వదినవేనా? చూడు!' అని అడిగినప్పుడు

**"నా ఉ హం జానామి కేయూరే, నా ఉ హం జానామి కుండలే**
**నూపురే త్వభి జానామి, నిత్యం పాతాభి వందనాత్"**

అనగా ప్రతి నిత్యం నేను పాదములకే నమస్కరించటంవలన, ఆమె పాదములపై గల అందెలను మాత్రమే ఎరుగుదును. మిగతా శరీరంమీద నున్న నగలు నాకు తెలియదంటాడు. లక్ష్మణుని యొక్క నిర్మల చరిత్రకు యిది ఒక మచ్చు తునక. వదినగారి యెడల అతని హృదయమందు గల మాతృభక్తికి ఈ ఉదంతం ఒక నిదర్శనం. లక్ష్మణుడు తండ్రియైన దశరథుని కంటే శ్రీరామునే మిక్కిలిగా ప్రేమించాడు, పూజించాడు, అనుసరించాడు, సేవించాడు. **"భ్రాతా,**

భర్తాచ, బంధుశ్చ పితాచ మమ రాఘవ:" అను లక్ష్మణుని వచనములను బట్టి శ్రీరాముని యెడల అతని భావము స్పష్టముగా గోచరిస్తున్నది. సోదర ప్రేమ అంటే ఏవిధంగా వుండాలో తన జీవన గమనంలో చూపించి, నిరూపించి,అనుసరించి చూపిన ప్రేమస్వరూపుడు, కరుణామయుడు. నేటి సమాజం లక్ష్మణుని ఆదర్శంగా స్వీకరిస్తే వైరుధ్యాలకు తావే వుండదు.

లక్ష్మణుడు కర్తవ్య పాలన విషయంలో కూడా పరమ కఠోరుడు. శ్రీరామచంద్రుడు ఒక పర్యాయము బ్రాహ్మణవేషంలో వచ్చిన కాలయమునితో రహస్య సంభాషణలు చేయవలసి వస్తుంది. అప్పుడు లక్ష్మణుని ద్వారంవద్ద కాపలా వుంచి, ఎవరినైనా ఆ సమయంలో లోపలికి రానిచ్చినగాని, తమ సంభాషణలు వినినగాని. అట్టివాని తల తీసివేయటం జరుగుతుందని హెచ్చరించి లోపలికి వెళ్ళిపోతాడు శ్రీరాముడు. ఇంతలో దుర్వాసమహర్షి వచ్చి తక్షణమే శ్రీరాముని దర్శించవలెనని వత్తిడి చేస్తాడు. లక్ష్మణుడు ససేమిరా అంగీకరించడు. దుర్వాసునికి కోపం వస్తుంది. తన రాకను శ్రీరామునికి వెంటనే తెలియబరచని యెడల అయోధ్యా రాజ్యము, రాజసంతతి, ప్రజలు యావత్తూ సర్వనాశనం అయ్యేట్లుగా శపించుతానని హెచ్చరిస్తాడు. లక్ష్మణునికి సంకటపరిస్థితి ఏర్పడుతుంది. తనవల్ల దేశం, వంశం యావత్తూ సర్వనాశనం కావటానికి మనస్కరించదు. తానొక్కడూ శ్రీరాముని శిక్షకు గురియై మరణించినా ఫరవాలేదని భావించి, దుర్వాసుని రాకను లోపలికివెళ్ళి శ్రీరామునికి ఎరుక పరుస్తాడు. శ్రీరాముని ఆజ్ఞను తిరస్కరించి లోపలికి వెళ్ళినందులకు దండన విధించమని స్వయంగా తానే కోరుతాడు. **"నీవు నా కొఱకు విచారించకుము. నన్ను వధించి ప్రతిజ్ఞను పాలింపుము. ప్రతిజ్ఞను పాలింపని నరులు నరకమును పొందుదురు. సంశయింపకుము. నన్ను వధించి ధర్మమును వృద్ధి చేయుము"** అని శ్రీరాముని కోరుతాడు. చిట్టచివరికి నీతికోవిదుల సలహా ననుసరించి లక్ష్మణుని దేశ బహిష్కారం చేశాడు శ్రీరాముడు. తను మనసారా ప్రేమించిన అన్న చివరకు తనను త్యజించినా, అతనిపై ఏమాత్రం కోపించక ఆజ్ఞను శిరసావహిస్తాడు. అనుశాసనమందు గల లక్ష్మణుని దృఢవైఖరిని తలచుకుంటే ఎంతటి పాషాణ హృదయమైనా ద్రవించక మానదు. అతనిలోగల అకుంఠిత దీక్ష, కర్తవ్య నిష్ఠలు భావితరాల వారికి అత్యంత ఆదర్శనీయములు.

అధికార వ్యామోహంతో చేయరాని పనులు చేస్తూ, మారణహోమాలను సృష్టించడానికి కూడా ఏమాత్రం వెనుకాడనటువంటి ప్రస్తుత సమాజానికి లక్ష్మణుని ఆదర్శం, త్యాగం పరిష్కార మార్గాన్ని చూపించగలుగుతాయి. స్వార్థమే జీవిత పరమావధిగా నెంచి, అధికారం కోసం ఎంతటి నీచానికైనా వెరువని పచ్చి

అవకాశవాదులు సయితం ఒక్క పర్యాయం రామాయణ మహాకావ్యమును చదివిన యెడల మానసిక పరివర్తన జెందగలరు. లక్ష్మణుని సచ్ఛీల, నిస్వార్థ, త్యాగమయ మయిన జీవితం ఎంతటి వారికైనా కనువిప్పు కాగలదు. నేటి నాయకులు, పరిపాలకులు లక్ష్మణుని ఆదర్శముగా గైకొనిన యెడల వైషమ్యాలకు వైరుధ్యాలకు తావే వుండదు.

నీ ఉత్తరాలు అందుతూనే వున్నాయి. నా ఉత్తరాలు నీకు అందనట్లు వ్రాస్తున్నావు. ఆశ్చర్యంగా వున్నది. ఈ నెల 5వ తేదీనుంచి యిప్పటికి నీకు ఐదు ఉత్తరాలు వ్రాశాను. అక్కడి పోష్టాఫీసులో ఎంక్వయిరీ చేయించగలవు. ప్రస్తుత అత్యయిక పరిస్థితి మహిమ అనుకుంటాను. 25 తేదీ రాత్రి బయలుదేరి 26వతేదీ ఉదయానికి రాగలవు. చిరంజీవులనందరిని తీసుకొనిరాగలవు. మిమ్ములను చూడక చాలకాలమైంది గదా!

ఇకవుంటా......

ఇట్లు
" నీ "

సెంట్రల్ జైలు , రాజమండ్రి
ది 24-4-1976.

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం లేఖలో లక్ష్మణుని గురించి ప్రస్తావించాను. ఇకపోతే భరతుని ఆదర్శవంతమైన జీవితాన్ని కూడా ప్రజలు ఎన్నటికీ మరువలేరు. స్వార్థం అనేది ఏ కోశాన కనిపించదు. అతనిది అత్యంత త్యాగభూయిష్టమైన జీవితం. ధర్మంకోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసిన త్యాగశీలి. భాతృభక్తి మెచ్చుకోతగినది. అతని ధర్మనిష్ఠను ప్రశంసిస్తూ కైకేయితో **"రామాదపి హితం మన్యే ధర్మతో బలవత్తరమ్'** రాముని కంటే గూడ ధర్మవిషయమున భరతుడు చాలా నిష్ఠగలవాడు అని అంటాడు. భరతుడు మిక్కిలి నిర్మలమైన హృదయము గలవాడు. వాల్మీకి కూడా **"ఆకాశ ఇవ నిర్మల:"** ఆకాశము వలె విశాలమును, నిర్మలమునైన మనస్సు గలవాడు అని వర్ణించాడు. అతనిచరిత్ర దీనినే ఋజువు చేస్తుంది. తన తల్లి చర్యవల్ల పవిత్రమైన వంశమర్యాద మంటగలిసిందని బాధపడుతూ తన తల్లిని **"నృశంసే పాపా చారిత్రే కులపాంసని"** అని నిందిస్తాడు. ఇంతటి మహాపాతకానికి వడిగట్టిన మహాపాపితో మాట్లాడటం కూడా మహాపాతకమే అవుతుందని భావిస్తాడు.

పరివారంతో బయలుదేరి శ్రీరాముని వద్దకు వెళ్లి తిరిగి అయోధ్యకు వచ్చి పరిపాలించమని ప్రాధేయపడుతాడు. తన తల్లి చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తముగా తను వనవాసం చేస్తానంటాడు. ఎంతో బ్రతిమాలుతాడు. శ్రీరాముడు మాత్రం అంగీకరించడు. భరతుడు ప్రాయోపవేశమునకు సహితం పూనుకుంటాడు. వశిష్టాది మునులు భరతునికి నచ్చజెబుతారు. వారి ఆజ్ఞ మేరకు శ్రీరాముని పాదుకలను తీసుకొని శిరస్సున ధరించి, సపరివారంతో అయోధ్యకు తిరుగు ప్రయాణమవుతాడు. అయోధ్యలో మాత్రం అడుగుపెట్టడు. సమీపముననే వున్న నందిగ్రామంలో మకాంపెట్టి, శ్రీరాముడిచ్చిన పాదుకలను సింహాసనంపై వుంచి, ప్రజాసమక్షంలో వాటికి పట్టాభిషేకం గావించి **"ఈ రాజ్యం శ్రీరాముడిది. దానిని ఆయన తాత్కాలికంగా నాకు వప్పజెప్పారు. నేను ఆయన ప్రతినిధిగా,ధర్మయుతంగా రాచకార్యాలను నిర్వహించుతానని హామీ యిస్తున్నాను"** అని భరతుడు ప్రజా సమక్షంలో ప్రతిజ్ఞ చేస్తాడు. సకల భోగభాగ్యములను త్యజించి, నారబట్టలను ధరించి, కందమూలాదులను మాత్రమే భుజిస్తూ, కటికి నేలపై శయనిస్తూ, శ్రీరాముని ప్రతినిధిగా పదునాలుగు వత్సరాలు ప్రజానురంజకంగా పరిపాలన చేస్తాడు.

ఇటువంటి, ఇంతటి అద్భుత సన్నివేశం ప్రపంచ చరిత్రలో మనకెక్కడా కనిపించదు. ఈ ప్రపంచమున రాజ్యకాంక్షతో, ధర్మాధర్మములను విచారింపక, న్యాయాన్యాయములను గురించి యోచింపక, తల్లిదండ్రులను నిర్దాక్షిణ్యంగా చంపి సింహాసన మధిష్ఠించిన పితృ హంతకులు ఎందరో వున్నారు. పదవీ వ్యామోహంతో అన్నదమ్ములను సహితం సర్వనాశన మొనర్చి రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్న భ్రాతృ హంతకులూ ఎందరో కలరు. అనేక అక్రమ అమానుషకృత్యాలను, దారుణ హింసాకాండలను, మారణహోమాలను జరిపి చక్రవర్తులను సంహరించి సింహాసనాలధిష్ఠించిన మంత్రివర్యులు, సేనాపతులు ఎందరోవున్నారు. తమ అధికారానికి ఎప్పుడో ఒకప్పుడు అడ్డుతగులుతారనే భయంతో, ప్రత్యర్థులను కారాగారాలకు పంపించినవారు, ఉరికంబాల కెక్కించిన పచ్చి స్వార్థపరులు కూడా ఎందరో కలరు. కాని తనకు లభించిన రాజ్యాన్ని సహితం, తృణప్రాయంగా నెంచి, తన అన్న కోసం తన సర్వస్వాన్ని వదలుకోవటానికి సంసిద్ధపడిన **'భరతుడు'** లాంటి నిస్వార్థపరులు మాత్రం ప్రపంచంలో ఎక్కడా కనిపించరు. తనకు సంక్రమించిన రాజ్యాధికారాన్ని సహితం విడనాడి, తన అన్న పాదపద్మాలపైబడి పదునాలుగువత్సరాలు తానే వనవాసం చేస్తానని ప్రాధేయపడిన **'భరతుడు'** లాంటి త్యాగశీలురు ఏ వాఙ్మయమున మనకు కనుపించరు. తనకు రాజ్యాధికారాన్ని కట్టబెట్ట ప్రయత్నించిన తన కన్న తల్లిని సహితం అనరాని సూటిపోటి మాటలతో చిత్రహింస చేసిన

**'భరతుడు'** లాంటి ధర్మపరాయణులు కూడా మరెక్కడా కనిపించరు. సర్వాధికారములతో రాజ్యాధికారం సంప్రాప్తమైనప్పటికీ, స్వీకరింపక రామపాదుకలకు పట్టాభిషిక్తం గావించి, రామ ప్రతినిధిగా ప్రజానురంజకంగా పరిపాలన గావించిన **"భరతుడు"** లాంటి నిస్వార్ధజీవిని మరెక్కడా చూడలేము. పదు నాలుగు సంవత్సరాల తరువాత, తిరిగి వచ్చిన శ్రీరామచంద్రునికి నవ్వుతూ, నవ్వుతూ రాజ్యాన్ని తిరిగి అప్పగించిన ఘనత భరతునికి మాత్రమే దక్కింది,

ఒక్క పర్యాయం గద్దె కెక్కుతే చాలు....... ప్రజలు ఈసడించినప్పటికీ, తిరస్కరించినప్పటికీ, గద్దె దిగడానికి ఏమాత్రం ఇష్టపడని నేటి పాలకులు భరతుని ఆదర్శపూరితమైన చరిత్రను ఒక్క పర్యాయం చదివి అవగాహన చేసుకొని మానసిక పరివర్తన చెందగలుగుతే చాలు. దేశానికి ఎంతో మేలు చేసిన వారవుతారు. అధికారాన్ని సంపాదించటానికోసం, సంపాదించిన అధికారాన్ని నిలబెట్టుకోవటాని కోసం, చేయరాని పనులుచేస్తూ అనేక అక్రమ అకృత్యాలకు వడిగడుతున్న నేట స్వార్ధపరులు భరతుని త్యాగమయమయిన చరిత్రను చూచి సిగ్గుపడాలి. దేశం బాగుపడాలంటే, ధర్మం నాలుగుపాదాల విలసిల్లాలంటే, సుఖశాంతులతో, సుభిక్షంగా మనగలగాలంటే శ్రీరామ చరిత్రను చదవాలి, అవగాహన చేసుకోవాలి, ఆచరణలో పెట్టాలి. శ్రీరామసోదరులను ఆదర్శంగా గైకొనాలి. వారి త్యాగబుద్ధిని అలవరచు కోవాలి.

శ్రీరామచంద్రుడు భరతుని భ్రాతృభక్తిని ప్రశంసిస్తూ **"న సర్వే భ్రాతరస్తాత భవంతి భరతోపమాః"** సోదరులందరూ భరతుని వంటివారుకాదు అని అంటాడు. భరతుని వంటి సచ్ఛీల చరిత్ర మరే దేశమందూ కనిపించదు. ఏ కావ్యమందును గాంచలేము. భరతుని త్యాగపూరిత చరిత్ర ప్రపంచ మానవాళికి ఆదర్శము కదా! ఇక వుంటా....

ఇట్లు

' నీ '

---

*'త్యాగం చేయడంచేతనే తేజం ఆవిర్భవిస్తుంది. స్వార్థం ప్రవేశించిన మరుక్షణంలోనే తేజం అంతరించిపోతుంది. మహావృక్షంగా మారడానికి విత్తనం మొదట భూమిలో తన శరీరమును నశింపజేస్తుంది. అట్లే స్వార్థపరిత్యాగం చేతనే మనకు కార్యం విజయం చేకూరుతుంది'.*

- స్వామి రామతీర్థ

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది 1-5-1976.

ప్రియమైన జయ,

గతంలో వ్రాసిన నాలుగు లేఖలలో రామాయణంలో నాకునచ్చిన, ప్రపంచానికి ఆదర్శవంతంగా నేటికీ నిలచియున్న కొన్ని పాత్రలను (characters) గురించి క్లుప్తంగా వివరించాను. రామరాజ్య వైభవాన్ని గురించి కొంచెం వ్రాసి ముగిస్తాను. వాల్మీకి మహర్షి రామరాజ్య పాలననాటి విశేషాలను వర్ణిస్తూ....

**"న పుత్ర మరణం కించిత్, దక్ష్యన్తి పురుషా: క్వచిత్**
**నార్యశ్చా విధవా నిత్యం, భవిష్యన్తి పతివ్రతా:**
**నచాగ్నిజం భయం కించిత్, న్నాప్సు మజ్జన్తి జన్తవ :**
**నవాతజం భయం కించిత్, న్నాపి జ్వరకృతం తథా**
**నచాపి క్షుద్భయం తత్ర న తస్కర భయం తథా**
**నగరాణి చ రాష్ట్రాణి, ధన ధాన్యయుతాని చ**
**నిత్యం ప్రముదితా స్సర్వే, యథా కృతయుగే తథా"**

అనగా తల్లిదండ్రులుండగా పుత్రులు మరణించేవారుకాదు. స్త్రీలు విధవలయ్యేవారు కాదు. అగ్నివలన గాని, వరదలవలనగాని, గాడ్పులవలనగాని, రోగభయముగాని ఆకలిచావులుగాని, దొంగలభయముగాని వుండేదికాదు. దేశము ధనధాన్యములతో విలసిల్లుతూ కృతయుగమునందు వలె యావన్మంది ప్రజలు రామరాజ్యంలో సుఖసంతోషములతో జీవించారు.

రామరాజ్యంలో ధర్మం నాలుగుపాదాల విలసిల్లుతుండేది. అందువల్లనే మనకు స్వాతంత్ర్యము లభించిన తక్షణమే మహాత్మాగాంధీజీ **"రామరాజ్యాన్ని నెలకొలపటమే నా పరమావధి"** అని ప్రజలకు వాగ్దానం చేశారు. రామరాజ్య వైశిష్ట్యాన్ని బాపూజీ బాగా అవగాహన చేసుకొనివుండటం వలననే అటువంటి రామరాజ్యాన్ని పున:ప్రతిష్ఠాపించటం తన కర్తవ్యంగా భావించి వుంటారు. కాని దురదృష్టవశాత్తు బాపూజీ భావాలను, సక్రమంగా అవగాహన చేసుకొనకపోవటం వలన బాపూజీ ఆశయాన్ని మనం విస్మరించటం జరిగింది. ఆయన ఆశయం నెరవేరకమునుపే ఆయన పరమపదించారు. ఆయనతోపాటు ఆయన ఆశయం కూడా కాలగర్భంలో కలిసిపోయింది. ధర్మబద్ధమైన రామరాజ్యం రాకపోయినప్పటికీ, సకల భోగభాగ్యము లతో విలసిల్లుతూ, కరువు కాటకాలకు ఏమాత్రం తావులేని, స్వర్గాన్ని సహితం మైమరపించేటటువంటి రావణ రాజ్యం వచ్చినా ప్రజలు సుఖపడేవారు. రావణుడు

అనగానే అందరూ చెడుగా భావించడం పరిపాటయింది. ఇది యదార్థం కాదు. రావణుడు సామాన్యుడు కాడు. బలపరాక్రమ సంపన్నుడు. ప్రకృతి మరియు దేవతలుసహితం అతని శక్తికి తలవొగ్గారు. అతని ఐశ్వర్యమునకు అంతులేదు. లంకాపురి భోగభూమి. అంతా బంగారుమయం. సకలభోగభాగ్యములతో విలసిల్లు తుండేది. దానిని చూచి లక్ష్మణుడు సహితం మోహపడుతాడు. పేదదైన భారత భూమిని పాలించుతే ఏమి ప్రయోజనం? స్వర్ణమయమైన లంకాపురిలోనే ఉండిపోదా మంటాడు లక్ష్మణుడు కానీ శ్రీరాముడు అంగీకరించడు. శ్రీరాముడు, లక్ష్మణునికి చెప్పిన సమాధానం పరిశీలిస్తే లంకాపురి ఎంతటి భోగభాగ్యములతో విలసిల్లుతుండేదో అర్థమౌతుంది.

**"అపి స్వర్ణమయీ లంకా, నమే లక్ష్మణ రోచతే**
**జననీ జన్మ భూమిశ్చ, స్వర్గా దపి గరీయసీ"**

అనగా "ఓ లక్ష్మణా! లంక బంగారుమయమైనను, నాకు ఇష్టమగుట లేదు. తల్లియు, జన్మించిన దేశమును స్వర్గముకంటే శ్రేష్టమైనది' అంటాడు.

**"అక్రమంగా, దొంగతనంగా పరమపవిత్రురాలైన సీతాదేవిని అపహరించడం లాంటి అధర్మ ప్రవర్తన ఒక్కటి అతనియందు (రావణునియందు) లేకుండిన యెడల అతను సర్వలోకములను, చివరికి స్వర్గమును కూడా పాలించుటకు అర్హుడు, సర్వశక్తి సామర్థ్యమహాబల సంపన్నుడు"** అని హనుమంతుడు సహితం అంగీకరించినట్లు ఈ శ్లోకం మనకు తెలియపరుస్తున్నది.

**"యద్య ధర్మోన బలవాన్, స్యాదయం రాక్షసేశ్వర :**
**స్యాదయం సురలోకస్య, సక్రస్యాపి రక్షితా"**

బాపూజీ ఆశించిన ధర్మరాజ్యాన్ని (రామరాజ్యాన్ని) స్థాపించుకోవటంలో కృతకృత్యులం కాలేకపోయాం. సకల భోగభాగ్యములతో విలసిల్లేటటువంటి రావణ రాజ్యం లాంటిదైనా తెచ్చుకోలేకపోయాం. చివరికి రామరాజ్యమంటే మత ప్రాతిపదిక రాజ్యమని విమర్శించే మహానుభావులు కూడా బయలుదేరారు. అంతేకాదు **"రామాయణం బొంకు, భారతం రంకు"** అని ప్రచారం చేసే ప్రబుద్ధులు కూడా బయలు దేరారు. అంతటితో ఆగలేదు. **"రాముడికి సీత ఏమౌతుంది?"** అనే వ్యాసాలు కూడా యిప్పుడు దినపత్రికలలో ప్రచురించబడుతున్నాయి. రాముడికి సీత చెల్లెలని, చెల్లెలిని పెండ్లిచేసుకున్నాడని, రాముడికి, లక్ష్మణునికి **"సీత"** జాయింటు భార్యయని, దశరథుని భార్య మండోదరని, ఆమెకు సీత జన్మించిందని వ్రాస్తున్నారు. విజ్ఞానం వెర్రితలలు వేస్తున్నది. యావత్ ప్రపంచంలో పేరుప్రఖ్యాతులందుకున్న ఈ మహాకావ్యాన్ని

అవమానపరచడమే ధ్యేయంగా పెట్టుకున్నారు కొందరు స్వార్ధపరులు. ఈ మహాకావ్యంలోని వివిధ పాత్రల ఆదర్శవంతమైన నడవడిని ప్రచారం చేసి ప్రజలలో నైతిక విలువలను పెంపొందించడానికి బదులు, తప్పుడు మార్గాన మళ్లించడానికి పుక్కిటి కథలను ప్రచారం చేయడం ఏ మాత్రం క్షమించరాని విషయం. నేనే గనుక బయట వుండి వుంటే ఈ విషప్రచారాన్ని తీవ్రంగా, పత్రికాముఖంగా ఎదుర్కొని వుండేవాడను.

పితృవాక్యపరిపాలనము పుత్రుల కత్యంత ముఖ్యమైన ధర్మమని శ్రీరాముడు 14 వత్సరాలు వనవాసం చేసి ప్రజలకు ఆదర్శప్రాయుడైనాడు. మారుమూల గ్రామంలోని సామాన్య వ్యక్తి వేసిన అభాండములకు తలవొగ్గి, నిండుచూలాలు అయిన 'సీత' ను అడవులకు నిర్దాక్షిణ్యంగా పంపించి, ప్రజావాక్కును మన్నించిన విశుద్ధమైన ప్రజాస్వామ్యవాది శ్రీరాముడు. (నేటి రాజకీయ నాయకులలాగ కాకుండా) సకల భోగభాగ్యములను త్యజించి భర్తతో కానలకేగి అనేక కష్టనష్టముల కోర్చి, భర్తను అనుసరించటమే సతుల ధర్మమని నిరూపించినది సీతాదేవి. భార్య ఊర్మిళను, తల్లి సుమిత్రను, సకల రాజభోగములను త్యజించి శ్రీరామునను సరించి, అడవులకేగి భ్రాతృభక్తిని ప్రపంచానికి చాటిన లక్ష్మణుని త్యాగనిరతి, అవకాశం వచ్చిందేకదాయని స్వార్ధంతో యువరాజ పట్టాభిషేకాన్ని అంగీకరించక శ్రీరాముని పాదుకలకు పట్టాభిషేకం చేసి అయోధ్యలో అడుగిడక నందిగ్రామంలోనే మకాం చేసి నారబట్టలను ధరించి, కందమూలాలను మాత్రమే తింటూ, సకల రాజ భోగములను విడనాడి రాజ్యపాలన 14 సం॥లు చేసి, రాజ్యాన్ని తిరిగి శ్రీరాముని కప్పగించిన నిస్వార్ధ త్యాగజీవి భరతుడు. సేవాధర్మము ఏవిధంగా వుంటుందో ప్రపంచానికి చాటి చూపించిన నిష్కల్మష హృదయుడు హనుమంతుడు. స్నేహితులు ఏవిధంగా ఒకరికొకరు సహాయభూతులై, కష్టకాలంలో సహకరించు కుంటూ వుండాలో ప్రపంచానికి చేసి చూపించిన సుగ్రీవుడు. తన కొడుకు అనే వ్యామోహం కూడా లేకుండా శ్రీరామునితో అడవులకు పంపించిన నిస్వార్ధజీవి సుమిత్ర. ఇట్లా అనేక పాత్రలతో ప్రపంచ మానవాళికి ఆదర్శము నందించిన శ్రీరామకథను విమర్శించుట, కించపరచుట, అవమానపరచటానికి ప్రయత్నించుట అవివేకమేకాదు, క్షమించరాని విషయం కూడాను. ఇటువంటి మహాకావ్యం ప్రపంచ చరిత్రలో మరెక్కడా కనిపించదు. మంచిని విమర్శించేవారు అడుగడుగునా కుక్కగొడుగుల్లా పుడుతుంటారు, నశిస్తుంటారు. వేల సంవత్సరాలైనప్పటికీ ప్రజల హృదయాలలో స్థిరమైన స్థానాన్ని ఆక్రమించుకున్నాయి, రామాయణ మహా భారతాలు. ఈ చౌకబారు రచనలు వాటి శక్తిని ఏమాత్రం తగ్గించలేవు. ఇది

నగ్నసత్యం. మంచి ఏదో,చెడు ఏదో, సత్యమేదో, అసత్యమేదో సరియైన రీతిలో అవగాహన చేసుకొనగలిగే శక్తిసామర్థ్యాలను ప్రజలకు ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తూ ఈ లేఖను ముగిస్తున్నాను. ఇక వుంటా......

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 8-5-1976.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరంలో కృష్ణుని లాంటి వ్యక్తి ప్రస్తుత సమయంలో ఎంతో అవసరం అన్నావు. ఇది యదార్థం. శ్రీరాముడు ఆదర్శవంతమైన జీవితాన్ని గడిపి ప్రపంచ మానవాళికి ఆదర్శప్రాయుడైనాడు. శ్రీకృష్ణుడు దుష్టశిక్షణ, శిష్ట రకణ ఏవిధంగా సమయస్ఫూర్తితో నిర్వహించాలో చేసి నిరూపించిన మహానుభావుడు. అంతేకాదు మానవజాతి ఎన్నటికీ విస్మరించడానికి వీలులేని మహోన్నత వేదాంతి. గొప్ప ప్రవక్త, యుద్ధనీతి కోవిదుడు, రాజనీతి దురంధరుడు, ఉత్తమరాయబారి. ఆయన బోధించిన 'గీత' యిప్పుడేకాదు. మానవజాతి మనినంత కాలం గొప్పగా పేర్కొనబడే ఉత్తమ ఉత్కృష్ట గ్రంథం. దానిలో లేని విషయమంటూ లేదు. అందులో అన్ని సమస్యలకూ చక్కటి తరుణోపాయం సూచించబడింది, ప్రతి ఒక్కరూ చదివి ఆకళింపు చేసుకొని ఆచరించవలసిన ఆదర్శ గ్రంథరాజము. శ్రీకృష్ణుడు ప్రదర్శించిన రాజనీతి ఎంతో దూరదృష్టిని సూచిస్తుంది. ముఖ్యంగా నేటి పరిపాలకులు శ్రీకృష్ణుని ఆదర్శంగా గైకొంటే అపజయం అనేదే వుండదు. అయితే ఈనాటి పాలకులలో చాలామంది భారతం, భగవద్గీతలాంటి ఉత్తమ గ్రంథ రాజములను చదవని ప్రముఖులు ఎందరో!...ఇంక వుంటా......

ఇట్లు

'నీ'

---

*'ప్రజాస్వామ్యంలో ప్రజలు కోరేది స్వాతంత్ర్యంలేని క్రమశిక్షణ కాదు. వారికి స్వాతంత్ర్యం కావాలి, క్రమశిక్షణ కావాలి'.*

*- శ్రీ ఆచార్య కృపలాని*

సెంట్రల్ జైలు, రాజమండ్రి,

ది. 4-6-1976

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. అయితే నీకు వెంటనే ఉత్తరం వ్రాయటం నా చేతిలో లేదు గదా! జైలు అధికారులు వారానికి రెండే ఉత్తరాలిస్తారు. అందులో ఒకటి కస్తల వ్రాసాను. మరొకటి రాముడి (తమ్ముడు)కి వ్రాసాను. అమ్మగారికి వంట్లో బాగాలేదని నాన్నగారు బందరునుండి వ్రాసారు. అమ్మగారి కలలో నేను కనపడుతున్నానుట. మాతృప్రేమ గదా! అందువలన బందరుకు ఒక లేఖ వ్రాసాను. ఏదైనా అర్జంటుగా వ్రాయవలసివస్తుందేమోనని ఒక ఉత్తరాన్ని ఉంచుకున్నాను. అందువలన నీకు ఉత్తరం వ్రాయటం ఆలస్యమైంది. వ్రాయాలని ఉన్నప్పటికీ నేను పరాధీనుడను గదా! అసలు ఏమి వ్రాయాలో కూడా అర్థం కావటంలేదు. ఈ నెల 26వ తేదీ వరకు ఆశతో ఎదురుచూస్తున్నాం. అప్పటికీ విడుదల చేయకపోతే ఎన్నికలముందే అవుతుంది. అవి ఎప్పుడు? అంటే సమాధానం చెప్పటం కష్టమే. **"క్షణక్షణ భంగురముల్ జవరాళ్ళ చిత్తముల్"** కదా! (అప్పుడు ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి) ఎప్పుడు ఏ నిర్ణయం గైకొనబడుతుందో ఊహకు కూడా అందటం కష్టం గానే వున్నది. ఎప్పుడూ ఈ విషయాలను గురించే ఆలోచిస్తూ బుర్ర పాడు చేసుకోవటం అంత మంచిది కాదు. విజ్ఞత అంతకన్నాకాదు. నీ ఆరోగ్యవిషయం నాకు ఆందోళనకరంగావుంది. ఏపనిని సాధించాలన్నా ముఖ్యం శరీరమే కదా! దానిని సరియైన స్థితిలో వుంచుకుంటేనే, దేనినైనా సాధించగలుగుతాం. శరీరం బలహీనమవుతే మనస్సు దుర్బలమవుతుంది. దుర్బలత్వం అనేక విషపరిణామాలకు దారితీస్తుంది. నేను యిక్కడకు వచ్చి సంవత్సరం కావస్తున్నది. నేను ఇంటివద్ద నున్నప్పుడు నిర్వహించే పనులలో చాలా నీమీద పడ్డవి. బాధ్యతలు పెరిగాయి. ఆరోగ్యం తరిగింది కూడాను. అవకాశం వున్నంత, ఓపిక ఉన్నంత చేయి. దీనిలో ఏమాత్రం నిర్బంధం లేదు. ఎవరు ఏమనుకుంటారోనని మొహమాటపడనవసరం లేదు. ఎప్పుడు, ఏది, ఏవిధంగా జరగాలనివుంటే ఆ విధంగా జరుగుతుంది. మన చేతులలో ఏమీ లేదు. ఈ జగన్నాటకంలో మనమంతా ప్రేక్షకులమే. విచారంవద్దు. విచారించి ప్రయోజనం కూడా లేదు. మన ' టామి' (కుక్క) ఎట్లా వున్నది? దాని విషయమే మరచిపోయాను. నన్ను గురించి అడగటానికి దానికి నోరు లేదు గదా! పిల్లలందరికీ నా ముద్దులు. ఇక వుంటా......

ఇట్లు

'నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 23-6-1976.

ప్రియమైన జయ,

మిమ్ములనందరిని వదిలి యిక్కడికి వచ్చి సంవత్సరమైంది. నాకే ఆశ్చర్యంగా వున్నది. ఇది ఒకందుకు మంచిదేమోననిపిస్తున్నది. మీ అందరికీ జీవితంలో ఒక అనుభవం. మర్రిచెట్టు నీడ క్రింద మరొక మొక్క మొలవదు. నేనున్నప్పుడు అన్నీ నామీదనే వేసి మీరందరూ నిశ్చింతగా వుండేవారు గదా! ఇప్పుడు స్కూలు, హాస్టల్ నడపడంలో అనుభవం రాముడికి వచ్చి వుంటుంది. నేను చేసే పనులలో కొన్ని నీ మీద పడి, మరికొంత అనుభవాన్ని నీవు పొందివుంటావు. అందుకనే అనుకుంటాను. **"అంతయూ మన మేలు కొరకే"** అన్నారు పెద్దలు. ఇకపోతే నా విడుదల విషయం. 25వ తేదీకే తేలాలి. ఏమి జరుగుతుందో ఎవరూ ఊహించ లేకుండా వున్నారు. నమ్మకం మాత్రం నానాటికి సన్నగిల్లుతున్నది.

**"రోటిలో తలదూర్చి రోకటిపోటుకు వెరువనేల"** విచారించి ప్రయోజనం లేదు. పిరికివాళ్లలాగే పరుగిడటం విజ్ఞత అనిపించుకోదు. విధికృతం అని తలవంచి కూర్చోవటం పురుషుల లక్షణంకాదు. వీరుడు విధికి తలవగ్గడు. దుర్బలుడు మాత్రమే విధికి తలవంచుతాడు. విధిని ఎదిరించి ధైర్యంగా పోరాడి విజయాన్ని సాధించడం వీరుల లక్షణం. అమితమైన దుఃఖం మనిషిని ఆవరించినప్పుడు సహజంగా ఎవరి మనస్సైనా స్వాధీనం తప్పుతుంది. అది అతి సహజం. అందులో ముఖ్యంగా స్త్రీలు అబలలు అని ప్రసిద్ధిగదా! కష్టాలను సహించలేరు, తట్టుకోలేరు. సుఖాన్ని కోరుకుంటారు. అయితే స్త్రీలందరూ అబలలు కాదు. ఆదిశక్తి అవతారమని కొందరు నిరూపించి, సమాజానికి మార్గదర్శకులయ్యారు. మనస్సును నిశ్చలంగా వుంచుకోగలిగితే, ఎలాంటి విపత్కర పరిస్థితులు దాపురించినా, బయటపడ గలుగుతాం. దుఃఖాన్నిఅణచుకొని, మనస్సును స్థిమితపరచు కోవడంలోనే వున్నది విశేషం. ధైర్యాన్ని విడచినవారు ఏ ప్రయత్నమూ చేయలేరు. ఏ పనిని సాధించాలన్నా ధైర్యాన్ని విడువరాదు. ధైర్యం ఏ ప్రయత్నానికైనా మూలం. అధైర్యం అన్ని ప్రయత్నాలకు అవరోధం, అనర్థకం. సందర్భోచితమైన ధైర్యం (మొండిధైర్యం కాదు), సమయస్ఫూర్తి, విజ్ఞతతో కూడిన ఆలోచన, దూరదృష్టి, సామర్థ్యం, సాహసం, కార్యశూలత - ఎవరిలో వుంటాయో, వారే అంతిమంలోనయినా విజయాన్ని పొందితీరుతారు.

మానవ జీవితంలో సుఖ దుఃఖాలు, సంతోష విషాదాలు ఒకదానితో ఒకటి పెనవేసుకొని మానవుని నడిపిస్తుంటాయి. ఎప్పుడూ సుఖమే వుండదు. ఎల్లకాలం దుఃఖమే వుండదు. ఇప్పుడు నీ జీవితంలో కూడా అదే జరిగింది. ఒక్కొక్క

సమయంలో బాధతో, వ్యధతో, విచారంతో చేయవలసివస్తాయి కొన్ని పనులు. మరొక సమయంలో మరుక్షణంలోనే సంతోషంతో నిర్వహించవలసిన పనులు కూడా వస్తాయి, ఈ ఒక సంవత్సరంలోనే ఒకదానివెంబటి ఒకటి వచ్చాయిగదా! మీ నాన్నగారు పోవటం, నేను యిక్కడకు రావటం, మీ చెల్లెలు పెండ్లిచేయటం - అంతా ఈ ఒక సంవత్సరంలోనే జరిగాయి గదా! దీనినే భగవంతుని లీల అంటారు. ఏది ఎప్పుడు జరుగుతుందో మనకు తెలియదు కదా! ఎప్పుడూ దుఃఖమే అయితే సామాన్యుడు దానికి తట్టుకోలేక నాశనమవుతాడు. ఎప్పుడూ సుఖమే ఆవరిస్తే కన్నూమిన్నూ కానక పతనమవుతాడు. జీవితంలో ఈ రెండూ వుండినప్పుడే అనుభవాన్ని గడించి అత్యున్నతస్థాయికి చేరుకోగలుగుతాడు. కనుక తూ చా తప్పకుండా మనం చేయవలసిన కర్మలు మనం చేయవలసిందే. ఇది మన కర్తవ్యం. ఫలితాన్ని ఆశించడం మన వంతు కాదు. ఎవరికి, ఎప్పుడు, ఎంత ఫలితాన్ని ఏవిధంగా ఇవ్వాలో నిర్ణయించే హక్కు ఆ పరమేశ్వరునిదే. అది అతనికే వదలివేయాలి. ఈ జీవితంలో నిరాశ నిస్పృహలు సంభవించినప్పుడు పైవిధమైన ఆలోచనలు రావడం అతి సహజమే. అది మంచిది కాదు. దుఃఖంలోవున్నా సుఖంలో వున్నా విజ్ఞతతో కూడిన నిర్ణయాలను గైకొనాలి. కర్తవ్య నిష్ఠతో వ్యవహరించడం నేర్చుకోవాలి. తనవంతు విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించాలి. "**కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన**" అనే గీతోపదేశాన్ని మరువరాదు. సంతోషం సగం బలం. శోకం మనిషిని క్రుంగదీస్తుంది. ధైర్యాన్ని మ్రింగివేస్తుంది. అశాంతిని కలుగజేస్తుంది. చిట్టచివరికి జీవితంమీదనే విరక్తిని కలుగజేస్తుంది. "**అశాంతస్య కుతస్సుఖమ్**" శాంతి లేనివానికి సుఖం లేదు. ఆశ లేనివానికి నిరాశ లేదు. మనం ఈ పనిలో విజయాన్ని సాధిస్తామో! లేదో! అనే అనుమానాన్ని దరికి చేరనీయరాదు. అనుమానం పెనుభూతం. అది అభివృద్ధికి ఆటంకం. సంశయాలతో కార్యాలను సాధించలేం. సుఖాన్ని అంతకన్నా పొందలేం. "**న సుఖం సంశయాత్మన :** " మనస్సు యందు సంశయములను పెట్టుకొనివుండువానికి సుఖము లభించదు. '**సంశయాత్మా వినశ్యతి**' సంశయములు కలవాడు నశించునని '**గీత**' చెబుతున్నది. కనుక దానిని దరిదాపులలోనికి రానీయరాదు.

'**నేను నా జీవితాన్ని, అమరత్వాన్నయినా వదలుకోగలను కానీ ధర్మాన్ని విడచిపెట్టను**' అని అంటాడు ధర్మరాజు. సత్యధర్మాలను విడనాడకుండా, విడవకుండా ఓరిమితో వుంటే ఎటువంటి కఠినమైన కార్యాలనయినా సాధించవచ్చునని ఆయన దృఢ విశ్వాసం. కష్టపడని ప్రాణికి సుఖం ప్రాప్తించదు. ఓర్పు, ఓర్మి వహించిన వారికే విజయం ప్రాప్తిస్తుంది. ఆ నమ్మకంతో, విశ్వాసంతో ధర్మపథాన నడవటం వలననే

పాండవులు చిట్టచివరికి విజయాన్ని సాధించారు. ధర్మమే మానవునికి రక్ష అధర్మమే మానవునికి శిక్ష ధర్మాన్ని అల్క్షంచేస్తే ఆ ధర్మమే మానవుణ్ణి ధ్వంసం చేస్తుంది. ఈ వాస్తవాన్ని విస్మరిస్తే భవిష్యత్తు అంధకార బంధురం అవుతుంది, '**ధర్మో రక్షతి రక్షితః**' మనం ధర్మాన్ని రక్షిస్తే, అది మనలను రక్షిస్తుంది. ఇది విస్మరించ రాని నగ్నసత్యం.

మానవుడు ఆశాజీవి కదా! సుఖాంతాన్నే కోరుకుందాం. కరివేపాకు లేకపోతే పచ్చడికి ఏ విధంగా రుచి చేకూరదో, దుఃఖం జీవితంలో భాగం కాకపోతే ఆ జీవితానికి శోభ వుండదు. దానికి చైతన్యమే వుండదు. సుఖ దుఃఖాల మిళితమే నిజమైన జీవితం. ఇక వుంటా......

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 25-6-1976.

ప్రియమైన జయ,

రెండురోజుల క్రిందట వ్రాసిన ఉత్తరం అందియే వుండవచ్చును. ఈ ఉత్తరం అందేటప్పటికి మా '**రిలీజుల**' విషయం పత్రికలద్వారా తెలియవచ్చును. కచ్చితంగా యింతవరకు ఏమీ తెలియలేదు. కొంత మంది ఈ తేదీలలో ఆనందంతో వార్షికోత్సవ ఉత్సవాలు జరుపుకుంటారు. మరి కొంతమంది నిర్భాగ్యులు సంవత్సరీకాలు జరుపుకుంటారు. కొంతమందికి సంతోషం, మరికొంతమందికి దుఃఖం. కొంతమందికి సంయోగం, మరికొంతమందికి వియోగం. ఇది మానవజాతి ఆవిర్భవించిన దగ్గరనుండి వస్తున్న సహజపరిణామమే. ఇది యుగయుగాల చరిత్ర, తరతాల అనుభవం. మరువడానికి వీలులేని మధురమైన గాధలు, మరువలేని విషాద ఛాయలు. సుఖం-దుఃఖం; ఆనందం-విచారం; సంతోషం-విషాదం; సంయోగం-వియోగం; పేదరికం-భాగ్యం; - వీటిమధ్యపడి మానవుడు అటూ ఇటూ ఆసులో కండెలాగే ఊగిసలాడుతుంటాడు. బలహీనులు ఆ ఆటుపోటులకు తట్టుకోలేక కాలగర్భంలో కలసిపోతుంటారు. ధీమంతులు ధైర్యంతో వాటి నెదిరించి హిమాలయ పర్వతాలలాగే చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతారు. అందుకోసమనే మన పెద్దలు "**సుఖదుఃఖాలకు లొంగి, ఒంగి, పొంగిపోగూడదు**' అని అంటారు. దుఃఖములు దాపురించినప్పుడు ఏ విధమైన సంక్షోభం చెందకుండుట, సుఖములు

సంప్రాప్తించి నప్పుడు ఉబ్బితబ్బిబ్బు కాకుండుటే స్థితప్రజ్ఞుని లక్షణములుగా గీతలో పేర్కొనబడినది. మాటలు చెప్పటం తేలికే. ఉపదేశాలు చేయటం ఇంకా తేలిక. కాని వాటిని ఆచరించటం చాలా కష్టం. కష్టాలెదురైనప్పుడు వాటిని ధైర్యంగా ఎదిరించి నిలబడటం యింకా కష్టం. భరించరాని దు:ఖం దాపురించినప్పుడు ఆత్మీయులు శాశ్వతంగా యీ ప్రపంచాన్ని వదలి వెళ్లినప్పుడు, నా అన్నవారు దూరమైనప్పుడు, మన కష్టనష్టాలలో పాలుపంచుకునేవారు దరిదాపులలో లేనప్పుడు - ఎవరికైనా సరే మనస్సు స్వాధీనం తప్పడం అతి సహజము. చిరకాలవియోగం వల్ల, భరించరాని ఒంటరితనం వల్లః ఎంతటి బుద్ధిశాలి అయిన స్త్రీయైనా, ఎంతటి ధైర్యశాలి అయిన మగువ అయినా మనోదౌర్బల్యమునకు గురికావటం సహజమే, ఎవరూ కాదనలేరు. కాని వీటినన్నింటిని అధిగమించి జీవన ప్రయాణం కొనసాగించటంలోనే వున్నది విశేషం. గొప్పతనం, ఔన్నత్యం, కష్టాలు, సుఖాలు కలకాలం కాపురం వుండవు. కటిక చీకటి తరువాత వెలుగు వచ్చి తీరుతుంది. మరల వెలుగు తరువాత చీకటి రాక మానదు. శాశ్వతంగా, చీకటి తిష్ఠవేసుకొని కూర్చోదు. అదే విధంగా వెలుగు కూడా శాశ్వతం కాదు. ఈ సృష్టిరహస్యాన్ని తెలుసుకున్న వారికి చీకుచింతా వుండదు. వాటి నన్నింటిని అధిగమించిన వానినే 'జ్ఞాని' అని అంటారు. అందరు అట్టి పరమోత్కృష్టమైన స్థాయికి చేరుకోవటం కష్టమే. కాని ఆ స్థితిని చేరుకోవటంలోనే వున్నది ఆనందం, సౌఖ్యం. ఈ మహా ప్రయత్నానికి మన పురాణ, ఇతిహాస, ప్రబంధాలు ఎంతో ఉపకరిస్తాయి. అందుకోసమనే భగవద్గీత, రామాయణం, భారతం, రఘువంశం చదవటం పూర్తిచేశాం. శాకుంతలం చదువుతున్నాం. ఇవన్నీ చదవటం వైరాగ్యాన్ని పొందటానికి కాదు, ధైర్యాన్ని పుంజుకోవటానికే. దుర్బలత్వానికి గురి కావటానికి కాదు, మనోధైర్యాన్ని పొందటానికి, ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించుకోవటానికి మాత్రమే.

జూన్ నెల మళ్లీ జీవితంలో ఒక పెద్ద మలుపు. ప్రభుత్వ నిర్ణయాలకు నిస్పృహచెంది నిరాశను దరికి చేరనీయరాదు. ఏ కార్యములైనా సరే పురుషప్రయత్నం చేతనే నెరవేరుతాయిగాని, వట్టి కొరగాని కోరికలవల్ల నెరవేరవు. ఈ వాస్తవాన్ని విస్మరించరాదు. కనుక పరిస్థితులను గమనించి, విశ్వాసాన్ని విడనాడక, సంపూర్ణ విశ్వాసంతో ముందుకు సాగిపోవటం ఒక్కటే మార్గం. వేదాంతం వ్రాస్తున్నానని నిరాశ చెందక, సమయస్ఫూర్తితో వ్యవహరించి ప్రస్తుత పరిస్థితులను అధిగమించడం ఒక్కటే మన కర్తవ్యం, నీకు నచ్చినా నచ్చకపోయినా ఏదో చాలా వ్రాసాను. నిశ్చలమైన మనస్సుతో అవగాహన చేసుకుంటావని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

నీవు వ్రాసినట్లు ఆరోగ్యం అన్నిటికి ప్రధానంకదా! దానిని నీవు సదా కాపాడుకుంటావని నమ్ముతున్నాను. మనవాళ్ళందర్ని అడిగినట్లు చెప్పగలవు. చిరంజీవులకు ఆశీఃస్సులు. ప్రస్తుతం నేను చేయగల్గింది అంతేకదా! ఇక వుంటా..

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 2-7-1976.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరం, శంకరం మరియు రాజు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. నీ ఆరోగ్యం విషయంలో చాలా విచారిస్తున్నాను. మందు తీసుకోగలవు. ఏదైనప్పటికీ మందు శ్రద్ధగా తీసుకోవాలి. అధైర్యపడితే లాభంలేదు. ధైర్యాన్ని అవలంభించవలసిన సమయం. దైన్యాన్ని విడనాడాలి. ధైర్యంతో ప్రయత్నం చేయనిదే ఏకార్యం సాధించబడదు. ప్రయత్నం చేస్తేనే ఏ కార్యమైనా సఫలీకృతమయ్యేది. అధైర్యపడి చేజేతులారా ఆరోగ్యాన్ని పాడుచేసుకోకూడదు. దానివల్ల ప్రయోజనం లేదు. ధైర్యమే ఉత్సాహానికి మూలం. ఉత్సాహమే బలము. ఉత్సాహానికి మించినది వేరొకటి లేదు. అంతేకాదు ఈ లోకంలో ఉత్సాహవంతునికి దుర్లభమనేది ఏదీలేదు. ఉత్సాహవంతులు ఎటువంటి కష్టాలలోనైనా దుఃఖించరు. దుఃఖాన్ని ధైర్యంతో నిగ్రహించుకోవటం విజ్ఞుల లక్షణం. కష్టాలు వచ్చినప్పుడుగాని, సంపాదించిన సొమ్ము పోయేటప్పుడుగాని, ఆత్మీయులు దూరమైనప్పుడుగాని, ప్రాణం పోతుందేమోనన్న భయం కలిగినప్పుడుగాని బుద్ధిమంతులు అయినవారు తమ బుద్ధిబలంతో ఆలోచిస్తారు. ధైర్యంతో, విజ్ఞతతో వాటిని దాటటానికి ప్రయత్నిస్తారుగాని, దుఃఖములో మునిగిపోరు. అసలు దుఃఖానికే అవకాశమివ్వరు. దుఃఖపడేవారికి సుఖం ప్రాప్తించదు. ఈ విషమ పరిస్థితులలో మనం ఏమైపోతామో నని దిగులుపడితే ప్రయోజనం లేకపోగా ఆరోగ్యం కూడా చెడుతుంది., అసలు ఆరోగ్యమేపోతే జీవితంలో సాధించేదేదీ వుండదు. విచారించి ప్రయోజనం లేదు. విచారించడం విజ్ఞుల లక్షణం అంతకన్నా కాదు.

ప్రతివ్యక్తీ తెలిసో, తెలియకో పుణ్య పాపకర్మలు రెండూ చేస్తుంటాడు. ఆయా కర్మలను బట్టి శుభాశుభఫలాలు అనుభవించాల్సిందే. ఈ లోకాన్ని సృషించిన బ్రహ్మదేవుడే అందరి సుఖదుఃఖాలకు కర్త. అందువలననే భగవంతుణ్ణి 'కర్మఫల

ప్రదాత' అని అంటారు. దైవానికి ఈర్ష్యాద్వేషాలు వుండవు. చేసిన కర్మలనను సరించి తగిన ఫలాన్ని అందివ్వడం ఆయన వంతు. ఉపకారికి ప్రత్యుపకారం చేయడమే మానవత్వం. అదే మానవధర్మం. నాకు తెల్సినంతవరకు నేను ఎవరికీ అపకారం చేయలేదు. నిస్వార్థ బుద్ధితో ఉపకారమే చేసాను. నాకోసం నేను ఏమి దాచుకోలేదు, నేను ఎవర్ని దోచుకోలేదు. కనుక నాకు ఎవరూ అపకారం చేయడానికి సాహసించలేరు. చేసిన ఉపకారాన్ని మరచిపోయి అపకారం చేసేవాళ్లను భగవంతుడు కూడా క్షమించడు. కృతఘ్నులైనవారు మాత్రమే చేసిన ఉపకారాన్ని మరచిపోయి మంచివాళ్ల మనస్సులను నొప్పిస్తారు. నాకు అటువంటి దుస్థితి దాపురించదని నా నమ్మిక. అన్నిటికీ విశ్వాసమే ప్రధానం. ఆత్మ విశ్వాసం ముఖ్యం. అది లోపిస్తే ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేం. ఇకపోతే కష్టాలంటావా? అవి మహామహులకే తప్పలేదు.

ఈ దేశాన్ని మాతృభూమిగా, పుణ్యభూమిగా జన్మనిచ్చిన తల్లిగా భావించి, పూజించి, అవసరమైతే సర్వస్వాన్ని అర్పించటానికి ఏమాత్రం వెనుకంజ వేయనటు వంటి నాలాంటివాళ్లను ఈ ప్రపంచంలో ఏ శక్తీ అడ్డుకోలేదు. ఒకవేళ దుర్బుద్ధితో, స్వార్థంతో ఎవరైనా అడ్డుకోవటానికి ప్రయత్నించుతే, భవిష్యత్తులో అట్టి వారుతగిన శాస్తిని పొందితీరుతారు. ప్రపంచ చరిత్ర ఇదే వాస్తవాన్ని చాటుచున్నది. కనుక నీవేలాంటి భయాన్ని పొందనవసరంలేదు. ఏదో మనస్సులోనున్న ఆవేదనను కొంచెం తెలియజేసాను. నీ కలానికి వున్న స్వేచ్ఛ నాకలానికి లేదుకదా! పరిస్థితులను అవగాహన చేసుకొని, సమయస్ఫూర్తితో వ్యవహరిస్తావని విశ్వసిస్తున్నాను. రామాయణంలో **'సుందరకాండ'** పుస్తకం రాలేదు. భాగవతం (వచనం) కూడా తీసుకొనిరాగలవు. ప్రస్తుత పరిస్థితులలో పుస్తకాలే నా స్నేహితులు కదా! కనుక వచ్చేటప్పుడు మంచి పుస్తకాలు తీసుకొని రాగలవు. చిరంజీవులకు నా ఆశీస్సులు, ముద్దులు. ఇక వుంటా......

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 31-7-1976

ప్రియమైన జయ,

నేను క్షేమంగా వున్నాను. నీవు వ్రాసిన ఉత్తరం అందినది. నీకు నచ్చినట్లు ఉత్తరం వ్రాయాలంటే అంత తేలిక కాదు. 13 నెలల నుండి వ్రాస్తూనే ఉన్నాను. క్రొత్త విషయాలు ప్రతి ఉత్తరంలో వ్రాయాలంటే అంత తేలిక కాదు. నా వద్ద ఉత్తరం కాపీ వుండదు కదా! వ్రాసింది వ్రాస్తున్నానేమో! చదివేదానివి నీకే తెలియాలి. నీ కలానికి స్వేచ్ఛఉన్నది. నా కలానికి లేదు. రాజకీయాలు వ్రాస్తే నీకుచేరదు. దేశభక్తిపూరితమైన చారిత్రక విషయాలు వ్రాస్తే సెన్సార్ అధికారులకు అర్థంకాక త్రిప్పివేస్తారు. అసలు ప్రస్తుతం ప్రతి మాటకు అర్థాలు మారిపోతున్నాయి. నిర్వచనాలు తారుమారవుతున్నాయి. ఇకపోతే పురాణం. ఆ మాటలోనే ఉన్నది పురాతనమైనదనే భావం. పురాతనమంటే బూజుపట్టిన సిద్ధాంతం అని నవనాగరికుల అభిప్రాయం. ఆ పురాతనమైనది, సనాతనమైనది అర్థం కాక అసలు ఉత్తరానికే ప్రమాదం సంభవించవచ్చు. ఇక పోతే మిగిలింది వేదాంతం. ఇది అంతం లేనిది, అందరికి అర్థం కానిది. అర్థంకాని విషయాలువ్రాస్తే, దీనిలో ఏదో రహస్యం నిబిడీకృతమై

వుంటుందని భావించి, అధికారులు అనుమానిస్తారు. ఇది నాఅవస్థ, దురవస్థ. అధికారులతో మాట రాకుండా, నీకు నచ్చేట్లుగా, మనశ్శాంతిని చేకూర్చేట్లుగా వ్రాయాలనేదే నా తాపత్రయము.

మన భవిష్యత్తు మనం లోగడ చేసుకున్న పుణ్య పాప కర్మములమీదనే ఆధారపడి వుంటుంది. ఈనాడు నవ్వుతూ నవ్వుతూ చేసిన పాపకర్మలకు రేపు ఏడుస్తూ దు:ఖమును అనుభవించవలసి వస్తుంది. ఈనాడు చేసిన మంచికి రేపు సుఖమును అనుభవిస్తాం. ఈ జన్మలో చేసిన పుణ్యకర్మలుగాని, పాపకర్మలుగాని ఈ లోకములోనే నశించిపోవు. మనకన్నా ముందుగానే పరలోకం చేరుతాయి. ఎప్పటికప్పుడు "**చిత్రగుప్తుడు**" తన చిట్టాలో వ్రాస్తూనే వుంటాడు. దానికి తగిన ఫలితాన్ని మరో జన్మలో అనుభవిస్తాం. ఈ లోకమున సుఖముగాని, దు:ఖముగాని మరెవ్వరూ యివ్వరు. తాను చేసిన పుణ్యకర్మమువలన సుఖము, పాపకర్మము వలన దు:ఖము సంభవిస్తుంది. తనకు సంభవించిన ఆపదలను చూచి భగవంతుని తూలనాడటంకాని, దూషించటంగాని అవివేకం. ప్రతి మానవుడూ అన్నీ మంచి పనులే చేయడు. అదే విధంగా అన్నీ చెడ్డపనులే చేయడు. మంచిచెడులు రెండూ చేస్తూనే వుంటాడు. ఏ వ్యక్తీ పరిపూర్ణుడు కాలేడు, కనుక తాను చేసే పనుల కనుగుణంగా సుఖదు:ఖములననుభవిస్తాడు. కాబట్టి పునర్జన్మ మీద విశ్వాసం వున్న మనం ఈ జీవితంలో అన్నీ మంచి పనులు చేయలేక పోయినా, చూస్తూ, చూస్తూ తెలిసికూడా చెడ్డపని మాత్రం చేయరాదు. మంచి పనుల శాతం ఎక్కువగా వుండేట్లుగా జీవితాన్ని మరల్చుకోవటంలోనే వున్నది విజ్ఞత. కనుక ఆపదలు సంభవించినప్పుడు దు:ఖించరాదు. వికలత చెందరాదు. పరాకు లేకుండా నిరంతర కృషి సాగిస్తూనే వుండాలి. అవసరమైనప్పుడు భరించరాని దు:ఖాన్నయినా సంతోషంగా స్వీకరించి మ్రింగాలి. శోకించరాదు. శోకం అసలు రూపాన్నే మార్చివేస్తుంది. జ్ఞానాన్ని మ్రింగివేస్తుంది. బలాన్ని పిండివేస్తుంది. తాపాన్ని కలుగజేస్తుంది. దానికి తట్టుకోలేక చిట్టచివరికి వ్యాధిగ్రస్తుడవుతాడు. ఆఖరికి కాలగర్భంలో కలిసిపోతాడు. ఎవడు తన మనస్సును నిగ్రహించుకోలేడో, వాడు తరచుగా ఆపదలకు గురియైపోతాడు.

ఈ విషయంలో మహాభారతంలోని "**విదురుడు**" చక్కటి ఉదాహరణ చెబుతాడు. "**పురుషుని శరీరము రథము! మనస్సు సారథి! ఇంద్రియములు అశ్వములు. ధీరుడైనవాడు సారథిని గుఱ్ఱములను నేర్పుతో వశపరచుకుంటాడు. అట్టివాడే మహారథికునివలె సుఖముగా జీవిత యాత్రను కొనసాగించగలుగుతాడు**" అని చెబుతాడు. ఈ ఇంద్రియములనే దుష్టాశ్వములను నేర్పుతో వశపరచుకొనని

యెడల రథమును, సారథిని మట్టుపెడుతాయి. కనుక మానవుడు కడు జాగరూకుడై వ్యవహరించాలి. ప్రతి వ్యక్తికీ ఎల్లకాలం దుఃఖమే వుండదు. శాశ్వతంగా సుఖమే వుండదు. ఒకదాని తరువాత మరొకటి వస్తూనేవుంటుంది. దుఃఖములో వున్న వాళ్లను తేలికగా చూడటం, అవమానించడం సనాతనంగా వస్తున్న సంప్రదాయమే. మంచిగా వున్న రోజులలో ఇంద్రుడూ చంద్రుడూ అని పొగిడి గౌరవించిన మిత్రులు, బంధువులూ కనపడకుండాపోతారు. లోకులు నిందిస్తారు. సంపదలు దూరమవుతాయి. ఆత్మీయులు అనబడేవారు కూడా కనిపించరు. అయినప్పటికి **"నీతి శ్లాఘ్య పదంబు దప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్"** దీనిని మరువరాదు.

ఈ లోకంలో నిందాపనిందలు మోపి సజ్జనులను బాధించడం దుర్జనుల సహజ లక్షణం. దుర్జనులకు హింసయే బలం. సజ్జనులకు క్షమయే బలం. **"ఎవరైనా అవివేకంతో నిందమోపి అవమానించినను. శాంతిపరుడై కోపమును జెందరాదు. శాంతిపరుని యందు అణగిపోయిన కోపమే నిందకుని దహించివైచి, వాని సుకృతమునెల్ల శాంతి పరున కొసగును"** అని ధృతరాష్ట్రునితో విదురుడు చెబుతాడు. ఈ విషయం ఎంతో అనుభవంతో చెప్పబడింది. దీనిని ఆచరణలో పెట్టినవారికి విచారం వుండనే వుండదు. కనుక కార్యసాధకునికి ఓర్పు వుండాలి. ఓర్మితో సర్వ కార్యాలు సాధించవచ్చును. మానవ ప్రయత్నాన్ని విడువరాదు. ఏ మహత్తరకార్యాన్ని సాధించాలన్నా పురుషప్రయత్నం ఎంత అవసరమో, దైవము తోడ్పాటు కూడా అంతే అవసరం. ఇందులో దైవం బీజం. మానవ ప్రయత్నం క్షేత్రం. ఒకవేళ క్షేత్రం (భూమి) ఎందుకూ పనికిరాని చవిటి భూమి అయితే బీజం ఫలించదుగదా! అదే విధంగా మానవ ప్రయత్నమనే కర్మ జరుగకుండా బీజం ఫలించదు. భూమిని బాగుగా దున్ని , బలం పెట్టి, నీరు పెడితే బీజం ఫలిస్తుంది. కనుక మానవ ప్రయత్నము అత్యావశ్యకము. మంచి సారవంతమైన భూమి అయినప్పటికీ బీజం మంచిది కానియెడల మొక్క మొలవదు. అదే విధంగా మానవప్రయత్నానికి దైవం యొక్క తోడ్పాటు లేనిదే ప్రయోజనం లేదు. కనుక గతంలో మహానుభావు లందరూ అనుసరించిన ధర్మపథాన్నే మనం కూడా నడవాలి. మన కర్మను మనం చేయాలి. ఎట్టి ఫలాపేక్ష లేకుండా నిత్యమూ, నిరంతరమూ చేస్తునే వుండాలి. ఏ ఆశయాన్ని ఆశ్రయించుకొని వుంటామో, దానికి ఎన్ని అడ్డంకులూ, అవాంతరములు వచ్చినా విడువకుండదు. ఎట్టి విపత్కర పరిస్థితులు సంభవించినా లక్ష్యమును విడనాడరాదు. మహోన్నతమైన ఆశయం కొఱకు జీవించాలి. ఆదర్శానికి అంకితం కావాలి. పరమోత్కృష్టమైన సత్యాన్ని ధైర్యంగా ప్రకటించగలగాలి. నవ్వుతూ, నవ్వుతూ

పనిచేయగలవారే గొప్పవారు. అదే విధంగా నవ్వుతూ నవ్వుతూ ఎటువంటి కష్టాలనైనా ఎదుర్కొనగలవారే మరింత గొప్పవారు. ఈ రహస్యాన్ని అర్థం చేసుకుంటే ఈ జీవన సంగ్రామరంగంలో విజయాన్ని సాధించగలుగుతారు. అనుకోకుండా చాలా వ్రాసాను. చిరంజీవులకు నా ఆశీ:స్సులు. ఇకవుంటా....

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది 4-8-1976.

ప్రియమైన జయ,

నేను కులాసా. నీవు వ్రాసిన ఉత్తరం అందినది. సంతోషం. నీ భావాలను దాచకుండా విపులంగా వ్రాస్తున్నందులకు నాకెట్టి కోపం లేదు. ఏదోవిధంగా మనసులోని భావాలు బయటకు రావటం మంచిదే. అన్నీ గుంభనంగా మనస్సులో దాచుకొని, వాటిని భరించలేక మనస్సు పాడుచేసుకొనే దానికన్నా ఈ విధంగా వ్రాయటమే మంచిది. ఇకపోతే సన్యాసము, త్యాగము, తపస్సు మొదలగు వాటిని గురించి "గీత" లో చక్కగా వర్ణించబడింది. "సన్యాసి"అనగా అగ్నిహోత్రమును త్యజించినవాడని, కాషాయ వస్త్రములను ధరించి, భార్యాపిల్లలను, ఆత్మీయులను, ఆస్తిపాస్తులను వదలి, కాకులు దూరని కారడవులకు వెళ్లి, అన్నపానములు త్యజించి, వాయుభక్షణతో, ఘోరాతి ఘోరమైన తపస్సు చేసేవారే సన్యాసులని, యోగులనే భావం చాలామందిలో వున్నది. అట్టివారికే మోక్షం కూడా సిద్ధిస్తుందనే నమ్మకం చాలామందిలో వ్యాపించి వున్నది. ఇది యదార్థం కాదు. అటువంటి మహానుభావులు, సర్వసంగ పరిత్యాగులు అసలు ప్రస్తుతం వున్నారో? లేదో? అసలు ఇది అందరికీ సాధ్యం కూడా కాదు. ప్రస్తుత జీవన పరిస్థితులకు అనుగుణం అంతకన్నా కాదు. ఎట్టి ఫలాపేక్ష లేకుండా చేయదగిన కర్మలను చేయటమే సన్యాసి యొక్క లక్షణం. కామ్య కర్మలను వదులుటయే సన్యాసము. ఏ పని చేయువారు ఆ పని చేసుకొన వచ్చును. కర్తృత్వబుద్ధి మాత్రం వదిలిన చాలును. కామ్య బుద్ధిని అంతమొందించిన చాలును. ఆత్మీయులను త్యజించనవసరంలేదు. కాషాయాంబరములను ధరించ నవసరంలేదు. నిర్జన ప్రదేశములకుపోనక్కరలేదు. ఎక్కడ వున్నవారు అక్కడనే వుండి, ఏ వృత్తిచేసుకొనేవారు ఆ వృత్తిలోనే వుండి, న్యాయమైన, ధర్మబద్ధమైన, సత్యమైన జీవనాన్ని కొనసాగిస్తూ పదిమందికి ఉపయోగపడుతూ జీవితాన్ని సార్ధకం

చేసుకోవటంలోనే వున్నది గొప్పతనం. అట్టి వ్యక్తే మోక్షానికి అర్హుడు. దానితోపాటు మన మేధస్సును పెంచుకోవాలి. అధ్యయనం వలన మానవుని మేధస్సు వికసిస్తుంది. ధర్మాచరణం వలన మానవుని మనస్సు నిర్మలమవుతుంది. న్యాయ నిష్ఠల వలన మానవుని మనస్సునకు ప్రశాంతత చేకూరుతుంది. పరోపకారం వలన ఆత్మ సంతృప్తి చెందుతుంది. సత్య నిష్ఠ వలన ఆధ్యాత్మిక వికాసం పెంపొందుతుంది. భక్తి, ధ్యానం, తపము వలన ఏకాగ్రత కుదిరి మానసిక శక్తులు వికసిస్తాయి. ఏ కార్యాన్ని సాధించాలన్నా ఆత్మ విశ్వాసం ముఖ్యం. విశ్వాసం సడలినచో ధైర్యం దెబ్బతింటుంది. ధైర్యం దెబ్బతినిన సాధన కుంటుపడుతుంది. చేద్దామనుకున్న పని చేయలేము. సాధన కుంటుబడ్డచో లక్ష్యము దూరమైపోతుంది. కావున కార్యసాధకునికి పట్టుదల, అకుంఠితమైన విశ్వాసము, అపరిమితమైన శ్రద్ధ, ధైర్యము మొదలగునవి వుండాలి. అప్పుడే అతడు లక్ష్యాన్ని చేరుకోగలుగుతాడు. దారి దోపిడి చేసి జీవితాన్ని గడుపుకునే రత్నాకరుడు సాధన వల్లనే వాల్మీకి గా మారిపోయాడు. అత్యున్నతమైన రామాయణ మహాకావ్యాన్ని ప్రజానీకానికందించాడు. మాంసమును అమ్ముకొని జీవించేటటు వంటి ధర్మవ్యాధుడు న్యాయబద్ధమైన జీవితాన్ని గడపటం వలననే మోక్షానికి అర్హుడయినాడు. కనుక నిష్కామ కర్మ చేస్తూ, ఫలితాన్ని ఆశించకుండా ముందుకు సాగిపోవటం ఒక్కటే ప్రస్తుత మానవాళి అనుసరించదగ్గ మంచి మార్గం. ఈ మార్గాన్నే భగవద్గీత బోధిస్తున్నది. ప్రస్తుత యుగానికి అది అత్యంత ఆవశ్యకం. దీని వల్లనే మోక్షం ప్రాప్తిస్తుంది.

**"కలియుగమున సత్యనిష్ఠయే తపస్సు. సత్యవ్రతమే ముఖ్యమైన వ్రతము. సదా సత్యసంధుడై యుండునట్టివాడు, సత్యస్వరూపుడగు సత్యనారాయణుని (భగవంతుని) గనజాలును"** అని రామకృష్ణపరమహంస చెప్పారు. ప్రస్తుత యుగానికి ఈ సూక్తి ఎంతగానో ఉపకరిస్తుంది. నిరాశ చెందనవసరంలేదు. జీవితం మీద విరక్తి పొందనవసరంలేదు. నిరాశావాదులను గురించి శ్రీ సత్యసాయిబాబావారు చక్కగా చెప్పారు. **"కఠిన శిల సయితం ఒకనాడు ధూళిగా మారుతుంది. ఆ ధూళినుంచి ఒక చిరుమొలక లేచి మహావృక్షంగా పెరగవచ్చు. ఆ వృక్షఫలాన్ని ఆరగించి, దంపతులొక శిశుఫలాన్నిప్రపంచానికందించవచ్చు. కఠిన శిలయును సయితం వెచ్చని సుకుమార శిశు హృదయంగా పరిణమించగా, అపురూప మార్దవాన్ని నింపుకున్న మానవుడు అవతార పురుషుడు కాలేడా?"** అని అంటారు. నిజమే. ఆత్మవిశ్వాసం వుంటే సాధించలేనిది ఈ ప్రపంచంలో ఏమీ లేదు. ఆత్మ విశ్వాసం, పట్టుదల వుంటే బేధించరానిదైన మహాశిలనైననూ పిండి గావించవచ్చును. తిమింగలాలకే నిలయమైన మహోదధిని సహితం దాటవచ్చును. కాకులుదూరని కారడవిని నిర్భయంగా

దాటవచ్చును. ఆకాశమార్గాన అంగారక గ్రహమునకు సహితం చేరుకోవచ్చును. ఆత్మవిశ్వాసంగల మానవునికి అపజయమనేదే వుండదు. కాని అతని కార్యదీక్షను పరీక్షించడానికి మధ్య మధ్య అనేక అవాంతరములను భగవంతుడే సృష్టిస్తాడు. వాటిని ధైర్యంగా ఎదుర్కొనిన వారే అంతిమ లక్ష్యాన్ని చేరుకోగలుగుతారు. భగవంతుడు ముళ్లకిరీటాలను సామాన్య మానవులకు బహుకరించడు. జీసస్‌క్రీస్తు లాంటి మహాపురుషులకు మాత్రమే అట్టి ముళ్ళకిరీటాలు బహుకరించబడుతాయి. ఆదిశంకరులు లాంటి మహానుభావులను మాత్రమే సీసాన్ని మ్రింగమంటారు. సోక్రటీసులాంటి మహాతత్త్వవేత్తలకు మాత్రమే విషాన్ని యిస్తారు. కారణం? భగవంతుడు బుద్ధిపూర్వకంగా కష్టాలను ఆపాదించి, వారి వ్యక్తిత్వాలను యినుమడింప జేస్తాడు. ప్రజాబాహుళ్యం ఎదుట పరిశుద్ధులైనవారిగా నుంచోబెడతాడు. ప్రజానీకానికి చక్కటి ఆదర్శమును చూపించడాని కోసం భగవంతుడే మహాప్రవక్తలకు అనేక యిక్కట్లను కలుగజేస్తాడు. ఇదే వాస్తవమును మన పురాణ, ఇతిహాస చరిత్రలు ఋజువు చేస్తున్నాయి.

సత్యాన్ని అవమానించడానికి అడుగడుగునా ప్రయత్నాలు నిత్యం కొనసాగుతూనే వుంటాయి. ధర్మానికి విఘాతం కలిగించే ద్రోహులు ప్రతి యుగంలోనూ పుడుతూనే వుంటారు, న్యాయాన్ని సమూలంగా సర్వనాశనం చేయాలనే ప్రయత్నాలు తరచుగా జరుగుతూనేవుంటాయి. కానీ సత్యం, ధర్మం, న్యాయాలను ఏశక్తీ అవమానించలేదు, అడ్డుకోలేదు. తాత్కాలికంగా కొంత విఘాతాన్ని మాత్రం కలుగజేయవచ్చు. అది శాశ్వతం మాత్రంకాదు. కనుక అవరోధాలు వచ్చినా, అడ్డంకులేర్పడినా, అవాంతరములు వచ్చి పడినా పెనుగాలులు వీచినా, ఆరోపణలు, అభాండములు మీద వేసినా, **"లెక్కకు రానీయడు. కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్"** కనుక నిస్వార్థబుద్ధితో, ధైర్యంగా, ధార్మిక జీవనపథంలో ముందుకు పురోగమించడం నేర్చుకోవాలి. ఇదే నా ఆశయం. నా ఆకాంక్ష ఇక వుంటా....

ఇట్లు

" నీ "

---

*'గొప్ప ప్రభుత్వం అంటే ఏది? ప్రజలు మంచి పనులు చేయడానికి సులభంగాను, చెడ్డ పనులు చేయడానికి క్లిష్టంగాను ఉండాలి'.*

- శ్రీ గ్లాడ్‌స్టన్

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 15-8-1976.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. ఈనాడు ఏవో...ఏవో ఆలోచనలు ముమ్మరంగా మనసులో రీళ్లలాగే తిరుగుతున్నాయి. గత స్మృతులు ఉవ్వెత్తున తరంగాలలా లేచి మనస్సులో గందరగోళాన్ని సృష్టిస్తున్నాయి. రేడియోలో దేశభక్తి పరిపూరితమైన గీతాలు వినపడుతున్నాయి. **"గాంధీ పుట్టినదేశం, రఘురాముడు ఏలిన రాజ్యం, ఇది మమతకు సమతకు సందేశం"** అనే పాట నా మనస్సును ఎంతో ఆకర్షించింది. ఈవేళ స్వాతంత్ర్యదినోత్సవం గదా! నేటికి 29సం॥ల క్రిందట మనం స్వరాజ్యం సంపాదించుకున్నాం. మోడుబారిన మన బ్రతుకులు చిగిర్చినాయి. మూగబోయిన మన గొంతులు విచ్చుకున్నాయి. విజయదుందుభులు మారు మ్రోగినాయి. ఆనాడు ఒకప్రక్క మన భరతమాత మూడుగా ఖండించబడిందనే బాధ, మరొకప్రక్క ఇంగ్లీషువారి పీడవిరగడ అయిపోయిందనే సంతోషం, ఏదో ఒక విధంగా స్వాతంత్ర్యాన్ని సంపాదించామనే సంతృప్తి. మొత్తానికి ఈనాడు భారతీయులకు కనులపండుగ. రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని కూకటివేళ్లతో పెకలించివేయగలిగామనే సంతోషం, ఆనందం. ఈ సంతోషానందములకు కారణభూతమైన గత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను ఒక పర్యాయం సింహావలోకనం చేసుకొని గత స్మృతులను నెమరు వేసుకుంటే కలిగే బాధ, వ్యథ వర్ణనాతీతము. ఆపుకుందామన్నా ఆగని ఆవేదన, అప్రయత్నంగా వచ్చి పడే వేడి కన్నీరు. అమరవీరుల ఆత్మశాంతికి యివ్వగలిగేది వేడి కన్నీరే గదా! ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమనగా 1857సం॥. ఆనాటి నుండి 1947సం॥ వరకు భారతీయులు జరిపిన వీరపోరాటాలు, శౌర్యగాథలు, త్యాగాలు, బలిదానాలు తలచుకుంటే హృదయం గగుర్పొడుస్తుంది. బ్రిటీష్‌వారు భారతీయులమీద జరిపిన అమానుష, కిరాతక, పైశాచికకృత్యములను తలచుకుంటే మనస్సు ఎంతో వ్యథ చెందుతుంది. సోదరి రాణి లక్ష్మీబాయి తన పసిపిల్లవానిని వీపున కట్టుకొని . కత్తిపట్టి కదనరంగంలోనికి దుమికి స్వైరవిహారం చేసి బ్రిటీషువారిని గడగడలాడించింది. వేలాదిమంది విప్లవకారులు తెల్లవారితో పోరాడి అసువులు బాసారు. భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు **"వందేమాతరం"** అంటూ ఉరిత్రాళ్లను స్వహస్తాలతో తమ తలలకు తగిలించుకొని అమరవీరులైనారు. చంద్రశేఖర్ ఆజాద్ బ్రిటీషువారికి సింహస్వప్నంగా తయారయ్యాడు. చిట్టచివరికి స్వార్థపరులైన భారతీయుల కుట్రకు బలియై బ్రిటీషువారితో వీరోచితంగా పోరాడి ఆత్మబలిదానం చేసుకున్నాడు. మహాత్మాగాంధీజీ ప్రారంభించిన అహింసా ఉద్యమం

ప్రజలలో నవ చైతన్యాన్ని కలుగజేసింది. శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని వేలాదిమంది కారాగారాలకు వెళ్ళారు. **"స్వాతంత్ర్యం నా జన్మహక్కు"** అని యిచ్చిన బాలగంగాధరతిలక్ శంఖారావంతో బ్రిటీష్ సింహాసనం గజగజలాడింది. మాండలే జైలులో ఆరుసంవత్సరాలు కఠిన కారాగార శిక్షను అనుభవించాడు. ఆ సమయంలో మరణించిన తన భార్య మృతశరీరాన్ని కూడా చూడటానికి ఆంగ్లేయప్రభువులు అంగీకరించలేదు. న్యాయవాద వృత్తి ద్వారా ప్రతినెలా వేలాది రూ॥లు సంపాదించే బాబూరాజేంద్రప్రసాదు (ప్రథమ రాష్ట్రపతి), గాంధీజీ పిలుపునందుకుని సత్యాగ్రహోద్యమానికి సంసిద్ధమై వెళ్లే ముందు తన భార్యకు 9రూ॥ మాత్రమే ఇవ్వగలిగాడు. కారణం? సంపాదించినదంతా ఉద్యమనిర్వహణకు కార్యకర్తల బాగోగులు చూడటానికే ఖర్చు చేసాడుట. లక్షలాది రూ॥ న్యాయవాదవృత్తి ద్వారా సంపాదించే (ఒక్క 1920సం॥లోనే 6లక్షల ఆదాయం) చిత్తరంజన్‌దాస్ న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి స్వాతంత్ర్యసంగ్రామంలోనికి భార్యాబిడ్డలతో సహా దుమికి జైళ్లపాలయ్యారు. ఆగర్భ శ్రీమంతుడయిన మోతీలాల్ నెహ్రూ తన కుమారుడయిన జవహర్‌లాల్ నెహ్రూతో సహా ఈ మహోద్యమంలో పాల్గొని జైళ్ళపాలయినారు. **'బార్డోలి సత్యాగ్రహాన్ని'** జరిపి ఆంగ్లేయులను ఉర్రూతలూగించాడు సర్దార్ వల్లభాయ్ పటేల్, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం తన సర్వస్వాన్ని దేశానికి ధారపోసి బ్రిటీష్‌వారి తుపాకీగుండ్లకు ధైర్యంగా తన గుండెను ఇచ్చి కాల్చుకోమన్నాడు. నేతాజీ సుభాస్‌చంద్రబోస్ వేలాదిమంది యువకులకు శిక్షణయిచ్చి **'అజాద్ హింద్ ఫౌజ్ '** ను స్థాపించి బ్రిటీష్‌వారితో తలబడ్డాడు. బోస్ మాట వింటే చాలు బ్రిటీష్ సైనికాధికారులకు కాళ్లు చల్లబడేవి. ఇంకా ఎంతోమంది చరిత్రకందని యువకులు, మేథావులు, న్యాయవాదులు, త్యాగధనులు - వారి పేర్లు మనకు తెలియవు. తమ సాహిత్యంతో ప్రజలలో స్వాతంత్ర్యపిపాసను రేకెత్తించారు. తమ ఉపన్యాసపటిమతో ప్రజలను ఉవ్వెత్తున లేపారు. ఇంకా ఎందరెందరో, చరిత్రకందని ధీరులు, వీరమరణం పొందిన శూరులు, ఉరికంబాలకెక్కిన అమరులు, తుపాకి గుండ్లకు బలియైనవారికి మనంజోహారు లర్పిద్దాం. ఇంతకన్నా మనం ప్రస్తుతం చేయగలిగిందేమీ లేదుగదా!

ప్రపంచ చరిత్ర పుటలను తిరుగవేస్తే కనుపిస్తాయి త్యాగాలు, బలిదానాలు. ఏ దేశ చరిత్ర విన్నా వినిపిస్తాయి ఆర్తనాదాలు. ఏ దేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రను పరికించినా దేశభక్తులకు సంకెళ్లు, ఉరిత్రాళ్లు. **"జలియన్‌వాలాబాగ్"** లాంటి మారణహోమాలు, స్వాతంత్ర్యోద్యమంలో తమ సర్వస్వాన్ని అర్పించి, నవ్వుతూ, నవ్వుతూ పాల్గొని అనేక యాతనల ననుభవించి, బ్రిటీష్ వారిని ఉర్రూతలూగించిన వారిలో చాలామంది, దాస్యశృంఖముల నుండి విముక్తిపొందిన స్వేచ్ఛా భారతావనిని

చూడకుండానే శాశ్వతంగా ఈ లోకాన్ని వదలిపోయారనే బాధ నా హృదయాన్ని కలచివేస్తుంది. నా జీవితకాలంలోనే భారతదేశ స్వాతంత్ర్యాన్ని చూచి తీరాలనే తాపత్రయంతో, ఆశతో మహోద్యమంలో ధైర్యంగా పాల్గొని అశువులు బాసిన అమరవీరుల చరిత్రలను తలచుకుంటే నా మనస్సు వికలత చెందుతున్నది. అవునుమరి! చరిత్ర చాటుతున్న నగ్నసత్యం కూడా మరువలేము. చెట్టు నాటేది ఒకడు, దాని పండ్లను అనుభవించేది మరొకడు. త్యాగం చేసేది ఒకడు, తత్ఫలితాన్ని అనుభవించేది మరొకడు. చెట్టు పేరు చెప్పకొని కాయలుఅమ్ముకోవడం సహజమే కదా! భారత దేశ స్వాతంత్ర్యోద్యమంలో తమ సర్వస్వాన్ని సమర్పించి, **'నా'** అనేది లేకుండా అర్పించి మహోద్యమంలో నిర్వరామంగా పాల్గొనిన తిలక్, గాంధీ, రాజేంద్రప్రసాద్, బిపిన్ చంద్రపాల్, లాలా లజపతిరాయి, చిత్తరంజన్‌దాస్, ప్రకాశముల కుటుంబీకులు ఏమైపోయినారో చాలామందికి తెలియదు, పట్టదు. స్వాతంత్ర్యసమర యోధుల కుటుంబాలకు చెందిన వారికి నేడు తినటానికి తిండి లేక అనేకయిక్కట్లకు గురి అవుతున్న నిర్భాగ్యులు ఎందరో...ఒక ప్రక్కనున్నారు. పూర్వజన్మ సుకృతం కొద్దీ వంశపారంపర్యంగా సకల భోగభాగ్యములను అనుభవించే అదృష్టవంతులు మరో ప్రక్కన వున్నారు. స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొనకుండానే ప్రభుత్వ పింఛను సహకారమును పొందుతున్నవారు కొందరైతే, అధికారాన్ని హస్తగతం చేసుకొని అనుభవిస్తున్నవారు మరి కొందరు. ఇదే సృష్టి రహస్యం. సామాన్యులకు అర్థం కాని మీమాంస. అందరికి నేడు కనిపించే నగ్నసత్యం అదే....అదే.........

స్వాతంత్ర్యోద్యమ రధసారథి మహాత్మాగాంధీజీని, స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత పదవిని స్వీకరించమని ఎందరో ప్రాధేయపడ్డారు. కానీ ఆయన సుతరామూ అంగీకరించలేదు. అధికారం మానవుణ్ణి ఎప్పుడో ఒకప్పుడు పతనం చేసి తీరుతుందని ఆయన విశ్వాసం. అందుకోసమనే ఆయన ఎవ్విధమైన అధికారాన్ని ఆశించకుండా ప్రభుత్వానికి సముచితమైన సలహాలను యివ్వటమే పరమావధిగా భావించారు. అంతేకాదు ఈ దేశంలో రామరాజ్యాన్ని తిరిగి నెలకొల్పటమే ధ్యేయంగా పెట్టుకొన్నారు. కాని దురదృష్టం. ఆ మహాత్ముడు తానాశించిన రామరాజ్య వైభవాన్ని కానలేకపోయాడు. విధి బలీయం. తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లు. ఒక కిరాతకుడి తుపాకి గుండ్లకు బలియై అమరవీరుడైనాడు. గాంధీజీతోనే రామరాజ్య నినాదం స్వస్తిచెప్పబడింది. చరిత్ర పునరావృత్తమవుతున్నది. ఈ రోజు 30వ స్వాతంత్ర్యదినోత్సవం జరుపుకుంటున్నారు. నాబోటి నిర్భాగ్యులకు ఆ అవకాశం లేదుగదా ? మనం ఎక్కడ ఉన్నాం. ఎక్కడికి

పోతున్నాం? ఆత్మావలోకనం చేసుకోవలసిన సమయం ఆసన్నమైంది. మన పెద్దలు సంపాదించిపెట్టిన భారతదేశ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకుంటూ, ప్రపంచంలో మన దేశం ఒక అగ్రగామిగా రూపొందటానికి అవసరమైన శక్తిని సముపార్జించు కోవటానికి ప్రతి పౌరుడు కృషి చేయటం తన విధ్యుక్త ధర్మంగా భావించాలి. స్వాతంత్ర్యోద్యమంలో సర్వస్వాన్ని ఒడ్డి పోరాడిన త్యాగధనుల నాదర్శంగా గైకొని ఆ అమరవీరుల నుంచి స్ఫూర్తిని పొంది, కార్యోన్ముఖులై నవభారత నిర్మాణానికి శక్తివంచన లేకుండా కృషి చేయాలి. అధికార వ్యామోహం, బంధుప్రీతి, పక్షపాతం విడనాడి నిష్కామ కర్మయోగులవ్వాలి. గాంధీజీ కలలుగనిన రామరాజ్యాన్ని సఫలీకృతం చేయాలి. కానీ ఒకే ఒక బాధ నన్ను సతతమూ వేధిస్తున్నది, బాధిస్తున్నది. **"ఈ దేశాన్ని పరమ పవిత్రంగా భావించి, ఇది కర్మ భూమి, మాతృభూమి, ఇచటి ప్రతి అణువును పరమపవిత్రమైనదని భావిస్తూ, భారతమాతను పూజిస్తూ, ఆరాధిస్తున్న నాలాంటి వాళ్లనూ శంకిస్తున్నారే!"** అని బాధపడుతున్నాను. నిజం నిలకడ మీద తేలుతుందనే నమ్మకంతో, విశ్వాసంతో, నిరుత్సాహమును దరికి చేరనీయక జీవితాన్ని కొనసాగిస్తున్నాను.

ఈ రోజున రేడియో వింటుంటే మరొక పాటమీద నా దృష్టి మరలింది. **"గాంధి పుట్టిన దేశమా ఇదిః నెహ్రూకోరిన సంఘమా ఇదిః సామ్యవాదం రామరాజ్యం సంభవించే కాలమా ఇది"** అనే పాటను పునశ్చరణ చేసుకుంటూ, సంధ్య చీకటిలో స్నానానికి వెళ్ళాను. అనిర్వచనీయమైన బాధతో, గుండె బరువుతో స్నానం చేసి తిరిగి వచ్చాను. గాంధీజీ కనిన కలలు ఫలిస్తాయో! లేవో! వారాశించిన రామరాజ్యం సాంఘిక న్యాయం సిద్ధిస్తుందో ! లేదో ! ఇదే నా బాధ, నాహృదయాన్ని సతతమూ కలిచివేస్తున్న వ్యథ. నా మనస్సులో మహా ప్రవాహంలా పెల్లుబికి వస్తున్న భావాలకు కళ్లెము తగిలించి, వగ్గాలను బిగించి పట్టే, నా చేతులలో నున్న కలాన్ని అతి నిబ్బరంగా నడిపి నీ కందిస్తున్న యీ స్వాతంత్ర్య సమర గాధను చదివి, అందరికి వినిపిస్తావుగదూ!

భావాలు కోకొల్లలు, కలం కవిత్వం వ్రాస్తానంటున్నది వ్రాస్తే పోనంటున్నది ఉత్తరం. ఉత్తరం అందకపోతే నాకు బాధ, నీకు నిరాశ. ఇదే ఈనాటి దుస్థితి. ఇక వుంటా....

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది 25-8-1976.

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖ అందినదా? ఒకవేళ అందితే కొట్టివేతలు లేకుండా నీ చేతిలో పడ్డదా? ఉత్తరాలు వ్రాయాలంటే నిరుత్సాహంగా వున్నది. కేవలం యోగక్షేమాలే వ్రాస్తే ఎంతసేపటికీ కాగితము నిండదు. నాకు కాలక్షేపం కోసం, మీకు కాసేపు చదివి ఆనందించడానికోసం ఏదో ఒకటి వ్రాస్తున్నాను. సెన్సారు అధికారులు మాత్రం నేనువ్రాసిన లేఖలు పంపడానికి విసుక్కుంటున్నారు. వారికేదో భయం. నావ్రాతలవల్ల ఏదో కొంప మునుగుతుందనేమోనని వారి భావన. ఇంతా చేస్తే నేను వ్రాసేది సామాన్యులకు పనికిరాని వేదాంతం, చరిత్ర, దేశభక్తి. ఇవి కూడా నేరమైతే చేయగల్గిందేమీ లేదు. నేను ప్రస్తుతం పరాధీనుడను గదా! ఇదే రకమైన బాధను కీ॥శే॥ పండిత జవహర్‌లాల్ నెహ్రూ తన ఆత్మ కథలో పేర్కొంటారు. **"కొంతవరకు నా వ్రాతలలోని తీవ్రతను నేనే తగ్గించుకోవాల్సివచ్చింది. లేనిచో సెన్సారు ప్రయోగములు ఎంతదూరమైననూ కొనసాగగలవు."** అని ఎంతో బాధతో వ్రాస్తారు. నా ప్రస్తుత స్థితి కూడా అదే విధంగా వున్నది. రాజ్యాధినేతలు మారినా, స్వాతంత్ర్యము సిద్ధించినా జైలు రూల్సు, మాన్యూలు మాత్రం మారకపోవటం విచారకరం. పాపం మధ్యలో నున్న అధికారులు ఏం చేస్తారు? వారి ఉద్యోగధర్మం వారిది. కొంతమంది ఉద్యోగులు అదే రూలును పట్టుకొని ముక్కుసూటిగా పోతారు. మరికొంతమంది విజ్ఞతతో చూసి ప్రమాదభరితంగా లేని ఉత్తరాలను పంపిస్తారు. వీడికి వేదాంతమంటే పిచ్చి అని త్రోసేస్తారు. పాపం! దేశభక్తిని గురించివ్రాస్తున్నాడు గదా యని, జాలిపడి పంపిస్తారు. వారి వారి మన : ప్రవృత్తులమీద ఆధారపడి వుంటుంది. ఏది ఏమైనప్పటికి నేను ప్రస్తుతం ఒకరిమీద ఆధారపడి వున్నవాడినేకదా! కలం సాగుతుంటే, అనుకోకుండానే ఏదో ఒకటి వ్రాస్తుంటాను. ఇదీ ఒకరకమైన చాదస్తమేనని మధ్యలో చదివేవాళ్ళు భావిస్తారనుకుంటాను. ఏ పిచ్చీ లేకపోతే అసలు యిక్కడికి ఎందుకు వస్తాడని కూడా అనుకుంటే అనుకోవచ్చు. లోగడ నేను పంపమని వ్రాసిన పుస్తకాలు పంపగలవు. నాకు ప్రస్తుతం ఆహారం పుస్తకాలే కదా ! అవి కూడా లేకపోతే ఏవిధంగా కాలక్షేపం చేయాలి? నా భావాలు ఉత్తరాలలో వ్రాస్తే చేరవు. అందువలన నా వద్దనున్న ఎక్సర్‌సైజ్ పుస్తకాలలో ఈ మధ్య కవిత్వం కూడా వ్రాస్తున్నాను. ఇది వ్రాస్తుంటే ఒక విషయం గుర్తుకు వచ్చింది. తిలక్ మహాశయుడు 6 సంవత్సరాలు ఏకాకిగా మాండలే జైలులోవున్నాడు. మాట్లాడుకోవటానికి కూడా మరొకరు వుండేవారు కాదు. గ్రంథాలతోనే కాలక్షేపం

చేసేవాడు. అప్పుడే **"గీతా రహస్యాన్ని"** వ్రాశాడు. విడుదల అయ్యేటప్పుడు ఆ వ్రాతప్రతిని తీసుకొని వెళ్ళడానికి జైలు అధికారులు నిరాకరించారు. అప్పుడు **"కాగితం మీద వ్రాసింది తీసుకోగలుగుతారు గాని మనస్సులోని భావాలను తీసుకోలేరుగదా!"** అని చెప్పి ఆ వ్రాతప్రతిని ఆ అధికారుల మొహానకొట్టి జైలు నుండి బయటకువస్తాడు బాలగంగాధరతిలక్.

పుస్తకాల విషయం రాముడికి కూడా వ్రాశాను. అవి కూడా తీసుకొని రాగలవు. నాకుండే ఆతురత సహజంగా మీకుండదు. నాకు చదవటం, తినటం మాత్రమే నిత్యకృత్యాలు. బయటనున్నవారికి తీరుబడి లేని పనులు. వినాయక చవితి దగ్గర పడుతున్నది, నిర్విఘ్నంగా జరిపించగలరు. మేము కూడా యిక్కడ పెట్టుకుంటాం. **"అవిఘ్నం కురుమే దేవ సర్వ కార్యేషు సర్వదా'** అని వినాయకునికి కొబ్బరి కాయలు కొట్టటం మన ధర్మం, కర్తవ్యం. అది అనాదిగా వస్తున్న మన సంప్రదాయం. అనగా **"ఓ దేవా! సర్వ కార్యములయందు, ఎల్లప్పుడూ విఘ్నములు లేకుండా నాకు చేయుము"** అని వినాయకుని వేడుకోవాలి.

చిరంజీవులకు నా ముద్దులు, ఆశీస్సులు. ఇక వుంటా.....

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి.

ది 8-9-1976.

ప్రియమైన జయ,

నేను కులాసా. నీవువ్రాసిన ఉత్తరం కూడా అందినది. ఇక నీవు వ్రాసిన దానికి సమాధానం శలవలలో నీవు యిక్కడికి వచ్చినప్పుడు ఆలోచిద్దాం. అనవసరంగా బుర్ర పాడుచేసుకోవద్దు. సుఖదు:ఖాలు రెండూ మానవుడ్ని పెనవేసుకొని వుంటాయి. ప్రతి వాని జీవితంలో సుఖము కంటే దు:ఖము పాలే ఎక్కువగా వుంటుంది. ప్రతి వ్యక్తి జీవితంలో దు:ఖం అంతర్వాహినిగా వుంటునే వుంటుంది. దానిని గురించి తీవ్రంగా ఆలోచిస్తూ, సతమతమౌతూ బుర్ర పాడుచేసుకోవడం వలన వచ్చే ప్రయోజనం శూన్యం. మనకు కలిగిన దు:ఖాన్నే గొప్పగా చేసుకొని విలపించరాదు. మనకు కలిగిన కష్టం నిజంగా బాధాకరంగా ఉండేమాట వాస్తవమే అయినప్పటికీ మనకు కలిగిన బాధలను మనం సహించుకోవటంలోనే ఉన్నది గొప్పతనం. మనకు కలిగిన కష్టాలను లెక్క చేయక,

దుఃఖాన్ని దిగమ్రింగి ముందుకు సాగిపోవడం నేర్చుకోవాలి. ఇది చెప్పినంత తేలికైన విషయం కాదని నాకూ తెలుసు. అయినప్పటికీ పిరికిపందలలాగే పారిపోవటం మాత్రం ధైర్యవంతుల లక్షణంకాదు, విజ్ఞత అంతకన్నా కాదు. వనవాసమునకు వెళ్ళేముందు శ్రీరామునితో తల్లి కౌసల్యాదేవి ఆశీర్వదిస్తూ **"యం పాలయసి ధర్మం త్వం ధృత్వాచ నియమేవచ, సవై రాఘవ శార్దూల ధర్మస్త్వా మభిరక్షతు"** అని అంటుంది. వర ప్రసాదముచేత పుట్టిన కుమారుడు, సత్యసంధుడు, వీరాగ్రేసరుడైన కుమారుడు 14సం॥లు వనవాసానికి వెళ్ళుతుంటే ఏతల్లి హృదయము బాధపడదు? అయినప్పటికీ దుఃఖాన్ని దిగమ్రింగుకొని **"రాఘవా! నీవు ఏ ధర్మమును ధైర్యముతో, నియమముతో వదలక, ఆచరించుదువో, అనుష్టించుదువో, ఆ ధర్మమే నిన్ను రక్షించుగాక!!"** అని ఆశీర్వదిస్తుంది తల్లి కౌసల్య. కనుక ఎవరు మనల్ని పరిహసించినా, నిందించినా, అవహేళన చేసినా,అవమానపరచినా, మనమనుసరించవలసిన ధర్మాన్ని మాత్రం విడువరాదు. **"ధర్మం తలగాచును"** అనేసామెత కలదు. శ్రీరాముని ధర్మమే అడవిలో అతని తలను రక్షించింది. రావణునికి పదితలలున్నా, అతడు చేసిన అధర్మము ఒక తలనైనా రక్షించలేకపోయింది. అంతేకాదు అతని అధర్మప్రవర్తన వలన, అతనితోపాటు సకల రాజ్య భోగాలు, సంపదలు, ఆత్మీయులు అందరూ సమూలంగా సర్వనాశనమైపోయినారు. శ్రీరాముని సత్ప్రవర్తన, ధర్మనిష్ఠ అతనిని రక్షించింది. భౌతికమైన సైనికశక్తి అండగా లేకపోయినప్పటికి విజయాన్ని పొందాడు. ఊహించడానికి కూడా అందనటువంటి కోతుల సహాయంతో విజయలక్ష్మిని చేబట్టాడు.

**"యాం తిన్యాయ ప్రవృత్త స్యతిర్యం చోఽపి సహాయతాం, అంపథానంతు, గఛ్ఛతం సోదరోఽపి విముచంతి"** అనగా ధర్మాన్ని పాటించిన శ్రీరామచంద్రునికి జంతువులు (కోతులు,భల్లూకాలు) సహితం సాయపడినవి. అధర్మంగా, అన్యాయ మార్గమున నడచిన సర్వశక్తివంతుడైన రావణునికి స్వంత తమ్ముడైన విభీషణుడు కూడా సాయపడలేదు. కారణం? ధర్మానికి ఏ కాలంలోను, ఏ దేశంలోను అడ్డులేదు. ఏదైనా అడ్డువస్తే అది తాత్కాలికం మాత్రమే. అంతిమ విజయం ధర్మానిదే. ఆపత్కాలములోనయినా, ధైర్యము విడనాడక, విశ్వాసంతో, నియమంతో, పట్టుదలతో ముందుకు సాగిపోయే గుణానికి, స్వరూపానికి **"ధర్మమని"** పేరు. కనుక అట్టి ధర్మాన్ని పాటించడం మన విద్యుక్త ధర్మం. కనుక ఎట్టి కష్టములొచ్చిననూ, ఆపదలు సంభవించిననూ, నిరాశా నిస్పృహలను, దరిచేరనీయరాదు. ఓర్మితో సహించి, ఓర్పుతో కాలం గడపి, నేర్పుతో ముందుకు సాగిపోవటం నేర్చుకోవాలి. పురుష ప్రయత్నంతో భగవదానుగ్రహమును సాధించాలి, సంపాదించాలి. మానవ

ప్రయుత్నంలేకుండా దైవానుగ్రహం లభించదు. బలహీనునికి దైవం యొక్క తోడ్పాటు వుండదు. అన్నిటికన్నా ముఖ్యం మనశ్శాంతి. అది లేనిచో దు:ఖాలు మనల్ని వదలిపెట్టవు. నిరంతరం మనల్ని వెంబడిస్తూనే వుంటాయి. ఆ కూపం నుంచి బయట పడలేం. మనసుకు శాంతి చేకూరదు, ఆత్మకు ఆనందం వుండదు. శరీరానికి సౌఖ్యం వుండదు. జీవితం దుర్భరమవుతుంది. అట్టివారికి భగవదానుగ్రహము కూడా లభించదు, ముక్తి వుండదు, మోక్షం అసలే రాదు భగవంతుడు బలహీనులను అనుగ్రహించడని ఈ శ్లోకం చెబుతున్నది.

**"అశ్వం నైవ గజం నైవ, వ్యాఘ్రం నైవచ నైవచ**

**అజాపుత్రం బలిం దత్యాత్, దేవో దుర్బల ఘూతక:"**

అనగా గుర్రాన్ని గాని, ఏనుగును గాని, పెద్దపులిని గాని బలిగా యివ్వబోతే దేవుడు కూడా వద్దు...వద్దు...అంటాడుట. మేకనైతే మాత్రం యిష్టంతో స్వీకరిస్తాడుట. భగవంతుడు కూడా దుర్బలులను, బలహీనులను మాత్రమేచంపడానికి అంగీకరిస్తాడు. దీనివల్ల మనం నేర్చుకోవలసినది, బలవంతులను చూస్తే భగవంతుడు కూడా భయపడుతాడు. బలహీనులమీదకు ఒంటికాలిమీద పోతాడు. కనుక బలహీనుడు ఎందుకూ పనికిరాడు. తనకు తాను ఉపయోగపడడు. ఇతరులకు అంతకన్నా ఉపయోగపడడు. బలహీనులవల్లనే ప్రమాదం కనుక బలవంతుల వల్లనే ప్రతి ఒక్కరూ శక్తిని పెంచుకోవాలి. ఆ శక్తి పట్టి భౌతికమైనది మాత్రమే కారాదు. భౌతికశక్తికి నైతిక, ఆధ్యాత్మిక శక్తులు మేళవించినప్పుడే సర్వకార్యాలు సాధించగలుగుతాం. శక్తి వున్నదిగదా యని అధర్మానికి పాల్పడరాదు, అన్యాయం తలబెట్టరాదు, అక్రమంగా ప్రవర్తించరాదు. ఇతరులను హింసించడం అధర్మమని భావించి దుష్టులను మాత్రం వదిలిపెట్టరాదు. మన శక్తిని చూచి దుష్టులకు భయం, శిష్టులకు ఆనందం కలగాలి. మన ధ్యేయం పెద్దలు చెప్పిన ధర్మం. **"దుష్ట శిక్షణ, శిష్ఠ రక్షణ"** ఇదే మన ఆదర్శం, ఆశయం. అట్టి ధర్మమే మనల్ని సురక్షితంగా దరికి చేరుస్తుందని నా ఆత్మ విశ్వాసం, నమ్మకం, యదార్థం కూడాను. కష్టాలు తాత్కాలికం, శాశ్వతం మాత్రం కాదు. అయితే ఓపిక మాత్రం అత్యవసరం.

ఈ విధంగా వ్రాస్తూ పోతుంటే దీనికి అంతూ వుండదు, అంతం వుండదు. చదివేవారికి విసుగు, ఈ ఉత్తరం పంపే అధికారులకు చికాకు, విసుగు ఈ రెండూ చేరుతే ఈ ఉత్తరమే నీకు చేరకపోవచ్చు అదే నా బాధ. ఇక వుంటా...

ఇట్లు

"నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 11-9-1976.

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు ఒకేరోజు చేరాయి. మన కొమరగిరి శ్రీనివాసు అమ్మగారు దివంగతురాలైందని తెలిసి చాలా విచారించాను. హైద్రాబాద్ అడ్వొకేట్ శ్రీ లక్ష్మీనారాయణగారు గుండెపోటుతో అకస్మాత్తుగా మరణించారుట. వాళ్ళు హైద్రాబాద్ మహాపట్టణంలో ఉంటున్నారు. చిన్న కారున్నది, ఫోన్ కూడా వున్నది. ఆ పట్టణంలో డాక్టర్లకు కొరత వుండదు. ఎన్ని సౌకర్యాలున్నా అసలు ఆయుష్షు అనేది కూడా వుండాలి గదా! అది లేనప్పుడు ఇవన్నీ వుండికూడా సమయానికి ఏమీ ఉపయోగపడవు. దీనినే భగవంతుని లీల అంటారు. ఎప్పుడు, ఎవరికి ఏమి జరుగుతుందో చెప్పలేం. దీనికి సమాధానం విజ్ఞాన శాస్త్రవేత్తలు ఏమీ చెప్పలేరు. మానవుడు యావత్ ప్రకృతిని తన గుప్పెటలో పెట్టుకున్నానని విర్రవీగుతుంటాడు. ఉన్నవాళ్లు నా ప్రతాపమేనంటారు. నాతోనే వున్నదని, ఏవో గాలిమేడలు కడుతుంటారు. ఏదో ఒకరోజున అతనికి తెలియకుండానే అతనిలో నున్న జీవాత్మ మాయమైపోతుంది. కట్టె మిగులుతుంది. ఎంత సంపాదించినా తీసుకొనిపోయేది ఏమీ వుండదు. ఈ సత్యాన్ని తెలుసుకోవటం చాలాకష్టం. తెల్సుకున్న వారికి సుఖదు:ఖాలు, కష్టసుఖాలు, మంచిచెడ్డలు - అన్నీ వారి దృష్టిలో సమానమే. అయితే ఇది తెల్సుకోవటం మాత్రం అంత తేలిక కాదు. ఆధ్యాత్మిక దృష్టి కావాలి, సాధన కావాలి. కేవలం భౌతికశక్తితో మానసిక వ్యధను పోగొట్టుకొన జాలము. భౌతిక శక్తితో పాటు ఆత్మశక్తినికూడా పెంపొందించుకోవాలి. అప్పుడే జీవికి మనశ్శాంతి చేకూరుతుంది. అందుకోసమనే 'గీత" లో సామాన్యులను దృష్టిలో పెట్టుకొని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి ఈ శ్లోకం బోధించాడు.

**"జాతస్య హిధ్రువో మృత్యు:, ధ్రువం జన్మ మృతస్య చ**
**తస్మాద పరిహార్యే ఽర్థే, సత్వం శోచితుమర్హసి"**

**అనగా "జన్మించినవానికి మరణం తప్పదు. మరణించినవానికి జన్మించుట యును నిశ్చయమే. అందువలన తప్ప శక్యముకాని ఈ విషయమునందు నీవు శోకించుట తగదు"** అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో చెబుతాడు. ఇది సామాన్యులను దృష్టిలో పెట్టుకొని చెప్పాడు. యదార్థముగా ఆత్మకు పుట్టుకగాని, చావుగాని లేదు. అది శాశ్వతమైనది, నిర్వికారమైనది చినిగిన వస్త్రములను మానవుడు ఏ విధంగా తీసిపారేసి క్రొత్తవాటిని ధరిస్తాడో, అదేవిధముగా అది (ఆత్మ) కూడా పాత శరీరములను తొలగించివేసి నూతన శరీరములను ధరించుచుండును. కావున

ఆ శరీరములకై దు:ఖించనవసరం లేదు. ఈ అత్యున్నతమైన భావన కలగటం చాలా కష్టం. వానిని 'ఆత్మజ్ఞాని' అంటారు. ఏది ఏమైనప్పటికీ, ఎన్ని భౌతిక శక్తులు సంపాదించినప్పటికినీ చావు పుట్టుకలు మాత్రం మనచేతులలో లేవు. ఎవరికి ఎన్నాళ్లు ఋణానుబంధమో, అన్నాళ్ళు మనతో వుంటారు. అది తీరిన తరువాత మనకు చెప్పకుండా శాశ్వతంగా మనకు కనిపించకుండా దూరంగా వెళ్లిపోతారు. కొందరు మరణించి శాశ్వతంగా దూరమవుతారు. మరికొందరు బ్రతికి వుండగానే తాత్కాలికంగా దూరమవుతారు. దానిని మనం ఎప్పుడూ సమత్వంగా స్వీకరించటం నేర్చుకోవాలి. దు:ఖించరాదు.

**"సుఖమా పతితం సేవ్యం, దు:ఖమా పతితం తథా**

**చక్రవత్పరి వర్తంతే, దు:ఖానిచ సుఖాని చ"**

అనగా వచ్చిన సుఖమును సేవించవలసినదే. అట్లే వచ్చిపడిన దు:ఖమును కూడా సేవించవలసినదే. దు:ఖములుయును, సుఖములుయును చక్రమువలె క్రిందమీదు అగుచుండును. ఈ యదార్ధ సత్యమును తెలుసుకుంటే శోకించవలసిన పనే వుండదు. కనుక సుఖదు:ఖములను సమత్వంగా భావించుకొనటంలోనే వున్నది ఆనందం. ఆ సమత్వం లుప్తమవుతే జీవితమే అంధకారబంధురమవుతుంది. కారుచీకటిలో ముందుకు నడువలేము గదా! ఈ యదార్థమును అవగాహన చేసుకొని జీవన సంగ్రామ రంగంలో ధైర్యంగా ముందుకుపోవటం నేర్చుకోవాలి. ఈనాడు కావాల్సింది అదే...అదే...

చిరంజీవులకు నా ముద్దులు. ఇక వుంటా,,,,,

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 2-10-1976.

ప్రియమైన జయ,

చి॥గౌరికి జ్వరం ఎట్లా వున్నది? ఇక్కడికి వచ్చే టప్పటికి ఐదు లంకణాలు అని చెప్పినావు. ఇక్కడికి వచ్చినప్పుడు పిల్లలంతా చిక్కిపోయి వున్నారు. మందులు, టానిక్స్ సరీగా యిప్పించగలవు. 'టామి' (కుక్క) విషయం అడగడం మరచి పోయాను. మంచిగా ఉన్నదనుకుంటాను.

ఈ రోజు మహాత్మాగాంధీజీ పుట్టిన రోజు గదా! ఒక విషయం వ్రాయ లేకుండా ఉండలేకున్నాను. గాంధీజీ గదిలో మూడు కోతుల బొమ్మలుండేవి. ఒక కోతి నోరు, మరొక కోతి చెవులు, మూడవ కోతి కళ్లు మూసుకొని వుండే బొమ్మలుండేవి. గాంధీజీని చూడవచ్చిన వారందరికి వాటిని గురించి ఈ విధంగా చెప్పేవారు. **"చెడును మాట్లాడరాదని, చెడును వినరాదని, చెడును చూడరాదని - ఆ కోతుల భావం"** అని చెప్పేవారు. ఆ చిన్ని చిత్రంలో ఎంతో భావాన్ని గాంధీజీ యిమిడ్చారు. అత్యున్నతమైన ఆదర్శాన్ని అందించారు. దురదృష్టవశాత్తు గాంధీజీ ఈనాడు లేరు. పరలోకానికి వెళ్లిపోయారు., కాని ఆ చిత్రం ఆ విధంగానే వున్నది. అయితే వాటి నిర్వచనం మాత్రం మారిపోయింది. **"మంచి మాట్లాడకు, మంచి వినకు, మంచి చూడకు"** గా మారిపోయింది. దేశకాలమాన పరిస్థితులనుబట్టి అర్థాలు, నిర్వచనాలు మారిపోతున్నాయి. మారుతున్న మానసిక ప్రవృత్తుల కనుగుణంగా భావాలు మారిపోతున్నాయి. భావాలకనుగుణంగా మాటలు మారుతున్నాయి. చేష్టలు మాటలననుసరిస్తున్నాయి. ఇది ఈనాటి పరిస్థితి.

జీవితం కడు చిత్రవిచిత్రమైనది. అపజయం సంభవించినప్పుడు, అధికారానికి ముప్పువాటిల్లినప్పుడు, తానాశించిన విధంగా జరగనప్పుడు, అంధకార బంధురం అలముకున్నప్పుడు మానవునికి నిరాశా నిస్పృహలు జనించడం సహజం. అప్పటివరకు తననుసరిస్తున్న సత్యపథాన్ని విడనాడి పతనమైపోతాడు. ఆ క్లిష్ట సమయంలో కొంచెం అసత్యమాడినా,అనుచితమైన కార్యంచేసినా ఫరవాలేదని భావిస్తాడు. కొంచెం అబద్ధం ఆడటం వలన ఏ హాని వుండదులేనని తలుస్తాడు. అసత్యమార్గాన పయనిస్తాడు. అసత్యోపార్జితం వలన కలిగే స్వల్ప ఫలితం తాత్కాలికమేనని ఊహించనయినా ఊహించలేడు. ఆ క్షణిక సుఖాన్ని చూచి మురిసిపోతాడు. అంతిమ పరిణామం దు:ఖదాయకంగా వుంటుందని ఊహించలేడు. సత్యానికే సదా విజయమని మొట్టమొదట మానవుడు గుర్తించలేడు. అనుభవం మీద మాత్రమే విశ్వసిస్తాడు. ఇది సహజంగా సృష్ట్యారంభంనుండి జరుగుతూవున్న వాస్తవిక విషయం. మనం ఊహించనివెన్నో జీవితరంగస్థలంలో జరుగుతూ వుంటాయి. కోరుకున్నవి కావు. ఆశించనివి సిద్ధిస్తుంటాయి. అంతమాత్రాన జీవితంలో ఓడిపోయామని భావించరాదు. ఇటువంటివి గాంధీజీ జీవితంలో కూడా ఎన్నో జరిగాయి. విజయాలకన్నా అపజయాలనే ఎక్కువ చవిచూచారు గాంధీజీ. గౌరవాలకన్నా అవమానాలనే ఎక్కువ భరించారు. అసలు అవమానాలవల్లనే మానవుని యదార్థస్వరూపం బయటపడుతుంది. అతని నిజస్వరూపానికి ప్రకాశమేర్పడుతుంది. అవమానాలే ఆయన స్థానాన్ని మహోన్నతం చేశాయి.

కష్టసుఖాలు, మానావమానాలు, మంచిచెడ్డలను సమంగా చూడగల్గినాడు కాబట్టే ఆయనను మహాత్ముడన్నారు. ఆయన నుంచి భావితరాలవారు నేర్చుకోవలసినవెన్నో వున్నాయి. ఆ మహనీయుని విస్మరించడంవల్లనే ఈ దేశానికి యిన్ని విపత్తులు దాపురిస్తున్నాయి. ఆయనను అనుసరించి వుంటే ఈ దేశానికి ఈ దుస్థితి దాపురించి వుండేది కాదు.

నేడు విజయదశమి కదా! విజయం లభిస్తుందని ఆశిద్దాం. కనీసం విజయానికి నాందీ ప్రస్తావన అయినా జరిగి తీరుతుందని నమ్ముదాం.

చిరంజీవులకు నా ఆశీస్సులు. ఇక వుంటా......

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 9-10-1976.

ప్రియమైన జయ,

నాన్నగారు వ్రాసిన రెండు ఉత్తరాలు అందినాయి. చి॥గాయత్రి నీళ్లాడినట్లు, అమ్మాయి కలిగినట్లు వ్రాశారు. నీకు గౌరికి జ్వరం వచ్చినట్లు తెల్సింది. అదోక్షాచార్యులు గారు పరమపదించినట్లు తెల్సింది. పుట్టినవారికి ఆశీస్సులు అందచేయటం, మరణించినవారికి సంతాపాన్ని తెలియజేయటం - ప్రస్తుతానికి నేను చేయగలిగింది యింతేకదా! బాధ్యతలు, బరువులు బయటవున్నవారివే. అదృష్ట దురదృష్టాలను వెంట బెట్టుకుని మానవుడు ఈ లోకంలో జన్మిస్తాడు. ఈ ప్రయాణంలో ఎవరికి, ఎక్కడ, ఎంత లభించాలనేది సృష్టికర్త ఎప్పుడో నిర్ణయిస్తాడు. మానవుడు ఎక్కడ వున్నా, ఏం చేస్తున్నా అతనికి ఎంత లభించాలని నిర్దేశించబడుతుందో అంత లభించుతునే వుంటుంది. ఇంకా ఎక్కువ కావాలని ఆశించినా రాదు. తాపత్రయపడినా ప్రయోజనం వుండదు. ఈ వాస్తవమును అర్థం చేసుకోలేక మానవుడు అయిన దానికి కానిదానికి తాపత్రయపడుతూ వుంటాడు. తన ప్రయత్నంలో విఫలమైనప్పుడు విచారిస్తాడు, నిరుత్సాహపడుతాడు. ఈ సృష్టి రహస్యాన్ని సామాన్యులు అర్థం చేసుకోలేరు. అర్థం చేసుకొనిన విజ్ఞులు విచార సంతోషాలు; సుఖదుఃఖాలు; మంచి చెడులు - అన్నీ ఒకే మాదిరిగా స్వీకరించ గలుగుతారు. సహనంతో అన్నింటిని సమంగా చూడగలుగుతారు. అసలు అవమానాలవల్ల, కష్టాలవల్లనే మానవుని యదార్థ స్వరూపానికి ప్రకాశమేర్పడుతుంది. అవమానకష్టాలే అతని స్థానాన్ని

మహోన్నతం చేస్తాయి. విపత్తులు దాపురించినప్పుడు, భరించరాని కష్టాలు సంప్రాప్తించినపుడు, అపజయాలు సంభవించినప్పుడు, సంపదలు పోయినప్పుడు, ఆత్మీయులు దూరమైనప్పుడు, - మానవుని అసలు స్వరూపం బయటపడుతుంది. జయాపజయాలు, సంయోగ వియోగాలు, సుఖదు:ఖాలు రథచక్రాలవలె క్రిందికిపైకి వస్తూ పోతుంటాయి. ఏ ఒక్కనికి ఎల్లప్పుడూ దు:ఖమే వుండదు. అదే విధంగా సదా సుఖమే వుండదు. ఈ రెండూ వచ్చి పోతుంటేనే జీవితంలో చైతన్యం అనేది వుంటుంది. కనుక ఎక్కువగా ఆలోచించి ఆరోగ్యాన్ని చెడగొట్టుకున్నందువల్ల ప్రయోజనం లేదు. సాధించేది అంతకన్నా వుండదు. సవాలును స్వీకరించి ఈ జీవితసమరంలో పోరాడటం నేర్చుకోవాలి. జీవించి వున్న వారే ఏదో ఒక సమయంలో సుఖాన్నికూడా అనుభవించటానికి అవకాశం వస్తుంది. కనుక ఎన్ని కష్టాలనైనా ఎదుర్కొని జీవించడం నేర్చుకోవాలి. అసలు మన దోష దృష్టియే దు:ఖానికి కారణం. మంచి దృష్టితో చూడటం నేర్చుకుంటే సర్వత్రా సుఖశాంతులే లభిస్తాయి. దృష్టిలోనే వుంది సృష్టి. ఆ సృష్టి రహస్యాన్ని తెలుసుకున్నవారికి లభిస్తుంది మనశ్శాంతి. మనశ్శాంతి యిస్తుంది ప్రశాంతి. ఆ ప్రశాంత వాతావరణంలో సాఫీగా నడుస్తుంది ఈ జీవితం. ఇక వుంటా......

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 16-10-1976

ప్రియమైన జయ,

నేను కులాసా. నీ వద్ద నుండి ఉత్తరాలు లేవు. పోయిన నెల 13వ తేదీ నుండి నిన్నటి వరకు 60కోట్లమంది భారత ప్రజల భవిష్యత్తును నిర్ణయించేటటు వంటి 44 వ రాజ్యాంగ సవరణమీద ఐదు సుదీర్ఘమైన ఉత్తరాలు నీకు వ్రాసాను. కాని వాటిని నీకు పంపకుండా హైద్రాబాద్‌కు(ఇంటెలిజన్స్ వారికి) అధికారులకు పంపినారు. ఆ విధంగా పంపటం భావ్యం కాదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి మరొక సుదీర్ఘమైనలేఖను వ్రాశాను. కనుక ఆ విధంగా ఆరు ఉత్తరాలు అయిపోయినాయి. నాకు అధికారులు అనుమతించేది వారానికి రెండు లేఖలే కదా! వెంట వెంట ఉత్తరాలు వ్రాయటం లేదని నీకు కోపం రావటం సహజం. అందులో ఈ మధ్య ఉత్తరాలు వచ్చేవి, పోయేవి అన్నీ ఆలస్యమవుతున్నాయి. నేను

పరాధీనుడను గదా! నీజ్వరం ఎట్లా ఉన్నది? చి.గౌరి ఆరోగ్యం గురించి వ్రాయలేదు. దీపావళి వస్తున్నది గదా! పిల్లలకు పిస్తోళ్లు ఏమైనా కొన్నారా? కొంత కాలక్షేపానికి ఉపయోగపడుతాయి.

ఇకపోతే నీకొక విషయం వ్రాయటం మరచిపోయాను. ఒకరోజున ఒక అందమైన పిల్లి కూన జైలులో మా గదికి వచ్చింది. ఎరుపు, తెలుపు, నలుపు మచ్చలు వున్నాయి. చూడడానికి చాలా బాగుంది, దానికి నేను, శ్రీ జూపూడి యజ్ఞనారాయణ గారు పాలుపోయటం మొదలుపెట్టాము. నా మంచం ప్రక్కనే వున్న మడత కుర్చీలో పడుకొంటుంది. దానికి ఆకలైతే కాళ్ళవేళ్ల పడి జాలిగా ఏడుస్తుంది. పాలు పోసిందాకా వదలిపెట్టదు. అచ్చం చిన్నపిల్ల చేష్టలే. దాని చర్యలు అందర్ని ముగ్ధుల్ని చేస్తున్నాయి. ఋణానుబంధం. ఎవరికి ఎంతకాలం సేవ చేయాలో చెప్పలేం గదా! ఈ జీవన యాత్రలో అనేకరకములైన జీవులు తారసిల్లుతుంటాయి. కొంత కాలం వెంబడి వస్తారు(యి). వారివారి పని పూర్తి కావటంతోటే వెళ్లిపోతారు(యి). కొంతమంది మళ్లీ ఈ జీవితకాలంలో కనపడరు. మరి కొంతమంది ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట కలుస్తుంటారు. ఇదంతా వారివారి యోగ్యతలను బట్టి, వారు చేసుకొన్న పూర్వజన్మ సుకృతం మీద ఆధారపడి వుంటుంది.

ఈ మధ్య బొంబాయిలో అతి దారుణమైన విమానప్రమాదం జరిగింది. 90మంది చనిపోయారు. ఆనాడు ఎక్కువ సీట్లు వున్న విమానం రాకపోవటం వలన టిక్కెట్లు కొన్న ప్రయాణీకులు 20మంది విమానాశయంలోనే ఆగిపోవలసి వచ్చింది. 90 మంది మాత్రం విమానం ఎక్కగలిగారు. మిగిలిపోయిన 20మంది ప్రయాణీకులు,తాము ఆరోజున వెళ్ళలేకపోయినందుకు చాలాబాధపడ్డారు. ముందుగా ఎక్కిన ప్రయాణీకులు, ముందుగా ఇంటికి చేరగలుగుతున్నామనే సంతోషించారు. మరి కొన్ని నిముషములలో 90మంది ప్రయాణీకులతో బయలు దేరిన విమానం తగులబడి క్రిందపడిపోయింది. ఆ 90 మంది శాశ్వతంగా కన్ను మూశారు. ముందుగా ఇంటికి చేరుతున్నామని సంతోషించిన ప్రయాణీకులు శాశ్వతంగా పరలోకానికి పయనమైపోయారు. ఆగిపోవలసి వచ్చినందులకు విసుక్కుంటూ, అధికారులను తిడుతూ, నసుగుతూ విమానాశ్రయంలో మిగిలి పోయిన 20 మంది ప్రయాణీకులు, ఈ దుస్సంఘటన తెలుసుకొని సంతోషించారు. గండం తప్పినందులకు భగవంతునికి కృతజ్ఞతలు చెప్పకున్నారు. ఒక్క క్షణం ముందు వారే విచారించారు. మరుక్షణంలోనే సంతోషించారు. 110 మంది ప్రయాణీకులూ ఒకే విమానంలోనే వెళ్ళాలని టిక్కెట్లు కొనుక్కున్నారుగదా! అయితే ఆ నాటి విమానంలో 90 మందికే ప్రయాణం చేయటానికి అవకాశం లభించింది.

సృష్టికర్త ఆనాడు తొంభైమందినే అనుమతించాడు. స్వర్గంలో అప్పుడు తొంభై ఖాళీలే వున్నాయన్నమాట. అందువలన అంతమందికే ఈ సుదీర్ఘప్రయాణం చేయటానికి అనుమతి దొరికిందన్నమాట. "శివుడాజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు" అనే ఆర్యోక్తి మరొక పర్యాయం ఋజువైంది. మరుక్షణంలో జరుగబోయేది తెలియక బాధపడుతుంటారు. దీనికి భౌతికవాదుల వద్ద సమాధానం లేదు. కనుక సృష్టి రహస్యాన్ని తెలుసుకోవటం సామాన్యులకు సాధ్యం కాదు. దానిని అర్థం చేసుకున్న వారు మాత్రమే జీవనరంగంలో ఎదురవుతున్న మంచి చెడులన్నింటిని సమంగా చూడగలుగుతారు, స్వాగతం చెబుతారు, అనుభవిస్తారు, సహిస్తారు ఓర్పుతో, సహనంతో ముందుకు సాగిపోతారు. అట్టివారు మాత్రమే ఈ జీవనసంగ్రామ రంగంలో అంతిమ విజయాన్ని సాధిస్తారు. ఉన్నతస్థాయికి చేరుకుంటారు. వారిని ఏ దుష్టశక్తీ ఏమీ చేయలేదు. కనుక **"అంతయూ మన మేలునకే"** అనే ఆర్యోక్తిని విస్మరించరాదు. ఇక వుంటా.....అందర్నీ అడిగినట్లు చెప్పగలవు. చిరంజీవులకు ముద్దులు...........

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 19-10-1976

నేను కులాసా. పిల్లలు వ్రాసిన ఉత్తరాలు కూడా అందినాయి. చి॥ శ్యాం కార్టూన్ బొమ్మ వేసి ఇట్లు మూడవవాడిని అని వ్రాశాడు. బొమ్మ మాత్రం బాగానే వేశాడు. మార్కులు మాత్రం బాగా రాలేదు. బొమ్మ వేయటంలో వున్న తెలివితేటలు చదువులో కూడా ఉండాలి. మొత్తానికి వాడు తెలివికలవాడేనని నా నమ్మకం.

భారతదేశంలో ప్రతి పండుగ వెనుక ఒక ఉత్కృష్టమైన చరిత్ర గాధ వుండివుంటుంది. ఆ పండుగ ప్రాముఖ్యతను అర్థం చేసుకోవటం, పూర్వాపరాలను అవగాహన చేసుకోవటం వల్ల మన సంస్కృతి, సంప్రదాయాలు, సభ్యత, చరిత్రల యెడల గౌరవం, ప్రేమ, ఆప్యాయత, అభిమానాలు అభివృద్ధి చెందుతాయి. అంతేకాదు ఈ దేశంలో అనేక భాషలున్నా, ఒకరికొకరి మధ్య అలవాట్లలో తేడాలున్న అంతా ఒకటే. వీరంతా ఒకే జాతికి చెందిన వారనే భావాన్ని పెంచి పెంపొందించు తాయి ఈ పండుగలు. మరి ఈ భారతీయ జీవన స్రవంతిలో భాగస్వాములనే భావాన్ని స్ఫురింపజేస్తాయి. దుష్ట శిక్షణ, శిష్ఠ రక్షణ కోసం, ధర్మసంస్థాపనకోసం

అవసరమని భావించినపుడల్లా భగవానుడు మానవరూపంలో అవతరించి తన విద్యుక్తధర్మాన్ని నిర్వర్తించుతాడు. అట్టి ధర్మసంస్థాపనకోసమే శ్రీకృష్ణుడు ఈ పవిత్ర భారతావనిలో జన్మించాడు. అనేకమంది దుష్టులను సంహరించాడు. ప్రస్తుత అస్సాం రాష్ట్రంలో **'ప్రాగ్జ్యోతిషపురం'** అనే మహానగరం ఆ కాలంలోఉండేది. దానిని రాజధానిగా చేసుకొని **'భౌముడు'** అనే రాజు ఆ రాజ్యాన్ని పాలిస్తుండేవాడు. అతను చాలా బలవంతుడు కావడం వలన కండకావరంతో చేయరాని పనులు చేస్తూ ప్రజలను హింసిస్తుండేవాడు. ప్రక్క దేశాల మీదపడి దోచుకునేవాడు. అతని ధాటికి తట్టుకోలేక అందరూ అతనికి దాసోహమనేవారు. స్త్రీలను చెరబట్టేవాడు. ఇంకా అనేక అకృత్యాలకు పాల్పడేవాడు. ఆ ప్రజలు, రాజులు శ్రీకృష్ణుని వద్దకు వెళ్లి మొరపెట్టుకొనగ, సత్యభామా సమేతుడై వెళ్ళి అతనితో యుద్ధంచేసి అతనిని సంహరిస్తాడు. అతనే నరకాసురుడు. అతను మరణించినదినమే **'నరకచతుర్దశి'**. ఆ పరమక్రూరుడు మరణించినందులకు, అతని పీడ విరగడై నందులకు సంతోషంగా ఆ దినమును పండుగగా అప్పటి నుంచి ప్రజలు చేసుకుంటున్నారు. విజయసూచకంగా బాణసంచాలు కాలుస్తుంటారు. నరకుని తల్లి తన కుమారుడు మరణించినందులకు విచారించకపోగా సంతోషంతో **"ఎంత అదృష్టముంటే, ఎంత తపస్సుచేస్తే ఆ భాగ్యం లభిస్తుంది(భగవంతుని చేతిలో మరణించడం). నా పుత్రుడు చనిపోతే పోనీ, నాకు పుత్రశోకం కలిగినా ఫరవాలేదు. లోకులకు మాత్రం ఎటువంటి కష్టం రాకూడదు. నా కుమారుడు చనిపోయిన రోజు లోకులందరూ పండుగ చేసు కుంటున్నారు"** అని చెబుతుందట. కని పెంచిన కొడుకుఅయినప్పటికి, దురదృష్టవశాత్తు అతడు దుర్మార్గుడైతే అటువంటి వానియెడల తల్లిదండ్రులు ఏమాత్రం కరుణ చూపించకూడదనే ధర్మాన్ని ఆ తల్లి ప్రపంచానికి చాటింది. ఇదే ధర్మాన్ని అందరు తల్లిదండ్రులూ అనుసరిస్తే, లోకకళ్యాణమే పవిత్రంగా భావించుతే ఎంత బాగుంటుంది? పిల్లల భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉండదా? అయితే నేటి పరిస్థితులు అందుకు భిన్నంగా కనిపిస్తున్నాయి. తన కుమారుడు ఎంత దుర్మార్గుడైనప్పటికీ, ఏదో విధంగా అంతా తన కుమారులకే కట్టబెట్టాలని తాపత్రయ పడుతున్నారు, ఈనాటి తల్లిదండ్రులు. ఇటువంటి పరిస్థితి కొనసాగుతే పిల్లల భవిష్యత్తును తల్లిదండ్రులే పాడుచేసినవారవుతారు. ఈనాటి తల్లులు నరకుని తల్లిని ఆదర్శంగా గైకొంటే పిల్లలు బాగుపడుతారు. కనుక తల్లిదండ్రులు పిల్లలను తీర్చిదిద్దేటప్పుడు అవసరమైతే కొంత కఠినంగా కూడా ప్రవర్తించవలసివస్తుంది. ప్రేమించేటప్పుడు ప్రేమించాలి. దండించవలసిన పరిస్థితులు ఏర్పడినప్పుడు ఏమాత్రం సంకోచించ రాదు. ఈ వాస్తవమును విస్మరించరాదు.

నేను దూరంగా ఉన్నానుగదా! ప్రస్తుతానికి మనపిల్లల బాధ్యత నీ మీదనే ఉన్నది. సమయస్ఫూర్తితో వ్యవహరించి మన పిల్లలను సన్మార్గంలో నడిపించుతావని ఆశిస్తున్నాను. చిరంజీవులకు నా ఆశీస్సులు. ఇక వుంటా......

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 29-10-1976

మ॥ రా॥ శ్రీ నాన్నగార్కి - పూజ్య స ప్రేమ నమస్కారాలు

తమరు వ్రాసిన రెండులేఖలూ అందినాయి. తమరు బందరు నుంచి వచ్చిన తరువాత నా కోసం ఎంతో బాధపడ్డారని మీ కోడలు వ్రాసింది. కని పెంచిన తల్లితండ్రులకు, కట్టుకున్నా భార్యకు, కన్న పిల్లలకు బాధ వుండటం సహజమే. తీసివేద్దామనుకున్న పోయేది కాదు. మరచిపోదామనుకుంటే అంత తేలిక కాని మాట కూడా వాస్తవమే. వీరికున్న బాధ, వ్యధ మిగతావారికి వుండని మాట కూడా వాస్తవమే. కొంతమంది ఈ పాటికి మరచిపోయి వుంటారు. మరికొంత మందికి మనస్సులో వుండినప్పటికీ ఉత్తరాలు వ్రాయటానికి భయపడుతుంటారు. మరికొంతమంది, వీడితో ఇప్పుడు అవసరం లేదుగదా! అనే నిర్లక్ష్యంతో అసలు ఉత్తరాలే వ్రాయరు. ఇదీ లోక పరిస్థితి. మానవ సహజ ప్రవృత్తి. దీనిని చూచి నిరాశ, నిస్పృహలు చెందడం అవివేకం. విజ్ఞత లక్షణం అంతకన్నాకాదు. కనుక ధైర్యాన్ని కోల్పోరాదు. శోకించడం, దుఃఖించడం మీబోటి ధైర్యవంతుల లక్షణం ఏమాత్రం కాదు. దుఃఖాన్ని అణచుకొని, మనస్సును స్థిమితపరచుకొని మిగతావారికి ధైర్యాన్ని కలుగజేయాలి. మానవ జీవితంలో సుఖ దుఃఖాలు, సంతోషవిషాదాలు ఒకదానితో ఒకటి పెనవేసుకొని మానవులను నడిపిస్తూ వుంటాయి. కటిక చీకటి కాళరాత్రి తరువాత వెలుగు తప్పకుండా వచ్చితీరుతుంది. శాశ్వతంగా చీకటీ ఉండదు, శాశ్వతంగా వెలుగూ ఉండదు. సుఖం శాశ్వతంగా ఉండదు. కష్టాలు చిరస్థాయిగా జీవితాంతం ఉండవు. కష్టసుఖాల సమ్మిళితమే జీవితం. నేనొక్కడను తప్ప మిగతా సకుటుంబ సపరివారమంతా మీ సమక్షంలోనే వున్నారు గదా! కనుక ఏ బాధా మీ మనస్సులో పెట్టుకొనక, ఉల్లాసంగా వుంటూ, అందరిని ఉత్సాహపరుస్తూ పిల్లలతో కాలక్షేపం చేస్తూ, ప్రశాంతంగా జీవితాన్ని గడపాలని నా ఆ కాంక్ష చిరంజీవు లందర్కి నా ఆశీస్సులు అందజేయగలరు.

చి॥ లక్ష్మి, చందు, ఉదయ్, శ్యాం, గౌరి, రాజా, శైలజ, హరిత, పిలకా గణపతి, వసంతలకు ఈ క్రింది కవితలను చదివి వినిపించగలరు. పిల్లలతో దీపావళి సామాన్లు జాగ్రత్తగా కాల్పించగలరు.

1. ఓ పిల్లల్లారా!
ఓబాలల్లారా!
చదవాలోయ్
చదువులన్ని
తెలుసుకోవాలోయి
స్వాతంత్ర్య సమర గాథలు
నడచుకోవాలోయి
దేశభక్తుల అడుగుజాడలలో

2. శివాజీ వీరుని
శౌర్యగాథలు
రాణాప్రతాపుని
బలపరాక్రమాలు
ఝూన్సీ, రుద్రమ
సాహసగాథలు
పల్నాటి, బొబ్బిలి, కాకతీయుల
వీరశౌర్య గాథలు.....॥

3. వ్రాశాడు
బంకించంద్ "వందేమాతరం"॥
యిచ్చాడు
యువలోకానికి "స్ఫూర్తి"
వచ్చింది
ఆవేశం
ఉవ్వెత్తున లేచింది
భారత ప్రజ.....॥

4. పూరించారు
స్వాతంత్ర్య విప్లవ శంఖాలు

ప్రోగించారు

విజయ దుందుభులు

కదలి వెళ్లారు

కదన రంగానికి

అదిరాయి

బ్రిటీష్‌వారి గుండెలు.....॥

5. పేల్చారు

తుపాకులు

తగిలించారు

ఉరిత్రాళ్ళు

జరిపించారు

మారణహోమాలు

స్వర్గాన్నలంకరించారు

వీరయోధులు...॥।

6. నిర్బంధించారు

నాయకులను

క్రుక్కారు

కారాగారాలలో

పెట్టారు

అమానుష చట్టాలలో

పాలించారు

నియంతలలా

7. స్వాతంత్ర్యం నాజన్మహక్కుఅని గర్జించాడు 'తిలక్'

నడిపాడు

గాంధీజీ 'స్వాతంత్ర్య సమరం

స్థాపించాడు

నేతాజి 'ఆజాద్ హింద్ ఫౌజ్'

స్ఫూర్తి నిచ్చింది

వందేమాతర నినాదం.....॥।

8. కదిలింది
జగన్నాథరథం
బయలుదేరింది
ప్రజావెల్లువ
దుమికారు
కొదమసింహాలలా
చీల్చి చెండాడారు
తెల్లదొరలను......॥

9. ప్రజ్వరిల్లింది
విప్లవాగ్ని
రగుల్కొంది
దావాగ్ని
బద్దలైంది
బడబాగ్ని
పటాపంచలైంది
బ్రిటీష్ సామ్రాజ్యం.....॥

10. తట్టుకోలేకపోయారు
తెల్లదొరలు
వదలివెళ్లారు
భారతావనిని
సిద్ధించింది
పాక్షిక స్వాతంత్ర్యం
వచ్చింది
స్వదేశీపాలన.....॥

11. అందజేయాలి
అభినందనలు
అర్పించాలి
జోహార్లు
అమరవీరుల
ఆత్మశాంతికి

సమర్పించాలి
శ్రద్ధాంజలి.....॥

12. ఇదే.....ఇదే
నా ఆశయం
ఇదే.....ఇదే
నా ఆదర్శం
ఇదే....ఇదే
నా ఆదేశం
ఇదే......ఇదే
నా సందేశం......॥।

మ॥ రా॥ శ్రీ రాజేశ్వరరావు మామయ్యగారు వ్రాసిన ఉత్తరం అందినది. వారికి నా నమస్కారములు అందజేయండి. మీ ఇద్దరి ఉత్తరాలు చూస్తుంటే వయోవృద్ధులయినారనే విషయం స్ఫుటంగా కనపడుతున్నది. ఇక వుంటా.....

ఇట్లు
"మీ" కుమారుడు

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 27-10-1976

నేను కులాసా. నీవు వ్రాసిన ఉత్తరం, నాన్నగారు వ్రాసిన ఉత్తరం అందినాయి. చి.గాయత్రి, పిల్లలు అందరూ కులాసా అని భావిస్తాను. బారసాలలు, పండుగ అన్నీ నిర్విఘ్నంగా జరిగినందులకు చాలా సంతోషం. మళ్ళీ కార్తీకమాసం వచ్చింది. ఈ సంవత్సరం ఐదుగురం ఉపవాసం ఉంటున్నాం. పగలు భగవద్గీత చదువుతున్నాం. రాత్రిపూట **'శ్రీకాళహస్తి మహత్యం'** పంతులుగారు చదివి వినిపిస్తున్నారు. మొత్తానికి సత్ కథా కాలక్షేపం బాగానే జరుగుతున్నది. రోజులు గడుస్తున్నాయి. మాసాలు మారిపోతున్నాయి. ఋతువులు దొర్లిపోతున్నాయి, సంవత్సరాలు గడిచిపోతున్నాయి, కాలచక్రం గిర్రున తిరిగిపోతున్నది. నేను జైలుకువచ్చి 13నెలలు పూర్తిఅయినాయి. సుఖించే కాలం మనకు తెలియకుండానే వేగంగా గడిచిపోతూంటుంది. దు:ఖాన్ని అనుభవించే కాలంకూడా గడుస్తూనే ఉంటుంది కాని, అది త్వరగా గడుస్తున్నట్లుగా మాత్రం కనిపించదు. కారణం? సుఖానికి, దు:ఖానికి ఉన్న తేడా అటువంటిది. సుఖాన్ని పొందుటకు తాపత్రయపడే

మనస్సు, దు:ఖాన్ని అనుభవించడానికి అంత ఉత్సాహమును చూపించక పోవటమే. ఇది మానవ సహజ ప్రవృత్తి. దీనిని అధిగమించడం అంత తేలిక కాదు. వీటి రెంటిని సమ భావంతో చూడగల్గడంలోనే ఉన్నది విశేషం. అటుల చూడగలిగే వారిని **"జ్ఞాని"** అని అంటారు.

ఆత్మ జ్ఞానానికి మించిన జ్ఞానం మరొకటి లేదు. ఆత్మజ్ఞానియే కృతార్థుడు. అట్టి జ్ఞాని ఎవరికీ భయపడడు. అతనికి అసాధ్యమైనది అంటూ ఈ ప్రపంచంలో ఏదీ ఉండదు. ఇది అందరికీ సాధ్యమయ్యే విషయం మాత్రం కాదు. అసలు భగవంతుని లీలలు అర్ధంకావు, అలవికానివి. భగవంతుడు ఎప్పుడు ఎవరి హృదయాలలో ఎట్టి ప్రేగణను కలుగజేస్తాడో? ఎప్పుడు ఎవరి ద్వారా ఎలాంటి కార్యాలను నిర్వర్తింపజేస్తాడో ఎవరికీ అర్ధంకాదు, అంతుబట్టడు. జీవితం కడు చిత్ర విచిత్రమైనది. మనం ఒకటి చేయాలనుకుంటే వేరొకటి జరుగుతూ వుంటుంది. **"తానొకటి తలుస్తే దైవమొకటి తలచినట్లు"** గా ఉంటుంది. మనం ఊహించలేనివెన్నో జీవితరంగస్థలంలో మనకెదురవుతుంటాయి. మనం కోరుకున్నవన్నీ సఫలీకృతం కావు. అనుకోనివి, ఊహించనివి అవుతూవుంటాయి. నేడు కనిపించే అత్యంత ప్రియమైన వస్తువులు. రేపటి రోజున అత్యంత అప్రియమైన వస్తువులుగా మారిపోతుంటాయి. అనుక్షణం అత్యంత సన్నిహితంగా ఉండేవారు దూరంగా కంటికి కనిపించకుండా వెళ్ళిపోతారు. అతిదూరంగా ఉంటూ, ఎన్నడూ, ఎప్పుడూ కనిపించకుండా వుండేవారు అతి సన్నిహితులవుతుంటారు. కాల పరిణామంలో మిత్రులు శత్రువులుగా, శత్రువులు మిత్రులుగా అవుతూ వుంటారు. ఈ అనంతకాలప్రవాహంలో ఎక్కడెక్కడో నివసిస్తున్న అనేక జీవరాసులు కలిసి మెలిసి ఒకే ప్రవాహంలో కొంతకాలం పయనించి, ఉత్తరక్షణంలో వేరై, ఒకదానికొకటి సంబంధం లేకుండా దేనిత్రోవన అవి వెళ్ళిపోతుంటాయి. ఫలానా వస్తువును, ఫలానావ్యక్తిని శాశ్వతంగా, జీవితాంతం నావద్దనే ఉంచుకుంటాను, ఎటువంటి పరిస్థితులలోను ఎడబాటును ఏమాత్రం సహించను, అంగీకరించను అని కొందరు భావించుకుంటుంటారు. అట్టివారు మరుక్షణంలో ఏమి జరుగుతుందో ఊహించనయినా ఊహించలేరు. ఇదే సృష్టి రహస్యం. దీనిని అర్ధం చేసుకొనలేక మానవుడు అనేక సంకల్పాలు చేస్తుంటాడు. కోరికలకు అసలు హద్దే ఉండదు. ఎంత పొందినా, ఎంత అనుభవించినా తృప్తి ఉండనే ఉండదు. ఒకవేళ అతను ఊహించినవి, కోరినవి లభిస్తే అతని ఆనందానికి అంతే ఉండదు. దురదృష్టవశాత్తు ఆశించినది లభించకపోతే నెత్తి నోరు బాదుకొని ఏడవటం మొదలు పెడుతాడు. ప్రతివ్యక్తీ తాను ఊహించిన విధంగా జరగాలని భావించడం న్యాయమా? ఇది

సాధ్యమా? తన ఇష్టానుసారము ప్రకృతి కూడా నడవాలని కోరుకోవడం భావ్యమా? ఇది జరిగే పనేనా? ఆ విధంగా జరుగలేదని నిరాశ చెందటం సమంజసమా? ఈ చరాచర సృష్టి మన చేతులలో లేదని, దీనికి మూలవిధాత మరొకడున్నాడనే విషయం గమనిస్తే నిరాశా నిస్పృహలకు అసలు అవకాశమే ఉండదు. ఈజగత్తులో ప్రతి జీవి, ప్రతి అణువు ఏక్షణంలో ఎవరితో కలవాలో, ఏ క్షణంలో ఏకణంతో కలవాలో నిర్దేశించి, నిర్ణయించేటటువంటి మానవాతీతమైన మహత్తరశక్తి ఒకటున్నదనే విషయం విస్మరించరాదు. ఆ సృష్టికర్త ఇష్టాయిష్టముల మీదనే ఈ సర్వ జగత్తు నడుస్తున్నది. మనమంతా ఆ జగన్నాటక సూత్రధారి ఆడించే రంగస్థలంలో పాత్రధారులం మాత్రమే. ఆడించేది మహత్తరశక్తి ఆడేవారం మనం. భగవానుడు ఎవరికి, ఎప్పుడు, ఏ కార్యాన్ని అప్పగిస్తే, దానిని విశ్వాసపాత్రంగా, నమ్మకంగా, నిష్కామబుద్ధితో యంత్రంలా నిర్వహించడం మనవంతు. ఏ సమయంలో, ఎవరు, ఎందుకు, ఎంత పని చేయాలో నిర్ణయించేది ఆ పరమేశ్వరుడే. తదనుగుణంగా ఆ పనిని నిస్వార్ధ బుద్ధితో చేయడం మన కర్తవ్యం. అయితే ఇక్కడ ఒక్కవిషయం మాత్రం విస్మరించరాదు. నిస్పృహ అంతకన్నా దరికి చేరనీయరాదు. అప్రాప్త వస్తువులకోసం, అవిరామంగా, అధిక ప్రయత్నాలు సాగించి చింతించడం అవివేకం. సూక్ష్మజ్ఞానంతో తన అర్హతను, అదృష్టాన్ని అవగాహన చేసుకొని, అర్థం చేసుకొని ముందుకు నడవటం నేర్చుకోవాలి. మన అర్హతనుబట్టే దైవానుగ్రహం ఉంటుంది. పూర్వజన్మ సుకృతం వలన లభించిన ఈ మానవదేహాన్ని సద్వినియోగపరచాలి. మానవధర్మాన్ని నిర్వర్తించాలి. పరోపకార బుద్ధిని అలవరచుకోవాలి. ప్రతిఫలాపేక్షను ఆశించకుండా, నిరంతరం నిష్కామబుద్ధితో కర్మలనాచరించడం నేర్చుకోవాలి. ఆ స్థాయిని చేరుకున్నవారికి నీ.... నా బేధం కన్పడదు. ఈ సృష్టి అంతా సమభావంతో చూడగలుగుతారు. సమస్త జీవరాసులను సమభావంతో ఆదరించగలుగుతారు. ఈ అత్యున్నతమైన, పరమోత్కృష్టమైన, పరమపవిత్రమైన, మహోన్నతమైన, ఉత్తమోత్తమమైన ఆశయ ఆదర్శములను పొందుటకు, సాధించుటకు, అవసరమైన తత్త్వజ్ఞానం ఒక్క భారతీయ సంస్కృతీ ధర్మాలలో తప్ప మరెక్కడా కనిపించదు. కనుక అటువంటి ఉత్తమ సంస్కృతీ సంప్రదాయముల యెడల అకుంఠిత విశ్వాసం కలిగి ఉండాలి. ఇక ఉంటా....

చిరంజీవులకు నా ఆశీస్సులు

ఇట్లు

" నీ "

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 30-10-1976

చిరంజీవులకు - ఆశీస్సులు

నేను కులాసా. మీరంతా కూడా కులాసా అని భావిస్తున్నాను. దీపావళికి ఉత్సాహంగా టపాకాయలు కాల్చారనుకుంటున్నాను. మళ్లీ నెల పరీక్షలు వస్తున్నాయి గదా! బాగా చదువగలరు. పోయిన ఉత్తరంలో నేను వ్రాసిన కవిత చదివారా! అర్థం కాకపోతే అమ్మను అడిగి అర్థంచేసుకోగలరు. నేటి బాలలు రేపటి భావిభారత పౌరులుగదా! కనుక చదువుతోపాటు ప్రపంచజ్ఞానాన్ని కూడా సంపాదించాలి. మంచి క్రమశిక్షణ గల ఉత్తమ దేశభక్తులుగా తయారుకావాలి. ప్రతి ఒక్కరూ తమ తల్లిదండ్రులను, చదువు చెబుతున్న గురువులను, మనం నివశిస్తున్న మాతృదేశమును భక్తితో ప్రేమించి, గౌరవించడం నేర్చుకోవాలి.

శ్రీరామచంద్రుడు సహితం మాతృదేశమును ఎంత అమితంగా ప్రేమించేవాడో ఈ క్రింది శ్లోకమును అర్థం చేసుకుంటే తెలుస్తుంది. శ్రీరామ చంద్రుడు లక్ష్మణునితో వానర సేనను సమకూర్చుకొని, లంకాపురిపై దండెత్తుతాడు. రావణుని, అతని పరివారాన్ని హతమారుస్తారు. సకల అష్టఐశ్వర్యములతో తులతూగుతూ బంగారుమయమైన లంకాపురిని చూచి లక్ష్మణుడు మోహ పడుతాడు. అక్కడనే ఉండి రాజ్యపాలన కొనసాగిద్దామని, బీదదైన భారత దేశమునకు వెళ్లవద్దని అన్నగారైన శ్రీరామచంద్రుడ్ని కోరుతాడు. అప్పుడు

**"అపి స్వర్ణ మయీ లంకా, నమే లక్ష్మణ రోచతే**
**జననీ జన్మ భూమిశ్చ, స్వర్గాదపి గరీయసి"**

**"ఓ లక్ష్మణా ! లంకాపురి బంగారుమయమయినను నాకు యిష్టము లేదు. తల్లియునూ, జన్మించిన దేశమును స్వర్గముకంటే కూడా గొప్పవి"** అని శ్రీరాముడు లక్ష్మణునితో చెబుతాడు. కనుక మనం యిక్కడ నేర్చుకోవలసిన నీతి ఒకటి ఉన్నది. "జన్మనిచ్చిన తల్లిని ఏవిధముగా గౌరవించి, ప్రేమిస్తామో, అదే విధముగా మనం జన్మించిన మాతృభూమిని కూడా గౌరవించి ప్రేమించడం మన ధర్మం. ప్రతి భారతీయుని కర్తవ్యం." ఈ నీతిని మీరందరూ ఆచరిస్తారు గదూ! ఈ క్రింద కొన్ని ప్రశ్నలు వ్రాస్తున్నాను. ప్రక్కవాళ్లను అడగకుండా వాటికి సమాధానం, ఎవరికి వారు తలా ఒక కాయితంతీసుకొని వ్రాసి మీ అమ్మకు చూపించాలి. ఎవరు ఎన్ని ప్రశ్నలకు సరియైన సమాధానం వ్రాశారో ఈ తడవ ఉత్తరంలో నాకు వ్రాయాలి. సమాధానం తెలియనివారు మీ అమ్మను అడిగి తెలుసుకోండి.

1. పాండవులు ఎంతమంది? వారి పేర్లు ? (వరుసగా)
2. దశరథుని పుత్రుల పేర్లు, వారి తల్లులపేర్లు?
3. రామాయణమును సంస్కృతంలో వ్రాసినదెవరు?
4. భారతమును సంస్కృతంలో వ్రాసినదెవరు?
5. భగవద్గీత ఎవరు, ఎవరికి చెప్పారు?
6. వందేమాతరం జాతీయ గీతమును వ్రాసిన దెవరు?
7. జనగణమన వ్రాసినదెవరు?
8. భారతదేశ ప్రథమ రాష్ట్రపతి ఎవరు?

చిరంజీవులకు నా ముద్దులు, ఆశీస్సులు.

ఇట్లు
'మీ నాన్న'

సెంట్రల్ జైలు,రాజమండ్రి
ది. 3-11-1976

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. నీవు '**అత్యయికపరిస్థితి**' (Emergency) పూర్వాపరాలు వ్రాయమన్నావు. దానికి సమాధానం వివరంగా వ్రాస్తే ఆ లేఖ నీకు చేరకపోవచ్చును. రాజ్యాంగ సవరణ మీద వివరంగా వ్రాసిన నాలుగు ఉత్తరాలు హైద్రాబాద్ ఇంటెలిజెన్సు వారికి పంపబడి,అవి తిరిగి నాకే యిచ్చివేశారు. నీకు పంపటానికి ప్రభుత్వం అంగీకరించలేదు. అదీ పరిస్థితి. 1976 మార్చిలో ఎన్నికలు జరుగుతే వదలిపెడతారని భావించాం. ఇప్పుడు సంవత్సరం వాయిదా వేశారు. మరల 1977లో జరుగవలసిన ఎన్నికలు 1978మార్చి వరకు వాయిదా వేశారు. 1978 ఎన్నికల ముందర వదలాలని లేదు. వదలకూడదని లేదు. అసలు ఏమి చేయాలో వాళ్లకు అర్థమవుతే మనకు బోధపడుతుంది. అంతా అగమ్యగోచరమే. ఎప్పుడు ఏ నిర్ణయం తీసుకుంటారో వాళ్లకే (ప్రభుత్వం) తెలియదు. మనకంతకన్నా తెలియదు. ఇదీ పరిస్థితి. ఇటువంటి స్థితిలో ఊహాగానాలు చేయడంవల్ల ప్రయోజనం లేదు. ఎన్నికలు పెడితే ఫలితాలు ఏ విధంగా ఉంటాయోనని వారి భయం. ఉన్న అధికారం ఊడుతుందేమోననే అనుమానం. వీటిని గురించి ఆలోచించి, లేనిపోని ఆశలు పెట్టుకొని బాధపడేదానికన్నా, ప్రశాంతంగా గుండె

రాయి చేసుకొని, జీవితాన్ని కొనసాగించడం ఒక్కటే మార్గం. పరిస్థితులు ఎల్లకాలం ఒకే విధంగా ఉండవుగదా! ఓడలు బండ్లు అవుతాయి. బండ్లు ఓడలు అవుతాయి. అంతమాత్రంతో దిగులుపడి నిరాశచెందడం విజ్ఞుల లక్షణం కాదుగదా! విచారించి నందువల్ల ప్రయోజనం శూన్యం. ధైర్యవంతుడు మాత్రమే ఎప్పుడో ఒకప్పుడు విజయాన్ని పొందితీరుతాడు. పిరికివాడు నిత్యమూ మరణిస్తునే ఉంటాడు. ధైర్యవంతుడు మరణించేది ఒక్క పర్యాయము మాత్రమే. కాబట్టి నిర్భయంగా ముందుకు సాగిపోవటం ఒకటే మార్గం. అంతకన్నా మరో మార్గం లేదు. ఇక ఉంటా.....

చిరంజీవులకు - ఆశీస్సులు

పరీక్షలు బాగా వ్రాసి వుంటారని ఆశిస్తున్నాను. గత లేఖలో నేను వ్రాసిన ప్రశ్నలకు సమాధానం మీ అమ్మకు చెప్పారనుకుంటున్నాను. మరల ఒక శ్లోకం, దాని అర్థం వ్రాస్తున్నాను. బాగా అర్థం చేసుకోగలరు.

**"జననీ జన్మభూమిశ్చ, జాహ్నవీ చ జనార్థన:**
**జనక: పంచమశ్చై వ, జకారా: పంచ దుర్లభా:"**

అనగా జననీ (తల్లి), జన్మభూమి(జన్మించిన దేశము), జాహ్నవీ (గంగానది), జనార్దన: (విష్ణువు లేక కృష్ణుడు), జనక: (తండ్రి) - మొదలగు 'జ కారమందుగల ఈ ఐదుగురు అతికష్టముపై లభించుదురు. అనగా ఈ ఐదుగురు అందరికీ లభ్యం కావటం దుర్లభం అని అర్థము.

1. ఎంతో ఓర్పుతో లాలించి, ప్రేమించి మంచి బుద్ధులు చెప్పి, మంచి మార్గమున నడిపించే తల్లి అందరికీ లభ్యంకాదు. పిల్లలు ఎంత అల్లరి చేసినా, చీటికి మాటికి కొట్టకుండా మంచి మాటలు చెప్పి, బుజ్జగించి, చెడుమార్గమున పోనివ్వకుండా, మంచిమార్గమున నడిపించే ఓపిక, శక్తిఉన్న తల్లులు అరుదు. అటువంటి సహనశీలి అయిన తల్లి కల్గిన పిల్లలు ఎంతో అదృష్టవంతులు. అటువంటి తల్లి లభ్యంకావటం, ఆ పిల్లల పూర్వజన్మ సుకృతమేనని భావించాలి.
2. తల్లిలాంటిదే జన్మించిన దేశం కూడాను మనది భారతదేశం. ఇది మన మాతృభూమి, పుణ్యభూమి, తపోభూమి. వ్యాసవాల్మీకి, వశిష్ఠాది మహర్షులు జన్మించిన తపోభూమి. రామకృష్ణపరమహంస, అరవిందుడు, రమణమహర్షి లాంటి తత్త్వవేత్తలను ఈ మాత కన్నది. వివేకానంద, రాజారామమోహన రాయ్‌లాంటి ప్రవక్తలకు జన్మ యిచ్చింది ఈ భారతమాతే. శివాజీ, రాణాప్రతాప్, శ్రీకృష్ణ దేవరాయలు, ఝాన్సీరాణి, రుద్రమదేవి లాంటి వీరాధివీరులను,

వీరవనితలను కన్నది ఈ మాతే. తిలక్, గాంధీ, నేతాజీ లాంటి నాయకులను కన్నదికూడా ఈ భరతమాతే. అమెరికా, ఇంగ్లండు లాంటి సంపన్న దేశాలను సందర్శించి, తిరిగి ప్రయాణమవుతున్న వివేకానందునితో మీ మాతృభూమి పట్ల మీ అభిప్రాయమేమిటని కొందరు పత్రికావిలేఖరులు ప్రశ్నించగా **"భారతదేశమును లోగడ ప్రేమించాను. కాని ఇప్పుడు భారతభూమిలోని ప్రతి ధూళికణము నాకు అత్యంత పవిత్రము. అది నాకొక తీర్థస్థానము"** అని సగర్వంగా వివేకానంద సమాధానం చెబుతాడు. కనుక అటువంటి పవిత్రభూమిలో మనమందరం జన్మించడం, నిజంగా మన పూర్వజన్మ సుకృతమే. కనుక ప్రతి ఒక్కరూ తన తల్లితోపాటు జన్మించిన దేశము (భరతమాత) ను కూడా ప్రేమించాలి.

3. గంగానది ఎంతో పవిత్రమైనది. భగీరథుడు ఎంతో తీవ్రంగా తపస్సు చేసి శివుని జటాజూటంలో నున్న గంగను ఈ భారతభూమిమీద ప్రవహించేటట్లు చేశాడు. ఈ గంగానది వలన దేశం సశ్యశ్యామలమై కోట్లాదిమందికి తిండి లభిస్తున్నది. కాశీ, ప్రయాగ లాంటి ఎన్నో పుణ్యక్షేత్రాలు ఈ పవిత్ర నదీతీరాననే ఉన్నాయి. దీనిలో స్నానం చేస్తే పుణ్యం అని పెద్దలు చెబుతుంటారు. కనుక మనం గంగానదినికూడా గౌరవించి పూజించాలి.

4. విష్ణుమూర్తి. ఈ సకల చరాచర సృష్టికి మూలపురుషుడు. ఆపత్ బాంధవుడు, అనాథరక్షకుడు, దయామయుడు, ప్రేమస్వరూపుడు, భక్తుల కోరికలను నెరవేర్చగల దయార్ద్రహృదయుడు. కనుక ఆ భగవానుని ఎల్లప్పుడు భక్తి శ్రద్ధలతో పూజించాలి.

5. జన్మనిచ్చిన తల్లిని ఏ విధంగా ప్రేమిస్తామో అదే విధంగా మనల్ని పోషించుతూ, విద్యాబుద్ధులను నేర్పించే తండ్రిని కూడా ప్రేమించాలి. పిల్లల అభిరుచులను తెలుసుకొని, వారిని సన్మార్గమున నడిపించుతూ,చదువు సంధ్యలను నేర్పిస్తూ, ప్రేమతో చూచేటటువంటి తండ్రిని ప్రేమించి, గౌరవించడం పిల్లల కర్తవ్యం, ధర్మం.

కాబట్టి పై ఐదు అదృష్టాలు అందరికీ లభించడం అంత తేలికైన విషయం కాదు, దుర్లభం కూడాను. పూర్వజన్మలో చేసుకొనిన మహా పుణ్యం వలననే అటువంటివారు లభిస్తారు. కనుక ప్రతి ఒక్కరూ భక్తిశ్రద్ధలతో తల్లిని,తండ్రిని, మాతృభూమిని, భగవంతుని, గంగాదేవిని పూజించాలి, గౌరవించాలి, ప్రేమించాలి. ఇక ఉంటా.....

ఇట్లు

"మీ నాన్న"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 10-11-1976

చిరంజీవులకు ఆశీస్సులు

చి॥లక్ష్మి, చందు, ఉదయ, శ్యాం, రాజాలు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. నేను గత ఉత్తరంలో వ్రాసిన ప్రశ్నలకు సమాధానాలు వ్రాసినందులకు మిక్కిలి ఆనందిస్తున్నాను. ఈ తడవ ఉత్తరంలో కూడా మరికొన్ని ముఖ్య విషయాలు వ్రాస్తున్నాను. మీరందరూ బాలబాలికలు కదా! బాలబాలికల ప్రథమ కర్తవ్యమేమిటని ఎవరైనా ప్రశ్నిస్తే బుద్ధిమంతులైన బాలబాలికలు ఈ క్రింది సమాధానాలు చెబుతారు. అవి ఏమనగా 1. తల్లిదండ్రులను సేవించడం, 2. గురువులను వినయంతో, భక్తితో సేవించడం, 3. పెద్దలను గౌరవించడం, 4. భగవంతుని యెడల భక్తిశ్రద్ధలు కలిగిఉండటం, 5. ఎల్లప్పుడూ సత్యమునే పలకటం, 6. అల్లరి చేయకుండా బుద్ధిమంతులుగా ప్రవర్తించటం, 7. శ్రద్ధతో విద్య నభ్యసించటం. ఈ విధంగా సమాధానం చెప్పనటువంటి బాలబాలికలను **"బుద్ధిమంతులు"** అని చెప్పటానికి వీలులేదు.

ఈ ఉత్తరంలో అసలు విద్యయొక్క ప్రయోజనం ఏమిటి? దానివల్ల ఉపయోగమేమిటి? బాలబాలికలు నేర్చుకోవలసిన విద్య ఎటువంటిది అయి ఉండాలి? అనే విషయాలను గురించి క్లుప్తంగా వివరిస్తాను. శ్రద్ధగా చదివి, ఆకళింపు చేసుకొని, నిత్యజీవితంలో వాటిని అమలుపరచి, మంచి భావిభారత పౌరులుగా మీరందరూ తయారుకావాలని నా అభిలాష, ఆకాంక్ష

విద్యయొక్క ముఖ్య ప్రయోజనం విజ్ఞానమును సముపార్జించడంతోపాటు వినయాన్ని కూడా అలవరచుకోవడం. అసలు వినయమంటే ఏమిటి? అణుకువ, మంచి నడవడి, మంచి గుణం, మంచి ప్రవర్తన అని అర్థం. ఇటువంటి సద్గుణములు పెంపొందించనటువంటి చదువు అసలు చదువే అనిపించుకోదు. ఇటువంటి మంచి భావములను అలవరచుకొనకుండా వట్టి విద్యను (చదవటం, వ్రాయటం) నేర్చుకోవడంవలన ప్రయోజనం శూన్యం. వినయరహితమైన విద్యవలన ఉపయోగంలేదు. అందుకోసమనే **"విద్యా వినయ సంపన్న:"** అని పెద్దలు చెప్పారు. కనుక విద్యావినయములు రెండూ కలిసి ఉన్నవాడే రాణిస్తాడు. పైకి వస్తాడు, అభివృద్ధిలోనికి వస్తాడు. అయితే ఇటువంటి వినయసహితమైన విద్యను ఎప్పుడు నేర్చుకోవాలి? విద్య అనేది ఎప్పుడు పడుతే అప్పుడు నేర్చుకుంటే వచ్చేది కాదు. దీనికి సమయం సందర్భం ఉంటుంది. **"శైశవే ఽ భ్యస్త విద్యానాం"** అనగా బాల్యమునందే

విద్యను నేర్చుకోవాలి. అప్పుడు నేర్చుకున్నదే బాగా వంటపడుతుంది. అటువంటి అమూల్యమైన కాలమును వృథా పరుస్తే, భవిష్యత్తులో విచారించవలసివస్తుంది. బాధపడవలసివస్తుంది. కనుకనే మీరందరూ శ్రద్ధగా, మంచిగా విద్య నభ్యసించడంతో పాటు వినయమును కూడా అలవర్చుకోవాలి.

**"విద్యా దదాతి వినయం, వినయాత్ యాతి పాత్రతాం**

**పాత్రత్వాత్ ధన మాప్నోతి, ధనాధర్మంతత: సుఖమ్॥"**

అనగా విద్య వినయమును యిచ్చుచున్నది. అట్టి వినయము వలన యోగ్యతను, అర్హతను పొందుచున్నాడు. అట్టి యోగ్యతవలన ధనమును పొందుచున్నాడు. అట్టి సంపద వలన ధర్మమును, (దానధర్మములు) అట్టి ధర్మము వలన సుఖమును, ఆనందమును పొందుచున్నాడని దీని అర్థము. ఇదే భావము చెప్పే ఒక తెలుగు పద్యమును కూడా వ్రాస్తున్నాను.

**"విద్య యొసగు వినయంబు, వినయమునను**
**బడయు బాత్రత పాత్రత వలన ధనము**
**ధనము వలనను ధర్మంబు దానివలన**
**ఐహికాముష్మిక సుఖంబులందు నరుడు"**

పూర్వకాలమున విద్యను నేర్చుకోవటానికి వెళ్లే వాడిని **"వినేయుడు"** అనేవారుట. అనగా వినయమును అభ్యసించేవాడని అర్థము. విద్యతోపాటు వినయమును కూడా తప్పనిసరిగా అలవరచుకోవాలని ఆనాటి పెద్దల అభిప్రాయం. అటువంటివారు ఎక్కడికి వెళ్ళినా, ఏ దేశం వెళ్ళినా రాణిస్తారు. అభివృద్ధిలోనికి వస్తారు. అటువంటి వారిని తల్లిదండ్రులు, పెద్దలు, ప్రభువులు ప్రేమిస్తారు, గౌరవిస్తారు. అటువంటివారు పెద్దవారు అయిన తరువాత ఏ రంగంలో ప్రవేశించినా విజయాలను సాధిస్తారు. కనుక మీరందరూ విద్యతోపాటు వినయమును కూడా అలవరచుకొని అందరిచేత మెప్పును పొందాలని ఆశిస్తున్నాను.

ఈ క్రింది ప్రశ్నలకు కూడా సరియైన సమాధానములు వ్రాయగలరు.

1. భాగవతం సంస్కృతంలో వ్రాసిన దెవరు?
   తెలుగులో పద్యకావ్యంగా వ్రాసినదెవరు?
2. భారతమును తెలుగులో పద్యకావ్యంగా వ్రాసిన కవులెవరు?
3. అభిజ్ఞాన శాకుంతలమును సంస్కృతంలో వ్రాసిన కవి ఎవరు?

4. భారతదేశమునకు ఎప్పుడు స్వాతంత్ర్యం లభించింది?
   రిపబ్లిక్‌గా ఎప్పుడు అవతరించింది?
5. ఆంధ్రప్రదేశ్ ఎప్పుడు ఏర్పడింది? ముఖ్యపట్టణం ఏది?
6. భారతదేశముయొక్క రాజధాని ఏది?
7. మన రాష్ట్రంలో జిల్లాలు ఎన్ని? వాటి పేర్లు?
8. మన జిల్లా పేరు ఏమిటి? ఎన్ని తాలూకాలు(ప్రస్తుతం మండలాలు) ఉన్నవి?
   వాటి పేర్లు ఏమిటి?
9. తాజ్‌మహల్ ఎక్కడ ఉన్నది? ఎవరు ఎందుకు నిర్మించారు ?
10. ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానది మీద ఆనకట్టలు ఎక్కడ ఉన్నవి?

పై ప్రశ్నలకు సమాధానం వ్రాస్తారు గదూ!

ఇట్లు
"మీ నాన్న"

సెంట్రల్ జైలు, రాజమండ్రి
13-11-1976.

చిరంజీవులకు ఆశీస్సులు

విద్య, వినయముల ఆవశ్యకతను గురించి 10-11-1976 లేఖలో వివరించాను. విద్య నభ్యసించినవారు మాత్రమే ఏరంగంలోనయినా రాణిసారు. చలామణి అవుతారు. విద్యతో సమానమైనది ఈ భూప్రపంచంలో మరొకటి లేదు. సకల భోగభాగ్యములున్నప్పటికి, విద్యలేని యడల ఎందుకూ పనికిరాడు. **"విద్యా విహీన: పశు:"** విద్య లేనివాడు వింత పశువు అని ఏనాడో పెద్దలు అనుభవంతో చెప్పారు. ఈ క్రింది శ్లోకముకూడా ఇదే వాస్తవమును చెబుతున్నది.

**"సుందరోఽపి సుశీలోఽపి**
**కుతనో ఽ పి మహాధన:**
**శోభతే న వినా విద్యాం**
**విద్యా సర్వస్య భూషణమ్"**



అనగా "అందమైనవాడైననూ, మంచి శీలవంతుడైననూ, మంచి వంశమున జన్మించిన వాడైననూ, మహాధనవంతుడైననూ, విద్య లేకుండా ప్రకాశించడు. ఎందువలననగా విద్య సమస్తమునకు అలంకారము" అని అర్థం. విద్యకు ఎంత విలువ ఉన్నదో దీనివల్ల మనకు బోధపడుతున్నది. మానవునికి అలంకారం విద్య, శోభనిచ్చేది విద్య, గౌరవాన్ని పెంపొందించేది విద్య, అభివృద్ధికి తోడ్పడేది విద్య, పదిమందిచేత మెప్పును సంపాదించేది విద్య. విద్యతో సమానమైన అలంకారములు గల వస్తువు వేరొకటి లేదు.

ఇదే వాస్తవము భర్తృహరి సుభాషితములో కూడా వివరించబడింది.

"భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశపాశమృదు పుష్పసుగంధ జలాభిషేకముల్
భూషలుగావు పూరుషుని భూషితు జేయు బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్"

అనగా "భుజములకు అలంకరించుకొను దండె కడియముల వల్ల మనుజునికి అలంకారం రాదు. చంద్రుని వలె తెల్లగా ప్రకాశించెడి ముత్యాలదండను ధరించినందువల్ల ఏమాత్రం ప్రకాశించడు. మంచి పన్నీటి స్నానము వలనగాని, చల్లటి చందనము వ్రాసుకొనుట వలనగాని, సువాసనలు వెదజల్లెడి మల్లెపుష్పములను పెట్టుకొనినందువలన గాని, చక్కగా దువ్వి అందముగా కేశముల నలంకరించుకొనుట వలనగాని ఏమాత్రం శోభించడు" అని అర్థము. ఈ అలంకారములు ఏమాత్రం శాశ్వతం కావు. కాలక్రమమున క్షీణించి, నశించి, కాలగర్భంలో కలసి కనపడకుండా పోతాయి. కాని వ్యాకరణాది, శాస్త్రశుద్ధమైన వాక్కు ఒక్కటే మనుజునికి అలంకారం తెచ్చిపెడుతుంది. అది ఒక్కటే సరియైన భూషణము. అదే శాశ్వతమైన కీర్తిని తెచ్చిపెడుతుంది. దానికి ఎప్పటికీ నశింపులేదు. పైన అలంకరించుకొనిన భూషణములను ఒక వేళ దొంగలు దొంగిలించిన దొంగిలించవచ్చును గాని కష్టించి, శ్రమించి, కడు శ్రద్ధతో అభ్యసించిన విద్యను, సువాక్కును, ఎవ్వరూ, ఎప్పుడూ దొంగిలించలేరు. కనుక తాత్కాలికము, భౌతికమూ అయిన పై పై మెరుగులను చూచి, మభ్యపడి మోసపోరాదు. శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలను సముపార్జించి పెట్టేటటువంటి సువిద్యను శ్రద్ధగా అభ్యసించడం ప్రతి బాలబాలికల కర్తవ్యము. కనుక మీరందరూ శ్రద్ధగా చదువుకొని అభివృద్ధిలోకి రావాలని నా అభిలాష.

1. మన రాష్ట్ర గవర్నరు పేరేమిటి?
2. మన భారత దేశ రాష్ట్రపతి పేరేమిటి?
3. పాకిస్తాన్ ముఖ్య పట్టణం ఏది?
4. బంగ్లాదేశ్ ముఖ్య పట్టణం ఏది?
5. మన దేశ ప్రథమ ప్రధాన మంత్రి ఎవరు?
6. పాండవులకు, కౌరవులకు యుద్ధం ఎక్కడ జరిగింది? ఎన్ని రోజులు?
7. గోదావరి నది ఎక్కడ పుట్టినది?
8. కృష్ణానది ఎక్కడ పుట్టినది?
9. మన రాష్ట్రములో బొగ్గుగనులు ఎక్కడ ఉన్నవి?
10. మన దేశములోని ఓడరేవులలో అతిసహజమైన ఓడరేవు ఏది?

పై ప్రశ్నలకు సమాధానం వ్రాస్తారు గదూ! ఇకవుంటా....

ఇట్లు

"మీ నాన్న"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది.17-11-1976.

చిరంజీవులకు - ఆశీస్సులు

విద్య యొక్క ఔన్నత్యాన్ని, గొప్పతనాన్ని గురించి గత రెండు లేఖలలో వివరించాను. ఈ చరాచర సృష్టిలో విద్యావంతుని మించినవారు ఎవ్వరూ లేరనే విషయం సుస్పష్టం. విద్యావంతునికి సాటికాగల వారు కూడా లేరు. అన్నిటికంటే విద్యయే అధికమని ఈ క్రింది శ్లోకము ప్రపంచానికి చాటుచున్నది.

**"విత్తం బన్ధుర్వయ: కర్మ, విద్యా భవతి పఞ్చమీ**

**ఏతాని మాన్య స్థానాని, గరీయో యద్య దుత్తరమ్"**

అనగా "ధనము, బంధువు, వయస్సు, కర్మ, విద్య - ఈ ఐదు గౌరవించ దగినవి. ఇందు వరుసక్రమములో అనగా ధనము కంటే బంధుత్వము, దాని కంటే వయస్సు, దానికంటే కర్మము, దానికంటే విద్యయు శ్రేష్ఠమైనది" అని అర్థము.

**"ధనంమూలం మిదం జగత్"** అన్నారు గదా! ఈ లోకంలో సహజంగా సామాన్యుల చేత ధనము గౌరవించబడుతున్నది. ఎప్పుడైనా, ఎక్కడైనా ధనవంతునికి,

బంధుత్వానికి మధ్య పోటీ వస్తే సామాన్యులు సహజంగా ధనవంతుడినే వరిస్తారు. ఇంగిత జ్ఞానం గల వివేకవంతులు మాత్రం బంధుత్వానికి విలువ యిస్తారు. అసలు బంధుత్వం అంటే ఇక్కడ ఒక చుట్టరికం లేక రక్త సంబంధం అని మాత్రమే కాదు. ఒక్క సుఖములోనే కాక, కష్టములలో కూడా దూరం కాకుండా, ఆత్మీయతతో, అనురాగంతో, అంటిపెట్టుకొనిన, మనస్ఫూర్తిగా మమకారాన్ని వెదజల్లేవారిని మాత్రమే **'బంధువులు'** అని చెప్పుకుంటే బాగుంటుంది. ఇకపోతే అటువంటి బంధుత్వానికి, వయస్సుకు, మధ్య వైరుధ్యం వస్తే, సహజంగా సామాన్య మానవులు బంధుత్వానికే విలువ యిస్తారు. వయస్సు మళ్ళినవారిని ఏమాత్రం గౌరవించరు. కాని విచక్షణాజ్ఞానం, లౌకికజ్ఞానం గలవారుమాత్రం వయస్సుకు ప్రాధాన్యత యిస్తారు. ఇక్కడ వయస్సు అంటే కేవలం సంవత్సరములు అని అర్థం సరిపోదు. వయస్సుతో పాటు బుద్ధి కూడా వికసించటం అని అర్థం. వయోవృద్ధుడంటే జ్ఞానవృద్ధుడని, విచక్షణాజ్ఞానం కలవాడని యిక్కడ అర్థంగా చెప్పుకోవాలి. ఒకవేళ వయస్సు కర్మల మధ్య వైషమ్యం ఏర్పడుతే అతి సహజంగా వయస్సుకే విలువ యిస్తారు సామాన్యులు. కర్మను గుర్తించరు కాని కొంతమంది విజ్ఞులు మాత్రం 'కర్మ'కు ప్రాధాన్యతనిస్తారు. కర్మ అంటే యిక్కడ కేవలం వట్టి పని అని చెప్పుకుంటే సరిపోదు. కర్మ అంటే **'సత్కర్మ'** అనగా మంచి పని అని అర్థం. అనగా శాస్త్రసమ్మతమైన పని. అట్టి దానిని నిష్కామబుద్ధితో, ఫలాపేక్షలేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరించేటటువంటి పవిత్ర కర్మ అని అర్థము. అట్టి కర్మ, విద్య లలో దేనిని నిర్ణయించుకుంట బాగుంటుందో, ఒక్కొక్కప్పుడు చెప్పడం కష్టమే అవుతుంది. కాని అటువంటి సంది పరిస్థితి ఉత్పన్నమైనప్పుడు సామాన్య ప్రజానీకం **"కర్మ"** కే విలువయిస్తుంది. కాని అనుభవజ్ఞులు, పెద్దలు, శాస్త్ర పరిజ్ఞానం గల అనుభవశాలురు విద్యకే ప్రాధాన్యతనిచ్చి గౌరవిస్తారు. కారణం ఏమిటి? ఇక్కడ **"విద్య"** అంటే కేవలం చదవటం, వ్రాయటం అని భావం కాదు. జ్ఞాన విజ్ఞానములను సముపార్జించి పెట్టేదని, లౌకికజ్ఞానం, అనుభవజ్ఞానం, విచక్షణాజ్ఞానం, వివేకజ్ఞానం, శాస్త్ర పరిజ్ఞానములను సంపూర్ణంగా సంపాదించి యిచ్చేదని అర్థముగా చెప్పుకుంటే బాగుంటుంది. ఆఖరికి దీనిని బట్టి చూస్తే విద్యతో సమానమైనది ఈ ప్రపంచంలో మరేదీ లేదనే విషయం స్పష్టమవుతున్నది.

ఈ సందర్భమున భర్తృహరి సుభాషితములలోని ఈ క్రింది నీతి పద్యమును వ్రాస్తున్నాను. దీనిని బాగా అర్థం చేసుకొని కంఠస్థం చేయాలని నా కోరిక.

**"విద్య నిగూఢ గుప్తమగు విత్తము, రూపము పూరుషాళికిన్**

**విద్య యశస్సు భోగకరి విద్య గురుండు, విదేశ బంధుడున్**

విద్య విశిష్ట దైవతము విద్యకు, సాటి ధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము, విద్య నెఱుంగనివాడు మర్త్యుడే"

విద్యయే పురుషునికి మంచిగా ప్రకాశింపజేయునట్టి రూపమువంటిది. మానవునకు విద్యయే గొప్ప సౌందర్యము పరులెవ్వరికి తెలియకుండా, రహస్యంగా, మిక్కిలి పదిలంగా దాచిపెట్టుకోవటానికి వీలైన ధనములాంటిది. సమస్త భోగభాగ్యములు, కీర్తి ప్రతిష్ఠలను సుఖసౌకర్యములను కలుగజేయునదియూ విద్యయే. విద్యయే గురువులకు కూడా గురువు. దేశాంతరమునకు పోయినప్పుడు, బంధువువలె వెన్నంటి మిక్కిలి ఉపయోగపడునదియూ విద్యయే. విద్య పరమాత్మవలె మోక్షమును, ఇష్టదైవమువలె ఐహికాముష్మిక ఫలములను కూడా యిచ్చును. రాజులచేత పూజింపబడేటట్లు చేసేది కూడా విద్యే. సభలోని వారందరిని వశపరచుకోగల శక్తి విద్యలోనే ఉన్నది. రాజసభలయందు సన్మానాలను లభింపజేసేది కూడా విద్యే. ఈ లోకమున సుఖశాంతులతో సౌఖ్యవంతంగా జీవితమును గడుపుటకు మంచిగా ఉపకరించేది కూడా విద్యే. విద్య కన్నా అధికమైన ధనం మరొకటి ఈ లోకంలో ఏదీ లేదు. అట్టి ఉత్తమోత్తమమైన, పరమోత్కృష్టమైన, వివేకవిజ్ఞానాదులను, గౌరవప్రతిష్ఠలను, స్వాగత సన్మానాలను సంపాదించి పెట్టేటటువంటి విద్యను అభ్యసించడం ప్రతి వాని కర్తవ్యం, ధర్మం. అట్టి విద్య నభ్యసించనివాడు పశువుతో సమానము. అంతేకాదు అటువంటి సోమరిని అవివేకుడని, కర్తవ్యా కర్తవ్యముల నెరుగని వివేక శూన్యుడని, సర్వత్రా భావిస్తారు. కనుక అన్నిటికన్నా మిన్నయైన, సర్వసమ్మతమైన విద్యను శ్రద్ధగా, మీరందరూ అభ్యసించి, వివేక విజ్ఞానాదులను సముపార్జించుతారని ఆశిస్తున్నాను.

ఈ క్రింది ప్రశ్నలకు ఆలోచించి సరియైన సమాధానాలు వ్రాస్తారు గదూ!

1. మన రాష్ట్రంలో కృష్ణానదీతీరంలో వున్న పుణ్యక్షేత్రములు ఏవి?
2. తిరుమల తిరుపతి ఏ జిల్లాలో ఉన్నది?
3. మన తెలుగుదేశమునకు '**త్రిలింగదేశం**' అని పేరు ఎలా వచ్చింది?
4. బౌద్ధమతమును స్థాపించినదెవరు? అతని అసలు పేరు ఏమిటి?
5. శిక్కుమతమును స్థాపించినదెవరు?
6. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత రాష్ట్రపతి పదవిని అలంకరించిన వారెవరు?
7. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత ప్రధానమంత్రి పదవిని అలంకరించిన వారెవరు?
8. శివాజి గురువు పేరు? ఆయన ఆరాధ్య దేవత పేరు?

9. కాకతీయ సామ్రాజ్య ముఖ్య పట్టణం ఏది?

10. హైద్రాబాద్‌కు మరొక పేరు ఏమిటి?

ఉత్తరాలు వ్రాసేటప్పుడు మంచిగా, అర్థం అయ్యేట్లుగా మంచి దస్తూరితో వ్రాయాలి. ఇక ఉంటా.....

ఇట్లు

'మీ నాన్న'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 20-11-1976

చిరంజీవులకు - ఆశీస్సులు

విద్య యొక్క ప్రాముఖ్యతను గురించి, గొప్పతనాన్ని గురించి ఇప్పటికి మూడు లేఖలు వ్రాసాను. విద్యయొక్క ఔన్నత్యాన్ని గురించి మరికొన్ని ముఖ్య విషయాలను ఈ ఉత్తరంలో వ్రాస్తున్నాను.

**"రూపయౌవన సంపన్నా, విశుద్ధ కుల సంభవా:**

**విద్యాహీనా న శోభన్తే, నిర్గంధా ఇవ కింశుకా:**

అనగా "విద్యలేనివారు, మంచి రూపము, యౌవనము కలిగియున్నప్పటికినీ, గొప్ప వంశమునందు జన్మించినప్పటికినీ, వాసన లేని మోదుగుపూవువలె శోభించరు" అని అర్థము.

హితోపదేశమునందు ఈ నీతిశ్లోకము చక్కగా ఉపమాన సహితంగా వివరించబడింది. మోదుగుపూవు చూడటానికి చక్కగా అందంగా వుంటుంది. కాని సువాసన ఏమాత్రం ఉండదు. వాసన లేని పూవును సహజంగా ఎవ్వరూ కోరరు. దండలలో గుచ్చరు. స్త్రీలు పెట్టుకోనరు, దాని బ్రతుకు అడవిన గాచిన వెన్నెలలాంటిదే అవుతుంది. అదేవిధంగా మేడిపండు కూడా పైకి చూడటానికి నిగనిగలాడుతుంటుంది. పొట్ట తెరచి చూస్తే పురుగులుంటాయి. అటువంటి పండును ఎవ్వరూ తినరు గదా! పొట్ట కోస్తే అక్షరం కూడా కనిపించదంటారు కొంత మంది మొద్దులను చూచి, అటువంటివారిని ఎవరూ గౌరవించరు. కొంత మంది పైకి చూడటానికి మంచి అందంగా కనిపిస్తారు. రూపం ఆకర్షణీయంగా ఉంటుంది. దానికితోడు మంచి యౌవనం అనగా మిసమిసలాడే వయస్సు కూడా వుంటే అతనికి పట్టపగ్గాలే వుండవు. ఈ రెంటికి తోడు ఉన్నతమైన పేరుప్రతిష్టలు

గలిగిన వంశంలో జన్మించుతే ఇంకా వేరే చెప్పనవసరంలేదు. వీటికి తోడు సిరిసంపదలు గల వంశమున జన్మించిన భాగ్యశాలి అయితే అతను ఎవరినీ లెక్క చేయుడు. ఇన్ని విశేషమైన లక్షణములు ఒకే వ్యక్తిలో మూర్తీభవించినప్పటికీ, అసలు కావలసిన విద్య అతనిలో లేకపోతే అతను సమాజంలో ఏమాత్రం శోభించడు, రాణించడు, ప్రకాశించడు, చెలామణి కాడు. ఇన్ని విశేష లక్షణాలున్నప్పటికీ పొట్టకోస్తే అక్షరం లేకపోతే ఏం ప్రయోజనం? మేడిపండు ఏవిధంగా విసిరి పారేస్తారో, మోదుగపూవును ఏ విధముగా దరికి చేరనివ్వరో, మంచి రూపము, యౌవనము ఉండి ఉన్నతమైన గొప్పకులమునందు జన్మించినప్పటికినీ, 'డొక్కశుద్ధి' లేనివానిని ఎవరూ దరికి చేరనివ్వరు. గౌరవించరు. ఈ శ్లోకంద్వారా మనం నేర్చుకోవలసిన నీతి ఒక్కటే. మానవునికి ముఖ్యం పై పై మెరుగులు మాత్రమే కావు. బాహ్యసౌందర్యమే గాక, అంత:సౌందర్యమగు మంచి విద్య కూడా వున్నవానినే పదిమంది ప్రేమిస్తారు, గౌరవిస్తారు అనే విషయం విస్మరించరానిది. విద్య లేనివారు ఎందుకూ కొఱగారు. ఈ నగ్నసత్యాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించాలి.

రాజుకన్నా విద్వాంసుడే ఎన్నో రెట్లు మిన్నయని సమస్త దేశములలో పూజించబడేవాడు ఒక్క విద్వాంసుడే నని ఈ క్రింది శ్లోకం తేటతెల్లం జేస్తున్నది.

"విద్వత్వం చ నృపత్వం చ, నైవతుల్యం కదాచన
స్వదేశే పూజ్యతే రాజా, విద్యావన్ సర్వత్ర పూజ్యతే"

అనగా "పాండిత్యమును, రాచరికమును ఎన్నడునూ సమానమైనవి కానే కావు. రాజు తన దేశమునందే పూజించబడుతున్నాడు. విద్వాంసుడు మాత్రం అన్ని దేశములయందునూ పూజింపబడుతున్నాడు అని అర్థము. దీనినిబట్టి అధికారదండం చేబూనిన రాజుకన్నా, పాండిత్యంగల విద్వాంసునికే సమాజం ఎంతో విలువ యిస్తుందని తేటతెల్లమవుతున్నది. పండితుడనగా ఇక్కడ కేవలం కావ్య, శాస్త్ర, సాహిత్య పరిజ్ఞానము కలవాడని మాత్రమే చెప్పకుంటే సరిపోదు. పారమార్థిక అనుభవజ్ఞానం, లౌకికజ్ఞానము, ఆత్మజ్ఞానము కలవాడని గమనించాలి. సామాన్యముగా పండితుడనగానే పాండిత్యమునందు మంచి ప్రవేశము కలవాడని, సాహిత్యమునందు మంచి కౌశలము కలవాడని, శాస్త్రవిషయములయందు మంచి పరిజ్ఞానం గలవాడని, సహజంగా ప్రజలు భావిస్తుంటారు. కాని భగవద్గీతలో **"పండితుడనగా ఎవరి కొఱకు దేనికొఱకు దు:ఖింపనివాడని, సమస్త చరాచర ప్రాణికోటియందు సమభావము గలవాడని, పరోపకారమే పరమావధిగా భావించి, మానవసేవే - మాధవసేవ యని తలంచి, నిరంతరమూ సమాజసేవలో నిమగ్నుడై, నిస్వార్థబుద్ధితో వ్యవహరించే మహాత్ముడు"** అని చెప్పబడింది. కనుక మనం యిక్కడ

మాత్రం కావ్య శాస్త్ర సాహిత్య పరిజ్ఞానంతోపాటు, భగవద్గీతలో చెప్పబడిన మహాత్ముని లక్షణములను కూడా అలవరచుకొని సమాజాభివృద్ధికి తోడ్పడటం మన కర్తవ్యం. అటువంటి పరమోత్కృష్టమైన శక్తిని సముపార్జించిన విద్వాంసుడు, లేక పండితుడు, రాజుకన్నా.

గొప్పవాడని భావించడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. అటువంటి మహాశక్తి సంపన్నుడైన పండితుడు, అన్ని దేశములలో సహజంగా గౌరవించబడి, పూజింపబడుతాడంటే ఏమాత్రం ఆశ్చర్యపడనవసరం లేదు. కనుక అట్టి ఉత్తమ స్థితికి చేరుకోవటానికి ప్రతి విద్యార్థి, విద్యార్థినీ కృషి చేయాలి. ఇదే నా ఆశయం, ఇక ఉంటా.......

ఇట్లు

"మీ నాన్న"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

దివి.23-11-1976

ప్రియమైన జయ,

నేను కులాసా. నీవు మరియు మన పిల్లలు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. పిలకా గణపతి కూడా వ్రాసినందుకు చాలా సంతోషం, పిల్లల రైటింగ్ విషయంలో శ్రద్ధ వహించాలి. ఇప్పుడు మంచిగా వ్రాయటం రాకపోతే ముందు ముందు అసలేరాదు. నా ఉత్తరాలలోని భాష విషయం వ్రాశావు. స్థాయి తగ్గాలంటే కొంచెం యిబ్బందిగానే ఉన్నది. ఇది భవిష్యత్తువారికి ఉపయోగపడే విలువైన ఉత్తరాలని నా అభిప్రాయం. కనుక పిల్లలకు విడమరచి చెప్పాలి. పిల్లలకే కాదు చాలా మంది ఉపాధ్యాయులకు కూడా నేను వ్రాసే విషయాలు తెలియవు. వాళ్ళు కూడా తెలుసుకోవలసిన విషయాలున్నాయని నా అభిప్రాయం. విషయం యొక్క ప్రాముఖ్యతను బట్టి భాష ఉండాలి. పిల్లలుకూడా అర్థం చేసుకోవాలనేఉద్దేశ్యంతో సరళంగానే వ్రాస్తున్నాను. వాళ్లు చదివేది చిన్నతరగతులే గదా! అర్థం కావటం కొంచం కష్టమే. కనుక పెద్దలే పిల్లలకు వివరించాలి. అనేక పుస్తకములలోని నీతి శ్లోకములను తీసుకొని ఆలోచించి వ్రాస్తున్నాను శ్లోకము, అర్థము పుస్తకము లోనివి. మిగతా వ్యాఖ్య అంతా నాస్వంతం. భగవదనుగ్రహం వలన అను కోకుండా ఊహించనటువంటి విశ్రాంతి లభించింది. ఇటువంటి కారాగారప్రాప్తి బాధాకరమే అయినప్పటికీ, దానిని సద్వినియోగం చేసుకోవటం విజ్ఞత లక్షణం కదా!

అందువలన ఈ కాలమును వృధాపరచక సద్వినియోగం చేయటానికి కృషి చేస్తున్నాను. కలం దానంతట అదే సాగిపోతున్నది. ఒక భావం తరువాత మరొక నూతన భావం కలుగుతున్నది వ్రాస్తున్నాను. భావం కలిపించేది, వ్రాయించేది ఆ పరమేశ్వరుడే నని నా నమ్మకం. మనం నిమిత్తమాత్రులమేనని నా విశ్వాసం. ఇక వుంటా.....

చిరంజీవులకు - ఆశీస్సులు

మీరందరూ నేను వ్రాసిన ప్రశ్నలకు సమాధానాలు వ్రాసినందుకు చాలా సంతోషం. విద్య యొక్క విశిష్ఠతను గురించి మరికొన్ని విషయాలు వ్రాస్తున్నాను. సమస్త ద్రవ్యములలో విద్యయే ఉత్తమ ద్రవ్యమని ఈ క్రింది **"హితోపదేశం"** లోని శ్లోకము చాటుచున్నది.

"సర్వ ద్రవ్యేషు విద్యైవ, ద్రవ్యమాహురనుత్తమమ్
ఆ హార్యత్వా దనర్ఘ త్వా, దక్షయ త్వాచ్ఛ సర్వదా"

అనగా "ఎల్లప్పుడూ దొంగిలింప శక్యము కాని దగుటవలననూ, నాశనము కాని దగుటవలననూ, వెలకట్ట శక్యముకాని దగుటవలననూ, అన్ని ద్రవ్యముల యందు విద్యయే గొప్పదైన ద్రవ్యముగా చెప్పుదురు" అని అర్థము.

భౌతికమైన నగలు, మేడలు, పొలాలు మొదలగు సిరిసంపదల కంటే విద్యాధనమే ఎన్నోరెట్లు మేలైనది. ఎందుకనగా విద్యాధనమును దొంగలు దొంగిలించలేరు. పనిగట్టుకొని నాశనం చేయటానికి వీలుకాదు. ఈ విద్యా ధనమునకు విలువ ఎవ్వరూ కట్టలేరు. అటువంటి వెలలేని అమూల్యమైన ఈ విద్యాధనమును పొందినవారు నిజంగా ఎంతో అదృష్టవంతులు అట్టివారు పూర్వజన్మలో పుణ్యం చేసుకొని ఉంటారు.

**"అర్థానా మార్జనే దుఃఖమ్"** ధనము సంపాదించుటయందు దుఃఖము కలుగుచున్నది. ధనము విపరీతంగా అనగా అవసరానికి మించి సంపాదించే వానికి సుఖము వుండదు, సౌఖ్యమూ వుండదు. మనశ్శాంతి అంతకన్నా వుండదు. తాను అనుభవించలేడు. త ఇతరులకు చూస్తూ, చూస్తూ ఇవ్వలేడు. అనుభవిస్తే అయిపోతుందేమోనని భయం, దాచుకుంటే దొంగలు దోచుకొంటారేమోనని మనోవ్యథ. అటువంటివారికి నిద్దరేపట్టదు. ఇనుపపెట్టెలో పెట్టి, గట్టితాళం వేసి వీలుంటే విద్యుచ్ఛక్తి కూడా దానికి అమర్చి, భవనం మధ్యలో ఆ పెట్టెను పెట్టి తలుపులు బిగించి, కాపలాకు **"ఘూర్ఖా"** ను పెట్టి కూడా ప్రశాంతంగా నిద్రపోడ్రు యజమాని. ఇంత కట్టుదిట్టంచేసినా పోయేకాలం దాపురిస్తే దానిని ఎవ్వరూ ఆపలేరు. ఆ

ధనము ఎవరికైనా అప్పుగా యిస్తే తిరిగి వచ్చిందాకా నమ్మకం లేదు. నగలు చేయించుకుంటే దొంగలు దోచుకుంటారేమోననేభయం అవి కూడా కొంతకాలానికి అరిగి విరిగి పోతాయి. ఆ డబ్బు పెట్టి మేడలు, భవనాలు నిర్మిస్తే అవికూడా శాశ్వతం కావు. అద్దెకు యిస్తే వాటిని సక్రమంగా చూడరేమోననే భయం. గాలివాన వస్తే అసలు కథేలేదు అన్నట్టుగా భూకంపాలు, తుఫానులు వస్తే నేలమట్టమవుతాయి. పొలాల మీద పెట్టుబడిపెడితే పంట ఇంటికి వచ్చిందాకా నమ్మకం లేదు. దొంగలు దొంగిలించవచ్చు. అతివృష్టి అనావృష్టులకు గురియై పంటలు సర్వనాశనం కావచ్చు. కనుక మానవుడు కక్కుర్తిపడి, అక్రమంగా, న్యాయమైన అవసరాలకు మించి సంపాదించిన భౌతిక సంపద శాశ్వతంగా మనజాలదనే విషయం జగద్విదితమే. కనుక ఈ సమస్త ద్రవ్యములలో కెల్లా ఒక్క విద్యా ద్రవ్యమే శాశ్వతమైనది. దొంగలకు అసాధ్యమైనటువంటి, నశింపులేనటువంటి, వెలలేని అమూల్యమైన ఈ విద్యాధనమును సంపాదించినవారికి మాత్రమే మనశ్శాంతి ఉంటుంది. అటువంటి వారికి ఎట్టి భయమూ ఉండదు. అట్టివారి జీవితమే సార్థకమవుతుంది. కనుక అటువంటి ఉత్తమమైన విద్యాధనమును ప్రతి ఒక్కరూ తన జీవితకాలంలో సంపాదించి తీరాలి ముఖ్యంగా బాల్యదశయందే ఆర్జించాలి. ఇదే సరియైన తరుణం. ఈ సదవకాశమును యిప్పుడు జారవిడుచుకుంటే పెద్దవాళ్ళయిన తరువాత బాధపడవలసివస్తుంది. కనుక శ్రద్ధగా, ఓపికగా, పట్టుదలతో విద్యను మీరందరూ నేర్చుకోవాలని నా ఆకాంక్ష, నా ఆదేశం ఇక వుంటా..

ఇట్లు

"మీ నాన్న"

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 1-12-1976.

చిరంజీవులకు ఆశీస్సులు,

మీరందరూ వ్రాసిన ఉత్తరాలు అందినాయి. చాలా సంతోషం. సమస్త ద్రవ్యములలో విద్యయే ఉత్తమ ద్రవ్యమని లోగడ లేఖలలో వివరించాను. అనుభవించడం వల్ల, ఇతర భౌతిక ద్రవ్యములలాగే విద్యాధనం ఏమాత్రం తరిగిపోదని నిరూపించదలచి, ఇదే భావమును వివరించేటటువంటి ఈ క్రింది శ్లోకముతో ఈ ఉత్తరాన్ని ప్రారంభిస్తున్నాను.

"నభో గహార్యా న బన్ధుహార్యా, న భర్తృహార్యా నచరాజ హార్యా
స్వదేశమిత్రం పరదేశబన్ధు:, విద్యా సుధాం యేపురుషా: పిబన్తి"

అనగా "విద్యాధనము అనుభవించుట చేత తరగదు. బంధువులచేతనూ, అన్నదమ్ముల చేతనూ, రాజుల చేతనూ అపహరింపబడదు. స్వదేశమునందు మిత్రుని వంటిది. పరదేశమునందు బంధువు వంటిది. అట్టి విద్యయను అమృతమును ఏ పురుషులు త్రాగుదురో గదా! " అని అర్థము.

విద్యాధనము అనుభవించుట వలన అది ఏమాత్రం తరగదు, అయిపోదు, నశించిపోదు. దానిని దానం చేయటం వలన, అనగా మరొకరికి యిచ్చినందు వల్ల, నేర్పినందువల్ల అది ఏ మాత్రం ఖర్చు కాదు, వృధాకాదు. ఎవరైనా సరే తనవిద్యను, సంపాదించిన విద్యాధనమును, పది మందికి నేర్పడం వల్ల, యివ్వడం వల్ల, ప్రావీణ్యత, అనుభవము పెరుగుతుందే కాని ఏమాత్రం నష్టపోరు. పై పెచ్చు ప్రసిద్ధిచెందిన విద్యావేత్తలుగా, విద్వాంసులుగా పేరు ప్రఖ్యాతులు అందుకుంటారు. దొంగల చేత సహితం దొంగిలింప శక్యము కానటువంటి ఈ విద్యా ధనమును బంధువులుగాని, అన్నదమ్ములుగాని చిట్టచివరికి రాజులుగాని ఏమాత్రం అపహరించలేరు. కాజేయలేరు. భౌతికమైన స్థిరాస్తులను, ఏదో ఒకమిషతో, మాయోపాయంతో, కొంతమంది స్వార్థ పరులైన బంధువులుగాని, సోదరులుగాని ఒకవేళ కాజేస్తే కాజేయవచ్చును. చేసిన మేలును మఱచిన కృతఘ్నులు, నమ్మించి మోసం చేసి ఒకవేళ కబళించ వచ్చును. ప్రభుత్వం విపరీతమైన పన్నులను విధించినగాని, గరిష్ట పరిమితి చట్టముల ద్వారాగాని, మరియు అనేక నియమ నిబంధనలద్వారా గాని, ఆంక్షల ద్వారాగాని, ఏ వ్యక్తి ఆస్థినయినా స్వాధీనం చేసుకోవచ్చును గాని, విద్యాధనమును మాత్రం ఎవ్వరూ కాజేయలేరు. నీరుచిమ్మిన కొద్దీ జలము ఏవిధంగా ఊరుతుంటుందో, అదేవిధంగా పదిమందికి నేర్పిన కొద్దీ ఈ విద్య దిన దిన ప్రవర్ధమానంగా పెరిగి అభివృద్ధి జెందుతుంది. అంతేకాదు ఈ విద్య స్వదేశమునందుమిత్రునిగా, ప్రాణ స్నేహితునిలా ఉపయోగపడుతుంది, ఆదుకొంటుంది.

అసలు మిత్రుడంటే ఎవరు? అతని లక్షణములు ఏవిధంగా ఉంటాయి? కొంచం వివరిస్తాను. అభివృద్ధిలోనున్నప్పుడు సకల సంపదలతో విలసిల్లుతున్నప్పుడు, భోగభాగ్యములతో తులతూగుతున్నప్పుడు, ప్రతి ఒక్కరూ, స్వలాభం కోసం, స్వప్రయోజనం కోసం మిత్రులుగా వ్యవహరిస్తుంటారు. అంతేకాదు ఏమాత్రం విడవ కుండా వెంటబడి తిరుగుతూవుంటారు. ఇంద్రుడని, చంద్రుడని పొగడుతూంటారు.

ఒక వేళ దురదృష్టవశాత్తు, ఆపదలకు లోనై, భౌతిక సంపదలు కోల్పోయినప్పుడుగాని, ఊహించనటువంటి ప్రమాదాలు, కష్టాలు సంభవించినప్పుడు గాని -- అప్పటి వరకు అమిత ప్రాణస్నేహితులుగా వుంటూ, వెంట తిరిగిన వారిలో చాలామంది దూరమైపోతారు. కంటికి కనపడకుండా మటుమాయమై పోతారు. నిజమైన మిత్రులు, ఆప్తులు, ప్రాణస్నేహితులు తప్ప మిగతా వారందరూ అదృశ్యమవుతారు. కష్టకాలంలో కూడా విడవకుండా ఛాయవలె ఎవరు వెంట వుంటారో వారే నిజమైన మిత్రులు. మనకు సంభవించిన సుఖ దు:ఖములలో సమానంగా పాలు పంచుకుంటూ నిరంతరం మనల్ని వదలకుండా, మన వెంబడి ఎవరు ఉంటారో వారే నిజమైన స్నేహితులు. ఇదే భావమును చక్కగా ఈ క్రింది సుభాషితములలోని పద్యము వివరిస్తున్నది.

**"అఘము వలన మఱల్చు హితార్థకలితు**
**జేయు గోప్యంబు దాచు బోషించు గుణము**
**విడువడా పన్ను లేవడి వేళనిచ్చు**
**మిత్రుడీ లక్షణంబుల మెలగుచుండు"**

అనగా "పాపపు పనుల నుండి మఱల్చుట, మంచి పనులు చేయుటకు పురుగొల్పుట, రహస్యమును దాచుట, మంచి గుణములనే వెల్లడి చేయుట, ఆపద కలిగినప్పుడు విడిచిపోకుండుట, లేనప్పుడు అవసరమైన దానిని యిచ్చుట మొదలైనవి నిజమైన మిత్రుడి లక్షణములు" అని అర్థము. **"మాతామిత్రం పితాచేతి స్వభావాత్రితయం హితమ్"** అనగా **'తల్లిదండ్రుల తరువాత సహజంగా ప్రేమించుచూ మేలు కోరువాడు మిత్రుడే'** అనే ఆర్యోక్తి కూడా కలదు. అటువంటి ప్రాణ స్నేహితుడగు మిత్రుని కలిగి వుండటం అందరికీ లభించదు. పూర్వ జన్మ సుకృతం వలననే అటువంటి మిత్రులు లభిస్తారు. ఒక వేళ అటువంటి ప్రాణ మిత్రులు లేనప్పటికీ మంచి విద్య గనుక వుంటే మిత్రులు లేని లోటు పూరించబడుతుంది. ఎటువంటి విపత్కర పరిస్థితులలోనైనా సరే, ఈ విద్యాధనంతో సునాయాసంగా ఎంతటి కష్టాలనైనా దాటివేయవచ్చును. అందువలననే విద్యను కూడా గుణవంతుడైన మిత్రునితో పోల్చారు పెద్దలు. ఇకపోతే విద్యను పరదేశమునందు బంధువునిగా కూడా వర్ణించారు పెద్దలు, బంధువులు అంటే కేవలం రక్తసంబంధీకులు, చుట్టములు మాత్రమే కాదని లోగడ వివరించాను. అసలు నిజమైన బంధువు లక్షణాలు ఏవిధంగా వుంటాయో తెలుసుకోవటం ఎంతైనా అవసరం. ఒక వ్యక్తి

ధనమును బాగా సంపాదించి, మంచి స్థితిలో గనుక వుంటే అతని చుట్టూ చాలా మంది చేరుతుంటారు. ఎక్కడివారో వచ్చి బంధుత్వమును కలుపుకొని ఇంట్లో తిష్ఠ వేస్తారు రోజుల తరబడి. ఈ క్రింది సుమతీ శతకం పద్యం చక్కగా వివరిస్తున్నది.

**"ఎప్పుడు సంపద కలిగిన**
**నప్పుడు బంధువులు వత్తురది యెట్లన్నన్**
**దెప్పలుగ చెఱువు నిండిన**
**కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ".**

అనగా ఎప్పుడు మానవునికి సిరి సంపదలుకల్గునో, అప్పుడు వాని ఇంటికి ఎక్కడలేని బంధువులు పిలవకుండానే వచ్చెదరు. అది ఎట్లనగా చెఱువు సమృద్ధిగా నీటితో నిండియున్న తరుణంలో కప్పలు అనేకం చేరుతాయి.

అప్పటి వరకు బెక బెకలాడుతూ గందరగోళం చేసే కప్పలు, చెఱువు ఎండి పోయేటప్పటికి ఎక్కడా కనిపించవు. ఎక్కడికో వెళ్లి పోతాయి. అదే విధంగా సంపదలు తరగి, కరగిపోయినప్పుడు, అప్పటి వరకూ ఇంట్లో వుండి బాగా మెక్కిన బంధువులందరూ మటుమాయమై పోతారు. ఏదైనా సహాయం చేయవలసి వస్తుందేమోనని భయంతో కనిపించనయినా కనిపించరు. సహాయం చేయకపోగా అవహేళన కూడా చేస్తారు. కనీసం సానుభూతిని కూడా ప్రకటించరు. భౌతిక సంపదలను చూచి మోహపడకుండా, వ్యక్తి యొక్క మంచితనమును, మనసును గ్రహించినవారు మాత్రమే, సంపదలు పోయిన తరుణంలో కూడా వదిలిపెట్టి పారిపోరు. అట్టివారిని మాత్రమే నిజమైన బంధువులని చెప్పకుంటే బాగుంటుంది. మిగతావారందరూ విశ్వాస ఘాతకులే. ఒక్క సుఖసమయంలోనే కాకుండా, కష్టకాలంలో కూడా విడనాడనివారే నిజమైన బంధువులు. రాజాధిరాజై నప్పటికినీ, సాక్షాత్ భగవత్ స్వరూపుడైనప్పటికినీ, శ్రీకృష్ణపరమాత్మ బీదవాడైన కుచేలుని మరువలేదు. విదురుని విస్మరించలేదు. కుచేలుడు పెట్టిన అటుకులనే ఆనందంతో ఆరగించాడు. అదే నిజమైన మిత్రత్వానికి నిదర్శనం. రాయబారనికి వెళ్లిన శ్రీకృష్ణుడు దుర్యోధనుడు యివ్వబూనిన పంచభక్ష్య పరమాన్నములను స్వీకరించక, సామాన్యుడైన విదురుని ఇంటనే భుజించాడు. మనసారా ప్రేమిస్తున్న ఆత్మీయుడైన విదురుడినే శ్రీకృష్ణుడు గౌరవించాడుగాని సంపదలను, అధికారమును కాదనే విషయము యిక్కడ మరువరాదు. అటువంటి ఉన్నతములైన భావాలు కలవారినే నిజమైన బంధువులు అంటే బాగుంటుంది. విదేశాలకు వెళ్లినప్పుడు అటువంటి మంచి బంధువులు లభించటం కష్టం. అయినప్పటికినీ 'విద్య' అనే ద్రవ్యము గనుక మనవద్ద వుండివుంటే ఆ బంధువులు లేని లోటును పూరిస్తుంది.

మంచి విద్య మంచి బంధువునితో సమానము. అందువల్లనే యిక్కడ విద్యను కూడా ఆత్మీయుడైన మంచి బంధువునితో పోల్చారు పెద్దలు. అట్టి ఉత్తమోత్తమమైన, పవిత్రమైన, అమూల్యమైన విద్య యను **'అమృతమును'** ఎవరు త్రాగుదురో అనగా ఎవరు అట్టి విద్యను శ్రద్ధగా అభ్యసించుదురో, వారు వాల్మీకి, వ్యాస, కాళిదాసుల వలె శాశ్వతకీర్తి వంతులగుదురు. అట్టి అదృష్టవంతులు ప్రపంచంలో ఏమూలకు వెళ్లినా గౌరవించబడుతారు. పూజింపబడుతారు. అట్టి మహనీయుల చరిత్ర సువర్ణాక్షరములతో, చరిత్రలో లిఖించబడుతుంది. వారి భౌతికమైన దేహములు అంతరించినప్పటికి, వారి కీర్తి ప్రతిష్టలు మాత్రం చిరస్థాయిగా వెలుగొందుతునే వుంటాయి. కనుక మీరందరూ విద్యయను అమృతమును త్రాగి ఆదర్శవంతులైన విద్యావేత్తలుగా తయారుకావాలని నా ఆశయం, ఆకాంక్ష, ఇక ఉంటా....

ఇట్లు,

'మీ నాన్న'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 9-12-1976.

చిరంజీవులకు ఆశీస్సులు.

మీరందరూ శ్రద్ధగా చదువుతున్నారని ఆశిస్తున్నాను. లోగడ ఉత్తరములలో విద్య యొక్క ఔన్నత్యాన్ని గురించి, అవశ్యకతను గురించి, ప్రాముఖ్యతను గురించి కొన్ని విషయాలను వ్రాసియున్నాను. ఈ ఉత్తరములోను మరియు రానున్న ఉత్తరములలోను అసలు విద్య అంటే ఏమిటి? ఎటువంటి విద్యను అభ్యసించాలి? విద్యాప్రమాణాలు ఏవిధంగా ఉండాలి? ఎటువంటి విద్య మానవా భ్యున్నతికి తోడ్పడుతుంది? అసలు జ్ఞానం ఎటువంటి విద్యలవల్ల కలుగుతుంది? ప్రస్తుత విద్యావిధానం వలన ఏమైనా ప్రయోజనం వున్నదా? అనే విషయాలమీద కొన్ని అభిప్రాయములను వ్రాయదలిచాను. మంచిగా అవగాహన చేసుకొని, ఆచరణలో పెట్టి అభివృద్ధిలోనికి వస్తారని విశ్వసిస్తున్నాను.

నేడు మన సమాజంలో చదువుకోవడం ఉద్యోగం కోసమేనని, ధన సంపాదనకేననే అభిప్రాయం చాలామందిలో వున్నది. ఇది నిజంగా దురదృష్టకరం. ఈ అభిప్రాయం ముఖ్యంగా ఆంగ్లేయుల పరిపాలన కాలం నుండి మనకు సంక్రమించింది. ఈ భావాన్ని పనిగట్టుకొని మన ప్రజలలో ఆంగ్లేయులే కలుగజేసారు. **"మెకాలే"** మన దేశంలో ఇంగ్లీషును ప్రవేశపెట్టింది కూడా **"గుమాస్తాలు"**గా

తయారుచేయడానికే. ఆంగ్లేయులు తమ విద్యావిధానం ద్వారా మన ప్రాచీన భారతీయ సంస్కృతిని విజ్ఞానమును, ఉజ్వల చరిత్రను తారుమారు చేశారు. భారతీయులు అనాగరికులని, అటవికులని పాఠ్యపుస్తకములలోవ్రాసి మనచేతనే చదివించారు. భారతీయులు వట్టి చేతకాని దద్దమ్మలని ప్రచారం చేశారు. కొంతమంది స్వార్థపరులైన భారతీయులు తమ స్వలాభంకోసం, బ్రిటీషువారి అండన జేరి ఈ దుష్టయత్నానికి చేయూతనిచ్చారు. అవాస్తవికమైన చరిత్రను సృష్టించి పాఠ్యపుస్తకములలో యిరికించారు. అమాయక పసిహృదయాలలో విషబీజాలను నాటారు. నిర్మలమైన మనస్సులు కలుషితం చేశారు. భరించరాని భావదాస్యం మనలో కల్గింది. బ్రిటీష్‌వారు బోధించిందే వేదం, చెప్పిందే సత్యం, వ్రాసిందే వాస్తవం అనే అభిప్రాయం మన విద్యావంతులలో నాటుకొనిపోయింది. చాలామంది విద్యావంతులు సంపాదన వ్యామోహంలో పడి **"సేవకావృత్తి"** ని స్వీకరించారు. బ్రిటీషువారికి భృత్యులయ్యారు. ఏజంట్లుగా వ్యవహరించి, స్వాతంత్ర్య సమరంలో, నిస్వార్థబుద్ధితో పాల్గొని పోరాడుతున్న దేశభక్తులను అనేక యిబ్బందులకు గురిచేశారు. ఈ భావదాస్యం మనవారిలో కలగడానికి కారణం బ్రిటీష్‌వారు అనుసరించిన, ప్రవేశపెట్టిన విద్యా విధాన ఫలితమే. ఇప్పటికీ మనలో నుండి ఈ దాస్య భావాలు పైదొలగకపోవటం మిక్కిలి దురదృష్టకరం. ఇస్త్రీ బట్టలు నలగకుండా, చేతులకు మట్టికాకుండా హాయిగా ఫ్యానుక్రింద కూర్చొని, ఏ విధమైన ప్రయాసలేకుండా, సున్నితమైన నాజూకైన ఉద్యోగాలను చేస్తూ ధనం సంపాదించి, సుఖవంతమైన, విలాసవంతమైన జీవితాలను గడపాలనే అభిప్రాయం యిప్పటికీ మన విద్యావంతులలో (మనస్సులలో) పాతుకొనిపోవడం కడుశోచనీయం. విద్య యొక్క పరమార్థం మటుమాయమైంది. విజ్ఞాన సముపార్జనకు విద్యనభ్య సించాలనే అభిప్రాయం ఎక్కడా కనిపించటం లేదు. ఈ పరిస్థితి మారాలి. జీవితం యొక్క గమ్యం విజ్ఞానాన్ని సంపాదించడం. అంతటితోనే సంతృప్తి చెందరాదు. దానిని నిజజీవితంలో అనుభవంలోనికి తెచ్చి సర్వమానవ కళ్యాణం కోసం వినియోగించాలి. కాని స్వాతంత్ర్యం వచ్చి 29 సంవత్సరాలైనప్పటికీ ఈ భావం మన విద్యావంతులలో జనించకపోవడానికి కారణం ఏమిటి? స్వాతంత్ర్యానంతరం కూడా **'మెకాలే'** పెట్టిన విద్యా విధానాన్నే అనుసరించడం, అవసరమైన సమగ్రమైన మార్పులను చేయకపోవటం, శాస్త్రీయ పద్ధతులలో విద్యాబోధ జరుగకపోవడం, సాంకేతిక పరిజ్ఞానాన్ని అవసరమైన స్థాయిలో పెంపొందించకపోవడం, జీవితంలో తన కాళ్లమీద తను నిలబడే శక్తి నిచ్చే నిజమైన విద్యను గరపకపోవడం, వివేక, విజ్ఞానములను కలుగజేసేటటువంటి ఆధ్యాత్మిక విద్యను నేర్పకపోవడం, శక్తిని,

స్ఫూర్తిని, ధైర్యాన్ని, బలాన్ని యిచ్చేటటువంటి వాస్తవికమైన మన దేశ చరిత్రను యిప్పటికీ తిరిగి సమగ్రంగా వ్రాసి పిల్లలకు బోధించకపోవడం, జాతీయ విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టకపోవడం, వృత్తి విద్యలకు అవసరమైన ప్రాధాన్యత పాఠశాలలో యివ్వకపోవడం, నైతికవిలువలను పెంపొందించడానికి అవసరమైన తరగతులను నిర్వహించకపోవడం, సామాన్య మానవునికి ఉపయోగపడేవిధంగా విద్యావిధానము నకు సక్రమమైన రూపకల్పన చేయకపోవడంవల్లనే విద్యావంతులలో రావలసినంత మార్పు రాలేదు.

మనదేశంలో యిప్పటికీ **"విద్య"** అనేది యాంత్రికంగా బోధించబడుతుంది. అందులో ఏ మాత్రం చైతన్యంగాని, నైపుణ్యంగాని లేదు. ఈ ప్రస్తుత విద్యావిధానం తెలివితేటలను పెంపొందించడానికిగాని, వివేక విజ్ఞానములను కలుగచేయడానికి గాని ఏ మాత్రం ఉపయోగపడదు. ఉద్యోగం మీద ఆధారపడకుండా స్వశక్తితో జీవించడానికి అవసరమైన అనుభవపూర్వకమైన శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని ఏ మాత్రం యివ్వడంలేదు. బాలబాలికలలో నైతిక విలువలను (Moral values) పెంపొందించడానికి, అవసరమైన, ఆదర్శవంతమైన విద్యావిధానం యిప్పటికీ రూపొందకపోవడం కడు శోచనీయం. అందువల్లనే డిగ్రీలు పొందినవారుకూడా ఉద్యోగాల కోసమే అర్రులు చాస్తున్నారు. స్వశక్తితో సంపాదించడానికి ఏమాత్రం ఉత్సుకతను చూపించడంలేదు. ఒకవేళ ఎవరైనా స్వప్రేరణతో, ధైర్యముగా ముందుకు వస్తే అటువంటివారికి తగిన ప్రోత్సాహం, సహాయం లభించడంలేదు. అందువల్ల ప్రతి విద్యావంతుడు **"ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి"** లో తన పేరును నమోదు చేసుకొని, ప్రభుత్వ, ప్రయివేటు కార్యాలయముల చుట్టూ సంవత్సరాల తరబడి కాలికి బలపం కట్టుకొని తిరుగుతున్నాడు. కాని ప్రయోజనం శూన్యం, ఉద్యోగాలు లభ్యం కావడంలేదు. నేడు మన విద్యావంతులలో నిరాశ, నిస్పృహ తాండవిస్తున్నది. ఈ నిరుద్యోగసమస్య ప్రభుత్వానికి కూడా తీరని తలనొప్పిగా తయారైంది. ఇటువంటి దుస్థితి దాపురించడానికి మూలకారణం ముఖ్యంగా మనకున్న ప్రస్తుత లోపభూయిష్టమైన విద్యా వ్యవస్థ అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదేమో ననిపిస్తున్నది.

ఈ విద్యా వ్యవస్థలోని లోపాలను ప్రభుత్వం యిప్పుడిప్పుడే గమనిస్తున్నట్లు కన్పడుతున్నది. నవంబరు ఆఖరులో కేంద్ర విద్యాశాఖామంత్రి ప్రొఫెసర్ నూరుల్ హసన్ హైద్రాబాద్‌లో **"సామాజికమార్పుకు విద్య ఒక మార్గము"** అనే అంశంపై అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీలో ప్రసంగిస్తూ **"దేశంలో కొంతమంది ఉన్నతవర్గాలవారికి మాత్రమే ఉపయోగపడుతున్న విద్యావిధానంలో మార్పులు తీసుకొనివచ్చి, ప్రస్తుత పరిస్థితుల**

స్ఫూర్తిని, ధైర్యాన్ని, బలాన్ని యిచ్చేటటువంటి వాస్తవికమైన మన దేశ చరిత్రను యిప్పటికీ తిరిగి సమగ్రంగా వ్రాసి పిల్లలకు బోధించకపోవడం, జాతీయ విద్యా విధానాన్ని ప్రవేశ పెట్టకపోవడం, వృత్తి విద్యలకు అవసరమైన ప్రాధాన్యత పాఠశాలలో యివ్వకపోవడం, నైతికవిలువలను పెంపొందించడానికి అవసరమైన తరగతులను నిర్వహించకపోవడం, సామాన్య మానవునికి ఉపయోగపడేవిధంగా విద్యావిధానము నకు సక్రమమైన రూపకల్పన చేయకపోవడంవల్లనే విద్యావంతులలో రావలసినంత మార్పు రాలేదు.

మనదేశంలో యిప్పటికీ **"విద్య"** అనేది యాంత్రికంగా బోధించబడుతుంది. అందులో ఏ మాత్రం చైతన్యంగాని, నైపుణ్యంగాని లేదు. ఈ ప్రస్తుత విద్యావిధానం తెలివితేటలను పెంపొందించడానికిగాని, వివేక విజ్ఞానములను కలుగచేయడానికి గాని ఏ మాత్రం ఉపయోగపడదు. ఉద్యోగం మీద ఆధారపడకుండా స్వశక్తితో జీవించడానికి అవసరమైన అనుభవపూర్వకమైన శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని ఏ మాత్రం యివ్వడంలేదు. బాలబాలికలలో నైతిక విలువలను (Moral values) పెంపొందించడానికి, అవసరమైన, ఆదర్శవంతమైన విద్యావిధానం యిప్పటికీ రూపొందకపోవడం కడు శోచనీయం. అందువల్లనే డిగ్రీలు పొందినవారుకూడా ఉద్యోగాల కోసమే అర్రులు చాస్తున్నారు. స్వశక్తితో సంపాదించడానికి ఏమాత్రం ఉత్సుకతను చూపించడంలేదు. ఒకవేళ ఎవరైనా స్వప్రేరణతో, ధైర్యముగా ముందుకు వస్తే అటువంటివారికి తగిన ప్రోత్సాహం, సహాయం లభించడంలేదు. అందువల్ల ప్రతి విద్యావంతుడు **"ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజి"** లో తన పేరును నమోదు చేసుకొని, ప్రభుత్వ, ప్రయివేటు కార్యాలయముల చుట్టూ సంవత్సరాల తరబడి కాలికి బలపం కట్టుకొని తిరుగుతున్నాడు. కాని ప్రయోజనం శూన్యం, ఉద్యోగాలు లభ్యం కావడంలేదు. నేడు మన విద్యావంతులలో నిరాశ, నిస్పృహ తాండవిస్తున్నది. ఈ నిరుద్యోగసమస్య ప్రభుత్వానికి కూడా తీరని తలనొప్పిగా తయారైంది. ఇటువంటి దుస్థితి దాపురించడానికి మూలకారణం ముఖ్యంగా మనకున్న ప్రస్తుత లోపభూయిష్టమైన విద్యా వ్యవస్థ అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదేమో ననిపిస్తున్నది.

ఈ విద్యా వ్యవస్థలోని లోపాలను ప్రభుత్వం యిప్పుడిప్పుడే గమనిస్తున్నట్లు కన్పడుతున్నది. నవంబరు ఆఖరులో కేంద్ర విద్యాశాఖామంత్రి ప్రొఫెసర్ నూరుల్ హాసన్ హైద్రాబాద్‌లో **"సామాజికమార్పుకు విద్య ఒక మార్గము"** అనే అంశంపై అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజీలో ప్రసంగిస్తూ **"దేశంలో కొంతమంది ఉన్నతవర్గాలవారికి మాత్రమే ఉపయోగపడుతున్న విద్యావిధానంలో మార్పులు తీసుకొనివచ్చి, ప్రస్తుత పరిస్థితుల**

సామాన్య ప్రజలకు అందజేయాలి. అప్పుడే మానవుని బుద్ధి వికసిస్తుంది. గుమాస్తాగిరి మనస్తత్వం అంతరిస్తుంది. మానవుడు స్వశక్తి మీద సంపాదనకు పూనుకుంటాడు. మానవశక్తి దేశపురోభివృద్ధికి ఉపయోగపడుతుంది. నిరుద్యోగ పిశాచి కౌగిలి నుండి మన యువతీ, యువకులు బయటపడుతారు. ప్రభుత్వానికి కూడా కొంత భారం తగ్గుతుంది. దేశం సస్యశ్యామలమౌతుంది. విదేశాలమీద ఆధారపడవలసిన అగత్యముండదు. ప్రపంచంలో మన దేశం కూడా ఒక అగ్రరాజ్యంగా తయారవు తుంది. స్వరాజ్యం సురాజ్యంగా రూపొందుతుంది. గాంధీజీ కన్న కలలు సఫలీకృత మవుతాయి.

కనుక మీ అందరిలో కూడా విద్యార్జన ఉద్యోగం కోసం కాదు, విజ్ఞాన సముపార్జనకి అనే భావం కలగాలి. విద్యావంతులై, పెద్దవారైన తరువాత స్వశక్తితో దేశపురోభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషి చేయాలి. వ్యవసాయ, పారిశ్రామిక, వైజ్ఞానిక రంగములలో అత్యున్నతమైన అభివృద్ధిని సాధించేందుకు మీ శక్తిని, యుక్తిని, సమర్థతను, విజ్ఞానమును పూర్తిగా వినియోగించాలి. **"ప్రతి చేతికి పని కల్పించాలి, ప్రతి గృహం ఒక పరిశ్రమ కావాలి. ప్రతి గ్రామానికి విద్యుచ్ఛక్తి అందాలి, ప్రతి పొలానికి నీరు వెళ్ళాలి".** ఈ మహోన్నత ఆశయ సాధనకోసం అవిరామంగా కృషి చేయాలి, సాధించాలి. దేశాన్ని సస్యశ్యామలం చేయాలి. భావిభారత పౌరులైన మీ ధ్యేయం ఇదే..... అందరికీ ఆశీస్సులు.

ఇట్లు
"మీ నాన్న'

సెంట్రల్ జైలు', రాజమండ్రి
ది. 12, 14, 16, 20, 22 తేదీలు.

చిరంజీవులకు ఆశీస్సులు,

విద్య జ్ఞానాభివృద్ధికే గాని ఉద్యోగం చేయడానికి మాత్రమే కాదు. అనే విషయాన్ని గురించి లోగడ ఉత్తరములో వ్రాశాను. అసలు జ్ఞానం అంటే ఏమిటి? అనే ప్రశ్న మీ మనస్సులలో సహజంగా ఉద్భవించవచ్చును. ఈ ఉత్తరములో దీనిని గురించే వివరించదలిచాను. జ్ఞానమనగా ప్రకాశము, కాంతి, వెలుగు అని అర్థము చెప్పకుంటే బాగుంటుంది. మానవునికి జ్ఞానమే నిజమైన శక్తి. ఒక్కొక్క వస్తువునకు సంబంధించిన వానినెల్లను కనుగొనుటయే జ్ఞానము. వ్యక్తి సంబంధమును గుర్తించుటయే జ్ఞానము. మన మనస్సులలో ఉన్న పాతఅనుభవాలను, క్రొత్త

అనుభవాలను తీసుకొనివచ్చి కలుపుకొనుటయే జ్ఞానము. ఇట్టి జ్ఞానమును సంపాదించవలెననిన తీవ్రమైన కృషి మాత్రం అత్యవసరం. అసలు ప్రకాశం, కాంతి, వెలుగు మనిషిలో ఎలా వస్తుంది? వేద వేదాంగములు, ఉపనిషత్తులు, ఆధ్యాత్మిక శాస్త్రములు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, మహానుభావుల చరిత్రలు, భౌతిక విజ్ఞాన శాస్త్రములు, మానసిక శాస్త్రములు మొదలగు ఎన్నో ముఖ్యములగు గ్రంథములను వినుటవలన, పఠించుట వలన ఈ జ్ఞానము మనిషిలో కలుగుతుంది. శ్రుతి, శాస్త్రములే జ్ఞానము అని పెద్దలు చెబుతున్నారు. అట్టి జ్ఞానమే నిజమైన, వాస్తవికమైన విద్య. అందుకోసమనే జ్ఞానమనగా శాస్త్రజన్య జ్ఞానమన్నారు అనుభవజ్ఞులు. అనగా శాస్త్రములు చదివినందువల్ల వచ్చిన జ్ఞానమని అర్థము. ఇది ప్రత్యక్ష జ్ఞానం మాత్రం కాదు పరోక్షజ్ఞానమే.

**"జ్ఞానేన హీనా: పశుభిస్సమానా:"** జ్ఞానహీనులైనవారు పశువులతో సమానము . జ్ఞాన విజ్ఞానములతో సమానమైన వస్తువు ఈ ప్రపంచములో మరొకటి లేదు. మొట్టమొదట జ్ఞాన స్వరూపాన్ని వివరిస్తాను. దీని ఆవశ్యకతను గురించి భగవద్గీత లో **"నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే"** అని వున్నది. అనగా **"ఈ ప్రపంచమున జ్ఞానముతో సమానంగా పవిత్రమైనది లేనేలేదుకదా!"** అని అర్థము. ఈ ప్రపంచంలో ప్రతి వ్యక్తికి పవిత్రమైన వస్తువులెన్నో ఉన్నాయి. అతి ప్రియమైనవి కూడా వున్నాయి. వాటి అన్నిటికన్నా పరమపవిత్రమైనది, అతి ప్రియమైనది, మానవునికి వెలుగు ప్రసాదించునది ఒక్క జ్ఞానము మాత్రమే కనుక అట్టి పరమోత్కృష్టమైన జ్ఞానమును పుట్టిన ప్రతి వ్యక్తి సంపాదించి తీరవలెను. జ్ఞానమే జీవుల చరమ లక్ష్యము. అసలు ఈ జ్ఞానమనే తేజస్సు మనిషిలో ఎలా ప్రవేశిస్తుంది? గీతలో చక్కటి సమాధానం ఉన్నది. **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** శ్రద్ధగలవాడే జ్ఞానమును పొందగలుగుతాడు. ఏ కార్యమును సఫలీకృత మొనర్చవలెననిన **"శ్రద్ధ"** అత్యవసరం. ఏ విద్యార్థి అయినా సరే మంచి మార్కులతో పరీక్షలో ఉత్తీర్ణుడవ్వాలంటే 'శ్రద్ధ' ముఖ్యము. ఈ శ్రద్ధ వున్నప్పుడే సత్ఫలితాలు కలుగుతాయి. ఈ శ్రద్ధతో పాటు **"ఏకాగ్రత"** (Concentration) కూడా తప్పనిసరిగా వుండాలి. తన శక్తి, యుక్తుల నన్నింటిని ఒకచోట కేంద్రీకరించాలి. ఇంట్లో అమ్మ చేసిన పిండివంటలమీదకు గాని, బడిలోని ఆటలమీదకుగాని మనస్సును పోనివ్వరాదు. ఏ పని చేస్తుంటే, ఆ పని మీదనే తన యావత్ దృష్టిని కేంద్రీకరించి, శ్రద్ధతో, పట్టుదలతో వ్యవహరించిన యెడల, ఆ పని నిర్విఘ్నంగా విజయవంతమౌతుంది. మంచిఫలితాలు చేకూరుతాయి.

**"జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం"** అనగా శాస్త్రము నందు చెప్పబడిన దానిని తెలుసుకొనుము అని అర్థము. ఏ పని అయినాసరే చేయవలసివచ్చినప్పుడు, అది చేయదగినపనో, లేక చేయకూడనిపనో తేల్చుకొనవలెనని, అప్పుడు శాస్త్రమును ప్రమాణముగా తీసుకొనవలెను. ఆ శాస్త్రము ననుసరించి మనము చేయుపనులు మంచివో, చెడ్డవో నిర్ణయించుకొనవలెను. అటువంటి ఆలోచనాజ్ఞానము, శాస్త్రములు చదవటం వల్ల లభ్యమవుతుంది. అందువలన మన శాస్త్రములు మానవ పురోభివృద్ధికి ఏవిధంగా ఉపకరిస్తాయో పరిశీలిద్దాం. ఎటువంటి జ్ఞానమును ప్రబోధిస్తాయో కొంచెం ఆలోచిద్దాం. అట్టి శాస్త్రజన్యజ్ఞానం వల్ల విద్యార్థుల మనస్సు వికసిస్తుంది. బుద్ధి అభివృద్ధి చెందుతుంది.

**"మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ"** అని శాస్త్రములు చెబుతూ ఉన్నాయి. వీటిని గురించి పరిశీలిద్దాం. మరియు మరికొన్ని సద్గుణములను గురించి కూడా ప్రస్తావిస్తాను.

## 1. మాతృభక్తి

ఎంతో శ్రమపడి నవమాసములు మోసి, కని, ఎంతో ప్రేమతోలాలించి, పెంచి పెద్దవారిని చేసినతల్లిని ప్రతివారుప్రేమించి, గౌరవించి పోషించాలి. అనాది నుంచి మన దేశంలో మాతృదేవతకు మకుటాయమానమైన స్థానం యివ్వబడింది. తల్లికి మించిన దైవము లేదని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. మన దేశాన్ని కూడా **"మాతృభూమి" (Mother Land)** గా భావించి పూజించడం మన సంప్రదాయం. ఇటువంటి మాతృభావన ప్రపంచంలో మనకెక్కడా కనుపించదు. ఇతర దేశముల వారు వాళ్ల దేశమునకు **'పితృభూమి' (Father Land)** గా భావిస్తారు. దీనిని బట్టే మన దేశంలో స్త్రీకి ఎటువంటి గౌరవమర్యాదలు మనవారు యిచ్చారో అర్థం చేసుకొనవచ్చు. మన దేశంలో స్త్రీని తల్లిగా భావిస్తారు. ఇతర దేశములలో ఒక భోగ్యవస్తువుగా పరిగణిస్తారు. శివాజి, అభిమన్యుడు, బాలచంద్రుడు లాంటి వీరాధివీరులు తయారు కావడానికి మూలకారణం వారి మాతృమూర్తులే అనే విషయం విస్మరించరాదు. కనుక మీ యోగక్షేమములను, ఆయురారోగ్యములను, అభివృద్ధిని మనసా, వాచా కోరుకుంటున్న మాతృమూర్తిని పూజించడం మీ విద్యుక్తధర్మం.

## 2. పితృభక్తి

జన్మ యిచ్చిన తండ్రిని కూడా గౌరవించి పూజించాలి. చదువుకు, అభివృద్ధికి అనుక్షణము శ్రమించి కష్టించి, సంపాదించిన డబ్బును తాననుభవించక

పిల్లల భవిష్యత్తుకు ఖర్చు చేసే తండ్రిని మనసారా ప్రేమించాలి. పితృవాక్య పరిపాలనకు మంచి ఆదర్శం శ్రీరామచంద్రుడు. తన తండ్రి ఆజ్ఞను శిరసావహించి, సకల భోగభాగ్యములను, రాజ్యమును తృణప్రాయంగా భావించి 14సం॥లు అరణ్యవాసం చేసిన ఆదర్శ పురుషుడు హంసతూలికాతల్పాలమీద శయనించ వలసిన అతి సుకుమారి సీతాదేవి శ్రీరాముని అనుసరించి కీకారణ్యములలోని రాళ్ళమీద శయనించి, ఎన్నో కష్టాల ననుభవించిన ఆదర్శ పతిభక్తి పరాయణురాలు సీతాదేవి. మణిమయ సౌధాలలో, వందిమాగధుల కైవారాలతో మంగళ వాయిద్యములతో పరిచారికాగణం పసిడి వీవనలువీస్తుంటే, మధుర నాదాల వీణాస్వరాలతో, మృదుమధురమైన గానాలను ఆస్వాదిస్తూ, సకల రాజభోగములను అనుభవించవలసిన శ్రీరాముడు పితృవాక్య పరిపాలనకు తలవంచి, కాకులు దూరని కారడవిలో, అతి క్రూర మృగములు విచ్చలవిడిగా సంచరిస్తున్న కీకారణ్యములలో, పరమ కిరాతకులైన రాక్షసమూకలకు నిలయమైన మహారణ్యములలో 14 సం॥లు జీవితాన్ని గడిపి చక్కటి ఆదర్శమును లోకాని కందించిన పితృభక్తిపరాయణుడు శ్రీరామచంద్రుడు. కనుక ఆ మహనీయుని అడుగుజాడలలో నడవడం ప్రతి వారి కర్తవ్యం.

## 3. గురుభక్తి

ప్రతి విద్యార్థి గురువు యందు భక్తి శ్రద్ధలు కలిగి వుండవలెను. జ్ఞానార్జనకు గురు సేవ అత్యవసరము. శాస్త్రములలో ప్రవచించిన జ్ఞానమును అర్థం చేసుకోవడానికి గురువు సహాయం ఎంతయినా అవసరం. అట్టి అనుభవజ్ఞుని అనుగ్రహము పొందుటకు ప్రతి విద్యార్థి ప్రయత్నించవలెను. వినయముతో, నమ్రతతో, అణుకువతో, మెలకువతో, వారి మెప్పును పొంది జ్ఞానార్జన చేయవలెను. వారు మార్గమును మాత్రం చూపుతారు. నడువవలసినది ఎవరికి వారే అనే విషయం మాత్రం విస్మరించరాదు. ఎవరి కాళ్ళమీద వారే నిలబడాలి. తన భారాన్నంతా పూర్తిగా గురువుమీదనే వేయకూడదు. గురువు యొక్క అమూల్యమైన సలహాలను, సూచనలను తీసుకొని భక్తి శ్రద్ధలతో స్వశక్తిమీద ముందుకు సాగిపోవలెను. గురుభక్తికి చక్కటి ఆదర్శం **"ఏకలవ్యుడు"**.

ద్రోణాచార్యులు విలువిద్య నేర్పడానికి నిరాకరించినప్పటికీ నిరుత్సాహపడక అతని విగ్రహమును మాత్రం ముందుంచుకొని, కృషి సల్పి సాటిలేని మేటి విలుకాడయ్యాడు. స్వశక్తితో, స్వబుద్ధితో ఆరితేరిన గొప్ప విలువిద్యా నేర్పరయ్యాడు. ద్రోణాచార్యులు అతని విలువిద్యా నైపుణ్యానికి ఆశ్చర్యపడి మెచ్చుకొని, పారితోషికంగా బొటనవ్రేలును కోరగా, ఏమాత్రం సంకోచించకుండా, విలువిద్యకు అత్యవసరమైన

ఆబోటన వ్రేలును కోసి యిచ్చివేశాడు. ఏ విలువిద్యకోసం సంవత్సరాల తరబడి, ఏకాగ్రచిత్తముతో ఎనలేని తీవ్ర కృషి సలిపాడో, అట్టి ఆ విలువిద్యకు ఆధారమైన బోటన వ్రేలును సహితము, ఎట్టి విచారమూ లేకుండా కోసి యిచ్చిన మహోత్యాగి. నిరంతర కృషిచే సాధించిన ఆ విలువిద్య ఆనాటితో పరిసమాప్తి అవుతుందని తెలిసికూడా, ఏమాత్రం బాధపడకుండా, అడగడంతోనే ధైర్యంగా తన బొటనవ్రేలును కోసి ద్రోణాచార్యుని పాద పద్మములకు సమర్పించిన గొప్ప ధీశాలి, త్యాగశీలి, గురుభక్తి పరాయణుడు **"ఏకలవ్యుడు"**. కనుక ప్రతి విద్యార్థికి అనన్యమైన భక్తి శ్రద్ధలు గురువు యందు వుండవలెను. గురువాజ్ఞను శిరసావహించవలెను.

## 4. దైవభక్తి

భక్తియను పుష్పము నుండి జ్ఞాన ఫలము ఆవిర్భవిస్తుంది. కనుక ఈ చరాచర సృష్టి సర్వస్వానికి కారణభూతమైన పరమాత్మయందు అచంచలమైన, నిశ్చలమైన భక్తి కలిగియుండవలెను. అట్టి అకళతంకభక్తునికి ఒకవేళ శాస్త్రపరిజ్ఞానము, భౌతికమైన విద్య ఏకారణము చేతనైనా లేకపోయినప్పటికీ ఫరవాలేదు. జ్ఞానోదయానికి అర్హుడే అవుతాడు. అతడు దేనిని అడుగుతే దానిని భగవంతుడు అనుగ్రహిస్తాడు. ఎప్పుడు పిలుస్తే అప్పుడు ఎదుట నిలుస్తాడు భగవంతుడు. జ్ఞాన నేత్రం లేనివాడు అనగా జ్ఞానోదయం కానివాడు, అతడెంత గొప్పవాడైనా, ఎంతటి విద్యావేత్తయైనా, ధనవంతుడైనా, బలవంతుడైననూ, సర్వాధికారములు గల చక్రవర్తియైననూ భగవంతుని దృష్టిలో మాత్రం గ్రుడ్డివాడే. అకళంకమైన దైవభక్తికి ఆదర్శం ప్రహ్లాదుడు. అతని తండ్రి హిరణ్యకశిపునకు **'హరి'** మాట అంటే గిట్టేది కాదు. **'హరి'** ని స్మరించకుండా వుండేవాడు కాదు ప్రహ్లాదుడు. **'హరి'** ని స్మరించవద్దని ఎన్నో బాధలు పెట్టాడు హిరణ్యకశిపుడు. ఏనుగులతో త్రొక్కించాడు, విషసర్పములను ప్రయోగించాడు, కొండలమీద నుండి దొర్లించాడు, కొరడాలతో కొట్టించాడు. అయినప్పటికీ హరి నామ స్మరణను విడనాడలేదు ప్రహ్లాదుడు. ఏమి చేయాలో తోచక, విసిగి వేసారి చిట్టచివర్కి **"నీకు శక్తి వుంటే ఈ స్తంభంలో హరిని చూపించు"** అని గర్జిస్తాడు హిరణ్యకశిపుడు. స్తంభమును కోపంతో మూడుముక్కలు చేస్తాడు. అప్పుడు ఆ స్తంభం నుండి నృసింహస్వామి బయటకు వచ్చి హిరణ్యకశిపుని సంహరించి, ప్రహ్లాదునికి ఆనందం చేకూరుస్తాడు. ఈ ఉదంతం వలన భక్తితో సాధించలేనిదంటూ ఏమీ లేదని స్పష్టమవుతున్నది. ఎవరు నిశ్చలమైన భక్తితో, నిర్మలమైన చిత్తంతో భగవంతుని ఆరాధిస్తారో, అట్టి వారికి పరమాత్మ కరుణాకటాక్షములు ఎల్లప్పుడూ వుంటాయనే విషయం ఋజువవుతున్నది. కనుక మీరందరూ సర్వకాలసర్వావస్థలయందు

భక్తి శ్రద్ధలు కలిగి వుండవలెను. భగవంతుని నమ్మినవారికి ఎట్టి భయమూ ఉండదు.

## 5. సోదరప్రేమ

'ప్రతివ్యక్తీ తన సోదరులను (అన్నదమ్ములను) మనసారా ప్రేమించవలెను. ఆపదకాలములో సహితం విడవకుండా, కష్టసుఖములలో పాలుపంచుకొనేవారే నిజమైన సోదరులు. సోదర ప్రేమకు మంచి ఆదర్శము దశరథ కుమారులు (శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు). శ్రీరాముడు తండ్రి ఆజ్ఞానుసారం అరణ్యానికి బయలుదేరునప్పుడు లక్ష్మణుడు కూడా బయలుదేరుతాడు, శ్రీరాముడు వద్దన్నా వెంబడిస్తాడు. తన భార్యను, తల్లిని, తండ్రిని మరియు సకల భోగభాగ్యము లను తృణప్రాయంగా నెంచి అడవులకు పయనమైపోయి, సీతారాములకు అంగరక్షకునిగా, సకల సపర్యలూ చేస్తూ, చిట్టచివర్కి రావణ సంహారంలో శ్రీరామునికి కుడి భుజంగా నిలిచి పడరానిపాట్లు పడుతాడు లక్ష్మణుడు. అన్నగారి యెడల వున్న ప్రేమ యొక్క ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటి చూపించాడు లక్ష్మణుడు. శ్రీరాముడు కానల కేగునప్పుడు భరత శత్రుఘ్నులు అయోధ్యలో లేరు. శ్రీరాముని వియోగమునకు తట్టుకోలేక దశరథుడు మరణిస్తాడు. ఆ మరణవార్త విని తాతగారింటివద్దనున్న భరత శత్రుఘ్నులు అయోధ్యకు వస్తారు. శ్రీరాముని అడవులకు పంపినందులకు తల్లి కైకేయిని అనరాని మాటలు అంటాడు భరతుడు. దశరథుని అంత్యక్రియలు పూర్తిచేసి సపరివారంగా అరణ్యాలకు వెళ్ళి శ్రీరాముని ప్రాధేయ పడుతాడు భరతుడు. అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యమును పాలించమని వేడుకుంటాడు. అవకాశం వచ్చింది కదాయని రాజ్యాన్ని స్వీకరించకుండా, నిస్వార్ధబుద్ధితో ఎట్టి కల్లాకపటం లేకుండా శ్రీరామునికే పట్టాభిషేకం చేయటానికి ఎంతో ప్రయత్నం చేస్తాడు భరతుడు. శ్రీరామునికి బదులు అతనే 14సంవత్సరాలు అరణ్యవాసం చేస్తానని బ్రతిమాలుతాడు. లాభం లేక చిట్టచివర్కి ప్రాయోపవేశం చేయటానికి కూడా సిద్ధమవుతాడు. అప్పుడు శ్రీరాముడు, వశిష్ఠాది మహర్షులు అతనిని ఓదార్చి రాజ్యాన్ని పాలించమని నచ్చజెప్తారు. గత్యంతరంలేక శ్రీరాముని పాదుకలు తీసుకొని, నెత్తి మీద పెట్టుకొని తిరిగి వెళ్ళిపోతాడు భరతుడు. కానీ మళ్ళీ అయోధ్యలో మాత్రం తకాలు పెట్టడు. అయోధ్య ప్రక్కనే వున్న నందిగ్రామంలో మకాంచేసి శ్రీరాముని పాదుకలకు పట్టాభిషేకంచేసి, వాటి ప్రతినిధిగా 14 సంవత్సరాలు ప్రజానురంజకంగా రాజ్యాన్ని పాలిస్తాడు భరతుడు. సకల భోగ భాగ్యములను విడనాడి, నార బట్టలను ధరించి, ఒక "**ముని**" లా, ఎట్టి కోరికలూ లేకుండా జీవితాన్ని అతి నిరాడంబరంగా 14 సం॥లు గడిపిన త్యాగమూర్తి భరతుడు.

రావణ సంహరణానంతరం తిరిగి వచ్చిన శ్రీరామునికి స్వాగతం పలికి తిరిగి రాజ్యాన్ని వప్పగించిన త్యాగశీలి భరతుడు. సోదరప్రేమకు చక్కటి ఆదర్శం భరతుడు. ఒక పర్యాయం నాగపాశ అస్త్రమునకు గురియై రామలక్ష్మణులు యుద్ధంలో స్పృహ తప్పి పడిపోతారు. ముందుగా శ్రీరామునికి తెలివివచ్చి మూర్ఛలో నున్న లక్ష్మణునిచూచి " **సీతలాంటివారు భూలోకమున ఎక్కడైనా లభిస్తారు. కాని లక్ష్మణునితో సమానమైన సోదరుడు మాత్రం లభించుట దుర్లభం.**" అని విలపిస్తాడు. మరొక పర్యాయం సీతాన్వేషణ సమయంలో కబంధుడను రాక్షసుని చేతిలో రామలక్ష్మణులు బంధింపబడుతారు. అప్పుడు లక్ష్మణుడు "**నీవు నన్ను గూర్చి ఆలోచించడం మాని, కబంధునికి నన్ను బలిగానర్పించి, నీవు సుఖముగా పారిపొమ్ము.** " అని శ్రీరాముని ప్రాధేయపడుతాడు. లవణాసురుడనే రాక్షసుని సంహరించిన శత్రుఘ్నునికి బహుమానంగా మధురానగరమును పారితోషికంగా యిచ్చి పాలించమని శ్రీరాముడు ఆజ్ఞాపించగా అప్పుడు శత్రుఘ్నుడు అంగీకరించక " **14సం॥ లు శ్రీరాముని వియోగ దు:ఖమును పొందిన నాకు మరల ఈ వియోగము ను కల్పించవద్దు. తల్లి లేని శిశువువలె నిన్ను విడిచి ఒక్క క్షణమైనా వేరొకచోట వుండలేను**" అని ప్రాధేయ పడుతాడు. శ్రీరాముని సోదరులు ఒకరికి మించినవారు ఒకరు. వారి ఆప్యాయతను గురించి, సోదరప్రేమను గురించి మానవాళి మనుగడ ఉన్నంత కాలం చెప్పుకుంటూనే ఉంటారు. కనుక వారిని ఆదర్శంగా గైకొని, ఆప్యాయతతో, అనురాగంతో, ఎట్టి అరమరికలు లేకుండా, ఐకమత్యంగా, ప్రేమాభిమానములతో కలకాలం సుఖప్రదమైన జీవితాన్ని మీరందరూ గడపాలని నా ఆకాంక్ష

## 6. సత్యం

"**సత్యమేవ జయతే**" సత్యమే జయించునని మన స్మృతులు ఎలుగెత్తి చాటుచున్నాయి. సత్యమనగా నిజము. అబద్ధమాడకుండా వుండటం. ఎన్ని కష్టములు వచ్చినా, బాధలు కలిగినా, అవాంతరములు ఏర్పడినా, చిట్టచివరికి ప్రాణానికే ముప్పు వాటిల్లినా సత్యమునే పలుకవలెను. సత్యమార్గమునే పయనించవలెను. సత్యమునే అనుసరించవలెను. అసత్యం చెప్పినయెడల లేక అబద్ధమాడిన యెడల ఒకవేళ సంపదలు కలిసి రావటానికి మంచి అవకాశం ఉన్నా అట్టి దుష్టప్రయత్నం మాత్రం చేయరాదు. ఒకవేళ ఎవరైనా సరే పొరపాటున చేయకూడని పని చేస్తే, పెద్దలు దండించుతారనే భయంతో సహజంగా పిల్లలు అబద్ధమాడుతారు. ఆ అబద్ధాన్ని కప్పిపుచ్చుకోవడానికి మళ్ళీ మరొక అబద్ధం ఆడుతారు. తరువాత అబద్ధమాడటానికి ఏ మాత్రం వెరువరు, సంకోచించరు. చివరకు అది అలవాటు అయిపోతుంది. ఇది మాత్రం మంచి పద్ధతి కాదు.

దీనివల్ల ఆ విద్యార్థి యొక్క విలువ పెరుగక పోగా తరిగిపోతుంది. నైతిక భ్రష్టుడవుతాడు. చేసిన పని ఒకవేళ తప్పే అయినప్పటికీ, ధైర్యంగా ఒప్పుకోవడంలోనే వున్నది గొప్పతనం. మళ్లీ అటువంటి పొరపాటు జరుగకుండా జాగ్రత్తపడాలి. పెద్దలు కూడా 'సహనంతో అనుగ్రహించి, అనురాగంతో మృదుమధురమైన మాటలతో, చేసిన పొరపాటును విడమరచి చెప్పి దానివలన వచ్చే చెడును తెలిపి, భవిష్యత్తులో అట్టి పొరపాటు జరుగకుండా చూడాలి. సత్యానికి నిదర్శనం, ఆదర్శం **"సత్యహరిశ్చంద్రుడు"** కష్టములొచ్చినప్పుడు ఆ మహనీయుని స్మరించు కొనవలెను. ఆడినమాటను నిలబెట్టుకోవడానికోసం, రాజ్యాన్ని, తన సర్వస్వాన్ని త్యాగం చేసిన **"త్యాగశీలి"**. చిట్టచివరకు తన భార్యాపిల్లలను పోగొట్టుకున్న **'సత్యవ్రతుడు'**. అటువంటి భీకర భయంకరమైన భరించరాని యిక్కట్లు దాపురించినప్పటికినీ, ఏమాత్రం చలించకుండా, సత్యపథమును విడనాడకుండా చక్కటి ఆదర్శమును నెలకొలిపిన **"మహానుభావుడు"**. సత్యమూర్తులు తాము చేసిన వాగ్దానాన్ని సదా స్మరించుకుంటుంటారు. ఆపదలు ఒకదాని తరువాత ఒకటి వచ్చి మీద పడుతున్నా, ధైర్యాన్ని కోల్పోక, సత్యపథమును విడిచిపెట్టరు. **"సత్యమునకు ప్రాణం పోదు. అసత్యమునకు జీవం రాదు"** ఈ వాస్తవాన్ని గ్రహించితే మానవునికి ఎట్టి యిబ్బందీ వుండదు. కనుక ప్రతివారూ ఎల్లప్పుడూ ఓర్పుతో, ఓర్మితో సత్యమును పలుకవలెను.

## 7. అహింస

**"అహింసా పరమో ధర్మః"** అహింస పరమోత్కృష్టమైన ధర్మము అని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. అహింసా సిద్ధాంతమనగానే చాలా మంది, ఇది చేతకానివారు, అనామకులు, బలహీనులు చెప్పే సిద్ధాంతమని అపోహ పడుతున్నారు. ధైర్యము, శక్తి, బలము కలిగివుండి కూడా, అన్యోన్య ప్రేమను ప్రదర్శిస్తూ, కరుణ, దయ, ప్రేమలను వర్షిస్తూ, శాంతియుత, ప్రశాంత వాతావరణమును కలుగ జేయునదే అహింసా సిద్ధాంతం. హింసకు దిగకుండా, ఆత్మ నిగ్రహమును ప్రదర్శించేదే అహింసావాదం. సహనమే అహింస, అహింస ధర్మం, హింస అధర్మం (చేయకూడని పని) హింస చేయకూడని పని అని భావించి, విష జంతువులైన తేలు, పాము, పులి మొదలగు క్రూరజంతువులను చంపకుండా వదలటం విజ్ఞత కాదు. అదే విధముగా చెడు ప్రవర్తన కలవారిని, దుష్టులను శిక్షించడం ఏమాత్రం అధర్మం కాదు. అట్టి వారిని వదలి పెడితే వారి చెడుప్రవర్తన వలన సమాజానికి తిరిగి నష్టం వాటిల్లుతుంది. సమాజహితం కోరి దుష్టులను శిక్షించడం ఉత్తమ ధర్మం. అందుకోసమనే **"దుష్టశిక్షణ శిష్టరక్షణ"** కోసం అప్పుడప్పుడూ అవతరిస్తానని

భగవంతుడు గీతలో చెప్పాడు. హింసా ప్రవృత్తి పెచ్చు పెరిగి, అరాచకం చెలరేగి, అశాంతి విలయతాండవం చేస్తున్న రోజులలో బుద్ధుడు వచ్చి అహింసావాదాన్ని ప్రజలలో ప్రచారం చేసి, శాంతిని నెలకొల్పాడు. అదే అహింసా సిద్ధాంతాన్ని మహాత్మా గాంధీజీ వెలుగులోనికి తీసుకొనివచ్చాడు. కనుక సర్వ శక్తివంతమైన, నైతిక శక్తిని చేకూర్చేటటువంటి అహింసా సిద్ధాంతాన్ని అందరూ అనుసరించి, పాటించాలి, ప్రపంచ శాంతికి తోడ్పడాలి. ఇదే ఈనాటి మన కర్తవ్యం.

## 8. పరోపకారము

ఈ పరోపకార బుద్ధి అన్ని బుద్ధులలోకి మిక్కిలి శ్రేష్ఠమైనది. అడుగడుగునా శాస్త్రములలో ఇది కనిపిస్తున్నది. పరోపకారమనగా ప్రక్కవారికి, ఇతరులకు ఉపకారం అనగా మంచి చేయటం అని అర్థం. ఉపకారం చేసేటప్పుడు మన మనస్సులో ఎట్టి స్వార్థం ఉండరాదు. మనం ఈరోజున ఒకడికి ఉపకారం చేస్తే, భవిష్యత్తులో మనకు ఉపయోగపడవచ్చుననే భావంతో చేయరాదు. ఎట్టి ఫలాపేక్షా లేకుండా పరులకు నిస్వార్థబుద్ధితో సహాయం చేయటమే నిజమైన పరోపకారము. ఇదే భావమును తెలిపేటటువంటి ఒక చక్కటి నీతిశ్లోకమును వ్రాస్తున్నాను.

**"పరోపకారాయ ఫలంతి వృక్షా :**
**పరోపకారాయ వహంతి నద్య :**
**పరోపకారాయ దుహంతి గావ :**
**పరోపకారాయ సతాం విభూతయ:"**

అనగా "పరోపకారము కొఱకు వృక్షములు ఫలముల నిచ్చుచున్నవి. పరోపకారము కొఱకు నదులు ప్రవహించుచున్నవి. పరోపకారము కొఱకు గోవులు పాలు యిచ్చుచున్నవి. పరోపకారము కొఱకే సజ్జనుల సంపదలు వినియోగింప బడతవి" అని అర్థము. వృక్షములకు, నదులకు, గోవులకు, సజ్జనులకు ఎట్టి స్వార్థము ఉండదు. పరోపకారము చేయటమే వాటి వారి పరమావధి. ఇతరులకు యివ్వడమేగాని ప్రతిఫలం మాత్రం ఆశించవు, ఆశించరు. వృక్షములకు, నదులకు, గోవులకు అట్టి ఉదారస్వభావము, పరోపకారబుద్ధే గనుక లేకపోతే మానవజాతే నశించి వుండేది. అదేవిధముగా సజ్జనులకు తన సంపదను అనగా భౌతిక సంపదను, విద్యాసంపదను ఉదారంగా పరులకు దానం చేసే పరోపకార బుద్ధే గనుక లేకపోతే మానవజాతి మనుగడకే అవరోధం ఏర్పడి వుండేది. కనుక ఇట్టి పరోపకారబుద్ధిని అందరూ అలవరచుకోవలెను. **"మానవసేవే మాధవసేవ"** అని గీత బోధిస్తున్నది. జీవులకు నిష్కామబుద్ధితో సేవచేయడం అంటే సాక్షాత్

భగవంతునికి సేవ చేసినట్లే అవుతుంది. ఏ ప్రాణికి ఉపకారం చేసినా సాక్షాత్ భగవంతునికి పూజచేసినట్లే అవుతుంది. నరునికి సేవచేసిన నారాయణుని అర్చించినట్లే. పరులకు సేవచేయడం అంటే పరమేశ్వరుని పూజించినట్లే. జీవుని సేవించడం అంటే శివుని ఆరాధించడమే. కనుక పరులకు పరోపకారం చేయాలి. తనకు ఉపకారం చేసిన వారికి మేలు చేయడంలో లేదు గొప్పతనం. తనకు అపకారం చేసినవారికి కూడా ఉపకారం చేయడంలోనే వున్నది గొప్పతనం. ఎదుటి వారిలోని తప్పులను తలపోయక వారికి మేలు చేయువాడే ఉత్తముడు. ఇదే విషయాన్ని యీ క్రింది సుమతీ శతకం పద్యం బోధిస్తున్నది.

**"ఉపకారికి నుపకారము**
**విపరీతము కాదుసేయు వివరింపంగా**
**నపకారికి నుపకారము**
**నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ"**

ఇది అత్యున్నతమైన తత్త్వజ్ఞానము. ఆ స్థాయికి చేరుకోవడం అంత తేలికకాదు, అందరికీ చేతకాదు. అపకారికికూడా ఉపకారం చేయడం గొప్ప విశేషమే. అయినప్పటికీ, యీ ఉపకారం చేయడంలో కొంత ఇంగితజ్ఞానం ఉండాలి, విజ్ఞతను ప్రదర్శించాలి, విచక్షణాజ్ఞానాన్ని కలిగి ఉండాలి. గ్రుడ్డిగా అపకారికి కూడా ఎప్పుడూ ఉపకారం చేస్తూపోతుంటే, ఒక్కొక్కప్పుడు ప్రమాదం కూడా రావచ్చును. కొంతమంది మూర్ఖుల విషయంలో, ముఖ్యంగా కృతఘ్నుల (చేసిన మేలు మరచువారు) విషయంలో, వివేకాన్ని ప్రదర్శించాలి, అట్టివారికి గుణపాఠం నేర్పాలి.

అపకారం చేసేవారిని దండించుట రాజధర్మం. దుష్ట బుద్ధితో ఏ దేశం అయినా మన దేశంమీద దండెత్తి దురాక్రమణచేస్తే గట్టిగా ఎదుర్కొని బుద్ధి చెప్పాలి. అపకారికి కూడా ఉపకారంచేయడం ఉత్తమధర్మమని భావించి మెదలకుండా కూర్చోకూడదు. ఉత్తమ ధర్మమేదో, ధర్మసూక్ష్మమేదో వివేకంతో గ్రహించాలి. మాతృభూమిని రక్షించుకోవటం ప్రతి పౌరుని ప్రాథమిక కర్తవ్యం, విద్యుక్తధర్మం. కనుక ఆయా పరిస్థితులనుబట్టి ఉత్తమ ధర్మమేదో, తక్షణ కర్తవ్యమేమిటో, వివేకంతో నిర్ణయించుకొని సందర్భోచితంగా, సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. పృథ్విరాజ్ మీద గోరీమహమ్మద్ 17 సార్లు దండయాత్ర చేశాడు. అనేక అకృత్యాల నొనర్చాడు. అన్నిసార్లు గోరీమహమ్మదే ఓడిపోయాడు. పృథ్విరాజ్‌ను క్షమాభిక్ష కోరుకుంటాడు.

ఉదారబుద్ధితో, పృథ్విరాజ్ క్షమించి వదలిపెడుతాడు. అయినప్పటికీ గోరీ మహమ్మద్‌లో ఏమాత్రం పరివర్తన రాదు. దుష్టబుద్ధితో మాయోపాయముతో జయచంద్రుని వలలో వేసుకొని, పృథ్విరాజ్‌పై మరల దండెత్తివచ్చి పృథ్విరాజ్‌ను బంధిస్తాడు. 17 సార్లు క్షమాభిక్ష పెట్టాడనే విశ్వాసంకూడా లేకుండా, పృథ్విరాజ్ రెండు కళ్లనూ **"గోరీ"** నిర్దాక్షిణ్యంగా ఊడబెరికిస్తాడు. ఈ ఉదంతం నుండి మనం ఒక నీతిని నేర్చుకోవాలి. అదేమనగా విశ్వాసఘాతకునికి, క్రూరునికి, కృతఘ్నునికి ఉపకారం చేయడం పాముకు పాలు పోసినట్లే అవుతుంది. కనుక ప్రతి ఒక్కరూ వివేకంతో, విజ్ఞతతో పరోపకారబుద్ధిని ప్రదర్శించడం నేర్చుకోవాలి. ఇది విస్మరించరాని నగ్నసత్యం.

## 9. నిరాడంబరము

ప్రతి వ్యక్తీ నిరాడంబరమైన జీవితాన్ని గడపడం అత్యవసరమని పెద్దలు చెబుతున్నారు. ఆడంబరంవలన వ్యక్తిత్వం ఏమాత్రం అభివృద్ధిజెందదు. ఏవ్యక్తి అయినా సర్వ శక్తివంతుడైనప్పటికినీ, మిక్కిలి తెలివిగలవాడైనప్పటికినీ , గొప్ప సంపద కలవాడైనప్పటికినీ, మహామేధావి అయినప్పటికినీ, సకల శాస్త్రములను అధ్యయనం చేసిన మహాపండితుడైనప్పటికినీ - అట్టి వారిలో వినయ విధేయతలు, నిరాడంబరత గనుక లోపించిన యెడల ఏ మాత్రం వారు రాణించరు, శోభించరు. ఉండవలసిన సద్గుణములు ఏ కొద్ది ఉన్నప్పటికీ, అసలు లేకపోయినప్పటికీ, అన్నీ వున్నట్లుగా నటన చేస్తుంటారు, ఫోజులు కొడుతుంటారు కొందరు. షోకులు చేసుకొని కులాసాగా, జల్సాగా, ఆడంబరంగా తిరుగుతుంటారు. తమకే అన్ని తెలిసినట్లుగా **'షో'** చేస్తుంటారు. అమాయకులు వారిని చూచి మోసపోతుంటారు. అన్నీవున్న విస్తరి అణిగి మణిగే వుంటుంది. ఏమీ లేని విస్తరి ఎగిరెగిరిపడుతూ వుంటుంది అనే సామెత ఇట్టివారి విషయంలో యదార్థం. అన్నీ హంగులు గల సమర్థులు నిరాడంబరంగా జీవితాన్ని కొనసాగించిన యెడల వారి సమర్థత యింకా యినుమడిస్తుంది. ఏశక్తీ లేనివారు ఆడంబరంగా ప్రవర్తిస్తే ప్రయోజనం శూన్యం. కనుక ఆడంబరాలకు అవకాశం యివ్వకుండా, నిరాడంబరంగా జీవితాన్ని గడపటం ప్రతి ఒక్కరూ నేర్చుకోవాలి. **"Simple living and high thinking"** సామాన్యంగా, నిరాడంబరంగా జీవిస్తూ, ఆదర్శమైన, ఉన్నతమైన ఆలోచనలతో జీవితం గడపటం నేర్చుకోవాలి. నిర్మలమైన, నిశ్చలమైన మనస్సు కలిగి వుండాలి. అట్టివారే సమాజంలో పేరుప్రఖ్యాతులు, కీర్తి ప్రతిష్టలు తెచ్చుకుంటారు.

## 10. భూతదయ

"సర్వభూతహితే రతాః" అని గీత బోధిస్తున్నది. సమస్త ప్రాణికోటి యెడల దయ, ప్రేమ, కరుణలు కల్గి వుండాలి. భగవంతునిపై భక్తి, జీవరాసుల యెడల ద్వేషం కలిగివున్నచో, ఆ భక్తికి అర్థమే లేదు. అది అపచారమే అవుతుంది. సమస్తప్రాణులూ భగవత్స్వరూపులే. కనుక ఏ ప్రాణికి అపకారం తలబెట్టరాదు, బాధించరాదు **"సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"** ఏ జీవిని తిరస్కరించినా, బాధించినా భగవంతుని బాధించినట్లే అవుతుంది. కనుక సర్వజీవుల యెడల దయ కల్గివుండవలెను. **"ఎవరు ధ్యానము, దైవభక్తి దైవజ్ఞానములతో పాటు సమస్తప్రాణుల యెడల ప్రేమ, దయ కలిగి వుంటారో అట్టివారు నన్ను తప్పకుండా పొందుతారు"** అని శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునితో చెప్పారు. కనుక సర్వభూతదయ కూడా పరమాత్మ్యష్టమైన ధర్మములలో ఒకటి.

**"నిర్వైరస్సర్వ భూతేషు"** అన్నది గీత. మన ధర్మశాస్త్రములలో ఒక్క మనుజులకేగాక, సమస్త ప్రాణికోటికి కూడా ఎటువంటి ఉన్నతమైన స్థానం యివ్వబడిందో, దీనిని బట్టి అర్థం చేసుకొన వచ్చును. ఇటువంటి అత్యున్నతమైన తత్త్వజ్ఞానం (Philosophy) ప్రపంచంలో మరెక్కడా కనిపించదు. **'సర్వభూతదయ'** అన్నారు గదాయని చాదస్తంగా మాత్రం ప్రవర్తించరాదు. కొన్ని కొన్ని సమయాలలో వివేకం, విజ్ఞతను ప్రదర్శించవలసి వస్తుంది. జీవహింస చేయరాదని, పంటలను ధ్వంసం చేసే క్రిమికీటకాలను కూడా సంహరించరాదనే స్థాయికి పోరాదు. అసలు పంటలు బాగా పండుతేనేగదా మానవజాతి మనుగడ వుండేది . అందుకని అనవసరంగా ఏ జీవిని హింసించరాదు. ఏది చేస్తే ఎక్కువ ప్రయోజన ముంటుందో వివేకంతో ఆలోచించి నిర్ణయాలు గైకొనాలి. అకారణంగా ప్రాణులను హింసించ రాదు. కుంటిసాకులు చెప్పి హింసకు పూనుకోవటం ధర్మం కాదు ఉత్తమ ధర్మమేదో, ఏ పని చేస్తే సమాజ శ్రేయస్సుకు తోడ్పడుతుందో, విజ్ఞతతో ఆలోచించి చేయాలి. స్వార్థంతో, సంకుచితత్వంతో, స్వలాభ దృష్టితో ఇతర ప్రాణులను మాత్రం హింసించ రాదు. కనుక ప్రతి విషయంలోనూ వివేకంతో ఆలోచించి, విజ్ఞతను ప్రదర్శించాలి.

కనుక నిరాడంబర జీవితాన్ని గడుపుతూ సమస్త ప్రాణులయెడ దయ, ప్రేమ, కరుణలను ప్రదర్శిస్తుంటారు గదా!

## 11. శుచిత్వం

శుచిత్వమనగా పరిశుభ్రత. ఇది ప్రతి మానవునికి అత్యవసరం. ఈ శుచిత్వం రెండు రకములు. 1. బాహ్య శుభ్రత. 2. అంతః శుభ్రత. వీటిలో ఏ ఒక్కటి లోపించినా ఆ వ్యక్తి ఎందుకూ పనికిరాడు. ధరించు వస్త్రములు, చదువుకొను పుస్తకములు మరియు పరిసరములు బాహ్య శుభ్రత క్రిందకు వస్తాయి. ప్రతి వ్యక్తి వీటిని పరిశుభ్రంగా ఉంచుకోవలెను. మురికి వస్త్రములు ధరించిన వారిని ప్రక్కవారే అసహ్యించుకుంటారు. ప్రతిరోజు శుభ్రంగా తోముకొని స్నానము చేయనిచో దుర్గంధం బయలు దేరుతుంది. గజ్జి, తీట, తామర మొదలగు అంటు వ్యాధులకు గురి అవుతారు. చదువుకొను పుస్తకాలను చించకుండా, మాపకుండా మంచిగా వుంచుకొనే విద్యార్థులను ఉపాధ్యాయులు ప్రేమిస్తారు. పరిసరములు అనగా నివసించు గృహం మరియు చుట్టుప్రక్కలు ఎప్పటికప్పడు పరిశుభ్రంగా ఉంచుకోవలెను. **"ఇంటిని చూచి ఇల్లాలును చూడు"** అనే సామెత కూడా కలదు. అనగా ఇంటిని పరిశుభ్రంగా ఉంచే ఇల్లాలు, సహజంగా ఆమె కూడా పరిశుభ్రంగానే ఉంటుందని భావం. పరిశుభ్రత ఆరోగ్యానికి చిహ్నం. **"ఆరోగ్యమే మహాభాగ్యం"** అన్నారు పెద్దలు. ఎంత సంపద ఉన్నప్పటికీ ఆరోగ్యం కనుక సరిగా లేకపోతే ఏమీ ప్రయోజనం లేదు. కనుక మన పెద్దలు ఆరోగ్యానికి ప్రథమస్థానమిచ్చారు. ఇకపోతే అంతఃశుభ్రత, అనగా లోపలి మనస్సు కూడా ప్రశాంతంగా, నిర్మలంగా, స్వచ్ఛంగా ఉంచుకోవాలి. అప్పడే భావాలు కూడా నిర్మలంగా, స్వచ్ఛంగా ఉంటాయి. **"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"** అన్నారు గదా! బంధమునకు, మోక్షమునకు మన మనస్సే కారణం. కాబట్టి మన మనస్సును నిర్మలంగా, పవిత్రంగా ఉంచుకుంటే సద్భావనలు, సచ్ఛింతనలు, సదాలోచనలకు నిలయమవుతుంది. అటుల కాక మనస్సు మలినమైతే దుర్భావనలు, దుశ్చింతనలు, దురాలోచనలకు నిలయమవుతుంది. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములతో నిండిపోయి, ఈర్ష్య, ద్వేషము, అసూయలకు నిలయమై మనిషి దుర్మార్గుడై ప్రజల చేత అసహ్యించు కొనబడుతాడు. సంకుచిత భావములకు నిలయమై, విశాల భావములకు అవకాశం లేకుండా పోతుంది. బాహ్య శుభ్రత ఒకవేళ ఉన్నప్పటికీ అంతఃశుభ్రత గనుక లేకపోతే ఆ వ్యక్తి రాణించడు, శోభించడు. కనుక ప్రతి ఒక్కరు బాహ్య అంతఃశుభ్రతలను కాపాడుకోవాలి. అప్పడే సమాజం అట్టి వారిని గౌరవిస్తుంది, ఆదరిస్తుంది, ప్రేమిస్తుంది.

## 12. పట్టుదల

పట్టుదల ప్రతి వ్యక్తి యందు ఉండితీరవలసిన ఆయుధం. అయితే ఈ పట్టుదల మంచి విషయాలను సాధించడంలో ఉండాలి. చెడ్డ కోరికలను నెరవేర్చు కొనడంలో ఉండరాదు. చెడ్డ విషయాలకోసం పట్టు పట్టడం మొండి పట్టుదల అంటారు. మొండి పట్టుదల.మానవుణ్ణి పతనం చేస్తుంది. కనుక దీనిని దరికి చేరనీయరాదు. మంచి విషయాలను సాధించడానికోసం పట్టుదల ఉండాలి. అట్టి పట్టుదల లేనివాడు జీవితంలో విజయలక్ష్మిని చేబట్టలేడు, ఏ లక్ష్యమునూ సాధించలేడు. ప్రతి వ్యక్తికీ ఆశయం ఉన్నతంగా ఉండాలి, ఆదర్శం శ్రేష్ఠమైనదై ఉండాలి. అట్టి లక్ష్యమును సాధించేందుకు మంచి పట్టుదల ఉండాలి. సాధించేంత వరకు విశ్రమించరాదు. ఏమాత్రం బలహీనత మనసులో రాకూడదు. ముఖ్యంగా విద్యార్థి లక్ష్యం విద్యా విజ్ఞానాదులను సముపార్జించడం, వినయ విధేయతలను పెంపొందించుకోవడం. వీటిని పట్టుదలతో సాధించాలి. అసలు విద్యార్థికి తృప్తి అనేదే ఉండరాదు. ఒక పరీక్ష కన్నా మరొక పరీక్షలో ఎక్కువ మార్కులు తెచ్చుకోవాలనే పట్టుదల ఉండాలి. తరగతిలో అందరికన్నా ఎక్కువ మార్కులు తెప్పించుకోవాలనే పట్టుదల ఉండాలి. మన దేశంలోనే కాదు. యావత్ ప్రపంచంలోనే పేరు ప్రఖ్యాతులు గడించాలనే ఆకాంక్ష ఉండాలి. ఆశయం ఎప్పుడూ ఉన్నతంగా ఉండాలి గాని, నీచమైనదిగా ఉండరాదు. Low aim is crime. నీచమైన లక్ష్యమే నేరము. కనుక ఉన్నతమైన ఆదర్శం, దృఢమైన నిశ్చయం, ఎటువంటి పరిస్థితులలోనైనా సాధించి తీరుతాననే ఆత్మవిశ్వాసం, దానిని సాధించడానికి అవసరమైన పట్టుదల ప్రతి వ్యక్తిలో ఉండాలి. జీవిత సంగ్రామ రంగంలో విజయాలను సాధించాలంటే ఇవి అవసరం. కనుక మీరు జీవితంలో మంచి విషయాలను సాధించేందుకు అవసరమైన పట్టుదలతో కృషి చేయాలని నా ఆకాంక్ష

## 13. ధైర్య సాహస బలపరాక్రమాదులు

ఈ నాల్గు సద్గుణములు ప్రతి వ్యక్తియందు ఉండి తీరవలెను. అందులో ముఖ్యంగా కార్యసాధకునికి ఇవి అత్యవసరం. ఏ వ్యక్తి అయినా సరే మంచి తెలివి గల వాడైనప్పటికీ, సర్వ శాస్త్రములు సాకల్యముగా పఠించిన మహామేధావి అయినప్పటికి పై నాల్గు సద్గుణములు గనుక లేని పక్షంలో అతను ఏమాత్రం రాణించడు, శోభించడు. ఏ పనిని సాధించాలనినా ధైర్యం ప్రధానంగా ఉండాలి. ధైర్యమే ఏ ప్రయత్నానికైనా మూలం. అధైర్యం అన్ని ప్రయత్నాలకు అవరోధం. ధైర్యవంతుడు ఒక్క పర్యాయం మాత్రమే మరణించును. అధైర్యవంతుడు అనగా

భీరువు జీవితంలో అడుగడుగునా మరణిస్తూనే ఉంటాడు. పిరికివాడు, బలహీనుడు సమాజం పాలిటి చీడపురుగు. **"దేవో దుర్బల ఘాతకః"** భగవంతుడు కూడా బలహీనులనే సంహరిస్తాడు. బలహీనుల వల్లనే శాంతికి విఘాతం కల్గుతుంది. ఇద్దరు బలవంతుల మధ్యనే అన్యోన్యతతో ఇచ్చి పుచ్చుకోవడం, ఒకరినొకరు గౌరవించుకోవడం లాంటివి జరుగుతాయి. బలవంతుడు, బలహీనుని మధ్య ప్రశాంత వాతావరణం ఉండదు. పెద్ద చేప, చిన్న చేపను మ్రింగటం సహజం. అదే విధముగా బలమైన సర్వశక్తివంతమైన దేశం, ప్రక్కన ఉన్న బలహీనమైన దేశమును కబళించి వేస్తుంది. పెద్దపులి చిన్న జంతువులను, మనుష్యులను సునాయాసంగా స్వాహా చేస్తుంది. సర్కస్‌లోని పెద్దపులి మాత్రం **'రింగ్ మాస్టర్'** ను చూచి భయపడుతుంది. బోనులో నుంచి బయటకు రమ్మనమంటే వస్తుంది. మేక ఎదురుగా కనిపించినా దానిని ఏమీ చేయదు. కారణం? రింగ్‌మాస్టర్ చేతిలో నున్న **"హంటర్"** ను చూస్తే దానికి భయం. అదే రింగ్ మాస్టర్ చేతిలో నున్న 'హంటర్' ను బయట పారవేసి నుంచుంటే...... అప్పుడు అదే పెద్దపులి ఆ మేకను, ఆ రింగ్ మాస్టర్‌ను, చుట్టూ ఉన్న ప్రేక్షకులను సునాయాసంగా ఆరగిస్తుంది. శక్తిని బలాన్ని చూచి ఎంతటి వారైనా భయపడుతారు.

అదే విధంగా సాహసముతో కూడా ఎంతటి పెద్ద కార్యాలనయినా సునాయాసంగా సాధించవచ్చును. ప్రతి వ్యక్తీ మంచి పరాక్రమ సంపన్నుడై ఉండాలి. శారీరక విద్యలు కూడా నేర్చుకోవాలి. శరీరం ఆరోగ్యవంతంగా, పుష్టిగా, బలంగా ఉంటేనే మానవుడు దేనినైనా సాధించగలుగుతాడు. ఆరోగ్యమే మహా భాగ్యము గదా! కనుక ప్రతివారు ఆరోగ్యమును కాపాడుకోవాలి. ప్రతిరోజు వ్యాయామం చేయాలి. మంచి బలాన్ని సంపాదించాలి. బలం ఉన్నదిగదాయని అనవసరంగా ఇతరుల జోలికి పోరాదు. చెడు కోర్కెలను తీర్చుకోవటానికి, ఆ శక్తిని దుర్వినియోగం చేయరాదు. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు మాత్రమే అట్టి శక్తిని ఉపయోగించాలి. అట్టి శక్తిని చూచి చెడ్డవారికి భయం, మంచి వారికి ఆనందం కలగాలి. కేవలం భౌతికమైన శక్తి మీద, బలం పైననే ఆధారపడరాదు. ఆధ్యాత్మిక బలమును కూడా సంపాదించాలి. మానసిక బలాన్ని పెంపొందించుకోవాలి. విశ్వామిత్రుడు మొట్ట మొదట కేవలం తన శారీరక బలాన్నే నమ్ముకొని వశిష్ఠునితో యుద్ధానికి దిగాడు. బ్రహ్మ తేజోబలంగల వశిష్ఠుని ముందు, విశ్వామిత్రుని అస్త్రశస్త్రము లన్నియూ వృథా అయిపోయినాయి. అప్పుడు విశ్వామిత్రుడు బ్రహ్మబలం, దైవబలముల శక్తిని గుర్తించాడు. **"బ్రహ్మబలమే బలం, దైవబలమే బలం"** అని తెలుసుకొని, ఒక్క శక్తిని మాత్రమే నమ్ముకుంటే ఏమీ ప్రయోజనం లేదని భావించి, తీవ్ర సాధనలు సలిపి,

ఎట్టకేలకు ఆధ్యాత్మిక దివ్యశక్తిని సంపాదించి, "బ్రహ్మర్షి" అయినాడు. కనుక భౌతిక శక్తితోపాటు ప్రతిఒక్కరూ దైవబలమును కూడా సంపాదించి తీరాలి.

అసలు ఈ నాల్గు సద్గుణములు సాధించడానికి ప్రతి వ్యక్తిలో ఉత్సాహం కూడా ఉండాలి. అది లేనివాడు దేనినీ సాధించలేడు. వీటితోపాటు సద్బుద్ధి కూడా కలిగి ఉండాలి. మహాభారత యుద్ధ ప్రారంభంలో అస్త్ర సన్యాసం చేసిన అర్జునునికి మొట్టమొదట ధైర్యమును, నిర్భయత్వాన్ని ప్రబోధించి ఉత్సాహపరిచాడు శ్రీకృష్ణుడు. **"క్లైబ్యం మాస్మగమః పార్థ!"** "ఓ అర్జునా! అధైర్యము పొందకుము" అని హెచ్చరించాడు. వివేకానంద కూడా "**Be Fearless**" అను నిర్భయ మంత్రమును ప్రపంచానికి చాటాడు. దుర్బలత్వమే మహాపాపమని బోధించాడు. ఎచట ధైర్యం, ఉత్సాహం, ఆనందములు తాండవిస్తుంటాయో అచట పరమాత్మ ఉంటాడని, ఎచట పిరికితనం, భయం దౌర్బల్యములకు నిలయమవుతుందో అచట దయ్యాలు కాపురముంటాయని పెద్దలు అనుభవంతో చెబుతున్నారు. శాస్త్రములు కూడా ఇదే వాస్తవమును ప్రబోధిస్తున్నాయి. ఈ క్రింది శ్లోకమును అవగాహన చేసుకుంటే ఇదే వాస్తవం మనకు బోధపడుతుంది.

**"ఉత్సాహం సాహసం ధైర్యం బుద్ధిశ్శక్తిః పరాక్రమః**
**షడేతే యత్ర తిష్ఠన్తి తత్ర దేవోఽపి తిష్ఠతి"**

"ఉత్సాహం, సాహసం, ధైర్యం, సద్బుద్ధి, శక్తి (బలం), పరాక్రమం - అను యీ ఆరు సద్గుణములు వున్నచోట సాక్షాత్ భగవానుడు నివాసముండును" అని అర్థం. కనుక పై ఆరు సద్గుణములను సాధించి, స్వంతం చేసుకొనినవారికే భగవదానుగ్రహం లభించును. కనుక మీరందరూ శ్రద్ధతో, పట్టుదలతో పై సుగుణములను సాధించి భగవదానుగ్రహమును పొందవలెను.

## 14. ఓర్పు - ఓర్మి

ప్రతి వ్యక్తీ తన జీవితంలో ఈ సద్గుణాన్ని సాధించి తీరవలెను. ఈ సద్గుణానికి పరీక్షా సమయం కష్టకాలం. కష్టములు దాపురించినప్పుడు, దుఃఖములు కలిగినప్పుడు, బాధలకు లోనైనప్పుడు సహజంగా మనిషి నిజస్వరూపం బహిర్గతమవుతుంది. అతనిలోనున్న బలహీనతలు బయటపడుతాయి. అటువంటి విపత్కర పరిస్థితులలో కూడా ఏమాత్రం చలించక, ఓర్పుతో తనను తాను నిగ్రహించుకొని, ఓర్మిని ప్రదర్శించి ఏమాత్రం దిగజారకుండా, ఆత్మవంచన చేసుకొనకుండా, హుందాతనంగా వ్యవహరించడం విజ్ఞుల లక్షణం. ఓర్పు, ఓర్మి, సహనములను కోల్పోయినట్లయితే; ఎంతో కాలం శ్రమించి, కష్టించి, కృషిచేసి సంపాదించిన పేరు ప్రతిష్ఠలు ఒక్కక్షణంలో భస్మీపటలం అయిపోతాయి.

సంపాదించడం ఒక ఎత్తు, దానిని నిలబెట్టుకోవడం మరొక ఎత్తు. ఈ సద్గుణములు లోపించడంవలననే ఎంతో మంది, తపఃసంపన్నులు ఎందుకూ పనికిరాకుండా పతనమైపోయారు. రాజాధిరాజులు తమ రాజ్యాలను కోల్పోయినారు. పండితులు భ్రష్టులైపోయినారు. కనుక ఏదైనా ఒక క్లిష్టసమస్య ఉత్పన్నమైనప్పడు,తొందరపడక, ఎంతో చాకచక్యంగా వ్యవహరించాలి. ఓర్పుతో దాని లోతుపాతులను అమూలాగ్రంగా తెలుసుకోవాలి. ఓర్మిని ప్రదర్శించి, సహనంతో పరిశీలించి, దానిని పరిష్కరిం చేందుకు కృషి చేయాలి. తొందర పనికిరాదు. తొందరపాటు వలన సఫలీకృతం అయ్యే కార్యం కూడా చెడిపోతుంది. ఎదుటి వ్యక్తి కోపంతో, ఉద్రేకంతో మాట్లాడు తున్నప్పటికి, మనం మాత్రం తొందరపడకూడదు. సహనంతో ప్రశాంతంగా వినడం నేర్చుకోవాలి. ఓర్పును వహించి, అతను మాట్లాడటం అయిపోయిన తరువాత, శాంతంగా, నెమ్మదిగా, ఎదుటి వాని మనస్సు బాధ పడకుండా లౌకికంగా, నేర్పుతో సమాధానం చెప్పడం అలవాటు చేసుకోవాలి, భర్తృహరి 'క్షమ' ను కవచంతో చక్కగా పోల్చాడు. 'క్షమ' అనగా 'ఓర్పు'. అవమానాదులు, ఇక్కట్లు కలుగుతున్నప్పడు, కోపతాపములకు ఎట్టి అవకాశం యివ్వకుండా, ఓర్పుగా, ఓర్మి అనే సద్గుణం అడ్డుగోడలావుండి మానవుడ్ని రక్షిస్తుంది. 'ఓర్పు' అనే కవచం గల వ్యక్తిని ఈ భౌతికమైన కష్టాలు నష్టాలు ఏమీ చేయలేవు. కనుక అటువంటి అభేద్యమైన క్షమా కవచమును ప్రతి ఒక్కరూ సంపాదించాలి. చెప్పడం తేలికే. కాని ఆచరించడం మాత్రం బహు కష్టం. ఎంతో సాధన, ఏకాగ్రత, పట్టుదల వుంటేగాని ఈ సద్గుణాలు అబ్బవు. వీటిని సాధించి సంపాదించిన వారికి మాత్రం యింకా ఎట్టి భయమూ వుండదు. కనుక ఈ సద్గుణాన్ని సంపాదించడానికి ప్రతి ఒక్కరూ తీవ్ర ప్రయత్నం చేయాలి.

## 15. అసూయ - ద్వేషం

ఈ అసూయ ద్వేషాలు రెండూ తోడుదొంగలు. ఇవి వేరు పురుగులాంటివి. నవనవలాడుతూ పెరిగి పూత పూసి కాయలు కాస్తున్న చెట్టును, ఏ విధంగా వేరు పురుగు కుదుట్లోచేరి, ఆ చెట్టును సర్వనాశనం చేస్తుందో, అదేవిధంగా అసూయా ద్వేషాలనే తోడు దొంగలు మనిషిలో ప్రవేశిస్తే, అంతటితో ఆ వ్యక్తి పతనం కావటం ఖాయం. ఎన్నో సంవత్సరాల నుంచి సాధించి సంపాదించిన సద్గుణములన్నీ తృటిలో బూడిదపాలై పోతాయి. ఈర్ష్య కంటే పరమ శత్రువు మరొకటి లేదు. వీటి స్వరూపం కడు విచిత్రంగా వుంటుంది. ఎట్టి ప్రయోజనాన్ని ఆశించకుండానే ఇవి తమ పనులు చేస్తుంటాయి. వాటికి లొంగిన మరుక్షణంలోనే మనిషి పతన మవుతాడు. తనకన్నా మంచి మార్కులను సంపాదించేవాడిని చూచి ఓర్వలేక

పోవడం, తనకన్నా తెలివిగల వాడిని చూచి ఈర్ష్యపడటం, సుఖంగా, హాయిగా, ఎట్టి కలతలు లేకుండా, ఐకమత్యంగా బ్రతుకుతున్న వారిని చూచి అసూయ చెందటం, తనకన్నా ఉన్నత స్థానంలోనున్న వారిని ద్వేషించడం లాంటి అవాంఛనీయమైన దుర్గుణములను ఇవి ప్రోత్సహిస్తుంటాయి. వాటికి అవకాశం యిచ్చిన వారికి ఎప్పడో ఒకప్పడు పరాభవం తప్పదు. కనుక ప్రతి వ్యక్తీ ఈ దుర్గుణములకు దూరంగా వుండాలి. విశాల భావమును అలవరుచుకోవాలి. మనకన్నా తెలివితేటలు గల వారిని చూచి అసూయపడరాదు, సంతోషపడాలి. పట్టుదలతో యింకా ఎక్కువ మార్కులను తెచ్చుకోవాలనే కుతూహలం వుండాలి. ప్రతివ్యక్తిలో Sportive Spirit వుండాలి. ఆత్మస్తుతి, పరనిందలు కూడా ఈ కోవకు చెందినవే. ఎంతసేపటికీ తననుతానే పొగడుకోవటం, ఇతరులను కించపరచే విధంగా మాట్లాడటం, ఎందుకూ పనికిరానివారని భావించి నిందించడం లాంటివన్నీ దుర్గుణాలే. ఈ దుర్గుణాలు మనలో చేరితే దుష్టభావాలు పెరుగుతాయి. ఇవి అభివృద్ధికి ఆటంకంగా నిలుస్తాయి, ప్రగతిని నిరోధిస్తాయి. కనుక ఈ దుర్గుణాలను దరికి చేరనివ్వకుండా అవసరమైన జాగ్రత్తలు తీసుకోవాలి.

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలలో మన పెద్దలు, అనుభవజ్ఞులు, శాస్త్రములు ప్రబోధించిన పదునాలుగు సద్గుణములను గురించి వివరించినాను. ఒకే ఒక దుర్గుణమును గురించి మాత్రమే (అసూయ - ద్వేషం) ప్రస్తావించాను. బండెడు కట్టెలు సహితం ఒకే ఒక చిన్న నిప్పరవ్వతో భస్మీపటలం కాగలవు. ఒక చిన్న విషపు బొట్టుతో కడివెడుపాలు ఎందుకూ పనికిరాకుండా కలుషితం అయిపోతాయి. అదే విధముగా మానవునిలో అన్ని సద్గుణములున్న, ఒక దుర్గుణంతో ఎందుకూ పనికిరాకుండా సర్వనాశనం అయిపోతాడు. కనుక ఈ జీవనరంగంలో బహు జాగ్రత్తగా మసలుకోవాలి. అసూయా ద్వేషాలకు చోటు యివ్వరాదు. సోమరితనం, అహంకారం, క్రోధం, స్వార్థం లాంటి దుర్గుణాలను దరికి కూడా చేరనీయరాదు. పిల్లలను త్వరగా, అతి సులువుగా వలలో వేసుకొనే మరొక దుర్గుణం కూడా ఉన్నది. అదే చాడీలు, కొండెములు చెప్పటం. ఇటువంటి చెడు అలవాటు సహజంగా చాలామంది పిల్లలలో ఉంటుంది. దీనిని కూడా దరికి చేరనీయరాదు. మంచిపేరు తెచ్చుకోవటం చాలాకష్టం. చెడ్డ పేరు ఒక్క క్షణంలో తెచ్చుకోవచ్చు. కష్టం అయినప్పటికీ ప్రతిఒక్కరూ మంచిపేరు తెచ్చుకోవటానికే ప్రయత్నించాలి. ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి, అహంకారాన్ని త్రుంచివేయాలి. స్వార్థ సంకుచితత్వాలను విడనాడాలి. విశాలభావాన్ని అలవరచుకోవాలి. క్రోధానికి వీడ్కోలు, శాంతికి స్వాగతం పలకాలి. దుర్బలత్వానికి స్వస్తి చెప్పాలి. ధైర్యానికి స్వాగతం చెప్పాలి. సోమరితనాన్ని దరికి చేరనీయరాదు. **"An idle man's brain**

**is a devil's work shop**" (సోమరితల దయ్యాల కొంప) అన్నారు గదా! ఏ పనీ చేయకుండా తిని తిరిగే వానిని "**సోమరిపోతు**" అని అంటారు. సోమరితనం ప్రగతికి తీరని ఆటంకం. అందులో ఇది పిల్లలపాలిటి పరమ శత్రువు. ఇది పిల్లలలో ప్రవేశిస్తే వారి భవిష్యత్తు సర్వ నాశనం అవుతుంది. కనుక ఎటువంటి పరిస్థితుల లోనూ ఈ చెడుగుణాన్ని దూరంగా పారద్రోలాలి. కనుక దుర్గుణములను దూరంగా ఉంచి, సద్గుణములను అలవరచుకొని, సద్బుద్ధితో, సత్ప్రవర్తనలతో మంచి పౌరులుగా తయారుకావాలి.

మన వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు విజ్ఞానానికి నిలయాలు. అవి మహా సాగరములలాంటివి. ఈ మహా సాగరములోని నీటిని ఎన్ని పంపుసెట్లు పెట్టి తోడినా ఏమాత్రం తరగదు. ఎంతో నీరు నిత్యమూ సూర్యుని వేడికి ఆవిరై మేఘ రూపమును ధరించి, మనకు తిరిగి వర్షం ద్వారా నీరు లభిస్తున్నది. తద్వారా పంటలు పండి దేశం సస్యశ్యామల మవుతున్నది. ఎంత జలం అదృశ్యమవుతున్నప్పటికీ సముద్రం ఒక్క అంగుళమైనా తరిగినట్లుగా కనిపించడం లేదు. యధాతథంగానే కనిపిస్తున్నది. అట్లే "**జ్ఞాని**" కూడా మహా సాగరం లాంటి వాడే. అట్టి జ్ఞానానికి నిలయములైన మన పవిత్ర గ్రంథములు కూడా "**జ్ఞాన సముద్రాలే**". ఎవరి ఓపికను బట్టి, సామర్థ్యమును బట్టి వారు ఆ జ్ఞానమును ఆస్వాదించవచ్చును. అర్థం చేసుకొని ఆకళింపు చేసుకొన వచ్చును. నేర్చుకొనిన విషయాలను, సముపార్జించిన జ్ఞానమును తిరిగి ప్రపం చానికి వెదజల్ల వచ్చును. అటువంటి విశేషం, గొప్పతనం, విజ్ఞాన ఖని మన శాస్త్రము లలో ఉన్నది. దానిని పూర్తిగా అవగాహన చేసుకోవాలంటే సంస్కృతం రావాలి.

సంస్కృతం అనగానే మనలో చాలామందికి ఒక దురభిప్రాయం ఉన్నది. అది మృతభాషయని, సనాతనులు, ఛాందసుల భాష అనే అభిప్రాయం మనలో పాతుకొనిపోయింది. అది ఏదో అర్థం కాని వ్యర్థమైన భాషయని, అర్థంకాని మంత్రాలని, యజ్ఞయాగాది క్రతువులకు, కర్మకాండలకు, వివాహములకు ఉపయోగపడే మంత్రాలని ఛాందసులైన పండితులు వల్లించే భాషయనే అభిప్రాయం చాలామందిలో నాటుకొని పోయింది. ఈ భావాన్ని ముందుగా మన మనస్సులలో నుండి తీసిపారేయాలి.

సంస్కృతం అమృతభాష. భారతీయ భాషలన్నింటికి తల్లి వంటిది. దానిలో విజ్ఞాన సర్వస్వం ఇమిడి ఉన్నది. ఈనాడు ప్రపంచంలోని అనేక విశ్వవిద్యాలయా

లలో సంస్కృతం ప్రత్యేకంగా అధ్యయనం చేయబడుతున్నది. అమరవాణి దానిలో ఉన్నది. మన సంస్కృతికి నిలయం సంస్కృతం. సమస్త భారతీయ భాషలకు స్ఫూర్తి కేంద్రం సంస్కృతం. జర్మనీలోని కొన్ని విశ్వవిద్యాలయము లలో సంస్కృతం నిర్బంధంగా బోధించబడుతున్నది. కాబూల్ విశ్వవిద్యాలయంలో కూడా సంస్కృతం బోధించ బడటం విశేషం. ఆవిధంగా విదేశీయులే సంస్కృత భాష యందు ఆసక్తిని చూపుతుంటే, మన ప్రజలలో మాత్రం అట్టి ఆసక్తి లేకపోవటం కడు విచారకరం. మన ప్రభుత్వం కూడా సంస్కృతాభివృద్ధికి అవసరమైన ప్రోత్సాహమును యివ్వక పోవటం అత్యంత శోచనీయం.

వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిష్యం మొదలగు ఎన్నో అమూల్యమైన విషయాలను మన మహర్షులు సంస్కృతంలో వ్రాసి ఉంచారు. అందులో ఖగోళ శాస్త్రం, ధర్మశాస్త్రం, నీతి శాస్త్రం, తర్క శాస్త్రం, సంగీత శిల్ప శాస్త్రములు ఇంకా.... ఇంకా..... ఎన్నో........ ఎన్నో....... అమూల్యమైన శాస్త్రములు మనకు సంస్కృతంలోనే అందించబడ్డాయి. ప్రముఖ పాశ్చాత్య ఖగోళ శాస్త్రవేత్త "కౌంట్‌స్జర్నా" మన ఖగోళ శాస్త్ర విజ్ఞానం, జ్యోతిష్యశాస్త్ర పరిజ్ఞానం చూచి ఆశ్చర్యపోయాడు. సర్. డబ్ల్యూ హంటర్ "భారతీయ ఖగోళ శాస్త్రం, గ్రీకులకన్నా ఎన్నో రెట్లు మిన్న" అని ప్రశంసించాడు. మన ప్రాచీన వేద శాస్త్రములలో కేవలం ఆధ్యాత్మిక సత్యాలే కాక, ఈనాటి 'సైన్సు' అనే విజ్ఞాన సాంకేతిక అణు సిద్ధాంత రహస్యాలు కూడా ఎన్నో ఉన్నాయి. జర్మన్ పండితులు అటువంటి భాగములను అధర్వణ వేదము నుండి సంగ్రహించి, పరిశోధనలను, జరిపి సరిక్రొత్త విషయాలను కనిపెట్టి ప్రపంచానికి అందిస్తున్నారు. మన ఋషులు వ్రాసిన నాడీ జాతక గ్రంథములు, జ్యోతిష, ఆయుర్వేద, రసాయన, విషవైద్య పాశుపత (Veterinary), ఖగోళ, భూగోళ, గణిత శాస్త్రములు గల తాటియాకు సంస్కృత గ్రంథములను మణుగుల. కొద్దీ ఏనాడో విదేశీయులు తరలించుకొని పోయినారు. మన భారతీయ సంస్కృతి ఒకనాడు దేశ విదేశాలకు వ్యాపించింది. మన అమరవాణి సంస్కృతం దేశ విదేశాలలో ప్రముఖ స్థానమును ఆక్రమించింది. కనుక మన సంస్కృతీ ఔన్నత్యాలను చక్కగా అర్థం చేసుకోవాలంటే మనం సంస్కృతమును తప్పనిసరిగా అధ్యయనం చేయాలి.

ఇక ఉంటా....

ఇట్లు

మీ నాన్న

సెంట్రల్‌జైలు, రాజమండ్రి
23-12-1976

ప్రియమైన జయ,

ఈ వారంలో ఈ ఉత్తరం అధికారుల ప్రత్యేక అనుమతితో వ్రాయగలుగు తున్నాను. ఉత్తరాలు కొండవీటి చేంతాడులాగే పెరిగిపోతున్నాయి. నీకు కూడా విసుగ్గానే ఉండవచ్చును. అనుకున్నది పూర్తి అయ్యేంతవరకు విశ్రమించననే విషయం నీకు తెల్సిందే కదా! **"ఆలస్యం అమృతం విషం"** అన్నారు కదా అనుభవజ్ఞులు. ఒకరోజున కర్ణుడు నలుగు పెట్టుకొని అభ్యంగన స్నానం చేస్తుంటాడు. నవరత్నము లతో పొదగబడిన బంగారు పాత్రలో నూనె, మరొక బంగారు పాత్రలో సున్నిపిండి ప్రక్కనుంచుకొని తానే స్వయంగా తలంటుకుంటున్నాడు. ఆ సమయంలో శ్రీ కృష్ణుడు కర్ణుని వద్దకు వచ్చి ఆ నవరత్నఖచితమగు, మరకత మాణిక్యములు పొదగ బడిన ఆ బంగారు పాత్రను తనకివ్వమని కోరుతాడు. ఆ దానకర్ణుడు ఏమాత్రం సంకోచించకుండా తక్షణమే ఎడమచేతితో ఆ నవరత్న బంగారు పాత్రను శ్రీకృష్ణునికి యివ్వబూనుతాడు. కుడిచేతితో తలంటుకుండటం వలన ఎడమచేతితో యివ్వడానికి సిద్ధమవుతాడు. అయితే శ్రీకృష్ణుడు దానిని స్వీకరించ నిరాకరిస్తూ "కర్ణా! ఎడమచేతితో దానమివ్వుట, ఏమాత్రం శాస్త్ర సమ్మతం కాదని నీకు తెలియదా? అని ప్రశ్నిస్తాడు. అప్పుడు కర్ణుడు

**"క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవిత మావయోః**
**యమస్య కరుణా నాస్తి ధర్మ స్య త్వరితాగతిః"**

అనగా "ఇప్పడున్న భావం మరుక్షణంలో ఉండకపోవచ్చును. యమ ధర్మరాజుకి కరుణ ఉండదు. ఎప్పడు ఎవరిపైన అతని చూపు పడుతుందో చెప్పలేము. జీవుల ధర్మబుద్ధి త్వరితగతిన మారుచుండును" అని కర్ణుడు సమాధానం చెప్పెను. మరియు **"నూనె చేతిని అనగా కుడిచేతిని కడుక్కొనే లోపులో నా బుద్ధి ఏ విధంగా మారిపోతుందో! ఎవ్వరం చెప్పలేం గదా! అసలు అంతవరకు, జీవితం ఉంటుందో లేదో. అసలే చెప్పలేము. కనుక నాలో, నీకు యివ్వాలనే తలంపు కల్గిన వెంటనే ఏమాత్రం ఆలస్యం చేయక ఎడమచేతితోనే యివ్వ సంకల్పించాను. అంతేగాని శాస్త్ర పరిజ్ఞానం లేకపోవటం వల్ల కాదు"** అని సమాధానం కర్ణుడు చెబుతాడు.

కర్ణుని ఆధ్యాత్మిక పరిజ్ఞానానికి, త్యాగనిరతికి శ్రీకృష్ణుడు సంతోషపడుతాడు. అదే విధంగా భావాలు దొర్లినప్పడే కలాన్ని కదిలించాలి. ఆలస్యం చేస్తే వచ్చిన అవకాశాన్ని చేజేతులారా జారవిడుచుకున్న వారమవుతాం. అందువల్లనే వెంటవెంటనే ఉత్తరాలు వ్రాసి వేస్తున్నాను.



# యోగశాస్త్రము

ఈ ఉత్తరంలో "యోగశాస్త్రము" ను గురించి కొంత వివరిస్తాను. మన పూర్వీకులు 'యోగశాస్త్రము' నకు మంచి ప్రాముఖ్యత నిచ్చారు. పతంజలి మహర్షి ప్రవచించిన 'యోగశాస్త్రం' నేడు ప్రపంచంలోని అనేక అభ్యుదయ దేశాలలో అధ్యయనం చేయబడుతున్నది. 'యోగాసనాలు' నేర్పే విద్యాలయాలు ఈనాడు అమెరికా, రష్యా దేశాలలో ఎన్నో వెలిసాయి. యోగాభ్యాసం, ధ్యానయోగం అనగానే చాలామంది ఇదేదో వేదాంత పరమైన ప్రక్రియ అని భావిస్తున్నారు. కొంతమందికి అరణ్యాలలో ఒంటరిగా కాలం గడిపే యోగులు గుర్తుకు వస్తుంటారు. కాషాయంబరములు ధరించిన సన్యాసులు జ్ఞప్తికి వస్తారు. అటువంటి బైరాగులు అభ్యసించే ఛాంధస విద్యయనే భావం చాలామందిలో పేరుకొనిపోయింది. ఇది ఏమాత్రం వాస్తవంకాదు. నేడు యోగశాస్త్రమును సాంకేతిక శాస్త్ర విజ్ఞాన దృష్టితో పరిశీలించి, పరిశోధిస్తున్నారు. ఈనాటి యాంత్రిక యుగంలో ప్రశాంత జీవితం కొనసాగించడం కష్టసాధ్యమైపోతున్నది. రకరకములైన మానసిక వ్యాధులకు గురియైపోతున్నారు. అమెరికా లాంటి నాగరిక దేశాలలోని ప్రజలకు రాత్రిళ్లు నిద్రపట్టక నిద్రమాత్రలు మ్రింగుతున్నారు. గుండె జబ్బులతో, రక్తపోటు వ్యాధులతో బాధపడేవాళ్ల సంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. ఆధునిక వైద్యుల మందులు పనిచేయటం లేదు. ఈ మానసిక వ్యాధుల నుంచి బయట పడేందుకు మత్తుపానీయాలను సేవించడం మితిమీరి పోతున్నది. అందుకోసమనే ఈనాడు పాశ్చాత్య దేశాలలో మనశ్శాంతికి మార్గాలేమిటో అన్వేషణ జరుగుతున్నది. ధ్యానం, యోగం వలననే మనశ్శాంతి లభ్యమవుతుందని శాస్త్రజ్ఞులు నేడు భావిస్తున్నారు. ధనవ్యయం లేకుండా, డాక్టర్లతో, మందులతో నిమిత్తం లేకుండా కేవలం యోగాభ్యాసం ద్వారా శరీరమును ఆరోగ్యవంతంగా వుంచుకోవచ్చునని సైంటిస్టులు నేడు గుర్తించారు.

మానవునిలో అంతర్గూతమైన అనంతశక్తిని బయటకు లాగి ఉపయోగించ గల శక్తి ఈ "యోగశాస్త్రం" లో ఉన్నది. "రెండు రాత్రుల నిద్రవలన కలిగే విశ్రాంతి కేవలం 20 నిముషాలపాటు ఆచరించే ధ్యానం వలన లభ్యం కాగలదు" అని ఫెయిర్ ఫీల్డుకు చెందిన శాస్త్రజ్ఞుడు ఇంటర్‌నేషనల్ యూనివర్శిటీ ప్రెసిడెంట్, ఫిజియోలజీ ప్రొఫెసర్ అయిన డా. రాబర్ట్‌కేన్‌వెలెస్ మరియు హార్వర్డు నెన్సన్‌లు తీవ్రపరిశోధనలు జరిపి ఒక వ్యాసంలో వెల్లడించారు. ఈ ధ్యానయోగమును ను అవలంబించే విద్యార్థులలో స్మరణ శక్తి, జిజ్ఞాసా ప్రవృత్తి పెరుగుతుందని, మత్తు పదార్థములను సేవించడం మానుకుంటారని హవాయి యూనివర్శిటిలో పనిచేస్తున్న కాలియర్,

షీటన్, జాన్సన్‌లు పరిశోధించి చెప్పారు. పాశ్చాత్య దేశము లలో 1968 సం॥ నుంచి 1973 సం॥ వరకు రెండు లక్షలమంది విద్యార్థులు ఈ ధ్యానయోగమును నేర్చుకొనినారని, ఒక్క అమెరికాలోనే ప్రతి మాసం 14 వేలమంది విద్యార్థులు సాధన చేస్తున్నారని చెప్పారు. ఇటీవల ఢిల్లీలో జరిగిన ఇంటర్ నేషనల్ ఫిజియోలజి కాంగ్రేస్ 26 వ మహాసభలో డా॥ రాబర్ట్‌కేన్‌వెలెస్ మాట్లాడుతూ "**మానసికవికాసంతోపాటు, వ్యక్తిత్వాన్ని సహితం ధ్యానయోగం పెంపొందిస్తుంది. వినమ్రత వస్తుంది. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. కార్యదక్షత అభివృద్ధి చెందుతుంది. ఉద్రేకభావాలు, హింసాత్మక ప్రవృత్తి అంతరిస్తుంది. నిద్రపట్టక పోవటం అంటూ వుండనే వుండదు. మద్యం, సిగరెట్లు మరియు ఇతర మత్తు పదార్థముల పట్ల హేయభావం కలుగుతుంది.**" అని చెప్పారు. న్యూమెక్సికోలోని ఖైదీలకు ధ్యానయోగం నేర్పి పరిశోధనలు చేయగా, రెండు మాసాలలోనే వాళ్ళ మానసిక స్థితిలో ఎంతో మార్పు వచ్చినట్లు వెల్లడైంది. హార్టుఫోర్డు ఇనిస్టిట్యూట్ ఆఫ్ లివింగ్ డైరక్టర్ ధ్యానయోగం మెంటల్ ట్రీట్‌మెంట్‌కు ఎంతో ఉపయోగకరమైనదని చెప్పారు. హార్‌వర్డ్ యూనివర్శిటీకి చెందిన డా॥ శ్వార్‌టోజ్ ధ్యానయోగం అనేది అత్యంత సహజమైనది, లాభదాయకమైనదని, అటవిక జాతికి చెందిన ఒక తెగ రోజూ కొద్ది సేపు ప్రశాంతంగా ఒక చోట కూర్చుంటారని అని అంటూ, బహుశా వాళ్ళు ధ్యానయోగమును అవలంబిస్తూ ఉండ వచ్చునని అంటాడు. కోతులు కూడా రోజూ కొంతసేపు మౌనంగా కూర్చుంటాయని కూడా చెప్పాడు. ఈ విధంగా ధ్యానయోగమును, యోగశాస్త్రమును పరిశీలించి, పరిశోధించి ఆధునిక శాస్త్రవేత్తలు తమ అభిప్రాయములను వెలిబుచ్చుతున్నారు. వీటియెడల విదేశాలలో రాను రాను మోజు పెరిగిపోతున్నది. అయితే వీటికి పుట్టినిల్లు అయిన మన దేశంలో మాత్రం విలువ లేకుండా పోతున్నది. మన ప్రభుత్వం వైపునుంచి కూడా ప్రోత్సాహం లభించకపోవడం శోచనీయం. అయితే ఒక్కటి మాత్రం వాస్తవం. ఈనాడు ప్రపంచంలో విజ్ఞాన పథంలో అగ్రగాములమని విర్రవీగుతున్న దేశాల కన్నా మిన్నగా మన వేదకాలంలోనే మన దేశం అభివృద్ధి చెందినదని చెప్పటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

ధన్వంతరి, నాగార్జునుడు మొదలైనవారు ఆ కాలంలోనే తీవ్రమైన పరిశోధనలు జరిపి వివిధ రకములైన రోగములకు ఔషధాలను కనిపెట్టారు. ఒక్క భౌతిక శాస్త్ర విజ్ఞానమునకు పరిమితం కాకుండా, నైతిక విలువలను పెంపొందిం

చేందుకు అవసరమైన నీతిశాస్త్రములు ధర్మ శాస్త్రములను ఎన్నో మన మహర్షులు మనకందించారు. మనుధర్మ శాస్త్రము, గౌతముని న్యాయశాస్త్రము, యాజ్ఞవల్క్య పరాశర స్మృతులు ప్రసిద్ధములు. సమాజ అభివృద్ధికి అవసరమైన నియమ నిబంధనలు పేర్కొనినారు. నైతిక విలువలను పెంపొందించేందుకు అవసరమైన నీతి సూక్తులను కూడా అందించారు. ఆర్థిక స్థితిగతులను మెరుగుపరచడానికి అవసరమైన, ఆచరణయోగ్యమైన పథకములను రూపొందించారు. అలనాటి చాణుక్యుని 'అర్థశాస్త్రము'ను చూచి ఈనాటి మేథావులు, ఆర్థిక శాస్త్రవేత్తలు నోరు మెదపలేకపోతున్నారు. దురదృష్టవశాత్తు మనదేశం విదేశీ దండయాత్రలకు గురియైంది. ముఖ్యంగా మహమ్మదీయ పాలనలో మన విజ్ఞాన సర్వస్వం, నాగరికత సర్వనాశనం చేయబడింది. అమూల్యమైన ప్రాచీన గ్రంథాలెన్నో తగులబెట్ట బడినాయి. తరువాత వచ్చిన బ్రిటీష్ పాలనలోకూడా ఇదే ఘోరం జరిగింది. అంతటితో వాళ్లు సంతృప్తి చెందలేదు. చరిత్రనే తారుమారు చేశారు. భారతీయులు అటవికులని, కందమూలాలు తిని, ఆకులలములు కట్టుకొని జీవించే అనాగరిక జాతి అని తప్పడు చరిత్రను సృష్టించారు. భారతీయ నాగరికతను ఛిన్నాభిన్నం చేసారు. బ్రిటిష్ పాలనా సమయంలో కూడా అతినైపుణ్యం గల 'డక్కా మజిలీస్' అని ప్రసిద్ధి పొందిన నేతగాండ్రు వుండేవారు. వారు నేసిన 9 గజముల చీరె అగ్గిపెట్టెలో సరిపోయేదిట. అటువంటి వారందర్ని హతమార్చారు. మన సంస్కృతి నాగరికతలను, హస్తకళలను సమూలంగా సర్వనాశనం చేసినారు. ఒకప్పడు యావత్ ప్రపంచంచేత మెచ్చుకోబడిన మన సంస్కృతి నాగరికతలు, శిల్ప సౌందర్యాలు, హస్తకళలు, అష్టాదశ కళలు మహమ్మదీయులు మరియు ఆంగ్లేయుల కబంధ హస్తములలోపడి నలిగి నశించిపోయినాయి. ఇది మన దురదృష్టం. మరల గత వైభవాన్ని మనం కళ్లారా ఎప్పడు చూడగలుగుతామో! ఆ స్థితికి మరల ఎప్పడు చేరుకుంటామో!

ఇక ఉంటా.

ఇట్లు 'నీ'

---

*"స్వేచ్ఛ అనే వృక్షం ఎప్పటికప్పడు దేశభక్తుల రక్తతర్పణతో మాత్రమే వికసింప గల్గుతుంది"*

*- శ్రీ థామస్ జఫర్‌సన్*

సెంట్రల్‌జైలు, రాజమండ్రి
27-12-1976

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు అందినాయి. ఈ ఉత్తరములో మన ప్రాచీన వైభవాన్ని గురించి కొంత వివరిస్తాను.

వందలాది సంవత్సరములు విదేశీ పాలన క్రింద మన పవిత్ర భారత భూమి నలిగిపోయినప్పటికీ, మన సంస్కృతీ నాగరికతలు ఛిన్నాభిన్నములైనప్పటికీ, ఇంకా ఎన్నో అమూల్యమైన విషయాలను తెలిపేటటువంటి శాస్త్రాలు జీర్ణావస్థలో యింకా ఉన్నాయి. అపూర్వమైన గత వైభవాన్ని నిరూపించేటటువంటి స్మృతి చిహ్నాలు సాక్షికంగా నయినా యింకా కొంత అజంతా, ఎల్లోరా, హంపి, మహాబలిపురం, ఓరుగల్లు, అమరావతిలలో నేటికీ మనకు కనబడుతాయి. కాని వాటిని పరిశీలించి, వాటిలోని మహత్తును గొప్పతనాన్ని, విజ్ఞానాన్ని ప్రజాబాహుళ్యానికి తెలియబరచేవారే కరువైనారు. ఒకవేళ ఎవరైనా ఆసక్తితో కృషిసల్పేవారుంటే, అటువంటి వారికి అవసరమైన సహాయ ప్రోత్సాహాలు ప్రభుత్వం నుండి లభించడంలేదు. మన పురాతన గ్రంథములలో సర్వోత్కృష్టమైన సాహిత్య సంపద ఉన్నప్పటికినీ, అవసరమైన తత్త్వశాస్త్రం ఉన్నప్పటికినీ, విజ్ఞానాభివృద్ధికి (Scientific Development) తోడ్పడేటటువంటి విజ్ఞాన సర్వస్వం ఉన్నప్పటికినీ, దానిని బయటకు తీసి పరిశోధనలు జరిపేందుకు అవసరమైన వనరులు (Resources) లేకపోవటం కడు విచారకరం. పై పెచ్చు ఈనాటి యువకులలో అట్టి ఆసక్తిగాని, పట్టుదల గాని లేకపోవటం మిక్కిలి దురదృష్టకరం. రానురాను మనవాళ్లకు స్వదేశం మీద దురభిమానం, విదేశాల మీద అభిమానం పెచ్చు పెరిగిపోతున్నది. **'పొరుగింటి కూర పుల్లన'** అన్నట్లుగా మనవాళ్లకు విదేశాలమీద మోజు ఎక్కువైపోతున్నది. ప్రతి చిన్న విషయానికి విదేశాలవైపుకు చూడడం అలవాటైంది. రోజురోజుకు విదేశీ వ్యామోహం పెచ్చుపెరిగిపోతున్నది. వైద్యవిద్యలోను, సాంకేతిక విద్యలలోను ఉత్తీర్ణులైన వేలాదిమంది భారతీయ యువకులు, ధనసంపాదనకోసం విదేశాలకు తరలి వెళుతున్నారు. అటువంటి వారికి స్వదేశంలో కూడా తగిన ప్రోత్సాహం లభించక పోవటం కూడా ఒక కారణం. వారికి తగిన ఉద్యోగాలను మన ప్రభుత్వం చూపించ లేకపోతున్నది. అయితే సాంకేతిక సహాయం పేరుతో విదేశాల నుంచి అనేకమంది **'నిపుణులు'** మన దేశం వస్తున్నారు. వారికి హెచ్చుమొత్తంలో మన ప్రభుత్వం ఖర్చు పెడుతున్నది. మన మేధావులు విదేశాలకు పరుగిడుతున్నారు. విదేశాలలోని మూడవ శ్రేణి నిపుణులు మన నెత్తిమీద వచ్చి కూర్చుంటున్నారు. ఈ విధంగా రెండు విధాలా మనం నష్టపోతున్నాం. కనుక మన ప్రభుత్వ ఆలోచనాసరళి కూడా మారాలి.

ఈనాడు ప్రతి చిన్న విషయానికి విదేశాలను అనుకరించడం మనకు ఫ్యాషన్ అయింది. ముఖ్యంగా ఈ అనుకరణ వ్యామోహాన్ని విడనాడాలి. స్వాభిమానంతో స్వదేశాభివృద్ధికి కృషి చేయాలి. తాను ఆర్జించిన విజ్ఞానాన్ని తన దేశ ప్రజల అవసరాలను తీర్చేందుకు వెచ్చించాలనే పట్టుదల మన యువకులలో కలగాలి, పెరగాలి. అటువంటి అభిప్రాయం కలగటానికి అవసరమైన ప్రోత్సాహం కూడా మన ప్రభుత్వం నుండి రావాలి. ప్రతివారు సైన్సుకు ప్రముఖస్థానం యివ్వాలి. సాంకేతిక విద్యలనభ్యసించాలి. శాస్త్రీయ దృక్పథమును (Scientific out look) పెంపొందించుకోవాలి. పరిశోధనలను జరిపి, అమూల్యమైన సమాచారాన్ని సేకరించాలి. చక్కగా అధ్యయనం చేయాలి, క్రొత్త విషయాలను కనిపెట్టాలి.

అనుభవంలోనికి రాని విద్యవల్ల ప్రయోజనం శూన్యం. వట్టి శాస్త్ర జ్ఞానం వలననే ప్రయోజనం లేదు. శాస్త్రముల నుండి నేర్చుకొనిన, సముపార్జించిన జ్ఞానాన్ని ఆధారం చేసుకొని, స్వంత బుద్ధి నుపయోగించి, పరిశీలించి, పరిశోధించి, ప్రయోగాలను జరిపి, మానవాభ్యుదయానికి అవసరమైన సరిక్రొత్త నూతన విషయాలను కనిపెట్టాలి. అటువంటి జ్ఞానమే నిజమైన జ్ఞానము. అదే విజ్ఞానము, అదే అనుభవజ్ఞానం, అదే వివేకజ్ఞానం, అదే లౌకిక జ్ఞానం కూడాను. ఈ జ్ఞానములను గురించి కొంత వివరిస్తాను.

**"జ్ఞానం"** యొక్క స్వరూపాన్ని ఇంతవరకు వివరించాను. ఒక్క జ్ఞానం వల్లనే ప్రయోజనం లేదు. ఈ సందర్భమున పండిత నెహ్రూ గారి అభిప్రాయములను ప్రతి ఒక్కరూ తెల్సుకోవాలి. **"Knowledge without action is abortion, action without knowledge is foolishness"** కార్యాన్ని సాధించలేని జ్ఞానం నిష్ప్రయోజనం, జ్ఞాన రహితమైన కార్యం మూర్ఖమైనది అన్నారు నెహ్రూగారు. కనుక చక్కటి జ్ఞానంతో పాటు పరోపకారము కొరకు విజ్ఞానాన్ని కూడా ప్రతి ఒక్కరూ సంపాదించి తీరాలి. శాస్త్రాధ్యయనం వలన పొందిన పరోక్ష జ్ఞాన రూపమగు పాండిత్యము పరులకు బోధించడానికి మాత్రమే ఉపయోగపడుతుంది. కేవలం శాస్త్ర పరిజ్ఞానం మాత్రమే మానవుని ఉద్ధరించదు. విజ్ఞానం కూడా అవసరం. విజ్ఞానం యొక్క స్వరూపం మూడు రకాలుగా ఉంటుంది. "**1. అనుభవ జ్ఞానం** (Practical Knowledge), **2. వివేక జ్ఞానం** (Intellectual Knowledge), **3. లౌకిక జ్ఞానం లేక ప్రపంచ జ్ఞానం** (Worldly Knowledge). **ఈ మూడింటిని సంపాదించిన వారినే 'విజ్ఞానులు' అని అంటారు".**

విజ్ఞానం లేని విద్య రాణించదు. అనుభవం లేని చదువు, వివేకం లేని విజ్ఞానం, లౌకికం లేని మనిషి, విచక్షణలేని పని, విజ్ఞతలేని పాండిత్యం, అర్హత లేని

అధికారం, స్వేచ్ఛలేని స్వాతంత్ర్యం, సత్యములేని వాక్కు, మాధుర్యము లేని సంగీతం, విశ్వాసం లేని భుజమాని, క్రమశిక్షణ లేని సమాజం, దేశభక్తిలేని రాజకీయాలు, శీలం లేని వ్యక్తి, భక్తి లేని పూజ, వినయం లేని విద్యార్థి, విద్యాబోధన చేయలేని ఉపాధ్యాయుడు, సభికులను మెప్పించలేని ఉపన్యాసకుడు వలన ఏమాత్రం ప్రయోజనం లేదు. శ్రమ తప్ప ఫలితం శూన్యం.

అందువలన ప్రతి వ్యక్తిలో ఉండితీరవలసిన పై మూడు జ్ఞానములను గురించి వరుసగా వివరిస్తాను.

## 1. అనుభవజ్ఞానము (Practical Knowledge)

శాస్త్ర జ్ఞానంతోపాటు ప్రతి ఒక్కరు అనుభవ జ్ఞానమును కూడా సంపాదించాలి. అనుభవంలోనికి రాని విద్యా విజ్ఞానాదుల వల్ల ప్రయోజనం ఏమీ ఉండదు. మనిషిలో నిలకడగా నిల్వ ఉన్న జ్ఞానం వట్టి వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలిచిపోతుంది. దానిని అనుభవంలోనికి తీసుకొనిరావటంలోనే ఉన్నది గొప్పతనం. ఇట్టి అనుభవం పొందటం ఎలా? ఇట్టి అనుభవ జ్ఞానమును పొందవలెనగిన మానవుడు మూడు దశలను దాటవలెను. 1. జ్ఞాతుం (తెల్సుకొనుట), 2. ద్రష్టుం (చూచుట), 3. ప్రవేష్టుం (ప్రవేశించుట) ఇప్పుడు ఒక్కొక్క దానిని గురించి వివరిస్తాను.

**1. జ్ఞాతుం :** శాస్త్రములలో నున్న అమూల్యమైన విషయాలను గురించి గురువులు లేక అనుభవజ్ఞుల ద్వారా మొదట తెలుసుకొనవలెను. తెలుసుకొనుట వలన సహజంగా వాటియందు ఆసక్తి జనిస్తుంది. వాటిని ఏమైనా సరే చూచి తీరాలనే కోరిక ఉద్భవిస్తుంది. **2. ద్రష్టుం :** రెండవ దశలో అటువంటి శాస్త్రములు ఎక్కడెక్కడ ఉన్నాయో వెతికి చూచి సేకరిస్తాం. వాటిని ప్రత్యక్షంగా చదువుతాం, కంఠస్థం చేస్తాం, అవగాహన చేసుకుంటాం, ఆనందిస్తాం. అంతటితో కొంత ఆత్మ తృప్తి కలుగుతుంది. కొన్ని అమూల్యమైన విషయాలను తెలుసుకున్నామనే తృప్తి కలుగుతుంది. శాస్త్రజ్ఞానం లభిస్తుంది. **3. ప్రవేష్టుం :** రెండు దశలలో సంతృప్తి చెందుతే ప్రయోజనం లేదు. సాధకుడు తెలుసుకోవటంలోనే సంతుష్టి పడక; చూచుటతోనే సంతృప్తి చెందక, ఇంకను ఒక మెట్టు పైకి పోయి, దానిలో ప్రవేశించి లీనమై తాదాత్మ్యత పొందవలెను. వాటిలో లీనమై వాటిననుభవించాలి, శాస్త్ర రహస్యములను తెలుసుకోవాలి, అవగాహన చేసుకోవాలి, ఆకళింపు చేసుకోవాలి, జీర్ణం చేసుకోవాలి. తిన్నతిండి జీర్ణమై రక్త రూపమై మానవునికి ఏవిధంగా శక్తినిస్తుందో, అదేవిధంగా అనుభవంలోకి తెచ్చుకొని మానవ కళ్యాణానికి, దేశ పురోభివృద్ధికి వాటినుపయోగించవలెను.

పుస్తకములలో నున్న విషయాలను కంఠస్థం చేసి ఉపన్యాస ధోరణిలో చెప్పవచ్చును. సాధారణంగా పుస్తక పఠన ద్వారా కలిగెడి జ్ఞానము సర్వ సామాన్యమైనది. వాటిని అనుభవించి, జీర్ణం చేసుకొని ఆచరణలో పెట్టి చూపించడమే బహుకష్టం. ఆచరణలేని వారి పలుకులు గ్రామఫోన్ రికార్డు పలుకులులాంటివి మాత్రమే. అటువంటి రికార్డులకు ఎటువంటి విలువ ఉంటుందో పుస్తక పాండిత్యము (Bookkish Knowledge) గలవారికి కూడా అంతే విలువ ఉంటుంది. కనుక కన్నవి, విన్నవి, తిన్నవి కొంతవరకైనా ఆచరణ రూపం దాల్చాలి. అనుభవంలోనికి తీసుకుని రావాలి, అన్వేషణ ప్రారంభించాలి.

మన ప్రాచీన శాస్త్రములలో అనేక అమూల్య విషయాలున్నాయి. 'సైన్సు' అనే విజ్ఞాన సాంకేతిక అణు సిద్ధాంత రహస్యాలు కూడా ఎన్నో ఉన్నాయి. వాటి నన్నింటినీ శ్రద్ధతో పరిశీలించాలి, పరిశోధించాలి, రహస్యాలను తెలుసుకోవాలి, వాటిని మానవవికాసానికి ఉపయోగపడేట్లు చేయాలి. ప్రతి విద్యార్థిలో, నూతన విషయాలను కనిపెట్టాలనే తాపత్రయం తప్పనిసరిగా ఉండాలి. మహోపన్యాసా లివ్వడం చర్చా వేదిక నలంకరించడంతోనే సంతృప్తి జెందరాదు. పరిశోధనలు జరిపి క్రొత్త విషయాలను కనిపెట్టాలనే పట్టుదల ఉండాలి. అటువంటి వారు మాత్రమే లోకానికి విజ్ఞానాన్ని అందించగలుగుతారు. పై పై జ్ఞానము (Superficial Knowl-edge ) వలన ప్రయోజనం శూన్యం. అనుభవజ్ఞానానికి మించిన జ్ఞానం మరొకటి లేదు. కనుక అటువంటి జ్ఞానమును స్వశక్తితో, స్వప్రేరణతో, స్వయంకృషితో, పట్టుదలతో ప్రతి ఒక్కరు సంపాదించి దేశ పురోభివృద్ధికి తోడ్పడవలెను. వివేకజ్ఞానం, లౌకిక జ్ఞానములను గురించి తరువాత లేఖలో వివరిస్తాను.

ఇక ఉంటా...

ఇట్లు

'నీ'

---

"చట్టం అసత్యంపై నిలిస్తే దానిని ఎదురించుటయే కర్తవ్యం. అణచి వేతను అనుమతించటమంటే నేరంలో భాగం పంచుకోవటమే

- శ్రీ మహాత్మాగాంధి

సెంట్రల్ జైలు, రాజమండ్రి
29-12-1976

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలలో అనుభవజ్ఞానమును గురించి వివరించాను. ఈ లేఖలో "వివేకజ్ఞానము", "లౌకిక జ్ఞానము" ల గురించి వివరిస్తాను.

## 1. వివేక జ్ఞానము (Intellectual Knowledge)

అనుభజ్ఞానమును సంపాదించటం ఎంత అవసరమో, దానిని మంచికి, దేశకళ్యాణానికి మాత్రమే వినియోగించే 'వివేకజ్ఞానం' కూడా కల్గివుండటం అంత అవసరం. వివేకం లేని విద్య వల్ల, విచక్షణ చూపించలేని 'జ్ఞానం' వల్ల ప్రయోజనం ఏమాత్రం లేదు. వివేకం వేరు, విద్య వేరు. మంచికి చెడ్డకు మధ్య వ్యత్యాసం తెలుసుకొనుటే వివేక లక్షణం. అట్టి వ్యత్యాసమును తెలుసుకొనిన పిదప, దేనికి, ఎంత, ఎటువంటి ప్రాముఖ్యతనివ్వాలో నిర్ణయించ శక్తిసామర్థ్యములు గలదే 'విచక్షణాజ్ఞానం' అంటారు. విచక్షణా జ్ఞానం, వివేకజ్ఞానంలోని అంతర్భాగం మాత్రమే. వివేకము లేనివారికి సన్మార్గం పట్టుపడదు. మనం చేయు ప్రతిపనిలోను వివేకాన్ని ప్రదర్శించడం విజ్ఞత లక్షణం. అణుపరిశోధలను జరిపి ఒక్క క్షణంలో ప్రపంచాన్ని భస్మీపటలం చేయగల మారణాయుధాలను తయారు చేయవచ్చు. అదే అణుశక్తి ద్వారా కొన్ని కోట్ల కిలోవాట్ల శక్తి గల విద్యుచ్ఛక్తిని తయారుచేసి పరిశ్రమలను, వ్యవసాయాన్ని అభివృద్ధిపరచి, దేశాన్ని సస్యశ్యామలం కూడా చేయవచ్చు. కోట్లాది మంది ప్రజానీకానికి పని కల్పించవచ్చు. మానవుడు ఇటువంటి విషయాలలోనే తన వివేకబుద్ధిని ప్రదర్శించాలి. విజ్ఞతని చూపించాలి. తాను కనిపెట్టిన గొప్ప విషయాలను, చెడుకు, సంక్షోభానికి, సర్వనాశనానికి కాక, మంచికి, మానవ కళ్యాణానికి, అధికోత్పత్తికి ఉపయోగించుటయే 'విచక్షణాజ్ఞానం' అని అంటారు. వివేకవిచారణచే విజ్ఞానాన్ని సాధించాలి. మానవత్వ రహితమైన విజ్ఞానం వల్ల ప్రయోజనం లేదు. వివేకంతో సాధించిన విజ్ఞానాన్ని, విచక్షణాయుతంగా సమాజాభివృద్ధికి ఉపయోగించాలి. ఇట్టి వివేక, విచక్షణాజ్ఞానం గలవాడు దరిద్రుడైనను, అధికారం లేనివాడైననూ అందరిచేత గౌరవించబడుతాడు, పూజించబడుతాడు. ఇట్టి వివేక, విచక్షణాజ్ఞానరహితుడు విద్యావేత్త అయినను, మిక్కిలి ధనవంతుడైనను, ప్రముఖ శాస్త్రవేత్త అయినను ఏమాత్రం రాణించడు. వివేకజ్ఞానం కలవాడు దూరం నుండే చూచి, ఎదుటి వ్యక్తి గుణగణాలను, మనోభిప్రాయములను, మనస్తత్వాలను యిట్టే తెల్సుకొనగల్గుతాడు. అట్టి వివేకజ్ఞానం

లేనివాడు అతి సమీపమున వున్న వాటినే తెల్సుకొనలేడు. తుమ్మెద ఎంతో దూరం నుంచే తామరపుష్పాల వాసనను పసిగట్టి దానిమీద సరాసరి వచ్చి వాలుతుంది. అదే కప్ప మాత్రం దగ్గరే వుండి కూడా ఆ వాసనను ఏమాత్రం గ్రహించలేదు. అంతేకాదు వివేక, విచక్షణాజ్ఞానములు లోపించినవాడు సామాన్య ధర్మం ఏదో, విశేషధర్మం ఏదో గుర్తించలేడు, గమనించలేడు. కొన్ని కొన్ని సందర్భములలో ధర్మం ఏదో, అధర్మం ఏదో కూడా కనుగొనలేడు. ఒక మనిషి, ఎదుటి మనిషిని క్రూరంగా, అక్రమంగా చంపడం అధర్మం. కాని తన ప్రాణానికే ముప్పు సంభవించే సందర్భాలలో ఆత్మరక్షణార్ధం. తప్పని సరైన పరిస్థితులలో ఎదుటివానిని తుదముట్టించవలసి వస్తుంది. చంపటం అధర్మమని మెదలకుండా వూరుకోవడం ధర్మం కాదు. అదే విధముగా సైనికుడు యుద్ధభూమిలో తన శత్రువులను చీల్చిచెండాటం ధర్మం. మనుష్యులను చంపడం ధర్మకాదు కాబట్టి, యుద్ధభూమిలో అస్త్రసన్యాసం చేయడం సైనికుని ధర్మం కాదు. శత్రువులను తుదముట్టించడమే సైనికధర్మం. అదే విధంగా న్యాయమూర్తి హంతకులను శిక్షించడం ధర్మం. అయ్యో పాపం అని కరుణతో హంతకులను శిక్షించకుండా వదలివేయడం అధర్మం. అసత్యమాడరాదు. ఇది సామాన్య ధర్మం. కొన్ని సందర్భాలలో సత్యమాడుట వలన, అసలు ధర్మానికే ముప్పువాటిల్లే ప్రమాదం కనుక సంభవిస్తే అసత్యమాడటమే ధర్మం. సామాన్య విశేష ధర్మముల మధ్య విరోధం తటస్థించినప్పుడు, సామాన్య ధర్మమును పరిత్యజించి, విశేష ధర్మమును అనుసరించవలెను. ధర్మం చాలా సూక్ష్మమైనది. కనుక ప్రతివ్యక్తి ఏదైనా పని చేయవలసి వచ్చినప్పుడు, ముఖ్యంగా సమాజశ్రేయస్సును దృష్టి యందుంచుకొని వివేకంతో వ్యవహరించాలి. విచక్షణను ప్రదర్శించాలి. అందువల్ల ఒక్క శాస్త్రపరిజ్ఞానంతోనే సంతృప్తి చెందక, వివేక విచక్షణా జ్ఞానములను కూడా అనుభవంలో ప్రతి ఒక్కరు సంపాదించి తీరవలెను. వివేకమైన దూరదృష్టిని అభివృద్ధి చేసుకొనవలెను. అట్టి జ్ఞాన సహాయంతో యదార్ధమును గ్రహించవలెను. వాస్తవములను తెల్సుకొనవలెను. సమాజాభివృద్ధికి వాటి నుపయోగించవలెను. ఇక ఉంటా.

## 3. లౌకికజ్ఞానము

లౌకిక జ్ఞానము దీనినే ప్రపంచ జ్ఞానము అని కూడా అంటారు. అనుభవ జ్ఞానం, వివేక జ్ఞానముతోనే తృప్తి చెందక ప్రతి ఒక్కరూ లౌకిక జ్ఞానమును కూడా సంపాదించి తీరాలి. ఈ జ్ఞానం కేవలం చదవటం వలన రాదు. ఇది అబ్బ వలెననిన విస్తృతంగా దేశాటన చేయవలెను. ప్రపంచములో జ్ఞానాన్ని బోధించే అమూల్యమైన విషయాలెన్నో ఉన్నాయి. ముఖ్యంగా మనదేశంలో ప్రాచీన సంస్కృతి

వైభవాలను ప్రతిబింబించేటటువంటి శిల్పకళ ఎంతో ఉన్నది. వాటినన్నింటిని పరిశీలించి, పరిశోధించాలి, వాటి పుట్టుపూర్వోత్తరాలను తెల్సుకోవాలి. వాటి వెనుకనున్న చరిత్రను, నాగరికతను, సంస్కృతిని కనుగొనాలి. ఆయా ప్రాంతాల సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను అవగాహన చేసుకోవాలి, అధ్యయనం చేయాలి. వారితో కలసిమెలసి సంచరించాలి. వారి సాధకబాధలను, అవసరాలను గుర్తించి, వాటిని తీర్చేందుకు అవసరమైన పథకాలను రూపొందించాలి. సహజసిద్ధంగా లభించేటటువంటి ఖనిజ సంపద మానవునికి ఏవిధంగా ఉపయోగపడుతుందో పరిశోధనలు జరపాలి, ఆ దృష్టితో ముందుకు సాగిపోతే ఊహించనటువంటి ప్రపంచ జ్ఞానం మనకు అబ్బుతుంది. అసలు నేర్చుకోవాలనే కోరిక, ఆసక్తి, పట్టుదల మనలో వుంటే పుస్తకాలనే చదువనవసరంలేదు. మనచుట్టూ కనిపించే ప్రకృతే మనకు పాఠాలను నేర్పుతుంది. ఎన్నో గ్రంథాలు చదివినా తెలియని విషయాలు ఈ ప్రకృతి వలననే తెల్సుకోగల్గుతాం. అందువలననే ప్రతి సంవత్సరం ఉపాధ్యాయులు, విద్యార్థులను వినోద విజ్ఞాన యాత్రలకు (Ex-cursions) తీసుకొని వెళ్ళుతుంటారు. వివిధ ప్రదేశములకు వెళ్లినప్పుడు అక్కడి ప్రజల మానసిక ప్రవృత్తులను, అక్కడి సాంఘిక స్థితిగతులను పరిశీలించి, అర్థం చేసుకోవాలి. సభ్యతను ప్రదర్శించాలి. సందర్భోచితంగా మాట్లాడటం నేర్చుకోవాలి. సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. ఎదుటి వారి మనోభావాలను కనిపెట్టి, వారి మనస్సును నొప్పించ కుండా, మృదువుగా, లౌకికంగా, చాతుర్యంగా వాస్తవమును చెప్పగలగాలి. యదార్థమే అయినప్పటికీ, వాస్తవమే అయినప్పటికీ, సత్యమే అయినప్పటికీ, కటువుగా, కుండ బ్రద్దలుకొట్టినట్లు నిర్మొగమాటంగా మాట్లాడరాదు. ఆవిధంగా పెళసరంగా మాట్లాడితే, కొన్నికొన్ని సందర్భాలలో ఎదుటివాళ్ల మనస్సును నొప్పించిన వాళ్ళమవుతాం. వారు బాధపడే అవకాశం కూడా ఉంటుంది **"కాలు జారితే తీసుకోవచ్చును గాని నోరుజారితే తీసుకోలేం"** కనుక మనం మాట్లాడే ప్రతి మాట ఆచి తూచి మాట్లాడాలి. సత్యం చెబితే ఎదుటివారి మనస్సు దెబ్బ తింటుందేమోనని, అసలు సత్యమునే చెప్పరాదనే స్థాయికి మాత్రం పోరాదు. మన మొగమాటం ఎక్కడ చెడిపోతుందోనని, అసలు వాస్తవమే చెప్పకుండా తప్పించుకొని తిరగటం కూడా మంచిది కాదు ఏ విషయంలోను అతిగా (Ex-treme) పోరాదు **"అతి సర్వత్ర వర్జయేత్"** అన్నారు గదా! కనుక మధ్యే మార్గమును అవలంబించాలి, దానిని పది మందీ మెచ్చుకొనేటట్లుగా వుండాలి ఇటువంటి లౌకికం కేవలం పుస్తకాలు చదవటం వలన రాదు. అసలు పుస్తకాలు చదవటమే వృథాయని భావించనూ రాదు. ఒక్క పుస్తకజ్ఞానం మీదనే ఆధారపడ కూడదు. పుస్తక జ్ఞానంతో పాటు ప్రపంచజ్ఞానమును కూడా ప్రతి ఒక్కరు సంపాదించి తీరాలి. అట్టి అమూల్యమైన జ్ఞానాన్ని సమాజాభివృద్ధికి ఉపయోగించాలి.

అనుభవం ద్వారా పొందిన జ్ఞానమును, వివేక జ్ఞానముతో దేశ కళ్యాణానికి ఉపయోగించి, విచక్షణాజ్ఞానంతో సద్వినియోగపరచి, లౌకికజ్ఞానంతో వ్యవహరించి, అనుభవ జ్ఞానమును తిరిగి పెంపొందించుకోవలెను. అట్టిదే సంపూర్ణమైన 'విజ్ఞానం' అవుతుంది. కనుక అట్టి ఉత్కృష్టమైన విజ్ఞానమును ప్రతి ఒక్కరూ సాధించి జీవితమును సార్థకం చేసుకోవలయును

'ఇంత వరకూ జ్ఞాన విజ్ఞానములను గురించి వివరించాను. వచ్చే లేఖలో " ఆత్మజ్ఞానము" ను గూర్చి వివరిస్తాను.

ఇక ఉంటా.....

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

3-1-1977

**మహారాజశ్రీ నాన్నగారికి - స ప్రేమ నమస్కారములు.**

నేను కులాసా. తమరు వ్రాసిన ఉత్తరం అందినది. ముక్కోటి ఉత్సవాలను నిర్వహిస్తున్నందులకు చాలా సంతోషం. పిల్లలకు, మీ కోడలికి వ్రాస్తున్న ఉత్తరాలు చదువుతున్నారనుకుంటాను. 'విద్య' యొక్క గొప్పతనాన్ని గురించి జ్ఞానవిజ్ఞానము లను గురించి ఉత్తరాలు వ్రాసాను. 'ఆత్మజ్ఞానము'ను గురించి ఈ ఉత్తరంలో వివరిస్తాను. చి॥ గౌరి వ్రాసిన ఉత్తరం అందినది. పిలకా గణపతి బాగా చదువుతున్నాడని భావిస్తున్నాను. పిల్లలందరికీ నా ముద్దులు.

## ఆత్మజ్ఞానం

**"జ్ఞానానాం ఆత్మజ్ఞానముత్తమం"** జ్ఞానములలో కెల్ల 'ఆత్మజ్ఞానం' ఉత్తమమైనది. ఈ ప్రపంచంలో అనేక జ్ఞానములున్నాయి. భౌతికశాస్త్ర విజ్ఞానం (Science) మరియు సంగీత, సాహిత్య , శిల్ప, గణిత జ్ఞానములెన్నో ఉన్నాయి. ఎన్ని జ్ఞానములను సంపాదించి నప్పటికినీ 'ఆత్మజ్ఞానము'ను సంపాదించని వానికి శాంతిలేదు, సుఖమూ ఉండదు. ప్రపంచదృష్టిలో కీర్తి ప్రతిష్టలు సంపాదించు కొనినప్పటికినీ, 'ఆత్మజ్ఞానం' లేనివారు భగవంతునకు ప్రీతిపాత్రులు కాలేరు. **"నహినహి రక్షతిడుకృఞ్ కరణే"** లౌకిక విద్యలు జనన మరణముల నుండి రక్షింప జాలవు. దైవ విద్య, ఆధ్యాత్మిక విద్యలవల్లనే మానవునికి 'మోక్షం' సంప్రాప్తమవుతుంది. ఏ జ్ఞానము

వలన మనుజుడు అనేకత్వంలో ఏకత్వమును, మృత్యువులో అమృతత్వమును గాంచ గల్గునో, అదియే అన్ని జ్ఞానములలో శ్రేష్ఠమైనది. అదియే సాత్వికజ్ఞానము, అదియే ఆధ్యాత్మిక విద్య. భగవానుని దృష్టిలో ఆధ్యాత్మిక జ్ఞానమే సర్వశ్రేష్ఠమైనది. ఆత్మజ్ఞానం అన్నా, పరమాత్మ జ్ఞానం అన్నా, ఆధ్యాత్మికజ్ఞానం అన్నా అంతా ఒకటే. ఆత్మను, పరమాత్మను చక్కగా తెలుసుకొనుటకు దోహదంచేసే విజ్ఞానం అది. అసలు అట్టి విజ్ఞానం ఎలా లభిస్తుంది?

**"యస్మిన్ జ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి"** దేనిని తెలిసికొనినచో, సమస్తమును తెలుసుకొనబడినదగునో, అట్టి పరమాత్మను ఎరిగినవాడగును. అదియే 'ఆత్మజ్ఞానము'. అతడే ప్రపంచంలో సర్వజ్ఞుడుగా పేరు ప్రఖ్యాతులను పొందుతాడు. ప్రపంచంలో ఎన్ని భౌతికవిద్యలు సంపాదించినను, ఎంతటి పాండిత్యమును బడసినను, ఎన్ని కళలు సముపార్జించినను, మనుజుడు 'సర్వవేత్త' కాలేడు, 'సర్వజ్ఞుడు' అంతకన్నా కాలేడు. కారణం? లౌకికవిద్యలు పరిపూర్ణశాంతిని కలుగజేయజాలవు. జన్మరాహిత్యమును కలుగజేయవు.

"తరతి శోకమాత్మవిత్" ఆత్మజ్ఞాని ఒక్కడు మాత్రమే శోకమును దాటగలడు. కనుక ప్రతి ఒక్కరూ పరమాత్మను ఆశ్రయించవలసినదే, ఆ జ్ఞానమును పొంది తీరవలసినదే అప్పుడే అతనికి సమస్త విద్యలు కరతలామలకము లగును. ఎందువలన అనగా ఈ సమస్త బ్రహ్మాండములు, ఈ చరాచర సృష్టి యావత్తు, సమస్త శాస్త్రములు విద్యలూ, కళలూ, అన్నియు భగవానుని యందే యిమిడి యున్నాయి. కనుక అట్టి పరమాత్మను బాగుగా తెలుసుకొనిన వాడినే "జ్ఞాని, సర్వవేత్త, సర్వజ్ఞుడు" అని అంటారు. అట్టి ఆత్మజ్ఞానికే మోక్షం సంప్రాప్తిస్తుంది. అట్టి ఆత్మ జ్ఞానం **"చిత్తశుద్ధి"** వలననే కలుగుతుంది. అట్టి చిత్తశుద్ధి పుణ్యకార్యములు, పవిత్ర కార్యములు (దానం, పరోపకారం, భూతదయ, మానవసేవ, దైవభక్తి, సత్ కథా కాలక్షేపం, భగవద్గీత, రామాయణ, భారత భాగవతముల అధ్యయనం) నిష్కామ బుద్ధితో ఆచరించడం వల్లనూ, ఎట్టి ఫలాపేక్ష లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మల నాచరించడం వల్ల కల్గుతుంది. అట్టి నిర్మల హృదయమున 'జ్ఞాన భాస్కరుడు' ఉదయిస్తాడు. అట్టి జ్ఞానోదయం వలన నరుడు నారాయణుడు అవుతాడు, జీవుడు శివుడవుతాడు, మానవుడు మాధవుడవుతాడు, పురుషుడు పురుషోత్తముడు అవుతాడు, పశువు పశుపతి అవుతాడు. అట్టి పరమోత్కృష్టమైన స్థాయికి చేరుకొన వలెనననిన మొదటిది పురుష ప్రయత్నం, రెండవది దైవ సహాయం అత్యవసరం. భక్తి శ్రద్ధలు కావాలి; ఏకాగ్రత, పట్టుదల ఉండాలి. మనుజుడు తన అల్పశక్తిని చూచుకొని గర్వించరాదు. దైవమునందు విశ్వాసముండాలి. నిష్కామబుద్ధితో కర్మలనాచరించిన యెడల సత్ఫలితాలు చేకూరుతాయి, జ్ఞానోదయమవుతుంది.

అజ్ఞానం పటాపంచలైపోతుంది. నిజ ఆత్మ స్వరూపమును సాక్షాత్కరించుకొన గలుగుతాడు. అదియే "మోక్షం", అదియే "జన్మరాహిత్యం". అదియే జీవుని అంతిమ లక్ష్యం. జ్ఞానమే జీవుల చరమ లక్ష్యం. అట్టి జ్ఞానియే కృతార్థుడు. అట్టి మహనీయుడు, ఎన్నడూ, ఎప్పడూ, ఎవరికీ భయపడడు. అట్టి జ్ఞానమము కలుగనంతవరకు జీవుని సంశయములు బాధించుచునే ఉండును. అట్టి ప్రత్యక్షజ్ఞానం కలిగిన వెంటనే అవిద్య, అంధకారం తొలగిపోయి, సందేహములు మటుమాయమగును. అందువలననే ఆత్మజ్ఞానమునకు మించిన జ్ఞానము మరొకటి లేదన్నారు మహానుభావులు. కనుక ప్రతి ఒక్కరు అట్టి మహత్తరమైన "ఆత్మజ్ఞానము"ను సంపాదించితీరవలెను.

మిగతా విషయములు తరువాత వివరిస్తాను.

ఇక ఉంటా.....

ఇట్లు

'మీ అబ్బాయి'

సెంట్రల్‌జైలు, రాజమండ్రి

3-1-1977

ప్రియమైన జయ,

అంతకుపూర్వం వ్రాసిన లేఖలో **"ఆత్మజ్ఞానము"** ను గురించి కొంత వివరించాను. మిగతా విషయములు ఈ లేఖలో వ్రాస్తున్నాను.

ఒక పర్యాయం ఏసుక్రీస్తు వద్దకు ఒక భక్తుడు వచ్చి **"అయ్యా! నాకు మోక్షం ఎప్పుడు లభించును?"** అని ప్రశ్నించెను. అంతట ఏసుప్రభు తన సమీపమున నున్న ఒక పసిబాలుని చూపించి **"నీ చిత్తము ఎప్పుడు ఈ బాలుని చిత్తము వలె తయారగునో, అప్పడే నీకు మోక్షం లభిస్తుంది"** అని చెప్పెను. ఎందువలన? పసిబాలునియందు ఈర్ష్యాద్వేషాలు గాని, కామక్రోధాలు గాని ఉండవు. అతని మనస్సు అతి నిర్మలంగా ఉంటుంది. నిర్మలమైన, శుద్ధమైన చిత్తమును ఎవరు కల్గివుందురో, అట్టివారు మాత్రమే మోక్షమునకు అర్హులవుతారు. కనుక ప్రతి ఒక్కరు సాధన ద్వారా అట్టి స్థితిని సంపాదించి తరించవలెను.

ఆత్మజ్ఞానము కొరకు ఎవరైనను ప్రయత్నించి సాధించవచ్చును. యోగ్యతను బట్టి సఫలతను బడయవచ్చును. స్త్రీలుగాని, పురుషులుగాని, బీదవారు గాని, ధనవంతులుగాని, ఏ కులమువారైనా మరెవరైననూ గాని ఈ జ్ఞానజ్యోతిని

వెలిగించుకొనవచ్చును. జాతి, మత, కుల, వర్ణ, వర్గ, లింగ బేధములతో దీనికి ఎలాంటి సంబంధమూ లేదు. భౌతిక శాస్త్ర పరిజ్ఞానము లేకపోయినప్పటికినీ, లౌకిక విద్యల నభ్యసించకపోయినప్పటికినీ ఫరవాలేదు. ప్రాపంచిక చదువు సంధ్యలు లేవని విచారపడి, దిగులుపడి కూర్చోనవసరం లేదు. కావల్సింది నిశ్చలమైన, నిర్మలమైన చిత్తము, అనన్యమైన భక్తి.

**"యోమద్భక్తః సమే ప్రియః"** "ఎవడు నా యెడల భక్తి కలిగియుండునో, వాడు నాకు ప్రియుడు" అని భగవానుడు గీతలో చెప్పాడు. కనుక దిగులు పడనవసరం లేదు. చింతించనవసరం లేదు. మహనీయుల ఆధ్యాత్మిక బోధనల వలన పరమార్థ తత్త్వములను తెలుసుకొని, లేక విని, సతతమూ, శ్రద్ధతో చక్కగా శ్రవణం చేయడం, ఏకాగ్ర నిష్ఠతో, భక్తి ప్రపత్తులతో వాటిని ఆచరించడం వలన తరించవచ్చును. పరమాత్మను సాక్షాత్కరించుకొనవచ్చును. మోక్షమును బడయ వచ్చును. అట్టి ఆత్మజ్ఞానము ఎదుట ఈ సామాన్యమైన భౌతిక శాస్త్ర జ్ఞానాదులు ఎందుకూ పనికిరావు. ఇట్టి ఆత్మజ్ఞానం కొందరికి పూర్వ జన్మ సంస్కారం వల్ల ఇట్టే అబ్బుతుంది. మరికొందరికి నిరంతర చింతన ద్వారా, అనన్య భక్తి ద్వారా నిదానంగా అబ్బుతుంది. రామకృష్ణ పరమహంస ఇటువంటివారిలో అగ్రగణ్యులు. ఈయన ఎక్కువగా లౌకిక విద్యలనభ్యసించలేదు. ప్రాధమిక విద్య కూడా పూర్తి చేసినట్లు కనిపించదు. అయినప్పటికినీ, నిరంతర నిష్ఠానుష్ఠానములతో, అచంచల భక్తితో, ఆ పరమాత్మను, ఆ కాళీమాతను సాక్షాత్కరింపచేసుకోగలిగినారు. జ్ఞాననేత్రం తెరువబడింది, సకల శాస్త్రములు కరతలామలకములైనాయి. విశేష జ్ఞానమును సముపార్జించారు. ప్రపంచానికి జ్ఞానభిక్షను ప్రసాదించారు. దారి దోపిడిగాడైన రత్నాకరుడు సాధన వలన వాల్మీకి మహర్షిగా మారిపోయి, అత్యున్నతమైన, ఆదర్శ వంతమైన రామాయణ మహాకావ్యాన్ని ప్రపంచానికి అందించగలిగాడు. కటిక కసాయివాడైన ధర్మవ్యాధుడు నిష్కామ కర్మాచరణ ద్వారా మోక్షాన్ని పొందాడు. దానవుడైన ప్రహ్లాదుడు భక్తాగ్రేసరుడుగా పేరుగాంచాడు. వానరుడైన హనుమంతుడు సేవచేసి శ్రీరామభక్తుడై తరించాడు. **"జటాయువు"** పక్షియైనను, భక్తుడై మోక్షమును సంపాదించాడు. దీనివలన గ్రహించవలసినది ఒకటి ఉన్నది. భగవంతుని దృష్టిలో మానవులైనా, దానవులైనా, జంతువులైనా, పక్షులైనా అంతా సమానమే. భగవంతునికి కావల్సింది అచంచలమైన భక్తి, హృదయ పవిత్రత, చిత్తనైర్మల్యము. శ్రద్ధాభక్తులు గల సాధకుడు మాత్రమే వీటిని సాధించి ఆత్మ జ్ఞానమును పొంద గలుగుతాడు. కావున శాస్త్రములయందు, గురువునందు, దైవము నందు పరిపూర్ణ విశ్వాసం, నమ్మకం, అకుంఠిత శ్రద్ధాభక్తులు కలిగి వుండవలెను. ముఖ్యంగా ఆత్మవిశ్వాసం కలిగి ఉండవలెను.

ఒక పర్యాయం వివేకానందుడు "Faith, Faith, Faith in ourselves; Faith, Faith, in God - that is the secret of Greatness". 'నమ్మకము! నమ్మకము! తనయందు నమ్మకము, దేవునియందు నమ్మకము ఇదియే ఔన్నత్యమునకు, విజయమునకు కీలకము' అని ఎలుగెత్తి చాటాడు. ప్రపంచంలో ఈనాడు చాలామందిలో ఈ శ్రద్ధ, నమ్మకం, విశ్వాసములు లోపించినందువలననే లక్ష్యమును చేరుకోలేకపోతున్నారు. కనుక ఈ మూడింటిని అలవరచుకొని జీవితాన్ని సార్ధకం చేసుకోవాలి. అత్యున్నతమైన ఆత్మజ్ఞానమును సంపాదించి మోక్షమును బడయవలెను. ప్రతి ఒక్కరూ భౌతిక శక్తితోపాటు ఆత్మశక్తిని కూడా పెంపొందించుకొనవలెను. ఒక్క భౌతికశక్తి మాత్రమే మానసికవ్యధను పోగొట్టజాలదు, పరమ శాంతిని కలుగజేయదు. ప్రతిఒక్కరూ పరమాత్మ తత్త్వమునుకూడా బాగుగా తెలుసుకొనవలెను. తత్త్వజ్ఞానమనగా సత్యాన్వేషణ. సత్యాన్వేషణ విద్యార్జన చేయువారి ప్రధమకర్తవ్యము.

మిగతా విషయములు తరువాత వివరిస్తాను. చిరంజీవులకు నా ఆశీస్సులు.

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి

3-1-1977

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలో "ఆత్మజ్ఞానము" గురించి వివరించాను. ఈ లేఖలో లౌకిక విద్యల అవసరమును గురించి వివరిస్తాను.

## లౌకిక విద్యలను విడువరాదు

ప్రస్తుత ప్రపంచంలో "ఆత్మజ్ఞానము" ను సంపాదించడం అంత తేలికైన విషయం కాదు. ఇది అందరికీ సాధ్యంకూడా కాదు. అసాధ్యమని భావించి నిరాశ నిస్పృహలతో ప్రయత్నాన్ని మాత్రం విడువరాదు. భౌతిక, ప్రాపంచిక విద్యలు లేకపోయినప్పటికినీ, "ఆత్మజ్ఞానము"ను సంపాదించడానికి అవకాశం ఉన్నమాట వాస్తవమే. ఒక్కొక్క సమయంలో పరమాత్మను తెలుసుకోవాలనే తాపత్రయంలో పడి లౌకిక విద్యలు విడనాడటం జరుగుతుంది. అటు పరమాత్మను తెలుసుకోలేక, ఇటు భౌతిక విద్యలనభ్యసించక "రెంటికీ చెడ్డ రేవడి" లాగే ఉభయ భ్రష్టులవుతూ ఉంటారు కొందరు. అది ఏమాత్రం మంచిది కాదు. భౌతిక విద్యలను ఏమాత్రం

నిర్లక్ష్యం చేయరాదు. లౌకిక విద్యలు లేకుండా ఉండటం కంటే, వాటిని కూడా కలిగి ఉండటం శ్రేష్ఠమూ, శ్రేయస్కరము. ఒక చంప భౌతిక శాస్త్ర విజ్ఞానమును సంపాదిస్తూ, ఆధ్యాత్మిక దృష్టి కూడా కలిగి ఉండటం మంచిది. ప్రతి రోజూ కొంత సమయమును భగవధ్యానమునకు కేటాయించడం ఉత్తమం.

**తపస్సు :** "**తపస్సు**" అనగానే చాలామందిలో ఒక భయం ఉన్నది. అన్నాహారములను విసర్జించి, ఆకులలములను తినుచూ, వాయుభక్షణ చేస్తూ, కీకారణ్యములలో తల క్రింద బెట్టి, కాళ్ళు పైకి పెట్టి సంవత్సరముల తరబడి ఉండటం అనే భావం ఉన్నది. ఆ భావాన్ని గీతలో భగవానుడు ఏనాడూ చెప్పలేదు. తనయందున్న రజో తమో గుణములను తపింపజేసి నిర్మూలన మొనర్చుటయే "**తపస్సు**" అని గీతలో నిర్వచనం చెప్పబడింది. తపస్సును మూడు విధములుగా వర్ణించాడు భగవానుడు. 1. శారీరక తపస్సు, 2. వాచిక తపస్సు, 3. మానసిక తపస్సు.

1. **శారీరక తపస్సు** అనగా 1. దేవతలను, గురువులను, బ్రహ్మ నిష్ఠలను, జ్ఞానులను గౌరవించి పూజించుట, 2. బాహ్యాభ్యంతర శుచిత్వం, 3. కుట్రలు, కపటం లేకుండుట, 4. బ్రహ్మచర్యము, 5. అహింస.

2. **వాచిక తపస్సు** అనగా 1. మనం మాట్లాడే మాటలతో పరుల మనస్సును నొప్పింపరాదు. సత్యమైన మాట అయి ఉండాలి. సత్యవాక్కు అయినప్పటికినీ, పరుషం, అప్రియంగా పలుకరాదు. మన వాక్కు ప్రియముగా, హితముగా ఉండవలెను. 2. వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత, భారత భాగవత రామాయణాదులను అధ్యయనం చేయవలెను.

3. **మానసిక తపస్సు** అనగా 1. మనస్సు నిర్మలంగాను, ముఖమును ప్రసన్నముగాను ఉంచుకొనవలెను. 2. ఆత్మనిగ్రహం కలిగి ఉండాలి. ఈ మూడు తపస్సులను ఆచరించిన యెడల అహంభావం చచ్చి, పెద్దల అనుగ్రహం సంప్రాప్తమగును. హృదయము నిర్మలమగును. విశాలభావము అలవడును. ప్రేమ, దయ, కరుణ, దానం, త్యాగం, పరోపకారం - మొదలగు సద్గుణములు సంప్రాప్త మగును. చిత్తశుద్ధి ఏర్పడును. అట్టి నిర్మల హృదయముననే జ్ఞాన భాస్కరుడు ఉదయించును. ఇటువంటి పరమోత్తమమైన, మహోత్కృష్టమైన భావాలను మన శాస్త్రాలు బోధిస్తున్నాయి. మన మహర్షులు, తత్త్వవేత్తలు ఇవే భావాలను ప్రబోధిస్తున్నారు. కనుక ప్రతి ఒక్కరూ ఇటువంటి పరమ పవిత్రమైన భావాలను ఆకళింపు జేసుకుని, జీర్ణం జేసుకొని, ఆచరణలో పెట్టి కృతకృత్యులు కావలెను. చిరంజీవులకు నా ఆశీస్సులు.

ఇట్లు 'నీ'

సెంట్రల్ జైలు,

5-1-1977

ప్రియమైన జయ,

నేను కులాసా. శనివారం ఇక్కడకు వస్తున్నట్లు వ్రాసావు. సంతోషం. "విద్య"ను గురించి విద్యయొక్క గొప్పతనాన్ని గురించి, జ్ఞానము, విజ్ఞానము, ఆత్మజ్ఞానములను గురించి వ్రాసాను. ఈ లేఖలో "సచ్ఛీలము"ను గురించి వివరిస్తాను.

సచ్ఛీలము (Good Character): సచ్ఛీలమనగా సంస్కారం, మంచి గుణం, మంచినడత అని చెప్పకుంటే సరిపోతుంది. ఏవ్యక్తి అయినాసరే జ్ఞానము, విజ్ఞానము, ఆత్మజ్ఞానములు లెస్సగా సంపాదించినప్పటికినీ "సచ్ఛీలము" లేని వ్యక్తి ఎందుకూ పనికిరాడు. శీలం చెడినచో, కోట్లకొలది ప్రాపంచిక విభవము లున్నప్పటికీ, మనుజునకు కించిత్తయి ననూ విలువ వుండదు. శీలము లేని వ్యక్తి పశువుతో సమానము. శీలమే జీవునికి అలంకారము. భగవంతుని దృష్టియందు సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద. ఎంతటి జ్ఞానులైనప్పటికి, వారికి నిగ్రహం, అణుకువ, వినయం, విధేయత, సంస్కారములు లేకపోతే నాశనమవుతారు. వారు కష్టించి సముపార్జించిన 'జ్ఞాన తపస్సు' బూడిదలో పోసిన పన్నీరువలే ఎందుకూ పనికిరాకుండా పోతుంది. మనుష్యుని విలువ అతని సౌందర్యమునందులేదు, ఆస్తిపాస్తులయందు అంతకన్నా లేదు. విద్యావైదుష్యములయందు వుండదు. ఒక్క సచ్ఛీలమందు మాత్రమే కలదు, భక్తి యందు మాత్రమే కలదు. పారమార్థిక సుగుణములయందు మాత్రమే కలదు. ప్రతి వ్యక్తి శారీరక శక్తిని సముపార్జించ వలసినదే, మానసిక పురోభివృద్ధిని పొందవలసినదే. ఈ రెండూ బాగా సంపాదించినప్పటికినీ, ఆ వ్యక్తికి సచ్ఛీలము లేనియెడల ఏ రంగంలోను అతను ప్రకాశించడు, రాణించడు అతని శ్రమ అంతా వృధా అయిపోతుంది.

**"Character is 3/4 Religion"** సచ్ఛీలమే మూడు పాళ్లు మతమని వివేకానంద చెప్పాడు. అది లేనిచో మతమునకు నామరూపాలే వుండవు, ఒకవేళ ఉండిననూ కళాకాంతులు వుండవు. ప్రస్తుత సమాజంలో చాలామంది ప్రజలు మతమునందలి బాహ్యాఆచారములకే ప్రాధాన్యతనిచ్చి అట్టహాసం చేస్తున్నారు. పటాటోపంగా వ్యవహరిస్తున్నారు. శీలమునకు ప్రాధాన్యతనివ్వటం లేదు. అంతఃశుద్ధి కలిగివుండరు. ఆడంబరంగా, పరులు మెచ్చుకోవాలనే తలంపుతో అట్టహాసంగా యజ్ఞయాగాది క్రతువులు, పూజలు చేస్తుంటారు. ఇటువంటివారిని గురించి వేమన చక్కగా వర్ణించాడు.

**"ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల?
భాండశుద్ధిలేని పాకమేల?
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమా"**

మనస్సు నిర్మలంగా లేని యాచారమెందుకు? కుండ శుభ్రంగా కడగకుండా, దానిలో వంట చేస్తే ఏమి బాగుంటుంది? అటులనే చిత్తశుద్ధిలేని శివపూజ కూడా నిష్ఫలమే. కనుక ప్రతి ఒక్కరూ మొట్టమొదట తన మనస్సును స్వచ్ఛంగా, నిర్మలంగా వుంచుకోవాలి. అటుల చేసుకొనకుండా పైకి ఆర్భాటంగా చేసే పూజల వల్ల ప్రయోజనం లేదు. పైపై ఆడంబరముల వలన ఏ మతమైనాసరే, కొద్దికాలమునకే నిర్వీర్యమై, నిస్తేజమై క్షీణించిపోతుంది. ఒకవేళ ఉన్నప్పటికీ, లోన చెదలు తొలచిన, బయటకు ఆకారము మాత్రము కన్పించు డొల్లకొయ్య స్తంభంలాగే వుంటుంది. చేవలేని డొల్ల కొయ్యవల్ల ప్రయోజనం లేదుగదా! కాబట్టి బాహ్య ఆచార విచారములతోపాటు అంతఃకరణ పరిశుద్ధత్వము ఎడల కూడా అతి జాగరూకత కల్గి యుండవలెను.

## శీలత్రయం

ఆధ్యాత్మిక క్షేత్రమున విజయము గాంచవలెననిన ప్రతి మనుజుడు **"శీలత్రయము"** ను తప్పనిసరిగా కల్గియుండవలెను. దీనినే ఆంగ్లమున P3 అందురు. అనగా P x P x P. అనగా Purity (పవిత్రత), Patience (సహనం), Perseverance (పట్టుదల) ఎవని హృదయము ఈ శీలత్రయముచే నిండి యుండునో, అట్టి సాధకునకు, విజయము విషయమై ఏ సంకోచమూ ఉండనక్కరలేదు. అతడు లక్ష్యమును నిరాటంకముగా చేరుకోగలడు. ప్రతి ఒక్కరూ పవిత్రమైన గ్రంథములను చదువుతూ, పవిత్రమైన భావములను, ఆలోచనలను కలిగి ఉండవలెను. ఎటువంటి కష్టములొచ్చి నప్పటికినీ, అవాంతరములు దాపురించినప్పటికినీ, ఎటువంటి పరిస్థితులలోనూ సహనమును కోల్పోరాదు. పట్టుదల ఉంటేనే లక్ష్యమును చేరుకోగలుగుతాము. విద్యార్థి పరీక్షలలో ఉత్తీర్ణుడు కావలెననిన పట్టుదల అత్యవసరం. వ్యక్తి ఏ రంగములో విజయమును సాధించ వలెననిన పట్టుదల ఆవశ్యకం. కాబట్టి ప్రతి ఒక్కరూ ఈ శీలత్రయము (పవిత్రత, సహనం, పట్టుదల) ను సంపాదించి తీరవలెను.

**శీలమే ప్రాణాధారము :** ఎన్ని భౌతిక శక్తులు సంపాదించినప్పటికినీ, శీలం

లేని శక్తి వల్ల నిష్ప్రయోజనం. ప్రతి జీవికి శీలం ఉండాలి. శీలం లేని వ్యక్తి చిల్లికుండతో సమానం. జీవితంలో ఎంతటి ఉన్నత పదవులనైనా సంపాదించ వచ్చును. సకల భోగభాగ్యములను చేబట్టవచ్చును. శీలం కనుక లేకపోతే వాటన్నిటినీ కోల్పోతాం. మనలో శీలం గనుక ఉంటే దేనినైనా సాధించవచ్చును. అది లేకపోతే ప్రతి దానినీ కోల్పోతాం. శీలమే మానవునికి ప్రాణాధారం. శీలం యొక్క ప్రాముఖ్యతను వివరిస్తూ ఒక చిన్న కథను వ్రాస్తాను.

**ప్రహ్లాదుడు :** ప్రహ్లాదుడు మంచి దైవ భక్తుడు. నిష్కామబుద్ధితో అనేక సత్కర్మల నాచరించి, అత్యున్నతమైన ఇంద్రపదవిని సంపాదించాడు. పదవీ భ్రష్టుడైన అసలు ఇంద్రుడు విచారముతో దేవతల గురువైన బృహస్పతి వద్దకు వెళ్ళి తన గోడును చెప్పకుని, తరుణోపాయాన్ని అర్థిస్తాడు. తిరిగి ఇంద్ర సింహాసనమును పొందటానికి ఉపాయమును చెప్పమని వేడుకుంటాడు. అప్పడు బృహస్పతి ఒక చక్కటి సలహానిస్తాడు. భిక్షుక రూపంలో ప్రహ్లాదుని వద్దకు వెళ్ళి, అతను దానం ఇచ్చే సమయంలో, అతని శీలమును దానముగా అడగమని సలహాయిస్తాడు బృహస్పతి. సలహా ప్రకారం పదవిపోయిన ఇంద్రుడు భిక్షుకరూపంలో ప్రహ్లాదుని వద్దకు వెళ్ళి అతని శీలమును అర్థిస్తాడు. ప్రహ్లాదుడు ఆశ్చర్యపోయి వట్టి శీలము వలన ప్రయోజనం ఏమిటి? నా శీలమును తీసుకొని నీవేం చేసుకుంటావు? ఇంకా ఏమైనా కావాల్సి వస్తే కోరుకో! అంటాడు. ఆ భిక్షుకుడు మాత్రం శీలమే కావాలంటాడు. అది ఒకటే చాలునంటాడు. ప్రహ్లాదుడు ఎట్టి సంకోచము లేకుండా **"తీసుకో"** అని అనడంతోనే ఒక తేజస్సు అతని దేహమునుండి బయటకు వచ్చి బిచ్చగాని రూపములో ఉన్న అసలు ఇంద్రునిలో ప్రవేశిస్తుంది. ఆ బిచ్చగానిలో ప్రవేశిస్తున్న తేజస్సును చూచి, **"నీవెవ్వరవు?"** అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు. "నేను నీ శీలమును. నీవు నన్నాతనికి దానం చేసావుగాబట్టి, నిన్ను వదలి అతనిలో ప్రవేశిస్తున్నాను" అని ఆ తేజస్సు బదులు చెబుతుంది. మరల కొంచెం సేపటికి మరొక తేజస్సు ప్రహ్లాదుని శరీరం నుండి బయటకు వస్తుంది. నీవెవ్వరవు? అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు. అప్పడు ఆ తేజస్సు **"నేను నీ శౌర్యమును, శీలము యొక్క సేవకుణ్ని. నీలో ఉన్నంత కాలం నిన్ను సేవించాను. ఇప్పడు శీలం నీ నుంచి వెళ్ళిపోయింది. కాబట్టి నేను కూడా శీలం వెంబడే పోతున్నాను."** . అని చెప్పి ఆ తేజస్సు బిచ్చగానిలో ప్రవేశిస్తుంది. చివరకు స్త్రీ ఆకారం గల ఒక తేజస్సు ప్రహ్లాదుని శరీరము నుండి

బయటకు వచ్చి "నేను నీ యొక్క రాజ్యలక్ష్మిని. నేను కూడా శీలం సేవకురాలినే. శీలమును వెంబడించి నేను కూడా పోతున్నాను" అని చెప్పి ఆ తేజస్సు కూడా బిచ్చగానిలో ప్రవేశిస్తుంది.

అంతట ప్రహ్లాదుడు తన అధికారాన్ని, వైభవాన్ని కోల్పోతాడు, పదవీచ్యుతుడవుతాడు, ఇంద్ర పదవిని కోల్పోతాడు. భిక్షుక రూపంలో నున్న అసలు ఇంద్రుడు తిరిగి ఇంద్ర సింహాసనమును పొందుతాడు. ఇక్కడ నేర్చుకోవలసిన నీతి ఒకటున్నది. మనలో శీలం గనుక ఉంటే మనం దేనినైనా సంపాదించవచ్చును. శీలం గనుక లేకపోతే ప్రతిదానినీ మనం కోల్పోతాం. ఇది వ్యక్తి విషయంలో ఎంత నిజమో, జాతి విషయంలో కూడా అంతే.

మన జాతీయ జీవన పరంపరలో శీలమునకు అత్యంత ప్రముఖస్థానం యివ్వబడింది. శీలం రెండు రకములు. **1. వ్యక్తిగత శీలం** (Personal Character), **2. జాతీయ శీలం** (National Character). ప్రతి వ్యక్తిలో ఈ రెండు శీలములు సమానంగా ఉన్నపుడే వ్యష్టి, సమిష్టిల ప్రగతి సాధ్యమవుతుంది. ఇందులో ఏ ఒక్కటి లోపించినా వ్యక్తి ప్రయత్నం నిష్ప్రయోజనం అవుతుంది. ఈ రెండూ ఒక నాణెమునకు ఉన్న బొమ్మ, బొరుసు లాంటివి. ఒక ప్రక్క జాతీయ చిహ్నం, రెండవ ప్రక్క నాణెం విలువ ఉంటుంది. రెంటిలో ఏది అరిగినా ఆ నాణెం చెల్లదు. ఈరెంటినీ గురించి వివరిస్తాను.

ఇట్లు "నీ"

**సెంట్రలు జైలు, రాజమండ్రి**

**12-1-1977**

**ప్రియమైన జయ,**

నేను కులాసా. పిల్లలతో తిరుగు ప్రయాణం చాలా ఇబ్బంది అయినట్లుగా తెల్సింది. నా వల్ల అందర్కి ఇబ్బందులు వచ్చాయి. ప్రస్తుతానికి చేయగల్గింది ఏమీ లేదు కదా! సంక్రాంతి పండుగ వస్తున్నది గదా! చిమ్మచీకట్లలో, గాఢాంధకారంలో పయనిస్తున్న మనలాంటి నిర్భాగ్యులకు క్రాంతి కనుపించవచ్చుననే ఆశతో ప్రయాణాన్ని కొనసాగిద్దాం. ఎల్లకాలం చీకటే ఉండదు కదా! చీకటి తరువాత

వెలుగు రావడం ప్రకృతి సహజ లక్షణం. ఈ నూతన సంవత్సరంలో అటువంటి వెలుగును తప్పనిసరిగా చూడగలమనే విశ్వాసం నాకున్నది.

## వ్యక్తిగతశీలము

ఇకపోతే ఈ లేఖలో **వ్యక్తిగత శీలము** (Personal Character) ను గురించి వివరిస్తాను. మన జాతీయ జీవన పరంపరలో శీలమునకు అత్యంత ప్రముఖ స్థానం ఉన్నది. మన సంస్కృతిలో వ్యక్తిగత శీలమునకు అత్యున్నతమైన, గౌరవప్రదమైన స్థానం ఇవ్వబడింది. శీలత్రయము (పవిత్రత, సహనము, పట్టుదల) గల వ్యక్తులనే మన సమాజం గౌరవించింది, అట్టి ఉన్నతులనే తత్త్వవేత్తలుగా భావించి, గౌరవించి, పూజించింది. కాని రాను రాను దురదృష్టవశాత్తు, అటువంటి ఉన్నత భావాలకు తిలోదకాలివ్వడం జరుగుతున్నది. వ్యక్తిగత శీలమునకు యివ్వవలసిన ప్రాధాన్యత ప్రస్తుత సమాజంలో ఎవరూ యివ్వటం లేదు. సామాజిక, రాజకీయ రంగములలో పనిచేసే కార్యకర్తల వ్యక్తిగత శీలమును గురించి ఎవరూ పట్టించుకోవడం లేదు. నాయకుల వ్యక్తిగత శీలమును గమనించకపోవడం వలననే, నేడు మన సమాజం అనేక ఇక్కట్లకు, అనర్థాలకు లోనవుతున్నది. కాని మన ప్రాచీన సమాజం ఈ పరిస్థితిని ఎన్నడూ అంగీకరించి యుండలేదు.

మనకు శ్రీరాముడు, వీర శివాజి ఆదర్శం. ఆ మహానుభావుల జీవితాలు మనకు స్ఫూర్తినిచ్చాయి. వారి పరిపాలన విషయంలోనేగాక, వ్యక్తిగత వ్యవహారము లలో కూడా వారిని వేలెత్తి చూపలేము. శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు. శివాజీ పరాయి స్త్రీలను తల్లితో సమానంగా చూచి గౌరవించేవాడు. యుద్ధములో పట్టుబడిన ముస్లిం స్త్రీలను, అవమానపరచకుండా, సురక్షితంగా, వాళ్ళ బంధువుల వద్దకు పంపినట్లు చరిత్రలో ఎన్నో ఉదంతాలు కనిపిస్తాయి. శివాజీ కుమారుడు శంభాజీ. అతను అతి బలపరాక్రమ సంపన్నుడు. యుద్ధనీతి కోవిదుడు. అయినప్పటికీ శివాజీకి వచ్చిన పేరు ప్రతిష్ఠలు శంభాజీకి రాలేదు, కారణం? వ్యక్తి శీలం లేనందువలన శంభాజీ రాణించలేదు. కాలగర్భంలో కలిసిపోయాడు. చరిత్ర హీనుడయ్యాడు. శీలరహితుల వలన దేశానికి, జాతికి తీరని హాని చేకూరుతుంది. వీరి బలహీనతలను శత్రువులు చక్కగా ఉపయోగించుకుంటారు. ముఖ్యంగా రాజ్యాధిపతులు విషయలోలురైతే మరింత ప్రమాదం. స్త్రీలోలులైన రాజుల చెంతకు సైన్యాధిపతుల వద్దకు అందమైన స్త్రీ గూఢచారులను పంపి, వారిని వలలో వేసుకొని,

రహస్యాలను సేకరించి సామ్రాజ్యాలను కబళించిన సంఘటనలు చరిత్ర పుటాలు తిరుగవేస్తే ఎన్నో కనిపిస్తాయి.

మానవునిలో మరొక భయంకరమైన బలహీనత కూడా ఒకటి ఉన్నది. అదియే పొగడ్త. ఈ పొగడ్త ప్రశంసలకు మురిసిపోయి సర్వమునూ కోల్పోయిన వారు కూడా ఉన్నారు. **"ఇంద్రుడవు, చంద్రుడవు"** అని పొగడగానే ఉబ్బితబ్బిబై అడిగినవన్నీ యిచ్చి బికారులైనవారు కూడా ఉన్నారు. జీవన సంగ్రామరంగంలో దేనినైనా ఎదిరించి నిలబడవచ్చును గాని పొగడ్తలకు, ప్రశంసలకు మాత్రం తట్టుకోవటం చాలా కష్టం. కనుక ఇటువంటి బలహీనతలకు ఎవరూ లోను కారాదు. ఇవి తాత్కాలికమైన సుఖమును, ఆనందమును మాత్రమే ఇస్తాయి. శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలను తెచ్చిపెట్టవు. ఒక్క**"సచ్ఛీలము"** (Good Character) మాత్రమే వ్యక్తి ప్రతిష్ఠను ఇనుమడింప జేస్తుంది. కనుక ప్రతి వ్యక్తి మచ్చలేని శీలము (Spotless Character) ను కలిగి ఉండాలి. అటువంటి ఆదర్శ వంతమైన, పవిత్రమైన శీల సంపత్తిని కలిగిన వ్యక్తినే **"పరిపూర్ణుడు"** అని అంటారు. కనుక అట్టి పరిపూర్ణత్వమును ప్రతి వ్యక్తి సాధించి, పొంది, తరించ వలెను. ఇక **"జాతీయ శీలము"**ను గూర్చి వివరిస్తాను.

## "జాతీయ శీలము" (National Character)

జాతీయ శీలమనగా "దేశభక్తి" అని కూడా చెప్పకొనవచ్చును. మన దేశంలో పూర్వం మంచి వ్యక్తిగత శీలం గల పవిత్రులు ఎందరో ఉండేవారు. మన చరిత్రను ఒక పర్యాయం సింహావలోకనం చేసుకుంటే, మనం ఎందుకు పతనమై పోయినామో, మన రాజాధిరాజులు ఎందుకు విదేశీయులకు లొంగిపోయారో అర్థమవుతుంది. వ్యక్తిగత శీలంతోపాటు ఉండవలసిన రెండవ అంశమైన జాతీయ శీలము మనలో లోపించటమే ఇందుకు కారణం. శక్తి సామర్థ్యములు లేకపోవడం వల్ల మనం ఎన్నడూ ఓడిపోలేదు. మనవారిలో స్వార్థం పెచ్చు పెరిగిపోవడం వలన మనం పతనమైనాం. మన రాజ్యాధినేతలలో దేశభక్తి భావం లుప్తం కావటం వలన మన దేశం విదేశీ దండయాత్రలకు గురైంది. జాతీయ దృక్పథం లేకపోవడం వలన, మాన్‌సింగ్ అక్బరుకు దాసుడై, తన సోదర భారతీయ వీరుడైన రాణాప్రతాప్ సింహుకు తీరని ద్రోహం చేశాడు. శివభక్తి పరాయణులని చెప్పకునే పూజారులు, స్వార్థంతో విదేశీయుడైన గజనీమహమ్మద్‌కు సహాయం చేసి సోమనాథ దేవాలయ పతనానికి కారణభూతులయ్యారు. జయచంద్రుడు స్వలాభాపేక్షతో ఘోరీ

మహమ్మద్‌కు సహాయపడి పృథ్వీరాజు ఓటమికి దోహదం చేశాడు. వీరందరూ వ్యక్తిగతంగా చాలా మంచివారే. కాని వారిలో జాతీయ దృష్టి లేకపోవడం వలన, దేశభక్తి లుప్తం కావడంవలన, సమగ్ర సమాజదృష్టి లోపించడం వలన స్వార్థంతో శత్రువులకు సహాయపడి దేశ విచ్ఛితికి కారణభూతులయ్యారు. ఒక్క వ్యక్తిగత శీలం మాత్రమే దేశాన్ని రక్షించడానికి సరిపోదు. వ్యక్తిగత శీలంతోపాటు జాతీయ శీలం కూడా ఉన్నటువంటివారే దేశ కళ్యాణానికి ఉపయోగపడుతారు.

ప్రతివ్యక్తికీ దైవభక్తి ఎంత అవసరమో, దేశభక్తి కూడా అంతే అవసరం. వ్యక్తి భవిష్యత్తుకు నిజాయితీ ఎంత అవసరమో, సమాజ శ్రేయస్సుకు దేశభక్తి కూడా అంత అవసరం. ఈ రెండూ ఒకే వ్యక్తిలో మూర్తీభవించినప్పుడే వ్యష్టికీ, సమిష్టికి ప్రయోజనం ఉంటుంది. తాను సంపాదించిన మంచితనం పవిత్రశీల సంపదను సమాజాభివృద్ధికి వినియోగించాలి. ప్రతిఫలాన్ని కోరకుండా, కీర్తి ప్రతిష్ఠలను ఆశించకుండా, నిస్వార్థబుద్ధితో, తన శక్తి సామర్థ్యములను దేశ కళ్యాణానికి ఉపయోగించాలి. అహంకార, అహంభావములను దరికి చేరనీయరాదు. స్వార్థ సంకుచితత్వాలను విడనాడాలి. తన సర్వస్వాన్ని భగవంతుని పాదపద్మములకర్పించి, లోకోపకారమే తన కర్తవ్యంగా ఎంచి, పరోపకార బుద్ధిని పెంపొందించుకొని, మాతృభూమి సమగ్రతను, సమైక్యతను పరిరక్షించడానికి కార్యోన్ముఖులం కావాలి. మాతృదేశం యెడల ఎనలేని భక్తి ప్రపత్తులు కలిగి ఉండాలి. మాతృభూమి పట్ల మన హృదయాలలో సతతమూ వీరోచిత భక్తిభావం ప్రజ్వరిల్లుతూ ఉండాలి. మన జాతీయ సంస్కృతీ ధర్మ పరంపరలను గౌరవించాలి. వాటి ఔన్నత్యానికి తీవ్ర కృషి సలపాలి. అట్టివారినే నిజమైన దేశభక్తులుగా, జాతీయ శీలం గల వారిగా సమాజం పరిగణిస్తుంది.

కనుక ప్రతి ఒక్కరూ వ్యక్తి శీలమును, జాతీయ శీలమును రెంటినీ సంపాదించాలి. శీలరాహిత్యం అత్యంత ప్రమాదకరం. శీలము లేనివాడు చిల్లి కుండతో సమానం. సచ్ఛీలత (Good Character) లేని వ్యక్తి తనను తాను ఉద్ధరించుకోలేడు, దేశానికి ఏమాత్రం ఉపయోగపడడు. కనుక ప్రతి ఒక్కరు ఈ రెండు శీలములను సంపాదించి జీవితాన్ని సార్థకం చేసుకోవాలి.

ఇక ఉంటా...

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు
ది. 15-1-1977

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలో వ్యక్తిగతశీలము (Personal Character),, జాతీయ శీలము (National Character),లను గురించి వివరించాను. ఈ లేఖలో **"త్యాగము"** యొక్క స్వరూప స్వభావములను గురించి వివరిస్తాను.

## త్యాగము

ప్రతివ్యక్తి అలవరచుకొనవలసిన ప్రధాన గుణములలో **'త్యాగము'** కూడ ఒకటి. త్యాగము అంటే కొంతమంది సహజంగా దానం చేయడం, ధర్మం చేయడం అని భావిస్తుంటారు. త్యాగానికి దానానికి ఎంతో తేడా ఉన్నది. దానం అంటే తనకున్న సంపదలో ఎంతో కొంత యితరులకు ఇవ్వటం. భూదానం, గోదానం, అన్నదానం, శ్రమదానం, విద్యాదానం, జ్ఞాన దానం మొదలగునవి **'దానం'** క్రిందకు వస్తాయి. దానం చేయడం వలన ఏ మానవుడూ, ఎప్పడూ, తన సర్వస్వాన్ని కోల్పోడు. **"అదాన దోషేణ భవేద్దరిద్రః"** ఈ జన్మలో దానంచేయక పోవడం వల్లనే జీవుడు వచ్చే జన్మలో దరిద్రుడై జన్మించును. **"దేయం దీన జనాయ చ విత్తం"** దీనులకు, దరిద్రులకు తనకున్న దానిలో కొంత యిచ్చి సాయము చేయవలెనని మన శాస్త్రములు ఘోషిస్తున్నాయి. అటుల చేయక, స్వార్థంతో, అన్యాయంగా, అక్రమంగా సంపాదించే వాని గతి అధోగతే అవుతుంది. అట్టి వానిని భగవంతుడు కూడా క్షమించడు. ఇతరులకు పెట్టక, తాను తినక సంపదను కూడబెట్టు 'లోభి' కి ఏమాత్రం మనశ్శాంతి ఉండదు. ఏదో ఒక విధంగా ఆ సంపద హరించుకొని పోతుంది. ఇదే వాస్తవమును ఈ శ్లోకము చాటుతున్నది.

**"చత్వారో విత్త దాయాదాః**
**ధర్మ భూపాగ్ని తస్కరాః**
**జ్యేష్ఠ భ్రాత్రవమానేన త్రయః**
**కుప్యన్తి సోదరాః "**

అనగా ధనమునకు నలుగురు వారసులు కలరు. 1. ధర్మము 2. రాజు 3. అగ్ని 4. దొంగ. ఇందులో పెద్ద వారసుడు ధర్మము, పెద్ద వారసునికి పెద్ద వాటా రావలెను. అనగా ధర్మమునకు ఎక్కువ డబ్బు వినియోగించవలెనని అర్థము, తండ్రి తన ఆస్తిలో ధర్మమునకు ఏమీ ఇవ్వకుండా అవమానించినచో అనగా దానధర్మములు చేయనిచో తక్కిన ముగ్గురు సోదరులైన రాజు, అగ్ని, దొంగలు దానిని భరించలేక కోపోద్రిక్తులై చెలరేగెదరు.



అనగా ధర్మకార్యములకు తన సంపదను న్యాయసమ్మతంగా వినియోగించని పక్షంలో, పన్నుల రూపమున 'రాజు' ఆ సంపదను స్వాధీన పరచుకొనును. అగ్ని ప్రమాదములు సంభవించి ఆస్తి నష్టమగును. దొంగలుపడి దానిని దోచుకొందురు. కాబట్టి ప్రతివ్యక్తి తన సంపదలో కొంత భాగమును విధిగా దానధర్మములకు కేటాయించవలెను, పశుపక్ష్యాదులకు పెట్టవలెను. దానధర్మములకు వినియోగించు ద్రవ్యము ఇహము నందును, పరము నందును కూడా తిరిగివచ్చును. స్నేహితులకు వినియోగించు ద్రవ్యము ఇహమునందు మాత్రమే తిరిగివచ్చును. భోగముల కొరకు వినియోగించు ద్రవ్యము ఇహము నందు గాని పరమునందు గాని తిరిగిరాదు.

ఇంతకు పూర్వం **"త్యాగము"** గురించి కొంత వివరించాను. మరి కొన్ని వివరాలు వ్రాస్తున్నాను. శ్రద్ధగా చదివి అవగాహన చేసుకుంటావని ఆశిస్తున్నాను.

## త్యాగం :

మేడమెట్లలో అత్యున్నతమైన ఆఖరిమెట్టు **'త్యాగం'** సర్వోత్కృష్టమైన, అమిత ప్రియమైన వస్తువులను సహితము, నవ్వుతూ, నవ్వుతూ,ఏ మాత్రం సంకోచించకుండా యితరులకు ఇవ్వగలిగిన వానినే **"త్యాగి"** అని అంటారు. కర్మ ఫలమును ఈశ్వరార్పణముగా వదులుటయే త్యాగం. తనకు నిర్దేశించిన శాస్త్రబద్ధమైన కర్మలను నిరంతరమూ చేయుచూ, ఫలమును మాత్రం త్యజించుటయే త్యాగం. దేనిని దానం చేయుటవలన, తనకు సర్వనాశనం తప్పదని తెలిసినప్పటికిని, ఏమాత్రం సంకోచించకుండా తన అస్థిత్వానికే మూలాధారమైన ఈ భౌతిక శరీరాన్ని సహితం, తృణప్రాయంగా నెంచి, భావించి, త్యజించడానికి సిద్ధమవుతాడో - అట్టివాడే నిజమైన త్యాగి. అట్టివాడే మహా దాతలలో అత్యున్నతమైన స్థానాన్ని అందుకో గలుగుతాడు. సత్యమే జీవిత పరమావధిగా భావించి, పరోపకారమే ధర్మముగా నెంచి, మృత్యువునకు కూడా ఏ మాత్రం భయపడక, ధర్మసంస్థాపనార్థం, తన జీవితాన్ని సర్వస్వార్పణ గావించువారే నిజమైన త్యాగశీలురు **"దుస్త్యజం కింధృతాత్మనాం"** ధైర్యవంతులకు త్యాగం చేయలేని వస్తువేముంటుంది? అట్టి మహనీయులు కోరుకొనేది తాత్కాలికమైన తుచ్ఛమైన ఆనందంకాదు, భౌతిక సౌఖ్యాలంత కన్నాకాదు. నిర్మలమైన, నిశ్చలమైన, శాశ్వతమైన, ఆధ్యాత్మికానుభూతి మాత్రమే. మన ప్రాచీన పురాణ ఇతిహాసములను పరిశీలిస్తే అట్టి త్యాగశీలురు కోకొల్లలు. శిబిచక్రవర్తి, బలిచక్రవర్తి, దధీచి, కర్ణుడు మొదలగు త్యాగశీలురెందరో కనిపిసారు. మన భారతీయ చరిత్రను పరికిస్తే **'తానాజీ'** లాంటి త్యాగమూర్తులు మరియు ఇంకా ఎంతో మంది త్యాగధనులు మనకు కనిపిస్తారు.

## శిబిచక్రవర్తి :

శిబిచక్రవర్తి ధర్మపరిపాలనను, త్యాగనిరతిని పరీక్షించాలనే అభిలాష ఒక పర్యాయం ఇంద్రాగ్నులకు కలుగుతుంది. డేగ,పావురముల రూపంలో బయలుదేరి శిబిచక్రవర్తి విహరిస్తున్న ఉద్యానవనం లోనికివస్తారు. డేగచేత తరమబడుతున్న పావురం, ఆత్మసంరక్షణార్థం శిబిచక్రవర్తి ఒడిలోపడి రక్షించమని వేడుకుంటుంది. భూతదయ పరాయణుడైన శిబిచక్రవర్తి పావురానికి అభయమిస్తాడు. ఇంతలో డేగ వచ్చి తనకు ప్రియమైన, ఆహారమైన పావురాన్ని యిచ్చివేయమని శిబిచక్రవర్తిని కోరుతుంది. తనచేత అభయాన్ని పొందబడిన పావురాన్ని, ఎటువంటి పరిస్థితుల లోను వదలనని ఖచ్చితంగా చెబుతాడు శిబిచక్రవర్తి. కాని డేగ తన మొండి పట్టుదలను వదలదు. తన ఆహారాన్ని దాచడం ధర్మం కాదని డేగ వాదిస్తుంది. అప్పుడు శిబిచక్రవర్తి ఆ పావురం ఎత్తు మాంసమును తన శరీరమునుండి కోసి యివ్వనన్నా యిస్తానుగాని అభయమిచ్చిన పావురాన్ని మాత్రం వదిలేది లేదని ఖచ్చితంగా చెబుతాడు. డేగ దానికి అంగీకరిస్తుంది. ఒక త్రాసులో ఒక ప్రక్క పావురాన్ని ఉంచి, రెండవ ప్రక్క తన శరీరమును కోసి కొంత మాంసమును ఉంచుతాడు. కాని ఆ మాంసం పావురంతో సరితూగదు. తన శరీరమును కోసి ఎన్ని మాంసపుముక్కలు త్రాసులో ఉంచినప్పటికినీ,పావురంతో సరి సమానంగా సరితూగలేదు. చిట్ట చివరికి గత్యంతరం లేక తాను యిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకోవడాని కోసం, తన శరీరమును యావత్తు డేగకు సమర్పించుకుంటాడు. ఈ సంఘటన మనకు పరమోత్కృష్టమైన నీతిని బోధిస్తున్నది. ఆడిన మాటను నిలబెట్టుకొనడానికోసం, యిచ్చిన వాగ్దానమును నెరవేర్చుకోవడానికోసం, అభయమిచ్చిన పావురాన్ని రక్షించడానికోసం "**శిబి**" లాంటి మహా చక్రవర్తి ఏ మాత్రం వెనుకాడకుండా, సంకోచించకుండా, తన శరీరాన్నే సమర్పించుకొని, ప్రపంచానికి త్యాగము యొక్క విలువను చాటాడు. గొప్పతనాన్ని నిరూపించాడు. ఆదర్శ త్యాగశీలిగా చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయాడు.

## దాన కర్ణుడు :

మహాభారత యుద్ధంలో 17వ రోజు పరిసమాప్తమయింది. మహారథి కర్ణుడు యుద్ధభూమిలో పడిపోయినందులకు పాండవుల శిబిరంలో ఆనందోత్సాహాలు చెలరేగుతున్నాయి. కాని శ్రీకృష్ణుడు మాత్రం విచార సముద్రంలో మునిగిపోయి ఉన్నాడు. ఖిన్న వదనంతో పలుసార్లు కర్ణుని ప్రశంసిస్తూ "**నిజమైన దాత ఈ భూమిని నేడు వదిలి పోతున్నాడు**" అని శ్రీ కృష్ణుడు విచారిస్తుంటాడు. తన

ప్రత్యర్థిని పొగడుతున్నందులకు అర్జునునకు ఖేదం కల్గుతుంది, పౌరుషం పెల్లుబుకు తుంది, ఈర్ష్య జనించి ద్వేషం పరవళ్లు త్రొక్కుతుంది. ఆవేశంతో కంపించి పోతుంటాడు. దీనిని గ్రహించిన శ్రీకృష్ణుడు **"ధనుంజయా! దుఃఖమేల? ఆవేశపడకు! ఇది యదార్థం. నా వెంటరా! దానకర్ణుడు ఇంకా చావలేదు. ఆయన దానశీలం ఎంతటిదో దూరాన ఉండి ఆఖరిసారిగా చూడు"** అని అంటాడు.

కన్ను పొడుచుకున్నా కానరాని కటిక కాళరాత్రి అది. యుద్ధభూమి నక్కల రాజ్యంగా మారింది, ఎక్కడ చూచినా విరిగిపోయిన అస్త్రాలు, తుంగ ముళ్లలాంటి బాణాలు, శవాల కుప్పలు, కుప్పలు కుప్పలుగా కూలిపోయిన రధాలు రక్తసిక్తమైన ఆ యుద్ధభూమి కుంకుమ వర్ణంతో భీకర భయంకరంగా కనిపిస్తూ ఉంటుంది. శ్రీకృష్ణుడు అర్జునుని వెంట తీసుకొని వెళ్లి అల్లంత దూరంలో ఒక చోట వుంచుతాడు. శ్రీకృష్ణుడు బ్రాహ్మణ వేషం ధరించి **"కర్ణా! కర్ణా ! దాన కర్ణా! ఎక్కడున్నావయ్యా!"** అని బిగ్గరగా అరవనారంభిస్తాడు. అప్పుడు కర్ణుడు అతి కష్టంతో తన యావత్ శక్తిని కేంద్రీకరించుకొని తల పైకెత్తి **"ఆ! ఇక్కడ! ఇక్కడనే ఉన్నాను! ఎవరు పిలుస్తున్నారు నన్ను ? ఎవరదీ! ఏం కావాలి?"** అని అడుగుతాడు. బ్రాహ్మణ వేషంలో ఉన్న శ్రీకృష్ణుడు **"నేను మీ పేరు ప్రతిష్ఠలు విని గంపెడంత ఆశతో వచ్చాను. నాకు కొద్దిగా బంగారం కావాలి. నేను చాలా కష్టాలలో వున్నాను."** అని అంటాడు. అప్పుడు కర్ణుడు **"మీరు మా ఇంటికి వెళ్ళండి. నేను చెప్పినట్టుగా చెప్పండి. నా భార్య మీకు కావలసినదంతా యిస్తుంది"** అని అంటాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు కోపంతో **"నాకు కావాల్సిన కొద్ది బంగారం కోసం అంతదూరం వెళాలా? మీ ఇంటికి వెళ్ళే ఓపిక నాకు అసలే లేదు, ఏమైనా ఇస్తే మీరే ఇవ్వండి. లేకపోతే లేదని చెప్పండి. నా దోవన నేను వెళతాను"** అని అంటాడు . అప్పుడు కర్ణుడు తన దంతాలను చూపించి, వాటికి ఉన్న బంగారమును తీసుకోమంటాడు, అప్పుడు ఆ బ్రాహ్మణుడు కోపంతో **"సజీవంగా ఉన్న మనిషి యొక్క దంతాలు ఊడబెరకమని చెప్పుటకు సిగ్గుగా లేదా?"** అని అంటాడు. అప్పుడు కర్ణుడికి ఏమి చేయాలో తోచక అటూ ఇటూ చూస్తాడు, కొద్ది దూరంలో ఒక బండరాయి కనిపిస్తుంది. అతి కష్టం మీద తన శరీరాన్ని ఈడ్చుకుంటూ ఆ రాయి దగ్గరకు చేరుతాడు. ఆ రాతిపై తన ముఖాన్ని కొట్టుకుంటాడు, ముఖం పచ్చడి పచ్చడై పళ్ళూడి క్రింద పడతాయి. బంగారం తొడుగుతో నున్న ఆ పళ్లను తీసుకొమ్మని ప్రాధేయపడతాడు. **"ఛీ! రక్తసిక్తమై అపవిత్రమైన ఆ పళ్ళను నేను స్వీకరిస్తానా?"** అని ఆ బ్రాహ్మణుడు రెండు అడుగులు వెనక్కి వేస్తాడు. కర్ణుడు తన ఖడ్గంతో ఆ పళ్లను కొట్టి బంగారమును వేరు చేసి, దానిని స్వీకరించమని ప్రార్థిస్తాడు. ఆ బ్రాహ్మణుడు దానిని కూడా అపవిత్రంగా

భావించి స్వీకరించ నిరాకరిస్తాడు. అప్పుడు కర్ణుడు అతి కష్టం మీద బాణాలను చేతబూని శిరస్సు సహాయంతో విల్లునెక్కుపెట్టి వారుణాస్త్రమును ప్రయోగించి , జలమును సృష్టించి , ఆ బంగారమును శుభ్రముగా కడిగి, దానిని స్వీకరించమని అర్థిస్తాడు. అప్పుడు ఆ బ్రాహ్మణ వేషంలో ఉన్న శ్రీకృష్ణుడు తన నిజ స్వరూపాన్ని చూపించి"**వరం కోరుకో వీరుడా!**" అని అంటాడు. అప్పుడు కర్ణుడు ఆనంద భాష్పాలతో తడబడుతూ "**త్రిభువనసేనుడు నా దేహ త్యాగ సమయంలో నా ముందున్నాడు. ఇంకా అంత కన్నా కావల్సింది ఏమున్నది? నా జీవితం ధన్యమైంది**" అని అంటాడు. ఈ సన్నివేశాన్ని చూస్తున్న అర్జునుడు సిగ్గుతో తలవంచుకుంటాడు. కర్ణుని త్యాగశీలత ఎంతటిదో ఈ సంఘటన మనకు తేటతెల్లం జేస్తున్నది. కర్ణుని జీవితం త్యాగమయం. ఇవ్వటమే కాని అడగటం ఆయనకు తెలియదు. ఎవరు ఏది అడిగినా ఏమాత్రం సంకోచించ కుండా ఇవ్వటమే ఆయన లక్ష్యం. ఒక పర్యాయం సూర్యుడు ఎంత వద్దని చెబుతున్నప్పటికీ, వినకుండా, తన శక్తికి మూలమైన కవచకుండలాలను సునాయాసంగా ఇంద్రునికి దానం చేసిన త్యాగపురుషుడు '**దానకర్ణుడు**'.

సత్యమే జీవిత పరమావధిగా భావించి, పరోపకారమే పరమ ధర్మంగా నెంచి, మృత్యువునకు కూడా ఏ మాత్రం భయపడక, ధర్మ సంస్థాపన కోసం, తమ జీవితాలను నవ్వుతూ...... నవ్వుతూ ...... సమర్పించగలిగినవారే నిజమైన '**త్యాగశీలురు**'.

## దధీచి - విశ్వకర్మ :

'**దధీచి**' మహర్షి యొక్క త్యాగమయమైన జీవితాన్ని గురించి వివరిస్తాను. అంతే కాదు విశ్వకర్మ చేసిన నిస్వార్థమైన త్యాగమును గురించి కూడా వివరిస్తాను. వృత్రాసురుడు తన అఖండమైన పరాక్రమంతో దేవతలను బాధ పెడుతుంటాడు. అంతే కాదు అతను కొంత కాలం దేవతల విరోధి అయిన హిరణ్యాక్షునికి సేనాపతిగా కూడా పని చేసాడు. పెచ్చు పెరిగిపోతున్న అతని అత్యాచారాలకు తాళలేక, అతనిని ఏదో విధంగా తుదముట్టించాలని, దేవతలు ఆలోచన చేసారు. కాని అతనిని ఎదిరించే సాహసం గాని, ధైర్యంగాని ఎవరికీ లేకపోయింది. ఇంద్రునికి కూడా అసంభవమనిపించింది. ఇట్టి స్థితిలో పరమపవిత్రుడైన ఒక మహా ముని యొక్క ఎముకలతో ముఖ్యముగా వెన్నెముకతో తయారు చేసిన ఆయుధంతో గనుక ఇంద్రుడు యుద్ధం చేసిన పక్షంలో వృత్రాసురుని జయించవచ్చునని కొందరు మహానుభావులు సూచన చేసారు. అట్టి మహర్షి కోసం దేవతలు విచారణ చేయగా దానికి తగిన వ్యక్తి '**దధీచి**' మాత్రమేనననే నిర్ణయానికి వచ్చి ఆ మహర్షి వద్దకు వెళ్లి , పరిస్థితిని వివరించి , అతని వెన్నెముకను అర్థించారు. అప్పుడు

దధీచి ఎంతో ఆనందంతో ' ఈ శరీరాన్ని ఎప్పుడో ఒకప్పుడు వదలవలసినదే గదా! అట్టి శరీరము ఎముకలు పరోపకారం కోసం ఉపయోగపెట్టటం కంటే నాకు కావల్సిందేముంది? అని కొద్ది నిమిషాలలో యోగ మార్గంలోనికి వెళ్లి పోతాడు. దుష్టశిక్షణ కోసం తన నిండు ప్రాణాలను త్యజించాడు, 'దధీచి'. అందుకోసమనే త్యాగానికి ప్రతీక 'దధీచి' అంటారు.

ఆ ఎముకలతో ముఖ్యంగా దధీచి వెన్నెముకతో వజ్రాయుధం తయారు చేయగల శిల్పి ఎవరా? అని దేవతలు అన్వేషణ ప్రారంభిస్తారు. వజ్రాయుధం తయారుచేయటం అంత సులభమైన పనికాదు. దానిలో ఏ కొద్ది పొరపాటు జరిగినా యుద్ధఫలితం తారుమారవుతుంది. ఇంద్రునికే ముప్పు వాటిల్లుతుంది. దేశం సర్వనాశనమవుతుంది. విచారించగా 'విశ్వకర్మ' కు మించిన మహాశిల్పి మరొకడు లేడని స్పష్టమవుతుంది. దేవతలు ఆయనని అర్థిస్తారు. విశ్వకర్మ సంతోషంగా అంగీకరించి దధీచి వెన్నెముకతో వజ్రాయుధం తయారుచేసి యిస్తాడు. ఆ వజ్రాయుధంతో ఇంద్రుడు వృత్రాసురుని సంహరిస్తాడు. దేవతలు సంతోషిస్తారు.

ఇక్కడ ఒక ముఖ్య విషయం గమనించాలి. వృత్రాస్రురుడు విశ్వకర్మ కుమారుడు. తన కన్న కుమారుని సంహరించడానికి, తాను చేసే వజ్రాయుధమును ఉపయోగపెడతారనే విషయం విశ్వకర్మకు బాగా తెలుసు. అయినప్పటికి వజ్రాయుధాన్ని తయారుచేసి యిచ్చాడు. విశ్వకర్మ ఒక ప్రక్క కన్న ప్రేమ, మరొకప్రక్క దేశ సంక్షేమం, జాతి క్షేమం. ఇది నిజంగా విశ్వకర్మకు సంకట పరిస్థితే. పుత్రుని హితంకన్నా రాష్ట్ర హితమే శ్రేష్టమని తలంచాడు విశ్వకర్మ. స్వశ్రేయస్సుకన్నా రాష్ట్రశ్రేయస్సే ముఖ్యమని భావించాడు విశ్వకర్మ. కనుకనే కన్న మమకారాన్ని కూడా విడనాడి, ఎంతో కష్టపడి దధీచి ఎముకలతో వజ్రాయుధాన్ని తయారుచేసి యిచ్చాడు విశ్వకర్మ. కన్న కొడుకు దుర్మార్గుడైనా, దేశ ద్రోహి అని తెలిసినా, అట్టివానిని రక్షించడానికి ఏమాత్రం వెనుకాడక సమాజానికి 'విశ్వకర్మ' చేసిన త్యాగం ఆదర్శంకాదా? దధీచిలాంటి త్యాగపురుషులు, విశ్వకర్మలాంటి త్యాగశీలురకు పుట్టినిల్లు మన భారతదేశము.

శుక్రాచార్యుడు వద్దని చెబుతున్నప్పటికీ, వినకుండా వామనునికి మూడడుగులు దానం యిచ్చి ఆత్మార్పణ చేసుకున్న మహాత్యాగి "బలి చక్రవర్తి". పసుపు బట్టలతో వివాహవేదిక నుండి బయటకు వచ్చి, కొదమ సింహంలా రణరంగంలోకి దుమికి, వీరవిహారం చేసి "సింహఘడ్"ను ఆక్రమించి విజయలక్ష్మిని చేబట్టి కన్నుమూసిన వీరాధివీరుడు 'తానాజీ'. నవ్వుతూ నవ్వుతూ ఉరికంబానికెక్కి ఉరిత్రాడును తలకు తగిలించుకొని "వందేమాతరం" అంటూ అమరవీరుడైనాడు,

**"భగత్ సింగ్".** భారత, పురాణ, ఇతిహాస చరిత్రలు త్యాగాలకు నిలయాలు. ఈ దేశం త్యాగధనులకు పుట్టినిల్లు. ఇక్కడి చరిత్రలో ఏ పుటలు త్రిప్పినా కనిపించేవి త్యాగం, బలిదానం, ఆత్మార్పణలు. ఇవే భారతదేశానికి పట్టుకొమ్మలు.

దురదృష్టవశాత్తు రానురాను శబ్దాలకు అర్థాలు మారి పోతున్నాయి. దానం, ధర్మం, త్యాగం ఈనాడు ఒక వ్యాపారంగా మారిపోతున్నది. స్వార్థం, సంకుచితత్త్వం విలయతాండవం చేస్తున్నాయి. అధికార వ్యామోహం, పదవీకాంక్ష పెచ్చు పెరిగిపోతున్నది. ఒకప్పుడు **"త్యాగభూమి"** గా పేరుగాంచిన ఈ పవిత్ర భూమి నేడు **'భోగభూమి'** గా మారిపోతున్నది. ఇది మారాలి. చరిత్ర పునరావృతం కావాలి. త్యాగశీలురు తిరిగి ఉద్భవించాలి. ప్రతి భారతీయ యువకుడు తిరిగి 'త్యాగమూర్తి' గా మారాలి. దేశసౌభాగ్యం కోసం, పరిరక్షణ కోసం సర్వస్వాన్ని సమర్పించిన త్యాగమూర్తుల అడుగుజాడలలో మనం నడవాలి. మన మాతృదేవి ఔన్నత్యాన్ని తిరిగి ప్రపంచానికి చాటాలి. ప్రపంచానికి జ్ఞానభిక్షను ప్రబోధించాలి. ఈ మహత్తర ఆశయాన్ని సాధించేంత వరకు ప్రతి భారతీయ యువకుడు శక్తివంచన లేకుండా త్యాగం చేయటానికి సిద్ధపడాలి.

భోగం కంటే త్యాగమే ఎక్కువ మధురమైనది. త్యాగమే జీవిత పరమావధి కావాలి. **"త్యాగాత్ శాంతిః".** త్యాగము వలననే శాంతి చేకూరగలదు. మనస్సుకు శాంతి లేకపోతే దుఃఖాలు మనల్ని వదలిపెట్టవు. వెంటాడుతునే ఉంటాయి. శాశ్వతంగా మనలోనే కాపురం చేస్తుంటాయి. ఆత్మశాంతిలేనివానికి ఎంత సంపద ఉన్నప్పటికీ ప్రయోజనం శూన్యం. కర్మ ఫలమును నిష్కామ బుద్ధితో త్యజించుటయే త్యాగం. అట్టి త్యాగం వలననే చిత్తశుద్ధి కల్గుతుంది. చిత్తశుద్ధి వలన శాంతి ఉదయిస్తుంది. **"త్యాగేనైకే అమృతత్త్వమానశుః".** త్యాగము చేయుట వలన మోక్షము సిద్ధించునని ఉపనిషత్తులు చెబుతున్నాయి. త్యాగమే శిష్టుల ప్రధాన లక్షణం. కనుక ప్రతి వ్యక్తి జీవితాన్ని త్యాగమయం చేసుకోవాలి. ప్రత్యుపకారం ఆశించి మాత్రం త్యాగం చేయరాదు. నిస్వార్థబుద్ధితో, ఎట్టి ఫలాన్ని ఆశించకుండా, తన విద్యుక్త ధర్మంగా భావించి త్యాగం చేయాలి. అన్ని రకముల ధనముకన్నా **'త్యాగధనం'** చాలా గొప్పది. అట్టి త్యాగధనము సంపాదించినవాడే ధన్యుడు. అతడే ఇహపర లోకములందు శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలను పొందగలుగుతాడు. కనుక ప్రతి ఒక్కరూ త్యాగనిరతిని అలవరచుకోవాలి. చిరంజీవులకు నా ఆశీస్సులు.

ఇక ఉంటా...

ఇట్లు

'గీ'

సెంట్రల్ జైలు,

ది. 17-1-1977

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలలో, దానం, త్యాగముల గురించి వివరించాను. ఈ లేఖలో **'దూరదృష్టి'** అవశ్యకతను వివరిస్తాను.

## "దూరదృష్టి" :

ప్రతి ఒక్కరు జీవితంలో విజయాన్ని సాధించవలెననిన **'దూరదృష్టి'** ఎంతయో అవసరం. రానున్న ఆపదలను ముందుగానే గ్రహించి, తరుణోపాయాన్ని కనుగొనుటయే **'దూరదృష్టి'** అందురు. విజ్ఞతతో కూడిన దూరదృష్టి అత్యవసరం. దూరదృష్టితో ఆలోచించకుండా ఏ పనిచేసినప్పటికీ విజయం చేకూరదు. దూరదృష్టి కలవారు ఆపదలను బహు తేలికగా దాటివేయగలరు. అట్టి దూరదృష్టి లేనివారు ఆపదలకు లోనగుదురు. దీర్ఘాలోచన లేకుండా చేసే పనులు అనర్థాలకు దారితీస్తాయి. తొందరపాటు వల్లవచ్చిన కార్యం చెడిపోతుంది. ఈ విషయమున మహాభారతంలో ఒక చక్కటి నీతి కధను భీష్ముడు ధర్మరాజుకు చెబుతాడు. ఆ కధలోని నీతిని ప్రతి ఒక్కరూ తెల్సుకొని ఆపదలకు లోనుకాకుండా జీవితంలో విజయాలను సాధించాలి. ఒక కొలనులో 3 చేపలు ఉండేవి. వాటి పేర్లు 1. దీర్ఘదర్శి, 2. ప్రాప్తకాలజ్ఞుడు, 3. దీర్ఘసూత్రి. వీటిలో మొదటిదైన **దీర్ఘదర్శి** దూరదృష్టి కలది. రానున్న ఆపదలను ముందుగా పసికట్టి తరుణోపాయాన్ని ఆలోచించి ముందుగా జాగ్రత్త పడగల సామర్థ్యం కలది. రెండవ చేపైన **'ప్రాప్త కాలజ్ఞుడు'**కి అట్టి దూరదృష్టి లేదు. కొంత ప్రయత్నలోపం కూడా కలదు. కాని ఆపదలు ముంచుకొని వచ్చి మీద పడ్డప్పుడు మాత్రం సమయస్ఫూర్తితో వ్యవహరించి తప్పించుకొనగల సామర్థ్యం మాత్రం కలదు. మూడవ చేపైన **దీర్ఘసూత్రి**కి మాత్రం దూరదృష్టి అసలేలేదు. సమయస్ఫూర్తి అంతకన్నాలేదు. ఏ ప్రయత్నము చేయని సోమరి. స్వల్పకాలంలో చేయవలసిన చిన్న పనిని కూడా గంటలు తరబడి చేయు స్వభావం కలది.

ఈ మూడు చేపలు నివసిస్తున్న ఆ కొలనును చూడటానికి ఒకరోజు సాయంతం బెస్తవారు వచ్చారు. బాగా బలసియున్న చేపలను చూచి మురిసి పోయారు. రేపు ఉదయం వలలు తీసుకొని వచ్చి పట్టుకుందామని వాళ్ళలో వాళ్ళు సంప్రదించుకొని ఇండ్లకు తిరిగి వెళ్ళారు. ఆ బెస్తవారి మాటలను ఆ మూడు చేపలు వింటాయి. అందులో మొదటి చేప అయిన **'దీర్ఘదర్శి'** రానున్న ఆపదను

గ్రహించి మిగతా రెండు చేపలను హెచ్చరిస్తుంది. ఆ బెస్తవారు రాకమునుపే ఆ కొలనును వదిలి మరొక కొలనుకు వెళ్లడం మంచిదని హితవు చెబుతుంది. కాని మిగతా రెండు చేపలు దీర్ఘదర్శి మాటలను ఖాతరు చేయవు. రెండవ చేప అయిన ప్రాప్తకాలజ్ఞుడు ఎప్పడో రానున్న ఆపదను గురించి ఇప్పటి నుంచే అనవసరంగా బుర్ర చెడగొట్టుకోవటం అనుచితమని చెబుతుంది. మూడవ చేప అయిన దీర్ఘసూత్రి మాత్రం వేదాంతం వల్లె వేస్తుంది. మరణించే కాలం వస్తే ఎక్కడ ఉన్నా తప్పించుకోలేమని శ్రీరంగనీతులు చెబుతుంది. రెండు, మూడు చేపలు చెప్పిన మాటలను వినిన మొదటి చేప అయిన దీర్ఘదర్శి వాళ్ళ అవివేకమునకు చింతించి, ఆ కొలనును అప్పడే వదలి మరొక కొలనుకు చేరి హాయిగా ఉంటుంది. మరునాడు ఉదయమే జాలరులు వలలు తీసుకొని వచ్చి ఆ కొలనులో వేస్తారు. ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రి ఆ వలలో చిక్కుకుంటారు. జాలరులు పైకి తీసి ఆ రెండు చేపలను ఒడ్డున పడివేస్తారు. ప్రాప్తకాలజ్ఞుడు వచ్చిన ఆపదలను గ్రహించి సమయస్ఫూర్తితో చచ్చిన దానిలా పడి ఉంటుంది. ఆ జాలర్లు చచ్చిన చేప ఎందుకని తిరిగి ఆ కొలనులో విసిరిపారేస్తారు. బ్రతికాను కదాయని కొలను లోపలికి వెళ్ళి ప్రాణాల్ని రక్షించుకుంటుంది. మూడవ చేప అయిన దీర్ఘసూత్రి మాత్రం ఏమాత్రం బుర్రను ఉపయోగించక ఒడ్డున పడి గిలగిల కొట్టుకుంటూ ఉంటుంది. బాగా బలసిన చేప దొరికింది గదాయని సంతోషించి జాలర్లు ఆ చేపను బుట్టలో వేసుకొని ఇంటికి తీసుకొని వెళ్ళి కోసి చక్కగా కూర చేసుకొని తిని హాయిగా పడుకుంటారు.

ఈ కథవల్ల మనం ఒక నీతిని నేర్చుకోవాలి. ప్రతి ఒక్కరు మొదటి చేప అయిన '**దీర్ఘదర్శి**' యొక్క దూరదృష్టిని కలిగి ఉండాలి. అటువంటి వివేకం కలవారు, ముందు చూపు గలవారు మాత్రమే జీవితంలో విజయాన్ని పొందగల్గుతారు. ప్రాప్తకాలజ్ఞుడు లాగే కష్టాలు వచ్చి మీద పడేదాకా మెదలకుండా కూర్చోనకూడదు. ఒకవేళ, అనుకోకుండా దురదృష్టవశాత్తు, హఠాత్తుగా ఆపదలు మీద వచ్చి పడితే ప్రాప్తకాలజ్ఞుడు చూపిన సమయస్ఫూర్తిని చూసి ఆపదల నుండి కడు చాతుర్యంగా బయట పడటం నేర్చుకోవాలి. '**దీర్ఘసూత్రి**' లాగే మాత్రం ఎవ్వరూ ఉండకూడదు. పురుష ప్రయత్నం ఏ మాత్రం లేకుండా అంతా దైవం మీదనే భారం మోపేవార్ని ఆ భగవంతుడు కూడా రక్షించలేడు. **"గాలిలో దీపం పెట్టి దేవుడా నీ దయ"** అంటే దేవుడు కూడా ఏమీ సహాయం చేయలేడు. దీపం ఆరడం ఖాయం. దీపానికి చుట్టూ గ్లాసును అమర్చాలి. పైన చిమ్నీని పెట్టాలి. అప్పడే దీపం గాలికి ఆరిపోకుండా ఉంటుంది. అదే విధంగా ఏదో రకమైన విత్తనాలను తీసుకొని వచ్చి భూమిలో చల్లినంత మాత్రమున పంట పండదు. విత్తనాలు మంచివి సేకరించాలి. భూమిని

బాగా దున్ని పదును చేయాలి. చక్కగా ఎద పెట్టాలి. మందులు చల్లాలి. మంచి కాపలా పెట్టాలి. మానవుడు చేయవలసిన పనులన్నీ సక్రమంగా నిర్వర్తించిన పిదప వర్షం కోసం వరుణదేవుని ప్రార్థించాలి. ఏ ప్రయత్నం చేయకుండా వట్టిగా భగవంతుని ప్రార్థిస్తూ కూర్చుంటే ప్రయోజనం ఉండదు. ఏ రంగంలో విజయాన్ని సాధించాలనినా పురుష ప్రయత్నం అత్యవసరం. విధి కృతం అని తలఒగ్గి కూర్చోవడం పురుష లక్షణం కాదు. వీరులు విధికి తలఒగ్గరు. దుర్బలులు మాత్రమే విధికి తల వంచుతారు. ఒకవేళ కష్టాలు వచ్చినప్పటికీ ధీరులు ధైర్యంగా వాటిని ఎదుర్కొని విజయలక్ష్మిని చేబట్టగల్గుతారు. ధైర్యమును విడనాడిన భీరువులు ఏ ప్రయత్నమూ చేయలేరు. పురుష ప్రయత్నంతో విధిని జయించాలి గాని మన భవిష్యత్తు ఏ విధంగా వ్రాసి ఉంటే ఆ విధంగానే జరిగి తీరుతుందని కాళ్ళు బారజాపి మూలకూర్చొన రాదు. ఏ పనిని సాధించాలన్నా ధైర్యం అత్యవసరం. ఏ ప్రయత్నానికైనా ధైర్యమే మూలం. అధైర్యం అన్ని ప్రయత్నాలకు అవరోధం. కనుక ప్రతి ఒక్కరు ధైర్యంగా ముందుకు సాగిపోవాలి. వివేకవంతమైన దూరదృష్టిని కల్గి ఉండాలి. సందర్భోచిత మైన సమయస్ఫూర్తిని ప్రదర్శించాలి. విజ్ఞతతో కూడిన ఆలోచన చేయాలి. ఎటువంటి పరిస్థితులలోను పురుష ప్రయత్నాన్ని విస్మరించరాదు. అట్టి సాటిలేని సామర్థ్యం, కార్యశూరత కల్గిన ధీమంతులకు మాత్రమే భగవత్సహాయం అభిస్తుంది. వారే విజయాన్ని పొందగల్గుతారు.

ఇకపోతే ఏ విషయాల్లోనయినా తొందరపడి నిర్ణయాలను గైనకొరాదు. తొందర పడటం వల్ల సఫలీకృతం కాబోతున్న కార్యాలు సహితం చెడిపోతాయి. దూరదృష్టితో ఆలోచించకుండా, తొందరబాటుతో నిర్ణయాలను గైకొంటే, ఒక్కొక్కప్పుడు ఊహించనటువంటి ప్రమాదాలకు గురి కావల్సి వస్తుంది. ఏదైనా ఒక విషయమై నిర్ణయాన్ని గైకొనే ముందు, ముందు వెనుకలు ఆలోచించాలి. పూర్వాపరాలను దృష్టియందుంచుకొని విజ్ఞతతో నిర్ణయాలను గైకోనాలి. ఏదైనా ఒక సంఘటనను చూడటంతోనే, వెంటనే ఒక నిర్ణయానికి రాకూడదు. అట్టి సంఘటన జరగడానికి గల కారణాలేమిటో ముందు క్షుణ్ణంగా తెల్సుకోవాలి. అటువంటి కారణాలుత్పన్నం కావడానికి దోహదం చేసిన పరిస్థితులను ఓపికగా పరిశీలించాలి. చక్కగా విచారించిన మీదటనే ఒక నిర్ణయానికి రావాలి. అటుల కాకుండా ఫలితాన్ని చూచిన వెంటనే తీవ్ర చర్యలను గైకొంటే అనేక అనర్థాలకు దారి తీస్తాయి. ఈ చిన్న కథ యిదే వాస్తవాన్ని ఋజువు చేస్తుంది. పూర్వం ఒక చదువుకున్న బ్రాహ్మణ దంపతుల కుటుంబం ఒక గ్రామంలో ఉండేవారు. ఎంతో కాలానికి వారికి ఒక చిన్నారి కల్గింది. ఎంతో ప్రేమగా పెంచు కుంటున్నారు. ఆ పిల్లతో పాటు ఎంతో ప్రేమతో ఒక ముంగిసను కూడా పెంచుకుంటున్నారు. ఒక

రోజున మంచినీళ్ళకు బ్రాహ్మణుని భార్య నదికి వెళ్ళింది. అదే సమయంలో ఆ బ్రాహ్మణునికి రాజుగారి ఆహ్వానం వస్తుంది. ఎంతో కాలం నుంచి రాజుగారి ఆహ్వానం కోసం ఎదురు తెన్నులు చూస్తున్న ఆ బ్రాహ్మణునికి ఏమీ తోచక, ముంగిసను ఆ పసిపిల్లకు కాపలా ఉంచి రాజు కొలువునకు వెళ్ళతాడు. ఇంతలో ఒక సర్పం ఆ ఇంటికి వచ్చి పిల్లను కాటు వేయబోతుంది. అప్పుడు ముంగిస దానితో పోరాడి పామును చంపివేస్తుంది. విజయగర్వంతో ఆ నెత్తురు మూతితోనే బ్రాహ్మణునికి ఎదురుగా ముంగీస పోతుంది. తన పసిపిల్లను చంపి వస్తుందని భావించి కోపంతో ఆ ముంగీసను కర్రతో కొడతాడు. ముంగీస చచ్చిపోతుంది. లోపలికి వెళ్ళి చూడగా పసిపిల్ల కేరింతలు కొడుతూ ఆడుకుంటూ ఉంటుంది. అక్కడ పాము చచ్చిపడి ఉండటం చూచి కోపంతో తాను చేసిన పనికి ఎంతో చింతిస్తాడు. కాని ప్రయోజనం ఉండదు కదా ఈ కథ వల్ల మనం ఒక నీతిని నేర్చుకోవాలి. అసలు జరిగిన దేమిటో తెల్సుకొనకుండా చక్కగా విచారించక తొందర పడి నిర్ణయాలను గైకొంటే ఆపదలకు గురి కావల్సి వస్తుంది. కనుక ప్రతి ఒక్కరు తొందర పాటును విడనాడాలి. చిరంజీవులకు నా ఆశీస్సులు. ఇక ఉంటా...

ఇట్లు

'నీ'

సెంట్రల్ జైలు,

ది. 19-1-1977

ప్రియమైన జయ,

ఇంతకు పూర్వం వ్రాసిన లేఖలో **'దూరదృష్టి'** ఆవశ్యకతను, తొందరపాటు తనంవల్ల కలిగే నష్టాన్ని, గురించి వివరించాను. ఈ లేఖలో **'ఐకమత్యము'** ఆవశ్యకతను వివరిస్తాను.

## ఐకమత్యము :

**"ఐకమత్యమే మహాబలము"** అనేది విస్మరించరాని నగ్నసత్యం. వ్యష్టిగా సాధించలేని కార్యం, సమిష్టిగా సాధించవచ్చు. కుటుంబం అభివృద్ధి చెందవలెననిన, గ్రామం పురోభివృద్ధి గాంచవలెననిన దేశం శత్రువులబారి నుండి రక్షించవలెననిన ఐకమత్యం, సంఘీభావం అత్యవసరం. అనైక్యత అనర్థానికి దారితీస్తుంది. సమైక్యత సంరక్షిస్తుంది. గడ్డిపోచ **'ఉఫ్'** అంటే సహజంగా లేచిపోతుంది. అతి బలహీనమైన ఆ గడ్డిపోచలను ఒక చోట చేర్చి, వెంటిగా తయారుచేసి, దానితో మదించిన

మదపుటేనుగును సహితం బంధించ వచ్చును. విడిగానున్న గడ్డిపోచలో ఏ శక్తీ లేదు. చిన్నగాలికి కూడా తట్టుకోలేదు. ఆ బలహీనమైన గడ్డిపోచలే ఒకచోట చేరగానే అజేయమైన శక్తిని సంపాదించుతాయి. కనుక ఎవరికివారు విడిగా ఏ కార్యాన్నీ సాధించలేరు, సఫలీకృతం చేయలేరు. అదే పదిమంది ఒక సంఘముగా ఏర్పడిన యెడల వారు సాధించలేనిదంటూ ఉండదు. అందుకోసమే మన పెద్దలు **"సంఘే శక్తికలౌ యుగే"** (కలియుగమున సంఘమునందే శక్తి కలదు) అన్నారు. సంఘశక్తికి మించినది ఇహమునందు వేరొకటి లేదు. శక్తివంతుడిదే రాజ్యం.

శక్తివిహీనుడైన బలహీనుడు సమాజాభివృద్ధికి ఏ మాత్రం ఉపయోగ పడడు. శక్తిలేని వానిని ఎవ్వరూ ఖాతరు చేయరు. సంఘటిత శక్తి వలననే దేశ సమైక్యత, సమగ్రత నిలబడుతుంది. శక్తివంతమైన, బలమైన దేశమునే ప్రపంచం గౌరవిస్తుంది. బలహీనునికి గుర్తింపు ఉండదు. బలహీనమైన దేశమునకు గౌరవం ఉండదు. అట్టి శక్తి ఐకమత్యము వలననే ప్రాప్తిస్తుంది, ఉద్భవిస్తుంది.

ఐకమత్యానికి, అన్యోన్యతకు మన శరీరం ఒక చక్కటి ఉదాహరణ. అనేక రకములైన అవయవములతో ఈ శరీర నిర్మాణం జరిగింది. వేటికి ఏ పని కేటాయించబడిందో, ఆ పనిని చక్కగా ఐకమత్యంగా చేస్తుంటాయి. మనిషి తన మనసులో ఎక్కడికి వెళ్ళాలో సంకల్పించుకుంటే చాలు, కాళ్ళు అక్కడికి తీసుకొని వెళ్ళుతాయి. ఏ పనిచేయాలని కోరుకుంటే ఆ పనిని చేతులు చేస్తాయి. దేనిని చూడదలచుకుంటే వాటిని కళ్ళు చూస్తాయి. దేనిని వినదలచుకుంటే దానిని చెవులు వింటాయి. దేనిని వాసన చూడాలనుకుంటే దానిని ముక్కు వాసన చూస్తుంది. దేనిని తినదలచుకుంటే ఆ పదార్థమును నోరు తినేస్తుంది. మన కడుపు నిండుతుంది. జీర్ణమై రక్తరూపంలో తిరిగి శరీరంలోని అన్ని భాగాలకు పంపించబడుతుంది. ఊపిరితిత్తులు, గుండె ఈ పనిని సక్రమంగా నిర్వర్తిస్తాయి. ఒకవేళ దురదృష్టవశాత్తు శరీరంలోని ఈ అవయవముల మధ్య ఏదైన పేచీ వస్తే అంతటితో ఆట కడుతుంది. మేము ఎంతో శ్రమపడి సంపాదించి తీసుకొని వచ్చి మంచిగా వండిన ఆహారపదార్థములను ఏమీ పనిచేయకుండా, నోరు ఒక్కటే అంతా తినేస్తున్నదనే భావం కనుక మిగతా అవయవములలో కలిగి, ఏ పనీ చేయకుండా సమ్మె చేయటం ప్రారంభిస్తే, బహు కొద్ది కాలంలోనే ఆ శరీరం నీరసించి, చిక్కి, శల్యమై నశించిపోతుంది. అసలు మొదటికే మోసం వస్తుంది. కనుక శరీరం సౌష్ఠవంగా, బలంగా ఉండాలంటే అవయవముల మధ్య అన్యోన్యత, ఐకమత్యం ఉండాలి. శరీరంలో ఏ చిన్న అవయవానికి దెబ్బ తగిలినా, జబ్బు

చేసినా మొత్తం శరీరం బాధపడుతుంది. దేనికుండే ప్రాముఖ్యత దానికున్నది. ఒకటి తక్కువ, మరొకటి ఎక్కువ అనే అభిప్రాయం మనలో రాకూడదు. అన్నీ కలిసి పనిచేసినప్పుడే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. అదే విధంగా కుటుంబాభివృద్ధిగాని, గ్రామాభివృద్ధిగాని, దేశాభివృద్ధిగాని, అందరూ కలిసి సమైక్యంగా తమ బాధ్యతలను నిర్వర్తించినప్పుడే ఆశించిన విధంగా అభివృద్ధి జరుగుతుంది.

మన దేశ చరిత్రను ఒక పర్యాయం పరిశీలిస్తే,సమిష్టి సమైక్యతాభావం లోపించడం వలననే మనం పతనమైనామనిపిస్తుంది. మన దేశంలో శక్తి సంపన్నులైన రాజాధిరాజులు లేకపోవటం వల్ల మనం ఓడిపోలేదు. వారి మధ్యసహకారం, అన్యోన్యమైన ప్రేమ, ఐకమత్యం, సమాజ దృష్టిలేకపోవటం వల్లనే మనం విదేశీ దురాక్రమణలకు లోనైనాం. మనవారి మధ్యఈర్ష్య, అసూయ, ద్వేషములు పెచ్చుపెరిగి పోవటంవల్లనే మన దేశం విదేశీయులచేత కొల్లగొట్ట బడింది. ప్రాంతీయ దురభిమానం, కులతత్వం, వర్గవైషమ్యాలు విజృంభించడం వల్లనే మన జాతి బలహీనమైంది. మన బలహీనతలను ఆసరాగా గైకొని విదేశీయులు తమ విషకబంధ హస్తములను మనదేశం మీదకు చాపగలిగారు. మనలోనున్న 'అనైక్యత' అనే బలహీనతను బ్రిటీష్‌వారు చక్కగా ఉపయోగించుకొని సుస్థిరమైన సామ్రాజ్యాన్ని మనదేశంలో నెలకొల్పగలిగారు. **'విభజించి పాలించు'** అనే రాజనీతిని ప్రయోగించి మన జాతిని, సంస్కృతిని సర్వనాశనం చేయటానికి ప్రయత్నించారు. భాషలు వేరైనా, ఆచార వ్యవహారములు భిన్నంగాఉన్నా, యవత్ భారతదేశంలోని ప్రజలందరూ ఒకే జాతికి ఒకే ధర్మానికి చెందిన వారనే భావం మనలో లోపించడం వల్లనే విదేశీయులు మరికొన్ని విషబీజాలను మనలో నాటగలిగారు. స్వాతంత్ర్యం వచ్చి 30 సంవత్సరాలు (1977 సం॥) అవుతున్నప్పటికీ ఈ విచిత్ర స్వార్ధపూరిత భావములకు స్వస్తి చెప్పలేకపోయినాం. కొందరు స్వార్ధపరులు తమ రాజకీయ స్వప్రయోజనముల కోసం కులాన్ని, వర్గాన్ని, మతాన్ని వాడుకుంటూ ఉండటం కడుశోచనీయం. ఈ స్వార్ధ దుష్ట భూయిష్ట కుటిల భావముల వల్లనే దేశానికి తీరని నష్టం వాటిల్లుతున్నది. కనుక ప్రతి భారతీయుడు దేశ సమగ్రతను, సమైక్యతను పరిరక్షించడానికి ప్రతిజ్ఞ పూనాలి. మనలో మనకున్న విభేదాలను విస్మ రించాలి. నవ సమాజ నిర్మాణానికి **"సమైక్యత, సంఘీభావములు"** అత్యవసరములు.

**"వయం పంచాధిక శతం"** అని చెప్పిన ధర్మరాజు నీతిని ఆచరణలో పెట్టాలి. **"మేము నూట్రైదుగురము అన్నదమ్ములము"** అని ధర్మరాజు చెప్పాడు. వారి మధ్య తగాదా వచ్చినప్పుడు మాత్రం పాండవులుఐదుగురు,కౌరవులు నూరుగురు. వారి మీదకు

మరెవరైనా ఇతరులు దండెత్తి వస్తే అప్పుడు వాళ్ళు నూట ఐదుగురు సోదరులు. ఈ నీతిని మనం కూడా అనుసరించాలి. మనలో ఉండే తేడాలను బాహ్య ప్రపంచానికి చూపరాదు. వ్యక్తిగత భేదాలు ఉండవచ్చును, భాషలు భిన్నంగా ఉండవచ్చు, ప్రాంతీయ భేదాలు కనిపించవచ్చును. మతాలు వేరు కావచ్చును. సిద్ధాంతపరమైన తేడాలుండవచ్చును. అయినప్పటికీ మనమంతా ఒకే కుటుంబీకులం. ఈ పవిత్ర భూమిలో జన్మించిన భరతమాత పుత్రులం. మనది ఒకే జాతి, ఒకే సంస్కృతి, ఒకే ధర్మం - ఈ యదార్థమును మాత్రం విస్మరించరాదు.

**'సమత, సమగ్రత, సమైక్యత, సౌభ్రాతృత్వము'** - ఇవి సమాజాభివృద్ధికి మూలస్తంభాలు. ఈ నాలుగు స్తంభాలు పటిష్టంగా గట్టిగా ఉన్నప్పుడే సౌధం నిలబడగలుగుతుంది. ఏ ఒక్కదానికి అపాయం వాటిల్లినా సౌధం కుప్పగా కూలి పోతుంది. నేలమట్టమవుతుంది. కనుక ఐకమత్యమనే మహాశక్తిని ప్రతి ఒక్కరూ సముపార్జించాలి. జీవితంలో అనుభవంలోనికి తెచ్చుకోవాలి, దేశ కళ్యాణానికి సమైక్యంగా కృషి చేయాలి. సమిష్టిగా కృషి సలపటం నేర్చుకోవాలి. వ్యక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యములను పరిరక్షించడానికి కంకణధారులవ్వాలి. ప్రజాస్వామ్య వ్యవస్థను పటిష్టం చేయటానికి శక్తివంచన లేకుండా శ్రమించాలి. ప్రపంచంలో ఒకే ప్రముఖ అగ్రరాజ్యంగా మనదేశం విలసిల్లేట్లుగా కృషి సలపాలి. ఈ మహా ప్రయత్నంలో ప్రతి ఒక్కరూ భాగస్వాములవ్వాలి.

ఈ భరతమాత కరుణాకటాక్షముల వలన మనకు తిండి, గుడ్డ, విద్య వసతి లభిస్తున్నవి. ఆమె ఋణం తీర్చుకోవటం మన విధ్యుక్త ధర్మం, కర్తవ్యం. ఆమె గౌరవమే మన గౌరవం. ఆమె సౌభాగ్యమే మన సౌభాగ్యం. ఆమె శ్రేయస్సే మన శ్రేయస్సు. ఈ మహోత్కృష్టమైన భావనను, సమాజ దృష్టిని ప్రతి ఒక్కరూ కలిగి ఉండాలి. సమైక్యతను పెంపొందించుకొని సమగ్రతను సాధించాలి. ఐకమత్యంతో, సంఘీభావంతో సమైక్యపోరాటానికి సంసిద్ధం కావాలి. వ్యక్తిగతమైన కోరికలకు ప్రాముఖ్యత యివ్వక, సమాజ శ్రేయస్సుకే అత్యున్నతమైన ప్రాధాన్యత నివ్వాలి. అప్పడే మహాత్మాగాంధీజీ కనిన కలలు సఫలీకృతమవుతాయి. అమరవీరుల ఆశయాలు నెరవేరుతాయి. ఇదే నేటి మన కర్తవ్యం.

చిరంజీవులకు నా ఆశీస్సులు..........

ఇక ఉంటా...

ఇట్లు

'నీ'

# (రెండవభాగము)

ఈ రెండవభాగంలో నా శ్రీమతి జయప్రదకు వ్రాసిన ఐదు ప్రధానమైన లేఖలు ఉన్నాయి. ఆ లేఖలలో అత్యాయిక పరిస్థితి (EMERGENCY) కాలంనాటి పరిస్థితులను వివరించాను. ఆనాటి ప్రభుత్వం సవరించ తలబెట్టిన 44వ రాజ్యాంగసవరణ వలన వచ్చే ప్రమాదాలను గురించి హెచ్చరించాను. ప్రముఖ న్యాయవేత్తల అభిప్రాయాలను కూడా ఆ లేఖలలో పొందు పరిచాను. అయితే ఆ ఐదు లేఖలు నా శ్రీమతికి జైలు అధికారులు పంపకుండా D.I.G. Intelligence వారి పరిశీలనార్థం హైద్రాబాద్ పంపినారు. ఆ లేఖలను వారు సునిశితంగా పరిశీలించి రెండు నెలల తరువాత నాకే త్రిప్పి పంపినారు. ఆనాటి ప్రభుత్వ నియంతృత్వ విధానాలకు ఈ సంఘటన ఒక మచ్చు తునక.

సహృదయులైన ప్రజాస్వామ్యవాదులు ఈ లేఖలను శ్రద్ధతో, సమగ్రంగా పరిశీలించి, ఆనాటి 'ఎమర్జన్సీ' కాల పరిస్థితులను సదవగాహన చేసుకొని, మరల అటువంటి దుర్భర పరిస్థితి ఈ దేశానికి దాపురించకుండా జాగ్రత్తపడుతారని ఆశిస్తున్నాను, ఆకాంక్షిస్తున్నాను.

భవదీయ

కొమరగిరి కృష్ణమోహనరావు

ఎడిటర్ 'శ్రీవాణి'

## (రెండవభాగము)

ఈ రెండవభాగంలో నా శ్రీమతి జయప్రదకు వ్రాసిన ఐదు ప్రధానమైన లేఖలు ఉన్నాయి. ఆ లేఖలలో అత్యయిక పరిస్థితి (EMERGENCY) కాలంనాటి పరిస్థితులను వివరించాను. ఆనాటి ప్రభుత్వం సవరించ తలపెట్టిన 44వ రాజ్యాంగసవరణ వలన వచ్చే ప్రమాదాలను గురించి హెచ్చరించాను. ప్రముఖ న్యాయవేత్తల అభిప్రాయాలను కూడా ఆ లేఖలలో పొందు పరిచాను. అయితే ఆ ఐదు లేఖలు నా శ్రీమతికి జైలు అధికారులు పంపకుండా D.I.G. Intelligence వారి పరిశీలనార్థం హైద్రాబాద్ పంపినారు. ఆ లేఖలను వారు సునిశితంగా పరిశీలించి రెండు నెలల తరువాత నాకే త్రిప్పి పంపినారు. ఆనాటి ప్రభుత్వ నియంతృత్వ విధానాలకు ఈ సంఘటన ఒక మచ్చు తునక.

సహృదయులైన ప్రజాస్వామ్యవాదులు ఈ లేఖలను శ్రద్ధతో, సమగ్రంగా పరిశీలించి, ఆనాటి 'ఎమర్జన్సీ' కాల పరిస్థితులను సదవగాహన చేసుకొని, మరల అటువంటి దుర్భర పరిస్థితి ఈ దేశానికి దాపురించకుండా జాగ్రత్తపడుతారని ఆశిస్తున్నాను, ఆకాంక్షిస్తున్నాను.

భవదీయ

కొమరగిరి కృష్ణమోహనరావు

ఎడిటర్ 'శ్రీవాణి'

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 13-9-1976

ప్రియమైన జయ,

నేను కులాసా. నీ విషాదపూరితమైన ఉత్తరాలు అందుతూనే ఉన్నాయి. ఈ స్వతంత్ర భారతంలో నీలాంటి నిర్భాగ్యులు కొన్ని వేలమంది భర్తలను, పుత్రులను దూరం చేసుకొని గత 14 నెలల నుండి అనేక యిక్కట్లననుభవిస్తూ, మానసిక ఆందోళనలతో జీవనయాత్ర కొనసాగిస్తున్నారు. ఏ తప్పూ చేయనిదే యింత దీర్ఘకాలము అనవసరంగా ప్రభుత్వము ఎందుకు జైళ్లలో వుంచినదో అర్థంకాక సతమతమవుతున్నారు, అనుమానిస్తున్నారు, సంశయిస్తున్నారు. ఒక చంప ప్రొద్దున లేచిన దగ్గర నుంచి రేడియో పెట్టినా, పత్రికలు చూచినా వినిపించేది, కనుపించేది ఒకటే. ప్రభుత్వవిధానాలను పొగడే వందిమాగధుల ప్రకటనలు, స్తోత్రపాఠములు, సభలు, సన్మానాలు, ఊరేగింపులు, సత్కారాలు. అంతేకాదు అమ్మగారి యిరవై సూత్రాలు, అబ్బాయిగారి నాల్గుసూత్రాలు, ముసలయ్యగారి ఎనిమిది సూత్రాలు, రఘురామయ్యగారి మూడు సూత్రాలు, బారువాగారి ఆదేశాలు, వీటిపై కవితలు, నాటికలు, నాటకాలు, బుర్రకథలు - ఇవేకదా ప్రతిరోజు రేడియోలో వినపడేవి, పత్రికలలో కనపడేవి. ప్రతిపక్షాలమాటే వినపడక పోవడానికి కారణమేమిటి? అనే సంశయం కొంతమందికి కల్గుతున్నది. ఈ అనుమానం ప్రబలి, పెద్దదై ఏమి ప్రమాదం వచ్చిపడుతుందోనని ప్రభుత్వాధినేతలు ముందుగానే జాగ్రత్త పడుతున్నారు. (గుమ్మడికాయ దొంగ ఎవరంటే భుజాలు తడుముకున్నట్లు) వారే ప్రశ్నలు వేసుకొని సమాధానాలు వారే చెప్పకుంటున్నారు. **"జైళ్ళలో ఎక్కువ మంది లేరని లక్షజనాభాకు యిద్దరుకన్నా ఎక్కువమంది లేరని (అనగా సుమారు 12వేలు) వారిలో మూడవవంతు నిషేధించబడిన సంస్థలకు చెందినవారని, మరొక మూడవవంతు స్మగ్లర్లనీ, మిగిలిన వారు మాత్రమే రాజకీయ పార్టీలకు చెందినవారని, అందులో** 10% **పెరోల్స్‌లోనే వున్నారు"** అని **శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు** సెలవిచ్చారు. **'అత్యవసర పరిస్థితి చాలా వరకు సడలించబడింది'** అని **శ్రీమతి గాంధీ** పేర్కొన్నారు. **'ఇప్పుడు జైళ్లలో వున్నవారు ఎక్కువ మంది స్మగ్లర్లే'** అని **ఓం మెహతా** చెప్పారు. **'మా రాష్ట్రంలో ప్రతిపక్షాల బెడదలేదు'** అని **శ్రీ వెంగళరావుగారు** చెప్పారు. కాని నాలాంటి వారందరూ గత 14నెలలలో ఎవరూ విడిచిపెట్టబడలేదు. ఎవరైనా విడిచిపెట్టబడితే, ప్రభుత్వ కరుణాకటాక్షములకు, వారి దయకు పాత్రులైనవారే. ఆశ్రయించిన వారికే పెరోల్సు. నిజమైన కారణాలు గలవారికి మాత్రం రావు. ఇదీ పరిస్థితి. పైకి చెప్పేది ప్రజాస్వామ్యం, అనుసరించేది నియంతృత్వం, బంధు పక్షపాతం, ఆశ్రితపక్షపాతం, కులతత్వం, వర్గ ముఠాతత్వాలు

తారస్థాయి నందుకున్నాయి. ఈ వాస్తవాన్ని ధైర్యంచేసి ప్రకటించేవారులేరు. అటువంటివారు చాలామంది జైళ్లలో మ్రగ్గుతున్నారు. ఒకవేళ ఎవరైనా ధైర్యంతో ప్రకటిస్తే వేసుకునే పత్రికలు లేవు. వాళ్ల పత్రికను మూసేస్తారేమోనని వారికి భయం. ధైర్యం చేసినవారు మరుక్షణంలో కటకటాల వెనుకకు పంపబడుతారు. మన దగ్గర బంధువులే కనీసం ఒక ఉత్తరం వ్రాయడానికి (నాకు) ఎంత భయపడుతున్నది నీకు తెల్సుకదా! మన ఇంటికి వచ్చి నిన్ను పలుకరించడానికే ఎంత భయపడు తున్నారో నీకు తెల్సుకదా! ఈ భయం కల్గడానికి కారణం? ప్రభుత్వ నియంతృత్వ విధానాలుకావా? అత్యవసర పరిస్థితి నాసరాగా గైకొని, నియంతృత్వంగా ప్రభుత్వం చేస్తున్న చట్టాలవల్ల కాదా? **'మీసా'** బూచిని చూసి ప్రజలను హడలకొట్టడం వల్లకాదా? **'మీసా'** క్రింద నిర్బంధించిన వారికి కారణాలు కూడా చెప్పనవసరం లేదు కదా! డిటెన్యూలకు కోర్టులకు వెళ్లే అవకాశం కూడా లేదు. 359 సూత్రం క్రింద రాష్ట్రపతి ప్రాధమిక హక్కులను తాత్కాలికంగా రద్దుచేసారు కూడా. ఈ మధ్య అటార్నీ జనరల్ **'నిరెన్‌డే'** సుప్రీం కోర్టులో ప్రభుత్వం తరఫున వాదిస్తూ **" ఏ నిర్బందితుడ్ని కాల్చిచంపినా, న్యాయస్థానాలు జోక్యం చేసుకొనడానికి వీలులేదు."** అని వాదించారు. ప్రభుత్వం ఏవిధంగా నియంతృత్వంగా పరిపాలిస్తుందో ఇంకా వేరే చెప్పనవసరం లేదు. ఈ విధంగా కారణాలు చెప్పకుండా దీర్ఘకాలం నిర్బందించడం న్యాయమా? ఎవరైనా ద్రోహులు దేశద్రోహం తలపెడితే అట్టివారిని బహిరంగంగా విచారించి కఠినంగా శిక్షించవచ్చును కదా? కాని అట్టి ధైర్యంగాని, నైతిక శక్తిగాని ప్రభుత్వానికి లేదు. అందువల్లనే **'మీసా'** ను అక్రమంగా అమాయకుల మీద ప్రయోగిస్తున్నది. శ్రీ రెడ్డిగారు భావిస్తున్నట్లుగా ఈ కొద్దిమంది వల్లనే శాంతి భద్రతలకు ముప్పు వాటిల్లిందా? బలం లేదని చెప్పబడే ప్రతిపక్షాలను చూచి ప్రభుత్వం ఎందుకు భయపడుతున్నది? లక్షలాది సైనిక, పోలీసు బలగం గల ఈ ప్రభుత్వం ఈ క్రొద్దిమందిని చూచి ఎందుకు భయపడుతున్నది? వారుచెబుతున్నట్లుగా మేమెవ్వరం ఆర్థిక పురోభివృద్ధికి అడ్డుపడలేదే? అసలు ఈ కొద్దిమంది వల్లనే ఆర్థిక వ్యవస్థ తారుమారవుతుందా? **"తాడి చెట్టు ఎందుకు ఎక్కావురా అంటే దూడ మేతకు"** అన్నట్లున్నది ప్రభుత్వవాదం. దేశపురోభివృద్ధికి వేసే సక్రమమైన పథకాలను విజ్ఞతగల ఏ ప్రతిపక్షం వ్యతిరేకించదు. శ్రీమతి గాంధీ యిప్పుడు చెప్పే సూత్రాలను గత 20 సంవత్సరాలనుంచి జనసంఘం చెబుతునేవున్నది. 1975 మార్చి 6న ఇదే రకమైన 20 సూత్రాలతో, 10 లక్షలమంది ఊరేగింపుతో వెళ్లి శ్రీ జయప్రకాశ నారాయణగారు పార్లమెంటుకు మెమోరాండాన్ని యిచ్చారు. గత 29 సంవత్సరాల నుంచి దాదాపు దేశం మొత్తం కాంగ్రెస్ ప్రభుత్వం క్రిందనే వున్నది కదా! శ్రీమతి గాంధీ అధికారంలోనికి వచ్చి 10 సంవత్సరాలు దాటిపోయింది కదా! వారు

ఎందువల్ల ఈ ఆర్థిక విధానాలను అమలు పరచలేదు? శ్రీమతి గాంధీ బెంగుళూరు కాంగ్రెసు కార్యకర్తల సభలో, ఆర్థిక విధానాలను అమలు పరచడంలో విఫలమైనామని (గతంలో) అంగీకరించారు(ఆంధ్ర పత్రిక 14-2-76). ప్రజాస్వామ్యం వర్థిల్లాలంటే ప్రతిపక్షం వుండి తీరాలి. ప్రతిపక్షం పాత్ర 'WATCH DOG" లాంటిది. ప్రతిపక్షమే లేకపోతే ప్రభుత్వ పక్షానికి పట్టపగ్గాలుండవు. విమర్శించేవారే లేకపోతే, కండకావరంతో కన్నూ మిన్నూ కానకుండా నియంతగా వ్యవహరిస్తుంది ప్రభుత్వం. ప్రతిపక్షం కూడా క్రమశిక్షణాయుతంగా వ్యవహరించాలి. అప్పుడే ప్రజాస్వామ్యం మనజాల గల్గుతుంది. ఈ వాస్తవికతను అర్థం చేసుకొనకుండా ప్రతిపక్షాలను సర్వనాశనం చేస్తే ప్రజాస్వామ్య వ్యవస్థ దెబ్బతింటుంది. ప్రజాస్వామ్యాన్ని గురించి, అమెరికన్ విమర్శకుడు **'జేమ్స్ రస్సెల్‌లానెల్' మీరు అధికారంలో వుండదగ్గవారేనా? అని అధికారంలో వున్నవార్ని అడగడం ద్వారా ఇబ్బంది పెట్టే అలవాటు ప్రజాస్వామ్యానికి ఉంది"** అని అంటాడు. కనుక ప్రజాస్వామ్యం మనజాలాలంటే ప్రతిపక్షాలు చేసే విమర్శనలను హుందాతనంగా ప్రభుత్వం స్వీకరించాలి. మంచిని గ్రహించి అమలు పరచాలేగాని, ప్రతిపక్షాల మీద ఆగ్రహించరాదు. కాని ఆ సహనం ప్రభుత్వానికి వున్నట్లు కన్పడటం లేదు. ఏదో ఒక విధంగా ప్రతిపక్షాలను సర్వనాశనం చేయడానికే ప్రభుత్వం సంకల్పించుకున్నది. తన అధికారాన్ని శాశ్వతంగా నిలబెట్టుకొనడానికే అత్యవసర పరిస్థితిని ప్రవేశపెట్టింది. దాన్ని ఆసరాగా గైకొని ప్రతిపక్షాలు, పత్రికల నోళ్ళను మూయగల్గింది. ఇదే ఛాన్సు అని రాజ్యాంగ స్వరూప స్వభావాలనే మార్చి వేయ సంకల్పించింది. ప్రభుత్వం తలబెట్టిన ఈ పెద్ద రాజ్యాంగ **(44)** సవరణ నేడు ప్రజల ముందున్నది. దీనిలో **59** క్లాజులున్నాయి. ఇటువంటి పెద్ద సవరణ మున్నెన్నడూ మన దేశంలో చేయలేదు. ప్రపంచంలో మరెక్కడా చేయలేదు కూడా. దీనిని రాజ్యాంగ సవరణ అనేదానికన్నా, రాజ్యాంగాన్నే మళ్ళీ వ్రాస్తున్నారంటే బాగుంటుంది. **"పార్లమెంటులో తమకు అత్యధిక మెజారిటీ వున్నప్పటికీ తొందరపడి ఈ సవరణను ఆమోదించలేదని, దేశంలోని పౌరులందరూ బహిరంగ చర్చ జరపడానికి అవకాశం కల్పించే నిమిత్తం 7 వారాలు అవకాశం యిచ్చాం"** అని శ్రీమతిగాంధీగారు సగర్వంగా పేర్కొన్నారు. చాలా సంతోషం. కాని నాబోటి వాళ్లకు పత్రికలలో భావాలను ప్రకటించే అవకాశం లేదు. అందువల్ల ఈ ఉత్తరం ద్వారానే నా భావాలను నీకు తెలియపరచ సంకల్పించాను. 60 కోట్ల మంది భారతీయుల భవిష్యత్తును నిర్ణయించే అతి ముఖ్యమైన సవరణ కదా! కనుక ఈ విషయమై ప్రతివ్యక్తీ తన అభిప్రాయాలను నిష్కర్షగా చెప్పాలని నా అభిప్రాయం ఎవరైనా, ఏమైనా అనుకుంటామోనని, ప్రభుత్వాధినేతలకు కోపం వస్తుందేమోనని గాని భయపడి నోరు మెదపకుండా వుంటే ప్రజాస్వామ్యానికి తీరని హాని చేకూర్చిన వారమవుతాం. వివరంగా

వ్రాయడానికి కాగితం చాలదు. అందులో నేను న్యాయవాదిని కూడా కాదు. కనుక క్లుప్తంగా మాత్రమే వ్రాస్తున్నాను.

1. ఈ రాజ్యాంగ సవరణలను ఏ న్యాయస్థానంలోను సవాలు చేయరాదు. అసలు ఇటువంటి క్లాజును పెట్టడం ప్రజాస్వామ్య సమ్మతమేనా? అసలు ఏ వ్యక్తి అయినా కోర్టులకు ఎందుకు వెళ్తుతాడు. ఒక వ్యక్తి వల్ల గాని, ప్రభుత్వం వల్లగాని అన్యాయం జరిగిందని భావించినప్పుడూ, తన ప్రాథమిక హక్కులకే భంగం వాటిల్లినప్పుడూ, నష్టపడ్డప్పుడూ - న్యాయం కోసం కోర్టులకు వెళ్ళడం జరుగుతుంది. మనపెద్దలు తీవ్రంగా ఆలోచించి ధర్మదండాన్ని న్యాయస్థానాలకు యిచ్చారు. రాజ్యాంగం ప్రకారం ప్రభుత్వం సరీగా పనిచేస్తున్నది, లేనిది చూచే బాధ్యతను న్యాయ స్థానాలకు, రాజ్యాంగంలోనే అవకాశాన్ని కలుగజేశారు. పార్లమెంటు చేసిన ఈ సవరణలనే న్యాయస్థానాలలో ప్రశ్నించరాదంటే, న్యాయస్థానాల హక్కులను పరిమితం చేసినట్లే గదా! అంతేకాదు పౌరుని ప్రాథమిక హక్కులను సమూలంగా ఊడబెరికినట్లే అవుతుంది. పౌరుని స్వేచ్ఛా స్వాతంత్ర్యములకే ఈ సవరణవల్ల తీవ్రమైన విఘాతం కల్గుతుంది. న్యాయ వ్యవస్థనే అగౌరవ పరచినట్లు అవుతుంది. ఈ సందర్భమున కీ॥ శే॥ నెహ్రూగారి అభిప్రాయాలను ప్రస్తుత పరిస్థితులలో తెల్పుకోవడం ఎంతయినా అవసరమని భావిస్తున్నాను. **"న్యాయవ్యవస్థను, సుప్రీం కోర్టును, దేశంలోని యితర హైకోర్టులను మనం గౌరవించాలి. ప్రజాప్రతినిధులు క్షణికోద్రేకంలో తప్పటడుగు వేయకుండా చూసే బాధ్యత వివేకశీలురైన న్యాయ నిర్ణేతలదే. రాజ్యాంగ విరుద్ధమైన దేదీ జరగకుండా వుండేందుకు కోర్టుల ప్రశాంత వాతావరణంలో వారు జాగ్రత్త తీసుకోవాలి"** అని కీ.శే. నెహ్రూ అంటారు. వారి భావాలను బట్టి చూస్తే వారికి న్యాయస్థానాల యెడల ఎటువంటి అత్యున్నతమైన భావం, గౌరవం వుండేదో అర్థమవుతుంది. ఈ సవరణలతో వారి భావాలకు తిలోదకాలివ్వడమే అవుతుంది.

2. ఈ సవరణలననుసరించి చేసే చట్టాలను మాత్రం న్యాయస్థానాలలో ప్రశ్నించడానికి అవకాశం మాత్రం యిచ్చారు. కేంద్ర శాసనములను సుప్రీంకోర్టు లోను, రాష్ట్రశాసనములను హైకోర్టులలోను ప్రశ్నించవచ్చు. సుప్రీం కోర్టులో 7గురు న్యాయమూర్తులుగల ధర్మాసనం వీటిని విచారిస్తుంది. వారిలో మూడింట రెండు వంతులు (అనగా 4 2/3 న్యాయమూర్తులు అనగా 5గురు), అదే విధముగా హైకోర్టులలో 5 గురు న్యాయమూర్తులు గల ధర్మాసనం విచారిస్తుంది. వారిలో మూడింట రెండువంతులు (అనగా 3 1/ 3 న్యాయమూర్తులు అనగా 4 గురు) మంది మెజారిటితో ప్రభుత్వం చేసిన చట్టాలు చెల్లవని తీర్పు చెప్పినప్పుడు మాత్రమే ఆ చట్టములు రద్దు అవుతాయి.

ఇది యిప్పుడున్న మెజారిటీ తీర్పు పద్ధతికి విరుద్ధం. పౌరునికి ఈ పద్ధతి వల్ల న్యాయం చేకూరడం కల్ల. కళ్ళనీళ్లు తుడవడానికే ఈ అవకాశం యివ్వడం జరిగిందని స్పష్టమవుతున్నది. అంతేకాదు న్యాయస్థానముల హక్కులను కుదించడానికే ఈ సవరణ కనుగొని రాబడిందని భావించవలసివస్తున్నది.

3. ఈ సవరణ వల్ల ప్రభుత్వోద్యోగులు న్యాయస్థానాలకు వెళ్లే అవకాశముండదు. వారి వివాదములను ప్రభుత్వం నియమించిన 'అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్స్' మాత్రమే విచారిస్తాయి. ఈ పద్ధతివల్ల ఉద్యోగులకు న్యాయం చేకూరుతుందనే నమ్మకం లేదు. అట్టి ట్రిబ్యునల్సులో ప్రభుత్వకనుసన్నలలో మెలిగేవారే సభ్యులవుతారుగదా! దీనివల్ల ఉద్యోగులకు ఉపకారం కన్నా, అపకారమే ఎక్కువగా జరిగేప్రమాదం వున్నది.

4. ఈ సవరణవల్ల **FOR ANY OTHER PURPOSES** అనే పదాలను తొలగించి 'రిట్' ల జారీకి లోగడ హైకోర్టుల కున్న అధికారాలను పరిమితం చేయడం జరుగుతుంది. అనగా ఏ పరిస్థితులలోను కోరిన వెంటనే 'స్టే' ఉత్తర్వులు హైకోర్టు యివ్వదు. నోటీసు యిచ్చుట, అన్నిరకాల కాగితాలను దాఖలు చేయుట ఎదుట పార్టీ వాదనను వినడం జరగనిదే 'ఇంజక్షన్' హైకోర్టు యివ్వరాదన్నమాట. దీనివల్ల ప్రభుత్వ నియంతృత్వ చట్టాలకు సామాన్యుడు బలికాక తప్పదు.

5. ఈ సవరణవల్ల లోగడ రాష్ట్రపతికి వున్న "వీటో" లాంటి అధికారాలు మటు మాయమవుతాయి. మంత్రి వర్గం ఏది నిర్ణయిస్తే అదే రాష్ట్రపతి తు.చ. తప్ప కుండా ఆమోదించాలి. అనుసరించాలి. దీనివల్ల రాష్ట్రపతి మీద మంత్రివర్గం పెత్తనం చలాయించడానికి అవకాశం ఏర్పడుతుంది. సహజంగా మంత్రివర్గం అధికారపార్టీ చెప్పుచేతలలో వుంటుంది. కనుక రాష్ట్రపతి అధికారపార్టీవారు చెప్పినట్లు వినవలసివస్తుంది. ఈ చర్యవల్ల ఏకపక్ష నియంతృత్వం ప్రబలే ప్రమాదమున్నది.

6. ఈ సవరణవల్ల సాయుధబలాలను శాంతి భద్రతలను కాపాడాలనే నెపంతో ఏ రాష్ట్రమునకైనా పంపించేందుకు కేంద్రం అధికారాన్ని పొందుతుంది. ఈ దళాలు కేంద్రం ఆదేశాలను మాత్రమే శిరసావహిస్తాయి. ఆ రాష్ట్రముల ఆదేశాలకులోబడి పని చేయవు. ఈ చర్య వల్ల కేంద్రం మరింత పటిష్టమై, నియంతృత్వంగా రాష్ట్రాల మీద తన పెత్తనాన్ని చలాయించే అవకాశం లభిస్తుంది. ప్రతిపక్షాల క్రిందనున్న రాష్ట్రములకు పూర్తిగా స్వేచ్ఛపోతుంది. ఇక వుంటా.........

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది.13-9-1976.

ప్రియమైన జయ,

ఒక ఉత్తరంలో చాలకపోవడం వల్ల రెండవ ఉత్తరంలో వ్రాస్తున్నాను. ఇది చాలినా చాలకపోయినా మూడవ ఉత్తరం లేధు కదా! అందువల్ల ఏదో విధంగా దీనిలోనే యిరికిస్తాను. ఇంతకన్నా చేయగల్గింది ఏమీ లేదు గదా!

7. ఈ సవరణలో కేంద్ర రాష్ట్రప్రభుత్వాల ఏ ఏ అకౌంట్లను ఏ విధంగా వుంచాలో నిర్ణయించే అధికారాన్ని కంట్రోలర్ మరియు ఆడిటర్ జనరల్ నుండి యిప్పుడు రాష్ట్రపతి స్వీకరిస్తారు. రాష్ట్రపతి మంత్రివర్గం చెప్పినట్లే వినాలి. కాబట్టి వివిధ రాష్ట్రముల అకౌంటింగ్ విధానమంతా మంత్రివర్గం చేతులలోనికి పోతుంది. అధికారపార్టీ అధికారంలోవున్న రాష్ట్రములలో అకౌంట్సును కూడా గందరగోళం చేయవచ్చు. ఆడిటర్ జనరల్‌కు భయపడవలసిన అవసర ముండదు. ప్రతిపక్షాల పాలనలో వున్న రాష్ట్రములను ఏడిపించడానికి అధికారపార్టీకి యిది మంచి అవకాశం.

8. జాతీయ వ్యతిరేక కార్యకలాపాలంటే నిర్వచనం యివ్వబడింది. ఈ అవకాశం తీసుకుని అధికార పక్షమునకు వ్యతిరేకమైన పక్షాలను (అవి దేశ భక్తి కలవి అయినప్పటికి) నిషేధించే ప్రమాదం కూడా వున్నది.

9. పార్లమెంటు, శాసనసభలలో అత్యవసర పరిస్థితులలో చేయబడిన చట్టాలు, ఒకవేళ అత్యవసర పరిస్థితి తీసివేసినప్పటికీ అమలులోనే వుంటాయి. వాటిని రద్దుచేస్తే తప్ప, నిరవధికంగా కొనసాగుతునే వుంటాయి. అసలు అత్యవసర పరిస్థితి కూడా రద్దు చేసేంతవరకు ఎంతకాలమైనా కొనసాగుతునే వుంటుంది. ఒకసారి అత్యవసర పరిస్థితిలో చేసిన చట్టాలకు శాశ్వతంగా ప్రజలు, ముఖ్యంగా ప్రతిపక్షాలు బలి కావల్సిందేనన్నమాట.

10. ఈ సవరణ వల్ల లోక్‌సభ, అసెంబ్లీ స్థానములు 2001 సం॥ వరకు మార్చరాదు. ఓటింగు, హక్కు వచ్చి ఓటర్ల సంఖ్య పెరిగినప్పటికి సీట్లు మాత్రం పెరుగవు. ఇది పరోక్షంగా పౌరుని ప్రాథమిక హక్కులను దెబ్బతీయడంలాంటిదే.

11. ఈ సవరణవల్ల రాష్ట్రపతికి ప్రత్యేకాధికారములు సంక్రమించుతాయి. 2సం॥ వరకు రాజ్యాంగాన్ని తన యిష్టము వచ్చినట్లు మార్చడానికి అవకాశం లభిస్తుంది. మంత్రివర్గం రాజ్యాంగాన్ని ఏ విధంగా మార్చదలచుకుంటే ఆ విధంగా రాష్ట్రపతి రాజ్యాంగాన్ని మారుస్తారు. అనగా అధికారపార్టీ వారు

ఏమి చెబుతే ఆ విధంగా రాజ్యాంగాన్ని రాష్ట్రపతి మారుస్తారు. ఈ సవరణ వల్ల ఏవిధంగా చూచినా, చిట్టచివరికి ఏకపక్ష నియంతృత్వం రష్యాలో మాదిరి యిక్కడకూడా వచ్చే ప్రమాదం వున్నది. మన ప్రభుత్వం యిప్పుడు రష్యావారి ఆదేశాల ప్రకారమే నడుస్తున్నది కదా! ఈ విధంగా వ్రాసుకుంటూ పోతే ఒక గ్రంథం వ్రాయవచ్చు. అవకాశం లేదు కదా! ఇకపోతే ఈ సవరణలు యిప్పుడు చేయవచ్చునా లేదా? చేయదలుస్తే ఎప్పుడు? ఏ విధంగా చేయాలి? అనే విషయం మీద నా అభిప్రాయాలు వ్రాస్తాను.

1. అసలు ఈ సవరణ చేసే అధికారం ఈ పొడిగించబడ్డ పార్లమెంటుకు లేదు. ప్రజలు యిచ్చిన 5 సం॥ల కాలపరిమితి అయిపోయింది. చేయదలచుకున్న వారు అసలు మొదటి 5సం॥లలో ఎందుకు చేయలేదు? అత్యవసర పరిస్థితిని అడ్డంపెట్టుకొని అదనంగా ఒక సంవత్సరం పాటు పెంచబడ్డ ఈ ఆపద్ధర్మ పార్లమెంటుకు, కడు ప్రధానమైన రాజ్యాంగ సవరణలను చేసే అధికారం లేదు.

2. ఇకపోతే రాజ్యాంగాన్ని మారుస్తామని పోయిన ఎన్నికలలో ప్రజలకు యిచ్చిన వాగ్దానం ప్రకారం మారుస్తున్నామని అధికారపార్టీవారు చెబుతున్నారు. ఇది పచ్చి అబద్ధం. ఈ **59** క్లాజుల స్వరూపాన్ని పోయిన ఎన్నికలలో ఏ మాత్రం వివరించకుండా యిప్పుడు ప్రతిపాదించడం అక్రమం. శాంతి భద్రతలను కాపాడడానికి పెట్టిన ఈ అత్యవసర పరిస్థితి కాలంలో రాజ్యాంగ స్వరూప స్వభావాలే మార్చేటటువంటి ఈ పెద్దమార్పును తీసుకొని రావడం న్యాయ సమ్మతం కాదు.

3. అసలు "స్వర్ణసింగ్ కమిటీ" పార్లమెంటు చేత నియమింపబడలేదు. కాంగ్రెస్ పార్టీ చేత ఏర్పాటు చేయబడిన ఈ అనధికార సంఘము యొక్క సూచనలను పార్లమెంటులో చర్చించడం ప్రజాస్వామ్య సాంప్రదాయం కాదు.

4. ఈ ఆపద్ధర్మ పార్లమెంటులో ఈ బృహత్కరమైన రాజ్యాంగ సవరణను చేయడం ఉపసంహరించుకొని ఎన్నికలకు సిద్ధపడాలి. ఎన్నికల ప్రణాళికలో తాము చేయదలచుకున్న మార్పులను పొందుపరచి ప్రజల ఆమోదమును పొంది, నూతనంగా ఎన్నికైన పార్లమెంటులో మాత్రమే ఈ సవరణలను ప్రవేశపెట్టడం సత్సాంప్రదాయం.

5. బెల్జియం లాంటి కొన్ని దేశాలలో రాజ్యాంగాన్ని మార్చదలచుకుంటే పార్లమెంటును రద్దు చేసి ఎన్నికలు పెడుతారు. ప్రజలు వాళ్లను ఎన్నుకుంటేనే పెట్టదలచుకున్న సవరణలను కొత్తపార్లమెంటులో పెడుతారు. ప్రపంచ చరిత్రను పరిశీలిస్తే

ఇటువంటి ఉన్నత సాంప్రదాయములతో వివిధ దేశాలవారు 11సార్లు ప్రజలవద్దకు వెళ్ళినట్లు తెలుస్తున్నది.

6. ఇకపోతే రిఫరెండం ద్వారా ప్రజాభిప్రాయాన్ని తెల్సుకోవడానికి కొన్నిదేశాలు ఈ పద్ధతిని అనుసరిస్తున్నాయి. గత 75 సంవత్సరాలలో ఆస్ట్రేలియా పార్లమెంటు 26 రాజ్యాంగ సవరణలు చేయగా **'రిఫరెండం'** లో ప్రజలు 4ను మాత్రమే ఆమోదించారు. , 1973 ఆఖరులో పార్లమెంటుచేత అత్యధిక మెజారిటీతో ఆమోదించబడ్డ రెండు రాజ్యాంగ సవరణలను, వివిధ రాష్ట్రాల ప్రజలు అత్యధికమెజారిటీతో తిరస్కరించారు.

7. భారతదేశంలో 60కోట్లు ప్రజలున్నారు. షుమారు 20కోట్లపైన ఓటర్లు అందులో 1971 సం॥లో 60 శాతం పైన పోలు అయింది. అందులో 42 శాతం ఓట్లు మాత్రమే కాంగ్రెసుకు ఓట్లు వచ్చాయి.(షుమారు 5 కోట్లు పైన అన్నమాట). ఎక్కువ సీట్లు వచ్చినప్పటికీ తక్కువ శాతం ప్రజలు మాత్రమే కాంగ్రెసును బలపరిచారు. మైనారిటి ఓట్లతో గెలిచిన కాంగ్రెసు పార్టీకి 60కోట్ల మంది భారతీయుల ప్రాథమిక హక్కులను తీసివేసే అధికారం నైతికంగా లేదు. కనుక **'రిఫరెండం'** జరపాలి.

8. ఈ సవరణలపై వివిధ స్థాయిలలో స్వేచ్ఛగా చర్చలు జరగడానికి వీలుగా అత్యవసర పరిస్థితిని రద్దుచేసి రాజకీయ డిటెన్యూలనందర్ని విడుదల చేయాలి.

9. పత్రికలపై సెన్సారుషిప్‌ను పూర్తిగా రద్దు చేసి అనుకూల ప్రతికూల చర్చలకు అవకాశం కల్పించాలి.

10. రేడియో, టెలివిజనులలో ఈ విషయాన్ని గురించి చర్చించడానికి అన్ని పక్షాలవారికి సమాన అవకాశాల నివ్వాలి.

11. సెమినార్లు, సదస్సులు, సభలు జరుపుకోవడానికి పూర్తి స్వేచ్ఛ యివ్వాలి. పరోక్షంగా కాని, ప్రత్యక్షంగాకాని, ఏవిధమైన ఆంక్షలు, నిర్బంధాలు విధించరాదు. ఇటువంటి అవకాశాల నివ్వకుండా, తొందరపడి, ఏకపక్షంగా రాజ్యాంగంలోని మూలసూత్రాలను సవరించడానికి ప్రయత్నించడం, సమూలంగా ప్రజాస్వామ్య వ్యవస్థను దెబ్బకొట్టడమే అవుతుంది. ఎంతో కష్టపడి, సంవత్సరాలతరబడి పోరాడి, తుపాకి గుండ్లకు బలైన తర్వాత తెచ్చుకున్న స్వాతంత్ర్యం బూడిదలో పోసిన పన్నీరులా అయిపోతుంది. తిలక్ మహాశయుడు స్వాతంత్ర్యం కోసం జరిపిన మహోద్యమం, నేతాజీ స్వేచ్ఛ కోసం సల్పిన పోరాటం, గాంధీజీ రామరాజ్యం కోసం జరిపిన సత్యాగ్రహం, నెహ్రూజీ సామ్యవాదం

కోసం చేసిన త్యాగం, పటేల్ ప్రజాస్వామ్యం కోసం నడిపిన 'బార్డోలి' సత్యాగ్రహం, అంబేద్కర్ ప్రాథమిక హక్కులను మన రాజ్యాంగంలో పొందుపరచడానికి చేసిన కృషి - అంతా వృథా వృథా..... ఈ సందర్భమున మరొక్క విషయాన్ని నీకు వివరించదలిచాను. స్వర్ణసింగ్ కమిటీ విషయాలను చర్చించి అభిప్రాయాలను తెలియబరచేందుకు శ్రీ జయప్రకాశ్‌నారాయణగారు ఒక కమిటీని వేసారు. దీనిలో .మేధావులు, సుప్రీంకోర్టు, హైకోర్టుల మాజీ న్యాయమూర్తులున్నారు. (ఛాగ్లా, శాంతిభూషణ్, హెగ్డే, సంతానం, తార్కుండే వగయిరాలు) స్వర్ణసింగ్ కమిటీ సవరణలను వ్యతిరేకిస్తూ తీర్మానించారని మాత్రమే పేపర్లలో వచ్చింది. వివరాలు లేవు. కారణాలు అంతకన్నా చెప్పబడలేదు. అంతేకాదు ఈ నెల 1, 2 తేదీలలో లోక్‌సభ, రాజ్యసభలలో ఈ సవరణలను ప్రతిపాదించారు. ఇప్పటికి పదిరోజులైనా, వ్యతిరేకించేవారి ప్రకటన ఒక్కటి కూడా పత్రికలలో కనుపించలేదు. శ్రీజయప్రకాష్ మరియు కొంతమంది ప్రతిపక్షనాయకులు బయటనే వున్నారే, ఒక్కప్రకటన కూడా ఎక్కడా కనుపించకపోవడానికి కారణమేమిటి? అసలు ఈ సవరణలను పార్లమెంటులో ప్రవేశపెట్టడానికి అంగీకరించినవారు.

1. పేరుకు ప్రతిపక్షమని చెప్పకుంటూ, శ్రీమతిగాంధీ వెంట నడిచే సి.పి.ఐ
2. మద్రాసు రాష్ట్రంలో ఒక చిన్న పార్టి అయిన అన్నా డి.యం.కె.(అప్పుడు అధికారంలో లేదు).
3. నామమాత్రంగానున్న ముస్లింలీగ్.

మిగతా ప్రతిపక్షాలన్నీ వ్యతిరేకించాయి. జనసంఘం, సంస్థా కాంగ్రెసు, బి.యల్. డి. సోషలిష్టు డి .యం.కె, అకాళీదళ్, రిపబ్లికన్, ఆర్.యస్ .పి మార్క్సిష్టు పార్టి యింకా అనేక పార్టీలు వ్యతిరేకించాయి. కాని వ్యతిరేకించడానికి గల కారణాలు మాత్రం పత్రికలలో ప్రభుత్వం ముద్రించడానికి అవకాశం యివ్వటంలేదు. ఇదేనా ప్రజాస్వామ్యం? గాంధీజీ కోరిన రామరాజ్యం యిదేనా? నెహ్రూజి కోరిన సామ్యవాదం యిదేనా? మనం పురోగమిస్తున్నామా? లేక తిరోగమిస్తున్నామా? ఇదే నా ఆవేదన, తీరుతుందా నా వేదన. ఈ సందర్భమున రాజ్యాంగ నిర్మాత అయిన అంబేద్కర్‌గారి అభిప్రాయాలను తెల్సుకోవడం ఎంతయినా అవసరమని భావిస్తున్నాను. 1948 సం॥ డిశంబరు 9వతేదీన రాజ్యాంగ నిర్ణాయక సభలో, కోర్టుల **"రిట్"** అధికారానికి సంబంధించిన **32, 226** సూత్రాలను గురించి అంబేదర్కర్ **"నన్ను అడుగుతే ఈ సూత్రాలు లేకపోతే రాజ్యాంగం శూన్యమవుతుంది. రాజ్యాంగం యొక్క ఈ గుండెకాయను, ఈ ఆత్మను ఎటువంటి పరిస్థితులలోను నాశనం**

చేయరాదు" అని అన్నారు. కాని యిప్పుడు మౌలికమైన ఈ రెండు సూత్రాలకే కాంగ్రెసు ప్రభుత్వం ముప్పు తలబెట్టింది. రిపబ్లిక్‌గా మన దేశం అవతరించిన మరుసటి సంవత్సరమే (1951) రాజ్యాంగానికి ప్రథమ సవరణ తీసుకొనిరాబడింది. CONSTITUANT ASSEMBLY లో సభ్యుడు, అటార్నీ జనరల్ అయిన శ్రీ జయకర్ వ్యతిరేకిస్తూ "THE PARLIAMENT IS TINKCKERING WITH CONSTITUTION" అన్నారు. ఇదీ ప్రస్తుత పరిస్థితి. ప్రజాస్వామ్యం పేరిట నియంతృత్వం విలయతాండవం చేస్తున్నది. న్యాయస్థానముల హక్కులు తుడిచివేయబడుతున్నాయి. పౌరుని ప్రాథమిక హక్కులు సమూలంగా సర్వనాశనం చేయబడుతున్నాయి. ప్రస్తుత పరిస్థితులను చూచిన మీదట ఎంతో బాధకల్గి, చేసేది ఏమీలేక, చిట్టచివర్కి నా ఆవేదనను ఈ విధంగా ఉత్తరం ద్వారా నీకు తెలియబరచుకుంటున్నాను. ఈ ఉత్తరం నీకు చేరుతుందో లేదో? శ్రీమతి గాంధీ బహిరంగ చర్చకు అవకాశం యిచ్చారు కదాయని ఎంతో శ్రమపడి ఈ రెండు ఉత్తరాలు ఒకే పర్యాయం వ్రాస్తున్నాను. శ్రీమతి గాంధీ మాటకు విలువయిచ్చి , ఆమె మీద గౌరవంతోనయినా, యీ నా ఉత్తరాన్ని సెన్సారు అధికారులు తప్పకుండా నీకు పంపిస్తారని నమ్ము తున్నాను. ప్రభుత్వం అవునన్నా కాదన్నా నా ఆశయం దేశభక్తి నా ఆదర్శం ప్రజాస్వామ్యం. నా ధ్యేయం పౌరహక్కుల రక్షణ. నేను కోరేది సాంఘిక న్యాయం. నాకు కావల్సింది న్యాయస్థానాల పరిరక్షణ. నేనవలంబించేది క్రమశిక్షణ. వీటిని సాధించేందుకు తుదివరకు పోరాడుతాను సాధిస్తాను. ఇదే నా ఆ కాంక్ష

**"PROPERTY IS A DIRTY WORD NOW**
**SHORTLY LIBERTY WOULD BECOME A DIRTY WORD"**

***- By Palkhiwala (1971)***

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 28-9-1976

ప్రియమైన జయ,

నేను కులాసా. నీకు యింతకు పూర్వం రెండు ఉత్తరాలలో 60కోట్ల మంది భారతీయుల భవిష్యత్తును నిర్ణయించేటటువంటి అతి ముఖ్యమైన 44వ రాజ్యాంగ సవరణను గురించి నా అభిప్రాయములను కొన్నింటిని వ్రాసాను. కాని ఆ రెండు ఉత్తరములు నీకు పంపకుండా సరాసరి **D.I.G.Intelligence** వారికి పంపారు. దీనిని బట్టి చూస్తే భారతదేశంలో భావనాప్రకటనకు తిలోదకాలివ్వడం జరిగిందనే విషయం స్పష్టమవుతున్నది. బహిరంగ చర్చకు అవకాశం

యివ్వడమైనదని శ్రీమతి గాంధీ చేసిన ప్రకటన, విదేశీయులను, స్వదేశీయులను మభ్యపెట్టడానికి మాత్రమే చేసినట్లుగా భావించవలసి వస్తున్నది. ఈ సవరణ బిల్లు పార్లమెంటులో ప్రతిపాదించి షుమారు నెలరోజులు కావస్తున్నప్పటికి, వీటిని వ్యతిరేకించేవారి ప్రకటన ఒకటి కూడా పత్రికలలో కనుపించకపోవడం కడు శోచనీయం. పత్రికా స్వాతంత్ర్యం పూర్తిగా అరికట్టబడిందనే విషయం దీనిని బట్టి తెలుస్తున్నది. అధికారపార్టీ వారి ప్రకటనలు మాత్రం ప్రతిరోజు కన్పడుతూనే వున్నాయి. వారే ప్రశ్నలు వేసుకొని వారే సమాధానాలు చెప్పకుంటున్నారు. న్యాయశాఖామంత్రి శ్రీ గోఖలే మాట్లాడుతూ **"రాజ్యాంగ సవరణ ద్వారా హైకోర్టుల అధికారాలను తగ్గిస్తున్నప్పటికి, ఆమేరకు సుప్రీంకోర్టు అధికారాలను పెంచడం జరుగు తున్నది"** అని అన్నారు. హైకోర్టు అధికారాలను తగ్గిస్తున్నట్లుగా వారే అంగీకరించారు. న్యాయం కోసం హైకోర్టుల వరకు వెళ్లే స్తోమత గలవారే ఈ దేశంలో బహుతక్కువ. అటువంటప్పుడు సుప్రీంకోర్టు వరకు వెళ్లడానికి ఎంతమందికి తాహతు వుంటుంది? పరోక్షంగా కోర్టులకు సామాన్యులు వెళ్లకుండా నిరుత్సాహపరచడమే ప్రభుత్వ ఆశయంగా కన్పడుతున్నది. న్యాయస్థానాలకు అధికారాలను తగ్గించి పార్లమెంటు యొక్క అధికారాలను పెంచాలని అధికారపార్టి భావిస్తున్నది. ఇట్టి చర్యలవల్ల ఏకపక్ష నియంతృత్వం ప్రబలే ప్రమాదమున్నది. ఇటువంటి పరిస్థితి భవిష్యత్తులో రావచ్చునని తలచి, రాజ్యాంగ నిర్మాతలు ముందుగానే జాగ్రత్త పడ్డారు. భారతదేశంలో సువ్యవస్థితమైన, సుపరిపాలన, న్యాయ బద్ధంగా జరగడానికి వీలుగా మన ప్రజాస్వామ్య వ్యవస్థను మూడు భాగాలుచేసారు.

1. చట్టాలను చేసే అధికారం పార్లమెంటుకు, శాసనసభలకు వప్పగించారు. వారు రాజ్యాంగంలో నిర్దేశించిన నియమ నిబంధనల ననుసరించి న్యాయమైన చట్టాలను చేయాలి.
2. ఆ చట్టములను అమలుపరచే బాధ్యత ప్రభుత్వ యంత్రాంగమునకు యిచ్చారు.
3. అట్టి చట్టములు రాజ్యాంగబద్ధంగా రూపొందించబడినవా? లేవా? మరియు వాటిని సక్రమంగా అమలుపరుస్తున్నారా? లేదా? చూచే బాధ్యతలను న్యాయస్థానాలకు వప్పగించారు.

ఈ మూడు వ్యవస్థలు సక్రమంగా నడవడానికి వీలుగా, అవసరమైన నియమ నిబంధనలను రాజ్యాంగంలోనే స్పష్టంగా పేర్కొన్నారు. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనేది లేదు. బాధ్యతలు, హక్కులు ఎవరికి వారికి స్పష్టంగా నిర్దేశింపబడినాయి. ఎవరి పరిధిలో వారు రాజ్యాంగ బద్ధంగా ప్రవర్తించాలి. అప్పుడే ప్రజాస్వామ్య వ్యవస్థ సుస్థిరంగా మనజాల గల్గుతుంది. ఈ మధ్య చాలా మంది

ప్రభుత్వాధినేతలు తాము చేబట్టిన అభ్యుదయకార్యకలాపాలకు, న్యాయస్థానాలు అడ్డువస్తున్నాయని, అభివృద్ధి కుంటుపడుతున్నదని ప్రచారం మొదలుపెట్టారు. ఇది దురుద్దేశంతో కూడిన ప్రచారమే. ప్రభుత్వం చేసిన చట్టాలు రాజ్యాంగబద్ధంగా వున్నవా? లేవా? అని విచారించే అధికారమే గనుక న్యాయస్థానములకు లేకపోతే ప్రజలకు న్యాయం చేకూరడం కల్ల. ప్రభుత్వ నియంతృత్వ విధానములకు హద్దూ, పద్దూ అంటూ ఉండదు. పౌరుని స్వేచ్ఛాస్వాతంత్ర్యములకే ముప్పువాటిల్లుతుంది. రాజ్యాంగంలో పొందుపరచబడిన ప్రాథమిక హక్కులు నామమాత్రమైపోతాయి. శ్రీమతి ఇందిరాగాంధీ ఒక ప్రకటనలో **"ప్రజాస్వామ్య మంటే ఎన్నికలు. పత్రికా స్వాతంత్ర్యమే కాదు అట్టడుగునవున్న ప్రజలకు న్యాయం చేకూర్చడం"** అని అన్నారు. అసలు ఎన్నికలు, పత్రికాస్వాతంత్ర్యం లేనిది ప్రజాస్వామ్యమనిపించుకుంటుందా? అట్టడుగునవున్న ప్రజల పరిస్థితిని మెరుగుపరచవద్దని ఏ పార్టీ చెప్పడం లేదే? పీడిత ప్రజల సముద్ధరణే ప్రతి పార్టీ ధ్యేయం. అది ఒక్క అధికారపార్టీ సొత్తు మాత్రమే కాదు. అట్టడుగునవున్న ప్రజానీకాన్ని పైకి తీసుకొని రావడంతోపాటు, స్వేచ్ఛా, స్వాతంత్ర్యములను కూడా కలుగజేయాలని కోరుతున్నాం. వారికి న్యాయం జరిగింది లేనిది చూచేందుకు అవసరమైన న్యాయవ్యవస్థ పటిష్టంగా వుండాలని అభిప్రాయపడుతున్నాం. మానవుడు ఒక తిండి, గుడ్డ, వసతులతోనే సంతృప్తి చెందడు. " MAN DOES NOT LIVE BY BREAD ALONE" వాటితో పాటు స్వేచ్ఛా, స్వాతంత్ర్యములను కూడా కాంక్షిస్తాడు. **"నాకు స్వాతంత్ర్యమయినా యివ్వండి, లేక చంపనయినా చంపండి"** అని **పాట్రిక్ హెన్రీ** అన్నమాటలు ఎంతో అనుభవ పూర్వకములైనవి. కీ.శే. మహాత్మాగాంధీజి 1921 సం॥లో **'యంగ్ ఇండియా'** పత్రికలో **"ప్రజాస్వామ్యంలో ప్రజలు గొర్రెలమందకాదు. ప్రజాస్వామ్యంలో వాక్‌స్వాతంత్ర్యాన్ని, ఆలోచనా స్వాతంత్ర్యాన్ని, క్రియా స్వాతంత్రాన్ని అత్యంత భద్రంగా కాపాడుకుంటారు"** అని వ్రాసారు. కాని యిప్పుడు మాత్రం మహాత్మాజీ వారసులమని చెప్పుకుంటున్న ఈ కాంగ్రెసు రాజ్యంలో మాత్రం పై మూడు స్వాతంత్ర్యములకు మాత్రం తిలోదకాలివ్వడం జరిగింది. రాజ్యాంగంలోని **14, 19, 21, 22** ప్రాథమిక హక్కులు పొందుపరచ బడిన సూత్రాలను రాష్ట్రపతి తాత్కాలికంగా నిలుపుదల చేసారు. దీని నాసరాగా తీసుకొని, ప్రతిపక్షాలు మరియు పత్రికలనోళ్ళకు తాళం వేసారు. రాజ్యాంగాన్ని మరియు **"పీపుల్సు రిప్రజంటేటివ్ యాక్టు"** లను సవరించి శ్రీమతి గాంధీజి తన అధికారాన్ని నిలబెట్టుకుంది. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, సభాపతి, ప్రధానమంత్రులను ఎవ్వరూ విమర్శించరాదని, వారి ఎన్నికలను గురించి ఏకోర్టులలోను సవాలు చేయరాదని, రాజ్యాంగాన్ని గూడా సవరించారు. తమ అధికారాలను నిలబెట్టు కోవడానికి, రాజ్యాంగాన్ని ఎప్పుడు పడుతే అప్పుడు తమకు అనుకూలంగా

మార్చుకోవడం సత్సాంప్రదాయం ఏమాత్రం కాదు. ఈ సరిక్రొత్త 44వ రాజ్యాంగ సవరణలో న్యాయస్థానాల అధికారాలు పూర్తిగా కుదించి వేయబడుతాయి. ఈ సవరణలను గురించి ఏకోర్టులోను ప్రశ్నించరాదంటూ, వాటిననుసరించి చేయబడే చట్టాలను మాత్రం కోర్టులలో సవాలు చేయవచ్చు అనే నామమాత్రపు అధికారాన్ని మాత్రం యిచ్చారు. పార్లమెంటు, శాసనసభలు చేసిన చట్టాలు 9వ షెడ్యూలులో చేరుస్తే మాత్రం, వాటిని ఏకోర్టులలోను సవాలు చేయడానికి వీలులేదు. దేశం మొత్తం మీద ఇటువంటి 188 చట్టాలను 9వషెడ్యూలులో చేర్చారు. ఆ చట్టములవల్ల ప్రజలకు అన్యాయం జరిగినప్పటికి న్యాయస్థానాలకు వెళ్ళడానికి వీలులేదు. అంతేకాదు ఈ క్రొత్త క్లాజుక్రింద ఏచట్టము చేసినాసరే ప్రాథమిక హక్కులకు భంగకరంగా వున్నదని ఏకోర్టులోనూ ప్రశ్నించరాదు. ఇదే వాస్తవాన్ని శ్రీ గోఖలే **"జాతీయ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడే ఏ సంస్థనయినా, పార్టీనయినా నిషేధిస్తూ శాసనంచేయడానికి పార్లమెంటుకు ఈ 44వ సవరణలోని 5 వక్లాజు అధికారం యిస్తున్నది. ఈ క్లాజు క్రింద పార్లమెంటు చేసే శాసనం ప్రాథమిక హక్కులకు విరుద్ధమైనప్పటికి ఆ శాసనం రద్దు కాదు"** అని అన్నారు. (ది. 24-9-1976 ఆంధ్రప్రభ). చట్టాలను కోర్టులలో సవాలు చేయవచ్చుననేది నామ మాత్రమేనని పై విషయాల వల్ల స్పష్టమవుతున్నది. అమెరికాలో గత 200సం॥లలో సుప్రీంకోర్టు యిచ్చిన తీర్పును ఎప్పుడూ ఆ పార్లమెంటు రద్దుచేస్తూ రాజ్యాంగాన్ని సవరించి యుండలేదు. మన దేశంలోలాగే, కోర్టులలో పెండింగులో నున్న కేసులను తమకనుకూలం చేసుకోవడానికి వీలుగా, ముందుగానే రాజ్యాంగాన్ని వారు ఎన్నడూ మార్చియుండ లేదు. **'THE JUDICIARY IS THE WATCH DOG OF DEMOCRACY '** అనేవిషయం విస్మరించరాదు. 59 వక్లాజు ప్రకారం రాష్ట్రపతికి ఎనలేని అధికారాలు యిస్తున్నారు. 2సం॥ వరకు రాజ్యాంగాన్ని తన యిష్టం వచ్చినట్లు మార్చవచ్చు. 13వ క్లాజు ప్రకారం మంత్రివర్గ సలహాలను తప్పని సరిగా పాటించాలి కదా! మంత్రివర్గం ఏ విధంగా రాజ్యాంగాన్ని మార్చదలచుకుంటే ఆ విధంగా చేయవచ్చు. వచ్చే ఎన్నికలలో అధికారపార్టీకి 2/ 3 వంతు మెజారిటి రాదేమోనని భయపడి ఈ విధమైన అధికారాలను ముందుగా రాష్ట్రపతికి యివ్వదలిచారు. ప్రస్తుత రాష్ట్రపతి అధికారం 1979సం॥ వరకు వుంటుంది. రానున్న ఎన్నికల ప్రభావం ఆయన పదవిని (1979 వరకు) ఏమీ చేయలేవు. ఈ అసాధారణ అధికారాలు ప్రజాస్వామ్యానికే ముప్పుతెచ్చిపెట్టడం ఖాయం. ఈ సవరణలోని 17, 30 క్లాజుల ప్రకారం లోక్‌సభ, శాసన సభల కాలపరిమితి 5సం॥ల నుంచి 6సం॥లకు పెంచ బోతున్నారు. అభివృద్ధి పనులు పూర్తిచేయడానికి 5సం॥ కాలము సరిపోనందున 6 సం॥లు పెంచామంటున్నారు. ప్రపంచంలో ఎక్కడా 6సం॥ల కాలం వున్న పార్లమెంటులు

కనుపించడంలేదు. చాలా దేశాలలో 4సం॥ కాల పరిమితే. ఏ పెద్ద ప్రాజెక్టు పూర్తి కావాలన్నా 15 నుంచి 20సం॥లు పడుతున్నది. అసలు వారు వేసిన పథకాలన్నీ పూర్తి అయ్యేంతవరకు ఎన్నికలు జరగడానికి వీలులేదని ఒకే పర్యాయం రాజ్యాంగాన్ని మారుస్తే యింకా బాగుంటుంది. అసలు కారణాలు యివేమి కావు. అత్యవసర పరిస్థితిలో పెంచబడ్డ ఈ ఆపద్ధర్మ పార్లమెంటుకు, ఈ బృహత్తరమైన రాజ్యాంగ సవరణనుచేయడం సమంజసం కాదని మేధావులు, ప్రతిపక్షాలవారు విమర్శిస్తున్నారని భావించి ఈ ఆపద్ధర్మ పార్లమెంటును శాసనబద్ధమైన, ఎన్నుకోబడిన పార్లమెంటేనని చెప్పడానికి చేసినదే ఈ సవరణ. ప్రతి 25సం॥లకు ఒకపర్యాయం రాజ్యాంగాన్ని పున: పరిశీలించి అవసరమైన మార్పులు చేయడం మంచిదని రాజ్యాంగ నిర్మాతలే భావించారని నేడు ప్రభుత్వాధినేతలు ప్రచారం చేస్తున్నారు. ప్రజావసరాల కనుగుణంగా అవసరమైన మార్పులు చేయడానికి ఏ పార్టి వ్యతిరేకం కాదు. 1971 ఎన్నికలలో ప్రతిపక్షాలు కొన్ని తమ ఎన్నికల ప్రణాళికలలో రాజ్యాంగ సంస్కరణలు చేయాలని కోరారు. **"ఒక క్రొత్త రాజ్యాంగ నిర్ణాయక సభను ఏర్పాటు చేయాలి"** అని సోషలిష్టు కోరింది. **'రాజ్యాంగాన్ని పరిశీలించడానికి ఒక కమీషన్‌ను నియమించాలి'** అని జనసంఘం కోరింది. **"ఆస్థి హక్కును రద్దుచేయాలి"** అని మార్క్సిష్టు పార్టీ కోరింది. అధికారపక్షం మాత్రం ఒక స్పష్టమైన అభిప్రాయాన్ని తమ ఎన్నికల ప్రణాళికలో ప్రకటించకుండా, పెంచబడిన పార్లమెంటు కాలపరిమితి సహితం పూర్తికానున్న తరుణంలో, అత్యవసర పరిస్థితిని ఆసరాగా తీసుకుని, పౌరహక్కులను గుప్పెట్లో పెట్టుకుని, ప్రతిపక్షాలను నిర్బంధించి, పత్రికలపై సెన్సారు ఆంక్షలు పెట్టి ఎవరూ మాట్లాడటానికి వీలులేకుండా చేసిఈ పెద్ద సవరణను తీసుకొనిరావడం శోచనీయం. అసలు రాజ్యాంగం ప్రజల కోసమా? లేక రాజ్యాంగంకోసం ప్రజలా? అనే దానిని అర్థంచేసుకుంటే వాస్తవం బయటపడుతుంది. ఏదేశంలోనయినా సరే రాజ్యాంగం ప్రజావసరాలను పరిరక్షించడానికే వ్రాయబడుతుంది. సహజ సిద్ధంగా, సృష్టి ప్రారంభమయిన లగాయితూ వున్న మానవహక్కులను పరిరక్షించలేని రాజ్యాంగం వున్నా ప్రయోజనం లేదు. ఈ సవరణ వల్ల యిప్పుడు అటువంటి దుస్థితే దాపురించబోతున్నది. పౌరులకు ప్రాథమిక విధులను కూడా ప్రవేశపెట్ట బోతున్నారు. ఆదేశిక సూత్రాలకు ప్రాధాన్యత యివ్వడం అనే పేరుతో, వాటిని అమలు పరచాలనే నెపంతో ప్రాథమిక హక్కులను కుదింపజేయడానికి, రద్దుచేయడానికి పూనుకుంటున్నారు. ఈ బాధ్యతలు, విధులు ఒక్క ప్రజలకు మాత్రమే పెట్టారు. అధికారంలో గలవారికి యివి అవసరం లేవా? ఈ సవరణ ఆమోదించబడుతే హక్కులు లేని విధులు ప్రజలు కల్గివుంటారు. విధులు లేనిహక్కులు పాలకులు కల్గివుంటారు. అప్పుడు పాలకులు ప్రజల మీద స్వైరవిహారం చేయవచ్చు. క్రమశిక్షణ, అనుశాసనముల పేరిట ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యములను మ్రింగవచ్చు. ప్రజాస్వామ్యంలో

ప్రజలు కోరేది స్వాతంత్ర్యం లేని క్రమశిక్షణకాదు. స్వేచ్ఛ లేని అనుశాసనం అంతకన్నా కాదు. భావ ప్రకటన మృగ్యమైన పరిపాలన కాదు. హక్కులులేని విధులు కావు. ఉద్యోగుల విషయంలో రెండవసారి అప్పీలు చేసుకునే హక్కును కూడా తీసివేస్తున్నారు. ఈ చర్యవల్ల ఉద్యోగభద్రత లేకుండా పోతుంది. రాష్ట్రాలకున్న కొన్ని అధికారాలను, కేంద్ర, రాష్ట్రాల ఉమ్మడి అధికారాలుగా మార్చబోతున్నారు. ఈ మార్పు వల్ల రాష్ట్రాలకున్న స్వపరిపాలనాహక్కులను కుంచించడమేఅవుతుంది. అందువల్లనే పౌరుల హక్కులను, న్యాయస్థానముల అధికారములను కుంచింప జేసేటటువంటి ఈ 44వ రాజ్యాంగసవరణను ప్రజాస్వామ్యవాదులందరూ వ్యతిరేకించాలని నా అభిప్రాయము. ఎంతోశ్రమకోర్చి సంవత్సరాల తరబడి పోరాడి, రక్తాన్ని , ధనాన్ని , సర్వస్వాన్ని పూర్తిగా వెచ్చించి, సమర్పించి సముపార్జించుకున్న స్వాతంత్ర్యానికే నేడు పాలకులు ముప్పుతెచ్చిపెట్టారు. స్వలాభాపేక్షతో తమ అధికారాన్ని శాశ్వతంగా, వంశపారం పర్యంగా తమ హస్తములలో పెట్టుకొనడానికి, తమకు అడ్డం వస్తున్నాయనే నెపంతో న్యాయస్థానముల హక్కులను సమూలంగా ఊడ బెరుకుతున్నారు. చివరికి నికృష్టమైన ఈ స్వలాభానికి భారత ప్రజలు బలి అయిపోతారా? లేక శక్తిసామర్థ్యము లతో తమ హక్కులను కాపాడుకోగల్గుతారా? ఇదే ఈనాటి సమస్య వ్యక్తుల ఆత్మబలానికి అగ్ని పరీక్ష. దేశభక్తికి పరీక్షాసమయం. **"స్వాతంత్ర్యపు చెట్టుకు స్వాతంత్ర్య యోధుల రక్తధారలే సహజమైన ఎరువు"** అని జఫర్‌సన్ అంటారు. పెద్దలు యిచ్చివెళ్లిన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనడానికి మరొక పర్యాయం దేశభక్తులు ఆహుతి కావలసిన తరుణమాసన్నమయిందేమోనని అనిపిస్తున్నది. బ్రిటీష్ వారు పెట్టిన "రౌలట్" లాంటి నియంతృత్వచట్టాలను అధిగమించిన అమానుష, నిర్బంధ చట్టాలు ఒకదాని వెంబడి ఒకటి ప్రజల మీద నేటి పాలకులు రుద్దుతున్నారనే బాధ ఒకచంప. స్వాతంత్ర్యం కోసం నిస్వార్థంగా ఆహుతి అయిపోయిన అమరవీరుల ఆత్మలు సంక్షోభిస్తుంటాయేననే వ్యథ మరొక చంప నన్ను పీడిస్తున్నాయి. ఈ బాధ వ్యథల వెనుకనున్న ఆవేదన ఎవరికి అర్థమవుతుంది. ఆ ఆవేదన వెనుకనున్న బడబాగ్ని ఎవరికి కన్పడుతుంది. దాని వెనుక దహించుకొనిపోతున్న దావాగ్నిని ఎవరు చూడగల్గుతారు. స్వార్థం, సంకుచితత్వం, అధికారవ్యామోహపు పొరలు కప్పబడి వున్నవారికి యివి అసలే కన్పడవు. ఎప్పుడో ఒకప్పుడయినా వీటిని (బాధ, వ్యథ) అనుభవించేవారికే అర్థమవుతాయి. కాని దురదృష్టం వాటిననుభవించిన వారు నేడు ఈ లోకంలో లేరు. వారు ఇక రారు. త్యాగం చేసేది ఒకరు. అనుభవించేది మరొకరు. ఇదే సృష్టి రహస్యం. ఇక వుంటా....

ఇట్లు

"LIBERTY OF INDIVIDUAL IS REAL LIBERTY" - BY SETHALWAD (సెథల్ వాడ్) 'నీ'

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 5-10-1976

ప్రియమైన జయ,

నేను కులాసా. రాజ్యాంగ సంస్కరణల మీద యిప్పటివరకు వ్రాసిన మూడు ఉత్తరములు హైద్రాబాద్‌కు పంపినారు: నీకు చేరకపోయినప్పటికి అతి ముఖ్యమైన ఈ ఉత్తరములు ఉన్నతాధికారులకు వెళ్లినందుకు మిక్కిలి సంతసించుచున్నాను. పత్రికలలో ప్రచురించే అవకాశం నాకు లేకపోయినప్పటికి, నాభావాలు సరాసరి ప్రభుత్వానికైనా జేరుతున్నందుకు ఆనందిస్తున్నాను. అందువల్లనే నాలో ఉత్సాహం ఏమాత్రం తగ్గక మరొక ఉత్తరాన్ని వ్రాస్తున్నాను. ఈ మధ్య ఢిల్లీ టెలివిజన్ ఇంటర్‌వ్యూలో శ్రీ గోఖలే మాట్లాడుతూ **"రాజ్యాంగంలో పట్టువిడుపు ధోరణి లేకపోయినట్లయితే హింసాయుత మార్పులు జరిగే అవకాశం వున్నది. అలాంటి పరిస్థితిని నివారించాలంటే రాజ్యాంగాన్ని మార్పుచేయడం ఒకటేమార్గం"** అని హెచ్చరించారు. బాధ్యతగల న్యాయశాఖామంత్రి యివ్విధమైన హెచ్చరికలు చేయడం అనుచితం వారి ప్రకటన వైరుధ్యాన్ని కలుగజేసేదిగా వున్నది కాని తర్కయుతంగా లేదు. హింసా ప్రవృత్తులను రెచ్చగొట్టేటటువంటి యీ రాజ్యాంగాన్ని గత 29 సం॥ల నుంచి ఎందుకు ఆమోదిస్తూ వచ్చారు? అటువంటి రాజ్యాంగం క్రింద ఎందుకు యింతకాలం పరిపాలన చేసారు. లేక ఈ యదార్థాన్ని యిప్పుడే క్రొత్తగా కనుగొన్నారా? ఈ విషయాలకు సమాధానం చెప్పకుండా బాధ్యతగల ప్రభుత్వాధినేతలు హింసాప్రవృత్తిని రెచ్చకొట్టేటటువంటి ప్రసంగాలు చేయడం సముచితం కాదు. రాజ్యాంగ స్వరూప స్వభావాలనే మార్చడానికి గల కారణములను సవివరంగా ప్రజలకు వివరించకుండా ప్రతిపక్షములకు, మేధావులకు అట్టి అవకాశం యివ్వకుండా అందర్ని జైళ్లలోపెట్టి, పత్రికలపై ఆంక్షలను విధించి, ఏకపక్షంగా, రాజ్యాంగాన్ని దాదాపు పూర్తిగా మార్చడానికి ప్రయత్నించడం నియంతృత్వ లక్షణం కాదా? హింసా ప్రవృత్తిని రెచ్చకొట్టే చర్య కాదా? సామాన్య మానవుని పురోభివృద్ధి కనుగుణంగా రాజ్యాంగాన్ని సవరించడానికి ఏ ప్రతిపక్షము వ్యతిరేకించదు. న్యాయం పేరుతో పౌరుని ప్రాథమిక హక్కులను స్వాహా చేయరాదని, మూలసూత్రములకు ఎటువంటి విఘాతం కలుగజేయరాదని మాత్రమే కోరుతున్నాం. ప్రభుత్వం ప్రవేశపెట్టుతున్న ప్రాథమిక విధులు క్రొత్తమేవి కావు. ఇవన్నీ రాజ్యాంగంలో యింతకు పూర్వమే ఏదో ఒక రూపంలో పొందుపరచబడే వున్నాయి. ప్రాథమిక హక్కులను దుర్వినియోగం చేయడానికి ఏమాత్రం అవకాశం లేకుండా, రాజ్యాంగంలోనే ప్రతి ప్రాథమిక హక్కుకు పరిధులను ఏర్పరిచారు. అనేక రకముల చట్టములను ఎప్పుడో రూపొందించారు. వ్యక్తికి స్వేచ్ఛ, స్వాతంత్ర్యములున్నవి కదాయని, తన యిష్టము

వచ్చినట్లుగా సంచరించడానికి వీలులేదు. ప్రక్కవానికి హాని చేకూరుస్తే శిక్షించడానికి చట్టాలు చాలా వున్నాయి. స్వేచ్ఛ వున్నది కదాయని, తన కారును రోడ్డుమీద యిష్టము వచ్చినట్లుగా నడిపించుటకు అవకాశం లేదు. ట్రాఫిక్ నిబంధనలను ఉల్లంఘిస్తే శిక్షించడానికి చట్టాలున్నాయి. అక్రమంగా ఆస్థులను సంపాదించి కూడబెట్టుకొనుటకు అవకాశంలేదు. INCOME TAX వేయ వచ్చును. భూగరిష్ట పరిమితిచట్టములు, పట్టణ ఆస్తుల గరిష్టపరిమితి చట్టములున్నాయి. తమ యిష్టం వచ్చినట్లు బంగారపు నిల్వలను వుంచుకోరాదు. GOLD CONTROL ORDER వున్నది. రైల్వే ఆస్థులను దుర్వినియోగం చేసేవారిని శిక్షించడానికి INDIAN RAILWAYS ACT వున్నది. తంతి తపాలా ఆస్థులను అక్రమంగా దొంగిలించేవార్ని శిక్షించడానికి P&T ACT కూడా వున్నది. మరియు మిగతా నేరములను చేసేవార్ని, విధ్వంసక చర్యలకు పాల్పడేవార్ని, ప్రభుత్వ ఆస్థులను ధ్వంసంచేసే వార్ని, అందర్ని శిక్షించడానికి INDIAN PENAL CODE వున్నది. అడవులను నరికే వార్ని, వన్యమృగములను హింసించేవార్ని శిక్షించడానికి, ప్రకృతి సంపదను పరిరక్షించడానికి INDIAN FORESTS ACT కూడా వున్నది. పౌరుడు తన విధులను సక్రమంగా నిర్వర్తించని యెడల శిక్షించడానికి యింకా అనేక రకములైన చట్టములు ఎప్పటి నుంచో వున్నాయి. రాజ్యాంగాన్ని, జాతీయపతాకమును అవమానపరచమని ఏ భారతీయుడు కోరడు. భారతీయ రక్తం ప్రవహించే ఏ వ్యక్తీ ఆ పని చేయడు. ఒకవేళ ఎవరయినా అటువంటి ద్రోహులుంటే వార్ని శిక్షించవద్దని విజ్ఞతగల ఏ ప్రతిపక్షం కోరదు. భారతదేశ సమగ్రతను, సమైక్యతను, సార్వభౌమత్వాన్ని, సంస్కృతిని, ధర్మాన్ని, అనాదిగా వస్తున్న భారతీయ పరంపరను, విలువలను, సహజ సిద్ధమైన ప్రకృతి సంపదలను పరిరక్షించడమే ప్రతి పార్టీ ఆశయం, ఆదర్శం. వీటికి భిన్నంగా ప్రవర్తించే పక్షం ఏదైనా ఒకవేళవుంటే, దానికి ఈ పవిత్ర భారతావనియందు వుండే అర్హతే లేదు. వీరు ప్రవేశబెట్టబోతున్న ఈ ప్రాథమిక విధులు, ఆదేశసూత్రములలో నిర్దేశించిన ఆశయాలను పొందేందుకు ఉపకరించేవిగా వుంటే ఎవరికీ అభ్యంతరం లేదు. ఈ పేరుతో ప్రభుత్వం పౌరుల ప్రాథమిక హక్కులను హరించే ప్రయత్నాన్ని మాత్రమే నిరేసిస్తున్నాం **"ఈ విధులు ప్రతిపాదించడం ప్రాథమిక హక్కులను కుదింపగలందులకే"** అని స్వర్ణసింగ్ అన్నారు. తమ హక్కులను కాపాడుకోవడానికి న్యాయస్థానములకు వెళ్ళడం పౌరుని ప్రాథమికహక్కు. ఈ హక్కును లేకుండా చేయడం ప్రజాస్వామ్య విరుద్ధం కాదా? రాజ్యాంగంలో పొందుపరుస్తున్న యీ విధులను ఉల్లంఘించాడని, సానుభూతి, ప్రజలమీద ముఖ్యంగా ప్రతిపక్షములమీద కఠిన చర్యలను ప్రభుత్వం ఒకవేళ గైకొంటే యిక ఎవరు న్యాయం చెబుతారు. అటువంటి అవకాశం న్యాయస్థానములకు లేకుండా చేస్తున్నారు కదా! ప్రపంచ

చరిత్రను పరిశీలిస్తే, ప్రాథమిక విధులు, హక్కులు ఒకే రాజ్యాంగంలో వున్న దేశాలలోని ప్రభువులు (నియంతలు) విధులను మాత్రమే తీసుకొని హక్కులకు తిలోదకాలివ్వడం జరిగింది. నాజీ జర్మనీలో యిదే జరిగింది. విధులను చూపి నియంత హిట్లర్ ప్రజల మీద స్వారీ చేసాడు. ప్రతి నియంత 'ప్రజాస్వామ్య సోషలిజమే' తన ధ్యేయమని చెబుతూ వుండటం సహజం. వాటిని పరిరక్షించడానికే కంకణధారినయినా నంటాడు. నాజీ జర్మనీ అనుభవాలను, జర్మన్ స్కాలర్ "KENT REIZLES" **బాధ్యతలు సమాజక్షేమము కొరకై వుండి, బాధ్యతలను నెరవేర్చినగాని, హక్కులు వుండవనెడి నియమమున్నచో. అట్టి బాధ్యతలు, హక్కులను కూకటివేళ్లతో పెరికివైచును. హక్కులు నశించిపోవును. బాధ్యతలు నెరవేర్చబడలేదనే నెపంతో, ప్రభుత్వం హక్కులను త్రోసివేయును**" అని చెప్పారు. ఇదేపరిస్థితి భవిష్యత్తులో మన దేశంలో ఉత్పన్నమయినా ఆశ్చర్యపడనవసరం లేదు. జపాన్ రాజ్యాంగంలో కూడా ప్రాథమిక విధులున్నాయని శ్రీ స్వర్ణసింగ్ చెబుతున్నారు. ఆ రాజ్యాంగాన్ని 103 పరిశీలిస్తే అసలు విషయం అర్థమవుతుంది. ఆ రాజ్యాంగంలో అధికరణలున్నాయి. Chapter III లో(RIGHTS AND DUTIES OF CONSTITUTION) 31 అధికరణలున్నాయి. దానిలో 2 మాత్రమే 'DUTIES' కు సంబంధించినవి. మిగతావన్ని 'RIGHTS OF CITIZENS' కు సంబంధించినవే. ఇందులో 6 అధికరణలు ప్రాథమిక హక్కులను కాపాడటానికికూడా పెట్టారు. ఒకవేళ పౌరులు తమ విధులను నిర్వహించక పోయినా హక్కులు అంతం కావు. మన దేశంలో మాత్రం విధులను నిర్వహించకపోతే హక్కులు కూడా గంగలో కలసిపోతాయి. శ్రీ సింగ్‌గారు ఆశించినట్లు జపాన్ రాజ్యాంగానికి, మనం సవరించబోయే రాజ్యాంగానికి ఏమాత్రం సారూప్యత లేనేలేదు. జపానులో ప్రధానమంత్రి నేరం చేస్తే కఠినంగా శిక్షించడానికి అవకాశం వున్నది. ఒక్క "WATER GATE" ఉదంతంతో అమెరికాలో నిక్సన్ పదవీచ్యుతుడైనాడు. వరుసగా మూడు ఉప ఎన్నికలలో అధికారపార్టీ ఓడిపోతే బ్రిటన్‌లో మంత్రివర్గం రాజీనామా యిచ్చే సత్సాంప్రదాయం వున్నది. కాని మనదేశంలో మాత్రం రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, సభాపతి, ప్రధానమంత్రులను విమర్శించడానికి, వారి ఎన్నికలను న్యాయస్థానములలో సవాలు చేయడానికి వీలు లేకుండా రాజ్యాంగాన్ని, ప్రజాప్రాతినిధ్య చట్టమును యిప్పుడున్న అత్యవసర పరిస్థితి వచ్చిన తరువాతనే మార్చారు. రాను రాను మన ప్రభుత్వం ప్రజాస్వామ్య విలువలకు తిలోదకాలిస్తున్నదనే విషయం స్పష్టమవుతున్నది. ఇకపోతే పేదలకు ఉచితంగా న్యాయసలహాలనివ్వాలని, పిల్లలను అభివృద్ధి పరచుటకు తగు చర్యలను గైకొనాలని, వన్యప్రాణులకు రక్షణ కల్పించాలని ఆదేశిక సూత్రాలలో చేరుస్తున్నారు. వీటినెవరూ కాదనరు. ఇవన్ని యిదివరేకే ఉన్నాయి. వాటిని సక్రమంగా ఎందుకు అమలుపరచలేదు. స్వాతంత్ర్యం

వచ్చిన దగ్గరనుంచి ఒకేపార్టి కేంద్రంలో పరిపాలన చేస్తున్నదికదా! పాత విషయాలనే క్రొత్తవిగా చేసి రాజ్యాంగంలో చేర్చడం ప్రజలను వంచించడానికి చేసే ప్రయత్నంతప్ప మరొకటి కాదు. పరిశ్రమ నిర్వహణలో కార్మికులకు భాగస్వామ్యం కల్పించబోతున్నారు. ఇది మంచిదే. కాని జనసంఘం స్థాపించిన దగ్గరనుంచి (1951సం॥) పరిశ్రమ నిర్వహణలోను, లాభాలలోను కార్మికులకు భాగస్వామ్యముండాలని డిమాండు చేయుచున్నది. కాని యిప్పుడు ప్రభుత్వం ఒక్క నిర్వహణలోనే అవకాశం కల్పిస్తున్నది. లాభాలలో మాత్రం వాటా యివ్వడం లేదు. పదిమంది వున్న డైరెక్టర్ బోర్డులో ఒకరు లేక యిద్దరు కార్మికులు ఉన్నందువల్ల వచ్చే ప్రయోజనం ఏమీ లేదు. లాభాలలో వాటా కల్గుగజేసినప్పుడే కార్మికులకు ఆ పరిశ్రమ యెడల అభిరుచి పెరుగుతుంది. ఇది నా స్వంతమని భావిస్తాడు. కష్టపడి ఉత్పత్తిని పెంచుతాడు. లాభాలలో కార్మికులకు వాటా యివ్వకుండా, ఒక్క నిర్వహణలోనే భాగస్వామ్యం కలుగజేయడం ప్రచారానికి ఉపకరిస్తుంది గాని, యదార్థంగా కార్మికులకు లాభించేది ఏమీ లేదు. ఈ అత్యవసర పరిస్థితి పెట్టిన తరువాతనే కార్మికులకు యివ్వవలసిన బోనసును పెంచడానికి బదులు 8శాతం నుంచి 4 శాతంకు ప్రభుత్వమే తగ్గించింది. ఈ చర్య కార్మికులకు ఉపకారం చేస్తుందా? లేక పారిశ్రామిక వేత్తలకు మేలు చేస్తుందా? ఏమాత్రం ఆలోచించే వారికైనా ప్రభుత్వమనుసరిస్తున్న పక్షపాతధోరణి అర్థమవుతుంది. రాజ్యాంగంలో 102, 191 అధికరణలను సవరించు (19, 32వ క్లాజులు) చున్నారు. ఇది సభ్యుల అనర్హతలకు సంబంధించినది. లోగడ రాజ్యాంగం ప్రకారం ప్రభుత్వ ఉద్యోగంలో వున్నవారుగాని, ప్రభుత్వ కాంట్రాక్టర్లుగాని, ప్రభుత్వం నుంచి లాభాలు పొందేవారు గాని ఎన్నికలలో పోటీ చేయడానికి వీలుండేదికాదు. పార్లమెంటు లేక శాసనసభలలో అటువంటివారు ఎవరయినా వుండవచ్చునని చట్టంచేసి, రాష్ట్రపతి లేక గవర్నరు ఆమోదముద్ర పడుతేమాత్రం అటువంటివారు సభ్యులుగా వుండవచ్చు, దీనిని యిప్పుడు తారుమారు చేస్తున్నారు. ఇప్పుడు ప్రభుత్వమునకు సంబంధించినవారు ఎవరైనా ఎన్నికలలోపోటీ చేయవచ్చును. అభ్యర్థులకు పోలింగు ఏజంట్లుగా ప్రచారనిర్వహణ కొనసాగించవచ్చు. పార్లమెంటుగాని, శాసనసభగాని ఎవరినయినా వుండకూడదు అని చట్టం చేస్తేతప్ప అందరూ వుండవచ్చు. ఈ సవరణవల్ల ప్రభుత్వ యంత్రాంగాన్ని బాహాటంగా పాలకపార్టీవారు ఉపయోగించుకోవటానికి అవకాశం లభిస్తుంది. లక్షలాది రూపాయలు చందాలు ప్రోగుచేయడానికి ఉపయోగిస్తుంది. ఉద్యోగులు, కాంట్రాక్టర్లు సరాసరి ఎన్నికలలో పాల్గొనడానికి వీలవుతుంది. ఈ మధ్యనే (COMPANIES ACT) కూడా మార్చారుగదా! రాజకీయ పక్షముల వారికి ఒక్కొక్క కంపెనీ తన నికరాదాయంలో 5 శాతంగాని, 50వేలకు మించకుండా గాని చందాలు

యివ్వడానికి అవకాశం కలుగజేసారు. కంపెనీలు రాజకీయపార్టీలకు చందాలు యివ్వరాదనే వాదం చాలా కాలం చర్చించబడి విరాళములను నిషేధిస్తూ 1969 సం॥లో చట్టం చేసారు. ఈ అత్యవసర పరిస్థితిలో ఆ చట్టాన్ని రద్దు చేసి మళ్లీ విరాళములు-యివ్వడానికి అవకాశం కల్పించడం కడుశోచనీయం. ఒక చంప కాంట్రాక్టర్లను, మరొక చంప కంపెనీలను తమ గుప్పెట్లో పెట్టుకుని కోట్లాది రూపాయలు సంపాదించడానికి అధికారపార్టి చేస్తున్న యిది ఒక తతంగం మాత్రమే. అసలు ఈ మార్పులు తీసుకుని రావడానికి మూలం శ్రీమతి గాంధీజి ఎన్నిక చెల్లదని అలహాబాద్ హైకోర్టు తీర్పు చెప్పడం వల్లనే జరిగింది. అప్పటివరకు ఉద్యోగంలో వుంటున్న శ్రీ యశపాల్ కపూర్ శ్రీమతిగాంధీ ఎన్నికల ఏజంటుగా వుండి ఆమె ఎన్నికల ప్రచారాన్ని నిర్వహించారు. ఇది అవినీతికరమైన చర్యగా అలహాబాద్ హైకోర్టు భావించింది. ఈ కేసు సుప్రీంకోర్టులో పెండింగులో వుండగా ప్రజాప్రాతినిధ్య చట్టమును సవరించారు. ఆ ఉద్యోగి ఎప్పుడో తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చాడని చెప్పారు. ఆ రాజీనామాను ఆమోదించినా, ఆమోదించక పోయినా అతను మాత్రం బాధ్యుడుకాదన్నారు. ఇప్పుడు చిట్టచివర్కి ఏఉద్యోగి అయినాసరే ఎన్నికలలో పాల్గొనవచ్చుననే స్థాయికి రాజ్యాంగాన్ని మారుస్తున్నారు. కన్వర్‌లాల్‌గుప్తా ఎన్నికల కేసులో, పార్టీలు ఖర్చుపెట్టిన సొమ్ము కూడా, అభ్యర్థి తన ఎన్నికలలోని జమాఖర్చులలో చూపించాలని, పార్టీ ఖర్చుచేసిన సొమ్ము, అభ్యర్థి ఖర్చుచేసిన సొమ్ము కలిపి ఎన్నికల కమీషన్ నిర్ణయించిన గరిష్ట పరిమితికి మించరాదని సుప్రీంకోర్టు తీర్పు యిచ్చింది. శ్రీమతి గాంధీజి ఈ సమస్యను కూడా ఎదుర్కొనవలసి వచ్చింది. ఆమె ఎన్నిక కూడా చెల్లకుండా పోయే ప్రమాదం ఏర్పడింది. అందువల్ల 1975 జులైలో ఆమె కేసు సుప్రీంకోర్టులో పెండింగులో వుండగా ప్రజా ప్రాతినిధ్యచట్టమును మార్చినారు. పార్టీ ఎంతయినా ఖర్చుచేయ వచ్చునని, అభ్యర్థికి ఏమాత్రం ఆ ఖర్చుతో సంబంధం లేదని మార్చారు. ఈమార్పు 1971 సం॥ నుంచే అమలులోనికి వచ్చేవిధంగా చేసారు. ఒక వ్యక్తి ఎన్నికను నిలబెట్టటానికోసం, యీ విధంగా ఎప్పుడు పడితే అప్పుడు తమ కనుకూలంగా రాజ్యాంగాన్ని, ప్రజాప్రాతినిధ్య చట్టమును మార్చడం సత్సంప్రదాయమేనా? ఈ విధంగా ఎవరైనా ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తే, అతడు తన బాధ్యతలను, విధులను సక్రమంగా నిర్వర్తించడం లేదని, అతనిని శిక్షించడానికి ఈ క్రొత్త సవరణలవల్ల ప్రభుత్వానికి అవకాశం లభిస్తున్నది. ఈ ప్రభుత్వ చర్య న్యాయమా? లేక అన్యాయమా? అని చెప్పడానికి న్యాయస్థానాలకు హక్కు లేకుండా చేస్తున్నారు కదా! మరియు 'రాజ్యాంగంలోని 100, 189 వ అధికరణలను (18, 31 క్లాజులద్వారా) సవరిస్తున్నారు. పార్లమెంటు, శాసనసభలలో "కోరం" నకు సంబంధించినవి. ఇంతకు పూర్వం

సభలోని మొత్తం సభులలో 1/10 వంతు **"కోరం"** గా నిర్ణయించ బడింది. **"కోరం'** 'లేనిదే సభలో ఏ విషయం చర్చించరాదు, ఏ బిల్లును ఆమోదించడానికి వీలులేదు. ఈ క్రొత్త సవరణవల్ల ఏ సభకు ఆ సభే **"కోరం"** ఎంత వుండాలో నిర్ణయించు కోవడానికి అవకాశం లభిస్తుంది. సభా నిబంధనలు ఎప్పుడుపడుతే అప్పుడు మార్చుకోవచ్చు. దీనివల్ల అన్ని సభలలో ఒకేరకమైన **'కోరం'** పద్ధతి యికనుంచి వుండదు. ఎవరు యిష్టం వచ్చినట్లు వారు మార్చుకోవచ్చు. తమకిష్టమైన చట్టాలను రూపొందించుకొనవచ్చు. వాటిని ప్రజల మీద రుద్దవచ్చు. మొత్తం సభలోని సభ్యులలో కనీసం 1/10 వంతు చేతనయినా ఆమోదించబడని చట్టం ఏ విధంగా ప్రజాస్వామ్య చట్టమనిపించుకుంటుంది? ఇకనుంచి 'కోరం' పరిమితి యింకా తగ్గిపోతుంది. సభకు ఏకొద్దిమంది హాజరైనా బిల్లులు ఆమోదించబడుతాయి. అసలు మంత్రులలో కొంతమంది సభకు హజరైనాచాలు. ప్రధానమంత్రి లేక ముఖ్యమంత్రి భావించినదల్లా చట్టాలు అయిపోతాయి. ఎక్కువమంది సభ్యుల మీద ఆధారపడవలసిన పని లేదు. ఇదేనా ప్రజాస్వామ్యం? మహాత్మాగాంధీజీ ఆశించిన సురాజ్యం యిదేనా? నెహ్రూజి కోరిన సామ్యవాద సంక్షేమ రాజ్యం యిదేనా? అమరవీరుల ఆశయం యిదేనా? ఫలిస్తుందా ప్రజాస్వామ్యం. చూస్తామా రామరాజ్యం. చేకూరుతుందా సాంఘిక న్యాయం. సిద్ధిస్తుందా సమానత్వం. పరిరక్షించబడుతాయా న్యాయస్థానాల హక్కులు. నిలబడుతాయా పౌరుల ప్రాథమిక హక్కులు. ఫలిస్తాయా గాంధీజీ కలలు. నెగ్గుతోందా నా ఆశయం. నెరవేరుతుందా నా ఆదర్శం. ఇదే నా ఆవేదన. తీరుతుందా నా వేదన. ఇక ఉంటా...

ఇట్లు

' నీ '

సెంట్రల్ జైలు, రాజమండ్రి

ది. 11-10-1976.

ప్రియమైన జయ,

నేను కులాసా. రాజ్యాంగసవరణల మీద వ్రాసిన నాల్గు ఉత్తరములు నీకు చేరకపోయినప్పటికి, చేరవలసిన చోటికి చేరినందుకు చాలా సంతోషం. నా మనస్సుకు తట్టిన భావాలను కొన్నిటిని లోగడ ఉత్తరాలలో వ్రాసాను. న్యాయవాదిని కాకపోయినప్పటికి, ఈ **44**వ రాజ్యాంగ సవరణవల్ల ప్రజానీకానికి ఎంత హాని జరుగుతుందో, నేనే ఊహించగల్గానంటే, న్యాయశాస్త్ర ప్రవీణులు యింకా ఎక్కువగా ఈ సవరణవల్ల ఉత్పన్నమయ్యే ప్రమాదాలను ఊహించగల్గుతారనడంలో ఏమాత్రం

సందేహం లేదు. మహాభారతానికి 18 పర్వాలుంటే, ఈ 44వ రాజ్యాంగసవరణకు 59 క్లాజులున్నాయనే విషయం విస్మరించరాదు. అన్ని వివరాలు వ్రాయడానికి ఉత్తరాలు పరిమితం. ఉన్న ఉత్తరము ఫారములో 1/4 వంతు చిరునామా క్రింద కేటాయించబడి వుంటుంది. అందువల్ల నేను యింకా వివరాల జోలికి పోదలచు కోలేదు. ఈ ఉత్తరంతో ముగించ దలచుకున్నాను. అధికారులకు కావలసిన సమాచారాన్ని వ్రాసుకుని, నా ఐదు ఉత్తరములను ఒకే పర్యాయం నీకు పంపిస్తారని విశ్వసిస్తున్నాను. కాని నాకు ఒక్క విషయం మాత్రం యిప్పటికీ అర్థం కాలేదు, బోధపడలేదు. ఈ మధ్య బొంబాయిలో శ్రీ గోఖలే మాట్లాడుతూ **"రాజ్యాంగ సవరణలపై నిర్మాణాత్మకమైన సూచనలను పరిశీలించడానికి ప్రభుత్వం యిప్పటికీ సిద్ధమే'** ' అని అన్నారు. ఇదే విధమైన అభిప్రాయాలను గత 40రోజులనుంచి ప్రధానమంత్రి మొదలు, అధికారపార్టీకి చెందిన సామాన్యనాయకుల వరకు చెబుతూనే ఉన్నారు. వ్యతిరేకించే వారి ప్రకటనలు మాత్రం ఎక్కడా కనుపించడంలేదు. ఈ విషయమ్మై వ్రాసే ఉత్తరాలను కూడా జైలు అధికారులు పంపించడంలేదు. దీనిని బట్టి చూస్తే అధికారపార్టీ వారి ప్రకటనలలో ఏమాత్రం వాస్తవం, నిజాయితీ లేదనేవిషయం స్పష్టమవుతున్నది? **'నేతిబీరకాయలో నెయ్యి ఎంత వుంటుందో'** ప్రభుత్వాధినేతల ప్రకటనలలో **'నీతి'** కూడా అంతే వుంటుందని భావించవలసి వస్తున్నది. ఈ మధ్య శ్రీ చవాన్ న్యూయార్కులో ప్రసంగిస్తూ**'వయోజన ఓటింగ్ ద్వారా ఏర్పడిన పార్లమెంటుదే పైచేయి గా వుండాలిగాని న్యాయస్థానములకు కాదు'** అని చెప్పారు. **"రాజ్యాంగ పరిషత్తు కన్నా పార్లమెంటే ప్రజాసంస్థ అని, ప్రజలచే ఎన్నుకోబడినది కాబట్టి పార్లమెంటుదే ఆధిక్యం'** అని శ్రీ స్వర్ణ సింగ్ గారు శలవిచ్చారు. న్యాయస్థానాలకన్నా పార్లమెంటుకే సర్వం సహాధికారా లుండాలని అధికారపార్టీ వారు పనిగట్టుకొని ప్రచారం చేస్తున్నారు. దీని నంగీకరిస్తే స్వేచ్ఛా, స్వాతంత్ర్యములకు, ప్రజాస్వామ్యానికి శాశ్వతంగా తిలోద కాలివ్వడమే అవుతుంది. ప్రధానమంత్రి చేతులలో సర్వాధికారాలను పెట్టడమే అవుతుంది. ఏకపక్ష నియంతృత్వానికి అవకాశం కల్పించిన వారమవుతాం. అసలు పార్లమెంటును ఎన్నుకొనేది ప్రజలే కదా! ఏ రాజ్యాంగం ప్రకారం పార్లమెంటును ఎవరు ఏర్పాటుచేసారో, ఆ రాజ్యాంగాన్ని నిర్మించింది కూడా ఆ ప్రజలే కదా! కనుక ప్రజలే అసలు యజమానులు. పార్లమెంటు ప్రజల ఏజంటు మాత్రమే. ఏజంటు ఐన పార్లమెంటు యజమాని అయిన ప్రజానీకాన్ని శాసించలేదు. ప్రజలకు సేవచేయడానికే మాత్రమే పార్లమెంటుకు హక్కున్నది. ప్రజాజీవితాన్ని, స్వేచ్ఛా స్వాతంత్ర్యములను తారుమారు చేసేటటువంటి బృహత్తరమైన రాజ్యాంగ మార్పులను చేసే అధికారం పార్లమెంటుకు లేదు. పరిపాలనా సౌలభ్యంకోసం కొన్ని సవరణలు పార్లమెంటు చేయవచ్చు. కాని రాజ్యాంగం యొక్క మౌలిక వ్యవస్థను (BASIC

STRUCTURE) మార్చే హక్కు మాత్రం పార్లమెంటుకు లేదు. ఇదే వాస్తవాన్ని 1973సం॥లో కేశవానందభారతి కేసులో సుప్రీంకోర్టు తన తీర్పులో చెప్పింది. రాజ్యాంగ నిర్మాతలు పార్లమెంటు, శాసనసభలు (LEGISLATURE), ప్రభుత్వ యంత్రాంగం (EXECUTIVE), న్యాయస్థానములు (JUDICIARY) ఈ మూడింటికి అవసరమైన అధికారములను యిచ్చి, వాటి హక్కులను, బాధ్యతలను నిర్దేశించి హద్దులను స్పష్టంచేసారు. ఇందులో ఏ ఒక్కరూ మిగతావారి హక్కులను అధికారాలను ఖ్రింగడానికి వీలులేదు. రాజ్యాంగబద్ధంగా ఎవరి కర్తవ్యాన్ని వాళ్ళు పాలించాలి. రాజ్యాంగాన్ననుసరించి ధర్మబద్దంగా, సుపరిపాలన చేయడానికి మాత్రమే పార్లమెంటును ప్రజలు ఎన్నుకొన్నారు. కాని ప్రజల ప్రాథమికహక్కులను దిగమ్రింగడానికి ఎన్నుకోలేదు. న్యాయస్థానముల హక్కులను స్వాహాచేయడానికిగాని, రాజ్యాంగం యొక్క మౌళికవ్యవస్థను తారుమారు చేయడానికి గాని హక్కు యివ్వలేదు. కనుక అధికారంలోనున్నవారు, ప్రజల మనోభిప్రాయములను 'జనవాక్య సేకరణ' ద్వారాగాని, ఎన్నికల ద్వారాగాని తెల్సు కోవాలి. అప్పుడే ప్రజాస్వామ్య విలువలు పరిరక్షించబడుతాయి. సృష్ట్యారంభంనుండి మానవునికి సహజసిద్ధంగా సంక్రమించిన హక్కులను, ఆయా దేశాలవారు, వారి వారి రాజ్యాంగములలో పొందుపరచి, వాటిని పరిరక్షించడానికి అవసరమైన రక్షణలు కలుగజేసారు. అట్టి మానవతా హక్కులను తీసివేయడానికి ఏ ప్రభుత్వానికి హక్కులేదు. U.N.O లో కూడా CHARTER OF HUMAN RIGHTS పెట్టారు. ది.26-6-1945న అనేక దేశాలవారు వాటినామోదించారు. అందులో **55, 56** అధికరణలు ఆయాదేశములలో మానవతా హక్కులను రక్షణ యివ్వగలందులకు పెట్టారు. ది.10-12-1948న UNIVERSAL DECLARATION OF HUMAN RIGHTS అను పత్రం మీద మన దేశ ప్రతినిధి కూడా సంతకం చేసారు. దానిని గౌరవించి, దాని ప్రకారం నడువవలెనని మన రాజ్యాంగంలో 51 అధికరణలు పొందుపరిచారు. "RIGHT TO LIVE" మానవుని ప్రాథమిక హక్కు. ఒకరి దయవల్ల యిది రాలేదు. మానవజాతి పుట్టడంతోనే జీవించే హక్కు కూడా లభించింది. స్వేచ్ఛని కోరడం మానవుని సహజప్రవృత్తి. "LIBERTY POSTULATES DIGNITY OF MAN" అని జాన్సటువార్టుబల్ పేర్కొన్నారు. స్వేచ్ఛ అనునది మనుష్యుని గౌరవమునకు మూలం. అట్టి స్వేచ్ఛను రక్షించడానికే న్యాయస్థానములు ఏర్పడినాయి. కాని ఈ 44వ రాజ్యాంగసవరణలో అట్టి హక్కులు శాశ్వతంగా సమాధి చేయబడుతాయి. ఈ రాజ్యాంగ సవరణలను వ్యతిరేకించే వారందరూ అభివృద్ధి నిరోధకులని, ఫాసిష్టులని, బూర్జువా వర్గాల ప్రతినిధులని,. ధనికవర్గముల ఏజంట్లని గుత్తపెట్టుబడిదారుల అనుచరులని అధికారపార్టీవారు ప్రచారం చేయడం కడుశోచనీయం.

దేశకాలమాన పరిస్థితుల కనుగుణంగా, పౌరుల ఆశయాలను, ఆశలను ఆకాంక్షలను, లక్ష్యాలను ప్రతిబింబించే విధంగాను, అట్టడుగున వున్న ప్రజానీకాన్ని ఉద్ధరించేందుకు వీలుగా, రాజ్యాంగంలో అవసరమైన మార్పులను తీసుకుని రావడానికి ఏ పార్టీ వ్యతిరేకంకాదు. సంపద అంతా కొద్దిమంది చేతులలో కేంద్రీకృతం కావడానికి ఎవ్వరూ అంగీకరించరు. ఆర్థిక వ్యత్యాసాలను తగ్గించడానికి అవసరమైన చట్టములను రూపొందించడానికి ఏ పార్టీ వ్యతిరేకం కాదు. పరిమితులను (సీలింగ్సు) పెట్టడానికి అందరూ సుముఖులే. అయితే ప్రభుత్వం తలబెట్టిన ఈ సవరణవల్ల ప్రజాస్వామ్యవ్యవస్థ సుస్థిర మవుతుందా? లేక బలహీనమవుతుందా? పౌరుని ప్రాథమికహక్కులకు రక్షణ వుంటుందా? లేక సమూలంగా తుడిచివేయ బడుతాయా? అనేదే ప్రశ్న. ముఖ్యంగా శ్రీమతి గాంధీజీ అధికారంలోనికి వచ్చినప్పటి నుంచి, రాజ్యాంగ స్వరూపాన్ని మార్చేందుకు అనేక సవరణలు జరిగాయి. అంతటితో సంతృప్తి చెందక మిగిలివున్న ప్రాథమిక హక్కులను, న్యాయస్థానముల అధికారములను పూర్తిగా తుడిచివేయడానికే ఈ 44వ రాజ్యాంగసవరణ తీసుకుని రాబడింది. అంతేకాదు ప్రభుత్వఆర్థిక వైఫల్యాలను గురించి బహిరంగంగా ప్రచారం కొనసాగించడానికి వీలు లేకుండా అత్యయిక పరిస్థితిని ప్రజల మీద రుద్దింది. ఒక్కసారి భారతదేశ ఆర్థిక వ్యవస్థను పరిశీలిస్తే ప్రభుత్వ బండారం బయట పడుతుంది. 1976 మార్చి 31వ తేదీ నాటికి విదేశాల నుంచి మనం తీసుకున్న ఋణం మొత్తం రూ. 10, 416 కోట్లు మాత్రమే. గత 29సం॥ నుంచి కాంగ్రెసు ప్రభుత్వమనుసరిస్తున్న దుష్ట భూయిష్టమైన, అస్తవ్యస్తమైన ఆర్థిక విధానముల వల్లనే ధనికులు మరింత ధనికులయ్యారు. దరిద్రులు కటిక దరిద్రులయ్యారు. అంతేకాదు కాంగ్రెసు ప్రభుత్వ అనాలోచిత, ఆచరణ సాధ్యం కానటు వంటి అవాస్తవిక ఆర్థిక ప్రణాళికల వల్లనే టా టా, బిర్లాలాంటి కొద్దిమంది గుత్తపెట్టుబడిదారుల చేతులలో సంపద అంతా కేంద్రీకృతమయింది. సామాన్యునిపై పన్నుల భారం పెరిగింది. ఆర్థిక వ్యత్యాసాలు నానాటికి పెరుగుతూ వచ్చాయి. టా టా పెట్టుబడి 1951లో రూ.95కోట్లు వుంటే, 1971లో రూ. 711కోట్లకు పెరిగింది. ఇదే కాలంలో బిర్లా పెట్టుబడి రూ.51కోట్ల నుండి రూ. 687 కోట్లకు పెరిగింది. ఇప్పుడు ఒక్కొక్కరి ఆస్థి సుమారు రూ. 1100 కోట్ల వరకు పెరిగి వుంటుందని అంచనా. అదే విధంగా మోడీలు, సింఘియానీలు, మఫత్‌లాల్, లాల్‌చంద్ మొదలగు గుత్తపెట్టుబడి సంస్థల ఆస్థులు 200 % నుండి 300 % దాకా పెరిగాయి. ఒక్క 1975లో టాటా ఉక్కు కంపెనీకి రూ. 34.3కోట్లు, గ్వాలియర్ రేయాన్ కంపెనీకి రూ. 25.2 కోట్లు, టాటానెల్కోకు 16.1 కోట్లు, గ్రేట్‌ఈష్టన్‌షిప్పింగుకు రూ.15.3 కోట్లు లాభాలు వచ్చాయి. 15సం॥ల క్రితం మనదేశంలో **'నల్లధనం' (BLOCK MONEY)** రూ. 300 కోట్లు వున్నదని ప్రొఫెసర్ కార్డార్ అంచనా వేశారు. అది ఇప్పుడు రూ. 4000కోట్ల

వరకూ ఉండవచ్చని అంచనా. పేదలపరిస్థితి గనుక చూస్తే దారిద్ర్యరేఖకు యింకా క్రింద వున్న ప్రజలు గ్రామీణప్రాంతములలో 1960-61లో 59% వుండగా వారు 1970-71 నాటికి 74%కు పెరిగారు. అదేకాలంలో పట్టణ ప్రాంతాలలో 33% నుండి 50%కి పెరిగారు. కేంద్ర ప్రభుత్వోద్యోగుల జీతాలు చూస్తే 1960లో చిన్న గుమాస్తాకు వున్న జీతం 100పాయింట్లు అయితే 1972కి 91 పాయింట్లకు పడిపోయింది. పెద్ద గుమాస్తాలకయితే 82 పాయింట్లకు పడిపోయింది. 4వ తరగతి రైల్వే కార్మికుల జీతాలు 1968 నాటికి 98 పాయింట్లు, 3వతరగతి ఉద్యోగులకు 93 పాయింట్లకు పడిపోయింది. ధరల విషయం పరిశీలిస్తే 1967 పూర్వం ధరలు 11%కు మించి పెరగలేదు. శ్రీమతిగాంధీజి అధికారంలోమాత్రం విపరీతంగా పెరిగాయి. 1973-74లో 30%, 1974-75లో 34% పెరిగాయి. ఆహార సరుకుల ధరలు 1961-62లో రూ. 100/- లుంటే, 1973-74 కి రూ. 381-70లకు పెరిగాయి. కొన్ని ప్రత్యేకమైన సరుకుల ధరలు 200% పెరిగాయి. పంటలు బాగా పండినప్పటికి 1975-76సం|| మొదటి ఆరునెలలలో ధరలు 3%నుంచి 5% కన్నా తగ్గలేదు. ఈ ఆర్థిక దుస్థితికి మూలకారణం కాంగ్రెసు ప్రభుత్వ దోషభూయిష్టమైన ఆర్థిక ప్రణాళికలు కావా? గత 29 సం|| నుంచి కేంద్రం లోను, దాదాపు అన్ని రాష్ట్రములలోను కాంగ్రెసు వారే అధికారంలో వున్నారుకదా! ఈ ఆర్థిక వైఫల్యాలను కప్పిపుచ్చుకొనడానికి శ్రీమతి గాంధీజి 20 సూత్రాల పథకమును పెట్టారు. వాటిలో క్రొత్త విషయాలేమీ లేవు. అసలు ఆ సూత్రాలను యింతకు పూర్వం ఎందుకు అమలుపరచలేదు. దీనికి అధికారంలోనున్నవారు బాధ్యులు కాదా? ఈ వాస్తవిక నగ్నసత్యాలను శ్రీ జె.పి. బయటపెడుతున్నారని భయపడి, ఆయనకు ప్రజలు, ముఖ్యంగా జాతీయప్రతిపక్షములు మద్దతు యివ్వడం వల్ల ప్రజా ఉద్యమం తీవ్రంకావడం చూచి, తద్వారా తమ అధికారానికి ముప్పు వాటిల్లడం ఖాయమని భావించి, అత్యయికపరిస్థితిని దేశంలో ప్రభుత్వం ప్రవేశపెట్టింది. యదార్థవాదులందరి నోళ్లను మూసివేసారు. పత్రికలపై సెన్సారును విధించి, వాస్తవాలను ప్రకటించడానికి వీలులేకుండా జేసారు. న్యాయస్థానముల హక్కులను కుదించి వేసారు. న్యాయస్థానములకు పూర్వం వున్న హక్కులు గనుక వుండి వుంటే నా బోటివారు యింతకాలం జైళ్లలో మ్రగ్గిపోవలసిన అవసరం వుండేది కాదు. పండిత నెహ్రూ హయాంలోఅప్పుడు దేశీయాంగ మంత్రిగా వున్న శ్రీ నందా P.D.ACT ను పెంచమని కోరారు. అప్పుడు నెహ్రూ "**WHY ARE YOU AFRAID TO PUT THE MEN ON TRAIL**" అని ప్రశ్నించారు. కాని యిప్పుడు తండ్రి భావాలకు కూతురు తిలోదకాలిచ్చింది. డిటెన్యూలను బహిరంగ న్యాయస్థానములలో విచారించేందుకు ప్రభుత్వానికి ఈనాడు ధైర్యంలేదు. నైతిక శక్తి అంతకన్నా లేదు. దేశంలో రాజకీయ నాయకులను నిర్బంధించడానికి, సహేతుకమైన కారణాలుగాని, గ్రౌండ్సుగాని

ప్రభుత్వం వద్ద లేవు. అందువల్లనే డిటెన్యూలను బహిరంగ న్యాయస్థానములలో విచారించడానికి భయపడుతున్నది. " **మీసా**" డిటెన్యూలను విచారించడానికి లోగడ వున్న '**సలహా సంఘము**' లను కూడా తీసివేసింది. డిటైన్ చేయడానికి గల కారణాలను కూడా యివ్వనవసరం లేకుండా '**మీసా చట్టము**' ను మార్చివేసింది. కోర్టులకు వెళ్ళడానికి వీలులేకుండా చేసింది. ఇదీ ప్రస్తుత పరిస్థితి. దీనిని ప్రజాస్వామ్యమనాలో? లేక నియంతృత్వమనాలో? నాకే అర్థం కావటంలేదు. ప్రజాస్వామ్య మేలిముసుగు క్రిందనున్న నియంతృత్వపాలన అంటే బాగుంటుందేమో ననిపిస్తున్నది. ఒక చంప బహిరంగ చర్చకు అవకాశం యిచ్చామని ప్రభుత్వాధినేతలు ప్రకటనలు చేస్తున్నారు. జైళ్ళలోనున్న వార్ని వదిలిపెట్టకపోగా పెరోల్సులోనున్న వార్కి పొడిగింపు ఉత్తర్వులు యివ్వనందున, వారు కూడా తిరిగి జైళ్లకు వస్తున్నారు. బయటవుంటే రాజ్యాంగసవరణ అంతర్యాన్ని బట్ట బయలు చేస్తారేమోనని ప్రభుత్వానికి భయం వుండివుండవచ్చు. భయం, అనుమానాలతో ఎంతకాలం పాలన చేయ గల్గుతారు? ప్రస్తుత మన దేశ పరిస్థితులను పరిశీలిస్తే ప్రజాస్వామ్యానికి అంతిమ ఘడియలు ఆసన్నమయినాయేమోననిపిస్తున్నది. సంవత్సరాల తరబడి పోరాడి, రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యాన్ని కూకటివేళ్లతో పెకిలించివేసి తెచ్చియిచ్చిన స్వాతంత్ర్యానికి ఈ కొద్దికాలంలోనే ముప్పు తెచ్చిపెట్టినందుకు అమరవీరుల ఆత్మలు సంక్షోభిస్తూ వుంటాయి. స్వేచ్ఛ స్వాతంత్ర్యముల కోసం అహర్నిశలు పోరుసల్పి, సర్వస్వాన్ని అర్పించి అశువులు బాసిన స్వాతంత్ర్యసమరయోధుల ఆత్మలు పరితపిస్తూంటాయి. **"గాంధీజి స్వేచ్ఛలేని స్వరాజ్యాన్ని కోరలేదు. తిలక్ స్వాతంత్ర్యంలేని స్వరాజ్యాన్ని కాంక్షించ లేదు. న్యాయం చెప్పలేని న్యాయస్థానాలు కలిగివున్న పాలనను నెహ్రూజి ఎన్నడూ వాంఛించ లేదు. ప్రాథమిక హక్కులు లుప్తమైన రాజ్యాంగాన్ని అంబేద్కర్ ఎన్నడూ ఆశించలేదు. పత్రికాస్వాతంత్ర్యం లేని స్వరాజ్యాన్ని స్వాతంత్ర్య సమర యోధులు ఎన్నడూ ఆపేక్షించలేదు. స్వేచ్ఛ లేని జీవితం, స్వాతంత్ర్యం లేని దేశం, న్యాయం చెప్పలేని న్యాయస్థానములు, ప్రాథమికహక్కులు లేని రాజ్యాంగం, పత్రికాస్వాతంత్ర్యంలేని పరిపాలన వున్నాప్రయోజనం శూన్యం. అవి వట్టి జీవచ్ఛవాల లాంటివే".** పంచేంద్రియాలు లేనిది శరీర మనిపించు కోదు. పంచభూతాలు లేనిది ప్రపంచమనిపించుకోదు. అదే విధంగా పంచ హక్కులు లేనిది ప్రజాస్వామ్యమనిపించుకోదు. ఈ పంచహక్కులను సాధించడం కోసం నిర్విరామ కృషి సల్పడం ప్రతిభారతీయుని కర్తవ్యం. ఇప్పటికే చాలా వ్రాసాను. రాజ్యాంగ సవరణలపై నా అభిప్రాయాలను యీ ఉత్తరంతో ముగిస్తున్నాను.

జై సాయిరాం